# శ్రీ అయ్యప్ప మహాభాగవతం



మధురాంతకం దొరస్వామి విద్వాన్

# శ్రీ అయ్యప్ప మహాభాగవతం



— మధురాంతకం దొరస్వామి విద్వాన్

ప్రథమ ముద్రణ 2003 సంవత్సరము

ప్రతులు 1000

వెల రూ. 150/-



ముద్రణకర్త మధురాంతకం దొరస్వామి విద్వాన్



ఆధ్యాత్మిక గ్రంథ ప్రచురణకు సహాయం

అను పథకం క్రింద తిరుమల తిరుపతి దేవస్థానం

వారి ఆర్థిక సహాయంతో ప్రచురించబడినది.

ప్రతులకు: మధురాంతకం దొరస్వామి విద్వాన్

పదిపుట్లబయలు - పాకాలమండలం

G.G.Palle (B.O) దామల్ చెరువు (So)

చిత్తూరు జిల్లా A.P

ముద్రణ : అన్నపూర్ణ గ్రాఫిక్స్, తిరుపతి ఫోన్ - 2235006

# శ్రీ అయ్యప్ప మహాభాగవతం



## అంకితం

ఓం శ్రీ అయ్యప్పస్వామి పాదారవిందములకు

సభక్తి పూర్వకంగా అంకితము !

శ్రీవినాయక గురుదేవోభ్యోనమః

ఓం స్వామియే శరణం అయ్యప్పా !

— మధురాంతకం దొరస్వామి విద్వాన్

# శ్రీ అయ్యప్ప మహాభాగవతం




రచయిత, గ్రంథకర్త

**మధురాంతకం దొరస్వామి విద్వాన్**

పదిపుట్లబయలు - పాకాలమండలం

G.G.Palle (B.O) దామల్ చెరువు (So)

చిత్తూరు జిల్లా A.P.

# ఇరుముడిలో తొలినుడి - 1

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్

ధర్మ సంస్థాప నార్థాయ సంభవామి యుగే యుగే !

అను గీతోక్తి ననుసరించి ధరణిపై ధర్మము అంతరించి అధర్మమధికమైన నాడు ధర్మోద్ధరణకై భగవదంశమున మహాత్ములవతరించి ధర్మము నెలకొల్పుదురు.

దశావతారము లిట్టివి, ఇవియే గాక 21 అవతారములు భాగవతమున బేర్కొన బడినవి.

భగవంతుడననెవ్వడు ? ఎట్టివాడు ? "స్త్రీ నపుంసక పురుష మూర్తియును గాక తిర్యగమరనరాది మూర్తియునుగాక వెనుక నన్నియు దానగు విభుదలంతు !" అని పోతన మహనీయుడు వాకొనెను. అనగా పరం జ్యోతి స్వరూపుడే భగవానుడు "బ్రహ్మసత్యం జగన్మిథ్య" అన్నారు వేదాంతులు.

బ్రహ్మమన పరబ్రహ్మము "బ్రహ్మమొక్కటే పరా బ్రహ్మమొక్కటే" అని తాళ్ళపాక అన్నమాచార్యులు నాట్యమాడుచూ ఆలపించినారు.

కాన భగవానుడొక్కడే. ఒక్కడే పెక్కురూపులతో విలసిల్లుచున్నాడు. ప్రతిజీవిలో జీవాత్మతో బాటు పరమాత్మ కలిసియే యున్నాడు. జీవాత్మను పరమాత్మతో కలుపుటయె యోగము అది స్థిరముగా నెలకొనుటయే మోక్షము. అతడు లేనిచోటు లేదు అతనికేదియును దూరమున లేదు దగ్గరనుగలదు. అంతాతానే. తాను కానిది యేదియును లేదు. సర్వసంపదలు కళలు, జ్ఞానము అంతయూ అతని నుండియే వెలువడును.

"యద్యద్విభూతి మత్సత్త్వం శ్రీమదూర్జిత మేవవాతత్త దేవావగచ్ఛత్వం మమ తేజోంశ సంభవమ్" అను గీత యందలి ఈ శ్లోకము పైన దెలిపిన భగవద్విభూతిని తెలియ జేయుచున్నది.

అయ్యప్ప భక్తులందరు నల్లని బట్టలను లేక కాషాయంబరములను ధరించవలెను. భూశయనము - ఒంటి పూట భోజనము, పాదరక్షలు ధరించరాదు, క్షవరము చేసికొనరాదు ఇట్లు 41 రోజులు పరమ తపోధనులవలె నుండి సూర్యోదయమునకు ముందే, వినాయక స్వామిని, సుబ్రహ్మణ్యేశ్వరుని హరిహరులను ఆదిశక్తిని పూజించి, శరణుఘోషలతో స్వామిని సేవింపవలెను. సూర్యాస్తమయ

సమయమునకు తర్వాత ఇట్లే చేయవలయును. ఈ విషయములు గ్రంథములో విపులముగా తెలుపబడినవి.

తేజస్సంపన్నుడైన హరిహరాత్మజుడైన పరంజ్యోతి స్వరూపుడైన ధర్మశాస్తా అయ్యప్పగా అవతరించినాడు.

బాల్య యౌవన కౌమారములెట్లో సదా దేహాంతర ప్రాప్తి యట్లేయని గీత బోధించుచున్నది. జన్మ పరంపరలు కలవనుట కిది ఉదాహృతము.

స్వామిత్రిమూర్త్యాంతర స్వరూపముగా అత్రి అనసూయలకు దత్తాత్రేయుడై అవతరించి భార్యాభర్తలు పరస్పర శాపకారణమున అతని భార్యలీలావతి మహిషిగా జనించి దేవేంద్రాదులను బాధపెట్టగా దత్తాత్రేయ స్వామి శాపవశమున సుందర మహిషముగా జనియించుటయు పిదప ధర్మశాస్తాగా మోహినీ శివుల కుద్భవించి కైలాసమునకేగి అటనుండి భూలోకమున కేతెంచి పూర్ణపుష్కలల వివాహమై కైలాసమున కొంతకాలముండి హరిహరుల అనుజ్ఞవలన మహిషిని వధించుట కొరకు పసిబాలుడుగా రూపాంతరము చెంది పంబ తీరమున పందళ రాజునకు లభించెను. నాలుగు జన్మముల కథ ఈ అయ్యప్ప భాగవతమున అలరారుచున్నది.

విశ్వశ్రేయము కొఱకు కవులు కథలు వ్రాయుదురు. అందు ఇతిహాసమును, సత్యశోభితమును ధర్మయుక్తమును భక్తియును తప్పక యుండును. రమణీయర్థాక ప్రతిపాదకముగ పురాణముల సత్యములని తలంపరాదు.

పరమార్థమును కోరిన భక్తుల నాకర్షించుటలోను వారి ఆకాంక్షలను నెరవేర్చుటలోను శ్రీ అయ్యప్ప భగవానుని మహిమము అనల్పము అమోఘము సత్యశోభితము సంశయింపబనిలేదు. దేశ విధేవములనుండి భక్తుల నాకర్షించుచు శాంతిని, సౌభాగ్యమును, జ్ఞానమోక్షము లొసంగు అయ్యప్పమహా మహిమనే పూర్ణముగా నమ్మి సత్యమును ఇతిహాసమును భక్తులు అవగతము చేసికొందురుగాక !

ధర్మశాస్తా పరాయగోపుత్రుడు మణికంఠేశ్వరుడు అయిన అయ్యప్ప సాక్షాద్విష్ణుడును, సదాశివుడును, పరబ్రహ్మమునై యుండుట సత్యము. ఓం అయ్యప్పా శరణం శరణం, శరణం అయ్యప్పా అనుచు భక్తులు స్వామిని తలచి కొలిచి భవబంధములనుండి. తరించి ధన్యులగుదురుగాక జ్ఞానమోక్షములు చూరగొందురు గాక !

# ఇరుముడిలో మలిముడి - 2

సహజ పాండిత్య బమ్మెరపోతానామాత్యులు వారు భాగవతంబు వ్రాయుచు ఇట్లు నుడివిరి.

నేను పుట్టలో పుట్టిన వాల్మీకిని కాను రెల్లుగడ్డిలో ఉద్భవించిన మహాపండితుడైన సుబ్రహ్మణ్యదేవుడను కాను పడవలోనే జనియించిన వేదవ్యాసుడను కాను కాళికాఅమ్మవారిని సేవించి "కాళిదాస్" అన్న సార్థక నామమును పొందిన అభిజ్ఞాన శాకుంతలాది గ్రంథములను వ్రాసిన కాళిదాసుడను కాను వీరి మనసులలో నుండికవిత్వకల్పలతికలను వెలయించిన ఓ భారతీదేవి నా మనస్సులోనే ఉండి వారివలె కవిత్వమును వ్రాయు వరమును నాకు ప్రసాదింపుము అని మరియు భాగవతమును వ్రాయుట కదు విచిత్రము చతుర్ముఖుడైన బ్రహ్మకును ఫాలనేత్రుడైన శివునకును భాగవతమును సంపూర్ణముగ వ్రాయుటకు వీలు పడదు. అట్టి మహాభాగవతమును వ్రాయుటకు నేను ఎంత అర్హుడనగుదును పండితులవలన తెలిసికొనినంత, నాకు తెలియవచ్చినంత వ్రాస్తున్నాను. అని సవినయముగ పోతన విన్నవించుకొన్నారు.

శబ్ద శాసనుడైన మహాభారతమును ఆంధ్రీకరించిన నన్నయభట్టారకుడు "భారత భారతీ సముద్రము దరియంగ నీదను విధాతృనికైనను నేరబోలునే" అయినా నాకు తెలిసినంత వరకు వ్రాస్తున్నాను అన్నారు.

కాళిదాసుగారు అభిజ్ఞాన శాకుంతలాది గ్రంథములు వ్రాయుచు ఈ కవిత్వమను కల్పవృక్షముమిక్కిలి ఎత్తుగానున్నది నేను మరుగుజ్జు వాడను. ఆకవిత్వమనెడి కల్పవృక్షము నందలి ఫలములను అందుకొనగలనా అని సందేహము వ్యక్తపరచినారు. ఇట్టి మహాకవులే సంశయగ్రస్తులై నిగర్వముగ తమ అశక్తతలను తెలియజేయుటను చూడగా వారిలో వినయసంపద అధికముగా గోచరించుచున్నది. పోతనగారు అన్నారు భాగవతమును ఒక మహాకల్పవృక్షమని అదికృష్ణమూలము అనగా కృష్ణుదేకథానాయకుడుగా గలది చెట్టుమొదలు నల్లగా వుండునది అని "శుకాలాపాభిరామంబు శుకునిచేత ఆలపింపబడినది అనియు కల్పవృక్షము పయిచిలుకలు కూయుచున్నవనియు బంగారమువలె అదిమనోహరమైనదియు, అందమైన ఇతివృత్తము కలదియు, మహాఫలము నొసంగునదియు, కోరిన కోర్కెలను యిచ్చునదియు అయిన భాగవతము అను కల్పవృక్షము బ్రహ్మజ్ఞానము కలిగిన వారందరికి శ్రేయమును చేకూర్చుచున్నదని నుడివిరి.

పుష్పములలో పారిజాతములు, అరవిందములు మల్లెలు, మొల్లలు, సంపెంగలు మొ॥ పుష్పముల వంటి కవిత్వములను పైన పేర్కొన్న కవులు రచించిరి.

గడ్డిపూవులు కూడ ప్రకృతి సౌందర్యమును వేలార్చు చున్నవి నేనును వాసనాభరితమైన పుష్పములను స్వామికి సమర్పింపదలచితిని కానీ కేవలము గడ్డిపువ్వుగా నైనా నాకావ్యమును స్వామి స్వీకరించిన నేను కృతకృత్యుడనగుదును.

గణపతి జననమును గూర్చిన అనేక విధములైన కథలు కనిపించుచున్నవి. అట్లే అయ్యప్పస్వామి విషయమున గూడ అనేక గ్రంథములలో చారిత్రక సంబంధమైన, పురాణ సంబంధమైన కథలు వ్యత్యస్థముగా కనిపించుచున్నవి.

కాని శబరిమలపైన స్వామి వెలసియుండుటయు స్వామిని పెంపుడు కొడుకుగా స్వీకరించిన రాజశేఖరుని వంశస్థులు పందళమున నేటికిని ఉండుటయు వారు సంక్రాంతినాడు ఆభరణముల పెట్టెను తమకోటనుండి కాలినడకన భక్తులు మోసుకొని పోవుచుండగా గరుడుడు ఆకసమున వారిననుసరించుటయు, స్వామికి ఆభరణములు అలంకరించునపుడు గరుడుడు గుడిని ప్రదక్షిణించి పోవుటయు నేటికిని కనిపించుచున్నది. ప్రతిసంక్రాంతినాడు పొన్నంబళమున భక్తులకు జ్యోతిర్దర్శనమగుచున్నది. శ్రీ స్వామి వారు వావరు స్వామిని కరుణించుటయు ఎరుమేలిలో అతనికి పూజావిధానము ఏర్పాటు చేయుటయు వావరు వంశమువారు నేటికిని స్వామిని సేవించుటయు జరుగుచున్నది. ఇది చారిత్రక పరమసత్యము. చరిత్రకు సత్యమే పరమ ప్రమాణము. పురాణములు పూర్వమునందు జరిగినవి అందులోను సత్యము గోచరించకపోలేదు. విశ్వశ్రేయమును కాంక్షించుకవులు భక్తబృందములను చైతన్య వంతము చేయుటకు కొన్ని స్వకపోలకల్పనలు చేయుటయుకలదు. రమణీయార్థక ప్రతిపాదికమైనదేగదా కావ్యము.

నేను చరిత్రయును పురాణమును కలిపియే వ్రాసితిని. నాకావ్యమున ఇతిహాసమును భక్తియునెసలారునట్లు ప్రయత్నించితిని. శ్రీరామచంద్రుడు లంకకు వారధి నిర్మించునపుడు ఆంజనేయాది మహాకవులు పర్వతోపమానమైన గండశిలలను గొని సంద్రమునవైచుచుండ ఒక ఉడుత నీటిలో మునిగి ఇసుకలో బొరలి మరల నీటిలోమునుగుచు మరల మరల నట్లాచరించుచు వారధినిర్మాణమునకు సాయముచేసినదట ఉడుత ఏమిటి ? దానిశక్తి ఎంత ? ఎంతప్రయత్నించిననుఅది వారధినిర్మింపజాలునా కాని దాని సద్భక్తికి సత్ప్రయత్నమునకు హర్షించి శ్రీరామచంద్రమూర్తి దానినాశీర్వదించినాడట.

అయ్యప్ప భాగవతమును వ్రాయుటకు ఏమహాపండితప్రకాండుడో తప్ప నావంటి వానికి సంపూర్ణముగ వ్రాయుట సాధ్యముకాని పనియని నాకు తెలియును కానీ, ఉడుతకుడుతాభక్తిగ నానేర్చినభంగి నాకు తెలిసినంత వరకు వ్రాసితిని.

శ్రీమణికంఠేశ్వర చరిత్రమను నామాంతరముగల శ్రీఅయ్యప్పభాగవతమును పరాయగోపుత్రడు, సద్ధర్మశాస్తా శ్రీమణికంఠేశ్వరుడు శ్రీహరిహరాత్మజుడు అయిన అయ్యప్పస్వామి పాదారవిందములకు సభక్తిపూర్వకముగా నిండు హృదముతో నమ్రతతో సమర్పించితిని.

ఇట్లు

విద్వాన్ మధురాంతకం దొరస్వామి

శ్రీ అయ్యప్పస్వామి పాదారవిందములకు
సభక్తి పూర్వకంగా అంకితము !
శ్రీవినాయక గురుదేవోభ్యోనమః
ఓం స్వామియే శరణం అయ్యప్పా !!

# శ్రీ అయ్యప్పమహాభాగవతం

రచయిత; కవి :- **మధురాంతకం దొరస్వామి విద్వాన్**
పదిపుట్ల బయలుగ్రామం, పాకాలమండలం, చిత్తూరుజిల్లా (ఆం.ప్ర)

**ఆచార్య పి.వి. అరుణాచలం,** వైస్ ఛాన్సలర్
ద్రావిడ విశ్వవిద్యాలయం
కుప్పం, చిత్తూరుజిల్లా
14-01-2001

## అభిప్రాయం

శ్రీ హరి హరాత్మజుడు, జగజ్జనులకు శరణుడైన భగవంతుడు శ్రీ అయ్యప్పస్వామి - ఈ స్వామి చరిత్రను శ్రీ మణికంఠేశ్వర చరిత్రమను నామాంతరముగల అయ్యప్ప మహాభాగవతమును భక్తలోకానికి ప్రసాదించిన కవి పండితులు, భక్తశిఖామణులు, మాన్యమిత్రులు శ్రీ మధురాంతకం దొరస్వామిగారు.

**పలుకుచుంటిని అయ్యప్ప భాగవతము**
**పలుకజేయుత మణికంఠ ప్రభుడితండు**
**పలుక కలుషంబులన్నియు బదలుపోవు**
**వేరుపలుకులు పలుకంగవేద్యమగునె !**

అని పోతనామాత్యుని తలపింపజేసే భక్తిరసాన్వితమైన కావ్యాన్ని మనకందించినవారు శ్రీ మధురాంతకంవారు -

ఈ కావ్యము చరిత్రపురాణముల సమ్మిశ్రమము - ఇతిహాసము, భక్తిపడుగుపేకల వలె విరాజిల్లుచున్నవి - స్వామి భక్తిలో తన్మయము చెంది, శబరియాత్రముగించి, స్వయంగా క్షేత్రమహిమను అవగతముచేసుకొని, రమణీయార్థ ప్రతిపాదకముగా ఈ బృహత్కావ్యాన్ని రచించిన శ్రీమధురాంతకం వారిని అభినందిస్తున్నాను.

ఈ రోజులలో ఇటువంటి సంప్రదాయిక సాహిత్యసస్యాలను పండించే కవివరేణ్యులు ఎక్కువగాలేరు. ఉన్న కొద్దిమంది ఖండకావ్యాలను, లఘుకావ్యాలను వ్రాసి తనియుచున్నారు. ఈ నేపథ్యంలో జరిగిన సాహిత్య సాహసము, శ్రీ అయ్యప్ప మహాభాగవతముగా కావ్యరూపంలో సాక్షాత్కరించింది.

శ్రీ మధురాంతకంవారి రచనలో అడుగడుగునా పోతనామాత్యుని కవితాస్ఫూర్తి కనబడుచున్నది. వినయంతో కృతికర్త తన కవిత్వాన్ని గురించి చెప్పుకొనుచు "అయ్యప్ప భాగమతమును వ్రాయుటకు ఏ పండితప్రకాండుడో తప్ప నావంటి వానికి సంపూర్ణముగా వ్రాయుటకు సాధ్యముకాని పని" అని అనిరి.

ఇవి వారి వినయ సౌజన్యమును తెలుపునే గాని వారి సామర్థ్యము మీద అభిప్రాయము కాదు - వినయసంపన్నులైన కవుల కలముల నుండి భక్తి రసభరితములైన మహాకావ్యములు వెలువడిన విషయము సాహితీ లోకమునకు తెలియనది కాదు. ఇటువంటి మహాకావ్యముల కోవలోనికి చేరు గరిమగల గ్రంథరాజ మీ భాగవతము.

మన అధ్యాత్మిక సాహిత్య, సంప్రదాయములలో పదునెనిమిదవ సంఖ్యకు ప్రత్యేకత ఉన్నది. శబరిమలలో వెలసిన అయ్యప్ప సన్నిధానమునకు పోవు సుదీర్ఘ యాత్రఘట్టములలో పరాకాష్ట అష్టాదశసోపాన ప్రస్థానము- మూడు సోపానములకొక ఉల్లాసమును కూర్చి, ఆరు ఉల్లాసములలో పదునెనిమిది సోపానముల నమర్చి వెలార్చిన కవితా సృష్టియిది. సంప్రదాయక పద్ధతిలో సాగిన ఈరచన సర్వధాశ్లాఘనీయము.

రచన ప్రథమోల్లాసం శ్రీకారంతో షష్ఠ్యంతములతో ప్రారంభమగుచున్నది. సందర్భోచితముగా చక్కని సమాసములు, రసోచితమైన సరళశైలి, ఎడనెడ కొన్ని రచనలు - వివిధ ఛందస్సులలో భావగర్భితములైన పద్యములు - అమరిన గొప్ప కావ్యమిది - ఉదాహరణకు కోకొల్లలుగా చూపవచ్చును.

వాచవిగా కొన్నిటిని ఉటంకించెదను. ప్రథమోల్లాసములో పద్యము (20) ఎంత చక్కగా నడచినదో చూడండి.

**అనయముసామగానముల సంచితరీతిని పాడుచుండి యా**
**ఘనుడగు సూతునింగనుచు కాంచన గర్భసముండ నీవిటన్**

పనివడి వచ్చినందులకు పల్మరు మ్రొక్కుచు మోక్షప్రాప్తికై
మనమున నెవ్వనిందలప మాకగు భద్రమటంచు వేడగన్

ఛందస్సు అలవోకగా సాగి, చక్కని భావప్రకటన జరిగింది -

రెండవ ఉల్లాసముతో పద్యము (9), సూర్యోదయాన్ని, ఉదయవేళ ప్రకృతి సోయగాన్ని ఎంత రమణీయంగా వర్ణింపబడిందో చూడండి.

*గగనాంగనా మణికంఠహారమ్మునా తూరుపుకొండపై తోచెనినుడు*
*రాగరంజితమైన రమణీయకిరణాళి పర్వత సీమల ప్రభలు నిలెపె*
*హరితవర్ణములైన ఆగిరుల్ లతలతో ఆ వృక్షతతితోడ నలరెనంత*
*కొండకోనలలోన కోకిలాంగనలును కేకియూధమ్ములు కెరలిపల్కె*

*బాలభానుండు ప్రాగ్దిశన్ ప్రబలజొచ్చె*
*ఝరులు గిరులును తరులును పరువముగను*
*స్వర్ణకాంతుల తులతూగి చాలవెలసె*
*రామణీయకమై యొప్పె రాజగృహము*

మూడవ ఉల్లాసములో ఈ పద్యము (12) మహిషిమర్ధన ఘట్టములోనిది.

*మీసములైన బుట్టకనె మిక్కిలి భండన భీముడైతివా ?*
*కాసర బీసరంబులగు కార్యముగాదుర యుద్ధభూమిలో*
*వేసరి ఇంద్రుడున్ సురులు వేగమెపర్వులు వెట్టిరెంతయున్*
*నీ సరియౌనె యుద్ధముననెక్కొన నన్ గని నిల్వనేర్తువే ?*

చతుర్థోల్లాసములోని 77వ పద్యము గుడి నిర్మాణమును గురించినది.

*కన్నుల పండువయ్యెనిట కాంచగనీగుడి చంద మౌ నటుల్*
*పన్నుగనేనుగట్టెదను ప్రాపుగ తీరిచి, దేవళంబు నా*
*పన్నులబ్రోవ బుట్టితివి పద్మదళాక్షుడ కొండపైనిటన్*
*మున్నుగగట్టెదన్ గుడిని బ్రోవుము వేగమె భక్తులక్ ధృతిన్*

పంచమోల్లాసములో వావర్ గజదొంగతో స్వామిభేటీ, తత్ఫలితంగా వావర్‌లో పరిణామము, ఈ ఉదంతాలు వివరింపబడియున్నవి.

*ఓరీ బాలక భయమును*
*నేరీతియు లేక నిటికునెటువచ్చితిరా*

పోరానేనిట "వావర్"

గారాములు సేయకనుచు కనలుచు పలికెన్ (17)

చివరి ఉల్లాసము ఆరవది -

శబరిమలకు వెళ్ళేవారు చాలానియమనిష్ఠలతో ఇరుముడి కట్టుకొని శీతలజలస్నానం, భూతలశయనం, ఒంటిపూట భోజనము చేస్తూ వ్రతదీక్షావరులై, ఒకమండలకాలం, భక్తిప్రపత్తులతో వెళ్ళుచుచ్చుతూ, శబరిమల నెక్కి స్వామి సన్నిధానం చేరుకొనెదరు -

మెట్లునెక్కుచు శ్రమయంచు మిగులదలచ

బోక సర్వేశునామంబు పూర్ణముగను

ఆత్మలోపలి ధ్యానంబు నపుడు చేసి

భక్తులే శ్రమలేకుండ ముక్తులగుచు (8)

కవిత్వము సంప్రదాయికము, కవి పండితులుగాబట్టి ప్రాచీన ప్రయోగాలు కొన్ని తమంతతాముగా రచనలో చోటు చేసుకొన్నవి. "తమ్ముగుఱ్ఱ", 'పల్మరు' కారియపెట్టు, వెల్లగొడుగు లాంటి ప్రయోగములు ఈ కోవకు చెందునవి కొన్ని ఉన్నవి.

ఇటీవల కాలంలో శబరిమలయాత్రలు చాల ప్రచారంలోనికి వచ్చినవి. ప్రతి ఊరు, ప్రతిపల్లె నవంబరు, డిశెంబరు, జనవరినెలలో "శరణమయ్యప్పా" "శరణమయ్యప్పా" అని దిక్కులు పిక్కటిల్లునట్లు భక్తులనినాదములతో ప్రతిధ్వనిస్తున్నవి. ఎక్కడ చూచినను అయ్యప్పస్వాములు దర్శనమిచ్చుచున్నారు. ఏడాదికేడాదికి భక్తులసంఖ్య పెరుగుచున్నది. అనేక ప్రాంతములలో అయ్యప్ప దేవాలయములు వెలయుచున్నవి. ఈ నేపథ్యములో ఈ కావ్యమునకు మంచి ఆదరణ లభించునని ఆశించుచున్నాను.

మరియొకసారి పండితకవులైన శ్రీమధురాంతకం దొరస్వామిగారిని అభినందించుచున్నాను.

ఇట్లు

**పి.వి. అరుణాచలం**

ఓమ్ స్వామియే శరణమయ్యప్పా ఓమ్

# పరిచయము

**డా॥ వేలుకూరి దైవశిఖామణి**
భాకరాపేట - 715 194
చిత్తూరు జిల్లా.

శుక్లాం బరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోప శాంతయేత్ !

శ్రీమణికంఠేశ్వర చరిత్రమను నామాంతరములగల శ్రీ అయ్యప్ప మహాభాగవతమును శ్రీమధురాంతకం దొరస్వామి విద్వాన్ రిటయర్డు సీనియర్ తెలుగుపండితులుగారు దాదాపు 1500 పద్యగద్యములతో రచించిరి. అందలి ముఖ్యాంశములను క్రోడీకరించి గ్రంథమును గూర్చియు, రచయితను గూర్చియు భక్తులకు పరిచయము చేయుటకు ఇందు మూలమున ప్రయత్నించుచున్నాను. భక్తులు విని తరించ గోరినాను.

భారతమాత రత్నగర్భ, ఆమె చేలాం చలం ఉజ్వలంగా ప్రకాశించే సజీవరత్నాలతో నిండి నిభిడీకృతమైయున్నది. భారతపుణ్యభూమిలో వందలమంది మహాయోగులు, మహాపురుషులు, మహాత్ములు, ఆవిర్భవించారు. వారు మాతృభూమి గౌరవాన్ని ఎంతో పెంచడమే గాకుండ లక్షలాది ప్రజలకు భక్తి, జ్ఞాన, సత్యాన్వేషణ మార్గము చూపించి వారి జీవితాల్ని ధన్యుల్ని చేశారు. ఆలాంటి కోవకు చెందినవారే శ్రీఅయ్యప్ప మహాభాగవత రచయిత శ్రీమధురాంతకం దొరస్వామి విద్వాన్ గారు. మామూలు మనిషిలాగే నిరాడంబరమైన గృహస్తజీవితం గడుపుతూ గృహస్థధర్మాలన్నీ నిష్టాపూర్వకముగ సూక్ష్మదృష్టితో నెరవేరుస్తూ ఆధ్యాత్మిక జీవనంలో అత్యున్నతశిఖరాన్ని చేరుకొని శ్రీఅయ్యప్పస్వామి జీవిత చరిత్ర లిపిబద్ధం చేసే సాహసానికి పూనుకొన్నారు. వీరి కవితావిన్యాసం శ్రీబమ్మెర పోతన కవితావిధానము ననుసరించియున్నది. ఇట్టి మహిమాన్వితమైన శ్రీఅయ్యప్ప మహాభాగవతము బమ్మెర పోతన యొక్క భాగవత శైలిలో ఆ భాగవత్ ప్రేరణచే వ్రాయబడినట్లు తోచుచున్నది. ఇంతటి గొప్ప గ్రంథమునకు నన్ను పరిచయ వాక్యములు వ్రాయగోరుట నా అదృష్టముగా భావించితిని. కానీ యింతటి గొప్ప భగవంతుని జీవిత చరిత్రకు పరిచయవాక్యములు వ్రాయుట నావల్ల అవుతుందా ! అని నేను ఆయనతో అన్నాను. పొట్టివాడు చంద్రుని అందుకోవడము లాంటిది. చిన్నగడ్డి దుబ్బు విశాలమైన మర్రిచెట్టు ఎత్తును కొలవలేనట్టే పరిచయ

వాక్యములు వ్రాయడము నావల్ల అయ్యేదేనా ! అనిపించినది. అయినను ఆకంద కోట శ్రీకందస్వామి అభయవాణివల్ల మనోబలం దృఢమై వ్రాయ సంకల్పించితిని.

రచయిత శ్రీమధురాంతకం దొరస్వామిగారు చిన్నతనముననే తల్లితండ్రుల వియోగము ననుభవించి అమ్మమ్మ తాతల పెంపకమున గారాభముగ పెరిగి పవిత్రమైన ఉపాధ్యాయవృత్తిని స్వీకరించి విద్వాన్ పట్టము పొంది కవిత్వము నందు ఆరితేరి గద్య,పద్య రచనల యందు పాండిత్యము సంపాదించిన మహనీయుడు, పుణ్యపురుషుడు, సత్యశీలుడు మన గ్రంథకర్త. మాసహోదరి శ్రీమతి శకుంతలమ్మ వీరిసహధర్మచారిణియై గృహస్త ధర్మము నెరపుచున్నారు. వీరికి అమరావతి శివసుబ్రమణ్య ప్రసాద్, ప్రసన్నలను ఇద్దరుకుమార్తెలు ఒకకుమారుడు కలిగి అమ్మమ్మ తాతగార్ల స్వస్థలమైన పుదిపుట్ల బైలునందు స్థిరపడి జీవిత గమనమును వెళ్ళబుచ్చుచున్నారు.

తదుపరి వీరు రచించిన శ్రీఅయ్యప్ప మహాభాగవతమును పాఠకుల కొరకై మచ్చునకు కొంత పరిశీలించుటకై పరిచయము చేయదలంచితిమి. ఇందు తప్పులున్న మన్నించప్రార్థన.

శా ॥ శ్రీవిఘ్నేశ్వర పాదపద్మయుగళిన్ చెన్నొందు నాధ్యానమే ।
ఈ విశ్వాత్మకుడైన స్వామివెలుగై । ఇంపారు బీజంబుగా ।
భావాతీతగుణోజ్వలంబగుచు । నేభావింప భావాంబుదిన్ ।
దైవాంశం బమృతమ్ము నీకవనమై । దైవంబు వెల్గొందుతన్ ॥

నిరాటంకతను బ్రసాధించు శ్రీవిఘ్నేశ్వరస్తుతియే అద్వైతమై విశ్వాత్మకు డైన స్వామిగా పరిణమించి ఆ తతగుణోజ్వలంబయి దైవాంశమైయీ కవనము విరాజమానమై బీజప్రాయముగ అద్యంత సమన్వయముగల ఈశ్వరుని మంగళాశీస్సువలె ఈ పద్యము ప్రభావితమొనర్చుచున్నది.

అయ్యప్పస్వామియొక్కయు, స్వామియొక్క భక్తులకథలుగలది ఈ అయ్యప్పమహాభాగవతము. పేరులోనే పెన్నిధిగలదు. ఆదరణీయ కవితాసారమైనది శ్రీ అయ్యప్పమహాభాగవతము. సామాన్యమైనది కాదు. అందున హరిహరాత్మజుడైన శ్రీఅయ్యప్పస్వామి మహాభాగవతమును వ్రాయువారు హరిహరాత్మజ స్వామి చరణరేణువుగ మదిదలంచువారు.

పూర్వ కవులగ్రంథముల వలె దేవతామూర్తుల స్తుతులు, నవకవులను గూర్చినతలంపులు - షష్ఠ్యంతములు గలిగి అష్టాదశ సోపానములు ఆరు ఉల్లాసములుగా విభజింపబడివిరాజిల్లుచున్నది.

శ్రీతిక్కనగారు శ్రీహరిహరనాథా ! అని సంబోధించుచూ భారతాంధ్రీకరణముగావించిరి. ఈ కవి శ్రీహరిహరపుత్రాయని సంబోధించుచూ స్వామి గాథను ప్రారంభించిరి. ఉల్లాసాంతములందు మాలినీ వృత్తములను, గద్యమును వ్రాసిరి. వేట, పుత్రోదయము, చంద్రోదయము, ప్రకృతి వర్ణనము మున్నగు కావ్యలక్షణములతో కూడి పరబ్రహ్మస్వరూపమైన అయ్యప్ప విశ్వరూపదర్శనముతో దుష్టశిక్షణ శిష్టరక్షణతో ఈ కావ్యము అలరారుచున్నది. స్థాలీపులాక న్యాయముననుసరించి గ్రంథమందలి కొన్ని ముఖ్యాంశములను పరికింతము.

అమృతోదయమున చంద్రుని పుట్టుకను ఇట్లు వచించిరి.

ఉ ॥ చల్లని కాంతి పుంజములు చాలగ దన్నుచు లోకమెల్లనా
చల్లని చూపులన్ కళలస్వాంతము ల్లుల్లసిలంగ నేర్పునన్
మెల్లగ మోహనం బొదవ మేకొన చంద్రుడు రూపసంపదన్
పల్లవి తాంగజుండనగ ప్రాపుగ బుట్టగ జూచిరందరున్ ॥

ఉ ॥ మందసమీరణంబుగతి మాధవు యుల్లము పల్లవింపగా
నంద మరంద బృందములు నందము చింద మరందమున్ గొనన్
మందవిలాస యానమున మాధవితా తగుదంచు వైళమే
చందురు తోడబుట్టువయి చానజనించెను మోహనాకృతిన్ ॥

వ ॥ చల్లని కాంతిపుంజములతో అమృత బిందువులు చిందగ చంద్రుడుదయించినాడు. శ్రీమహాలక్ష్మి ఆవిర్భవించినది.

పంబానదీ తీరమున మణికంఠస్వామి జనించినాడు. పందలరాజుకు లభించినాడు.

ఆ॥ వె॥ గృహము స్వర్గసీమ గృహమె పావనమైన
పాలసంద్రమందు పవ్వళించు
విష్ణుదేవునంత విమల తరాధ్యుండు
విభుడుదొచు శిశువు వెలసెనంత !

వ ॥ అట్లు రాజు గృహము స్వర్గశీమ యైనది.

కం ॥ జోజో కమల దలేక్షణ
జోజో శివతేజమూర్తి జోజో యనుచున్
జోజో అచ్యుత రూపా
జోజోయని పాడిరపుడు సూటిగ దతుల్ !

వ ॥ వ్యాఘ్రవాహన స్వామి వ్యాఘ్రములతో నేతెంచి – పులి పాలుపిండుదు– అమ్మ కౌషధమున గలిపియిందు అని చెప్పి ఇట్లన్నాడు.

ఆ॥ వె॥ అమ్మరుణము దీర్చ ఆవిర్భవించని
పుత్రుడేలపుట్ట పుడమియందు
మాతృ ఋణము దీర్చు మనుజుండెమనుజుండు
మమతలేని సుతుడు మనగనేల !

ఆ॥ వె॥ తల్లికంటె వేరు దైవంబులేదిల
తల్లితండ్రి గురుదు దైవమనుచు
దలచువారిలోన తల్లియేప్రథమంబు
తల్లికోటి దైవతముల సమము !

వ ॥ తర్వాత తండ్రికి తన జన్మవృత్తాంతము దెల్పి ఆత్మజ్ఞానమునుపదేశించెను.

❁ తే॥గీ॥ సర్వజీవులయందును సాగునాత్మ
అగ్నిగాలక గాలిచే నారిపోక
ఆయుధంబులచేతను అణగిపోక
నీటిచే తడుపబడక నెగదునాత్మ !

❁ ఉ ॥ ఆత్మకు చావులేదెపుడు అంచిత రీతిని చూడగా ధృతిన్
ఆత్మల కాత్మయౌ విభుడు ఆత్మయె గావున విశ్వనాథుడై
ఆత్మలు జీవులందరివి ఆదట గూర్చును తానెసర్వమై
ఆత్మల కాత్మయౌగురుడు అంచితరీతిని విశ్వనాథుడే !

❁ ఆ॥వె॥ వేరుచింతలేక వేద వేద్యుని భక్తి
తోడగొల్వ ప్రభుడు తోడుపడును
వారి యోగములను వారిక్షేమంబుల
వెలయజేయు వసుధ వేడుకలర !

వ ॥ అని ద్వాపర యుగమున శ్రీకృష్ణభగవానుడై అర్జునునికి బోధించి యుంటిని అని స్వామి

కం ॥ విశ్వము నాలోనున్నది
విశ్వములోనుంటి నేను విశ్వుడనేనున్
విశ్వాకృతి భావనలో
విశ్వేశ్వరుజూడవలయు విభుడుల మదులన్ !

❀ వ ॥ అట్లే శ్రీ అయ్యప్ప స్వామి రాజునకు నా విశ్వరూపము జూపెదచూడుమని ఎన్నికోరలు, ఎన్ని మిన్నగ జూపు చూపులు చూడుమాయిటు చూడు - చూడు హరియు నేనే, ఆపరబ్రహ్మంబునేనే, నేను కానిది ఈ జగంబున నేదియును లేనేలేదు, జయమునేనే, అధ్వయమునేనే, సర్వాంతర్యామిని నేనే, త్రికాలములలో సంచరింతును, కాలమూర్తిని, వేలమూర్తుల రూపములు నేనే, అన్నినేనే, అంతనేనే నేనె శక్తిని, నెనె ప్రకృతిని, ప్రకృతినాథుడను సైతము నేనే, పరమశివుడను, సృష్టి జేసెబ్రహ్మనేనే, లోకములుగాపాడు విష్ణుమూర్తిని గూడనేనే, నేనేసత్యం, నేనేనిత్యం, జగన్నాథులకు నాథుడను, భవబంధముల కతీతుడ, భాసురాంచిత జ్ఞానమూర్తిని, నిత్యవర్తిని, బ్రహ్మాండవర్తిని, నాదు విశ్వరూపము చూపెదను చూడుమనుచు,

❀ తే ॥ వివిధవర్ణాలు ఆకృతుల్ విశదముగను
మానుషేయంబు లవిగావు మహిమదనర
వసువులును రుద్రులంతట వారునాదు
దేహమందున నొకచోట తేరిచూడు !

❀ వ॥ అనగ మిరిమిట్లు గొల్పెడి విశ్వరూపంబు చూడలేక భయభ్రాంత చిత్తంబున నా రాజుగాంచెను

❀ ఉ ॥ చాలును చూడ జాలనిక స్వామివిబ్రోవుము నీదురూపమున్
బాలుని గాగ పూర్వమున భాసిలు భంగిని చూడగోరెదన్
చాలభయంబు తోడుతను స్వాంతము భ్రాంతము అయ్యెనో ప్రభూ
మేలగు దీవనల్ యిడుచు మోదముతోడుత నాదరింపవే !

❀ ఈ గుర్తులు గల పద్యముల భగవద్గీత శ్లోకముల కనువాదము

వ ॥ పోతనగారు భాగవతమునందు శ్రీకృష్ణభగవానుడు అడవిలో గోవులను మేపుచూ వానిని పిలచిన తీరును గనుడు.

**పోతఉవాచ -**

సీ॥ రాపూర్ణచంద్రిక రాగౌతమీ గంగరమ్ము భగీరథీ రాజతనయ
రాసుధాజలరాసి రామేఘమాలిక రమ్ముచింతామణీ రమ్ముసురభి
రామనోహారిణి రాసర్వమంగళరాభారతీదేవి రాధరిత్రీ
రా శ్రీమహాలక్ష్మి రామందమారుతి రమ్ముమందాకిని రా శుభాంగి

అనుచు మరియు గలుగు నాఖ్యలు గలగోవు
లడివిలోన దూరమందుమేయ
ఘనగభీర భాషగడునొప్ప జీరునా
జీరజనులు బొగడ బెంపుగనగ !

వ ॥ ఇందు మనకవి భక్తులు మణికంఠస్వామిని ఇట్లు పిలుచుచున్నట్లు పోతనను అనుకరించివ్రాసిరి.

**కవి ఉవాచ –**

రామణికంఠరా ! రమ్ముమాధవపుత్ర రమ్ము పందలరాజ రాజసుతుడ!
రమ్ము ఈశ్వరపుత్ర రంజిత తనుగాత్ర రమ్ము మారుని గన్న రమణుకుఙ్జి
రామనోహరగాత్ర రాజీవదళనేత్రరమ్ముపావనగాత్ర రాజవినుత
రామహిషాంగనా రమ్యమర్ధన స్వామిరమ్ము అయ్యపస్వామిరాజసుతుడ !

అనుచు భక్తజనులు ఆదట బిలువంగ
దూరమనకవచ్చి దరులనిలచి
ఎడదలందుమొలచి ఎంతొ బ్రోతువుస్వామి
అమృత బిందువులను అపుడుచింది !

వ ॥ గజేంద్ర మోక్షణమునందు గజరాజరక్షణ కుతూహలుడై ఏగు విష్ణుని లక్ష్మి ఇట్లడిగినది.

**పోతన ఉవాచ –**

అడిగెదనని కదువడిజను
అడిగిన తనుమగుడ నుడువడని నడయుడుగున్
వెడవెడ సిడిముడితడబడ
నడుగిడు నడుగిడదు జడిమనడుగిడునెడలన్ !

వ ॥ ఇందు మనకవి దుర్గామహా దేవి మహిషాసురుని జూచి యిట్లనుచున్నది

**కవి ఉవాచ –**

బిర బిర బరువిడ కుండగ
సరగున నిలునిలుపు మహిష జంపుదు ననుచున్
పురపురబొక్కుచు తరిమెను
అరివర్గము భీతిలంగ ఆహవ మందున్ !

వ ॥ మణికంఠస్వామి శూరపద్మాసురునితో బోరుట, మరియు దిగ్విజయ యాత్రలు సుమనోహరముగ వర్ణింపబడినవి. భక్తిరసభరితమగు కావ్యమగుటవలన అట నట పునరుక్తిగా పదములు దొరలినవి. పులివాహనుడగ స్వామి యేతెంచిన విధము, శబరికి మోక్షమిచ్చుట, స్వర్ణాలయనివాసము, ఆలయ నిర్మాణాదులు సవివరముగ వర్ణింపబడినవి.

వ ॥ ఇందు భక్తులిట్లు ప్రార్థించుచున్నారు.

మ ॥ ననునీ వానిగ జేర్చుకోసుమతిగానన్ నీవురక్షించుకో
మనగా మంజులరీతితో నెపుడు నీనీమనంబులన్ దిద్దికో
ఘనపాఠంబులు నేర్పివడినీ గానంబులన్ నింపుకో
అనయంబున్ భజియింపగా వసుధలో ఆనందమున్ జూపుకో !

మ ॥ ఘనతన్ ప్రాపుగ నేలికో గతివిగా జ్ఞానంబులన్ నింపికో
వినయాధిక్యత తోడనుం మనగ నీవిశ్వాసమున్ జూపుకో
ఘనమౌ స్వామివి విద్దెలందనుపుకోగాంచంగ గన్పించుకో
మనసా పార్థనలందుకో వెసనునీ మహత్మ్యమున్ జూపుకో !

వ ॥ ఇట్లే అంత్యపాస వృత్యను ప్రాసశబ్దార్థాలంకారములుగ కొన్ని పద్యముల లరారినవి. వదనం స్వర్ణం నయనం స్వర్ణం, హృదయం స్వర్ణం, నీభవసం స్వర్ణం, హృదయాధి పతే సకలంస్వర్ణం, అని వర్ణింపబడినది. చిన్ముద్రధారి – పరమపావనమూర్తి రమణీయ విగ్రహరూపమును వర్ణింపబడినది. జ్యోతిదర్శనము, కుదిరి ఉత్సవము పేర్కొనబడినది. పదునెనిమిది మెట్ల ప్రభావము ప్రక్యాతముగ వివరించబడినది. మూడు సోపానములు ఒక ఉల్లాసము, ఆరుల్లాసములుగాఈ కావ్యము తీర్చుడమైనది. షష్ఠమోల్లాసమున వారి "శబరిమలయాత్ర" వర్ణింపబడినద. యాత్రలో దర్శించిన ఆలయములందలి విగ్రహములను దర్శించినపుడు మన రచయిత మనోభావములిందు అవగతమగుచున్నవి.

ఇందు మన కవి చాముండేశ్వరి ఆలయమును దర్శించినపుడు

శా ॥ చంచత్ కాంచన కాంతి పుంజములతో సాలంకృతం బైననా
కించత్ క్రోధము నేత్రయుగ్మములపై కెంపుల్ గనన్ చండియై
చంచత్ దానవ నాశియై పరగెడిన్ సంహారియై హారియై
చంచత్ కాంతులశోభిలంగ నచటన్ స్వాధిష్టయై శోభిలెన్ !

ఉ ॥ ఆమహిషాసురుం బొదవి అంచిత శూలముద్రిప్పివైవగా
నామహిపైన వాడుబడె నాననమున్ రుధిరంబు వెల్వడన్
నామహిమాధ్యతాన చట దీప్తుల తోడుత నిల్చెనే ధృతిన్
పామరులైన సజ్జనుల పాపుగ నేలదలంచి యిద్ధరన్ !

వ ॥ హలి బేడును దర్శించినపుడు

ఉ ॥ నల్లని రాల చిత్రముల నాణ్యత తోడుత దీప్తులందగన్
యుల్లము పల్లవింపగను యూహలు కల్లగ చిద్విలాసమై

అల్లనగాంచ చిత్రములు ఆదట మల్లెలు మాధవీలతల్
పల్లవితంబులై బరగె ప్రాపుగ నాహలిబేడునందునన్ !

వ ॥ బేలూరును దర్శించినపుడు

తే॥ గీ॥ భారతీయ మహోత్కృష్ట భావలతల
కాలవాలంబు బేలూరు కలదు శిల్ప
దీప్తి పుంజంబుల కొటారు తేజమొసగ
శిల్పసంపద చెలువొందు శిలలపైన !

వ ॥ గురువాయూరున దేదీప్యమాన మగు కృష్ణాలయమును జూచి

ఆ॥ వె॥ వెన్నదొంగ యిటకు వేంచేసినావెట్లు
కుబ్జలేదు ఇచటకులుకులాడ
ఉన్నవారలంత కన్నకు చేలురే
కనికరించు స్వామి కాంక్షలొసగి !

ఆ॥ వె॥ కొడుకు బ్రహ్మయగును కోడలు వాగ్దేవి
కాంత లక్ష్మియగును కనికరింపు
విద్దెలొసగి ధనము విస్తృతంబుగనిచ్చి
ఆయువొసగి బ్రోవుమయ్య తండ్రీ !

వ ॥ ఇట్టి చణుకులకు, ప్రకృతి వర్ణనలకు, భక్తి భావ తరంతగములకు ఈ కావ్యమున కొదువలేదు. జ్యోతిదర్శన పూర్వకముగ అయ్యప్పబంగారుస్వామిని బంగారు కొండపై తిలకించి పులకించుదు. మహిషాసుర మర్ధని, మహిషి మర్ధన స్వామి వ్యాఘ్రవాహనస్వాముల ఉదంతములగనుడు. స్వామి తన ముందు పూర్ణముగ పుష్కలముగ అనుగ్రహములను రాసులు పోసికొని యున్నాడు. భక్తులకు స్వామి వానిని దయచేసి యిచ్చును

చిన్ముద్రధారి ఆత్మపరమాత్మలను కలిపి మోక్షమునొసంగు స్వామిని గూర్చిన ఈ అయ్యప్పమహా భాగవతమును చదివి తరించుడు. ఇంతటి గొప్ప భగవత్ గ్రంథమును రచించిన శ్రీమధురాంతకం దొరస్వామి విద్వాన్ గారికి ఆ దేవదేవుడు అష్టైశ్వర్యము లొసగి బ్రోచు గాత ! ఇట్టి గ్రంథములింకనూ వారు రచించి భక్తుల హృదయములను చూరగొందురని నా ఆకాంక్ష.

ఇట్లు
**డా॥ వేలుకూరి దైవశిఖామణి**
భాకరాపేట.

పదవీ విరమణ చేస్తున్న సీనియర్ తెలుగు పండితులు

## గౌ॥ శ్రీమధురాంతకం దొరస్వామి గారికి

మంగళం పేట జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల ఉపాధ్యాయ విద్యార్థి బృందం
సాదర పూర్వకంగా వీడ్కోలుపుతూ సమర్పించుకొంటున్న

# సన్మాన పత్రం

ఆదర్శ ఉపాధ్యాయా ! సూర్యుని వంటివాడు ఉపాధ్యాయుడు. ఉత్తమోత్తమమైనది ఉపాధ్యాయవృత్తి. దాదాపు 36 సంవత్సరాల జీవితకాలం ఈ వృత్తికే అంకితం చేసిన మీరు ఎంతైనా ధన్యజీవులు.

స్వయం కృషితో విద్వాన్ పట్టభద్రులు కావడం మీ విద్యావివేకానికో మచ్చుతునక ! సాహితీ రంగంలో మీకున్న పరిపూర్ణత్వం లోక విదితం ! అందుకే మీరు విద్యార్థులకు మాత్రమేకాదు ఉపాధ్యాయులకు సైతం ఒక నిఘంటువు లాంటి వారు. ఇంకా చెప్పాలంటే పుస్తక బండాగారం లాంటి వారు. అలాంటి విద్వద్వరేణ్యులతో కలిసి పనిచేయడం ఒక అదృష్టంగా భావిస్తున్నాం. తెలుగు కథానిక ఓనమాలు దిద్దుకుంటున్న కాలంలో మీరు రాసిన కథలు "స్వర్ణలత", "ఇది మరొక కథ", "హాలా హలంలో అమృతబాండం", "నిరీక్షణ", "స్వాతిచినుకులు", సాహితీ ప్రియుల నెంతగానో ఉత్తేజ పరచినవి. మీ పాండిత్య పటిమకు దర్పణం పట్టే "చిద్విలాస శతకం", శతక ప్రపంచంలో ధృవతారగా నిలిచి ఉండగలదనటంలో ఏలాంటి సందేహము లేదు. "మనమూ - మనవారసత్వాలు", "సంక్రాంతి సౌరభాలు" "అరగొండ ఆత్మోన్నతి" అనే వ్యాసాలు ఆంధ్రవ్యాసావళిలో హిమాలయ పర్వతాల వంటివి.

పెద్దలకే కాదు పిల్లలకూ సుద్దులు చెప్పడంలో మీకున్న నేర్పుని "దేశోద్ధారకుడు" అనే పిల్లల నవల స్పష్టంచేస్తోంది. నిజంగా అది పిల్లలకెంతో ఉపయుక్తమైన నవల ! ఈవీడ్కోలు సందర్భంలో మా దొక చిన్న మనవి.

సాహిత్యప్రక్రియలన్నింటిలోను చేయితిరిగిన రచయితలు మీరు చేవగలిగిన రచనలు చేయటంలో కదు సమర్థులు ఐనా ఉద్యోగ నిర్వహణలో తలమున్కలై ప్రయాసలతో కూడిన ప్రయాణాలు చేయడంచేతనేమో ఆశించినన్ని రచనలు మీనుండి వెలువడలేక పోయినై. అదిమీకేకాదు సాహితీ లోకానికే పెద్దలోటు !

కనీసం ఇప్పటికైనా మీ శేషజీవితకాలాన్ని రచనావ్యాసంగానికే వినియోగించి సాహితీ వ్యవసాయంలో ఇతోధిక కృషిచేసి ఆలోటును తీర్చగలరని విశ్వసిస్తున్నాము. ఆదేవదేవుడు మీకు చిరాయురారోగ్యములు సంపదలిచ్చి చల్లగా చూడాలని మనసారా ప్రార్థిస్తున్నాము.

ఇట్లు

**మీ ఎల్లంకి భాస్కరనాయుడు**
ప్రధానోపాధ్యాయుడు
ఉపాధ్యాయ విద్యార్థి బృందములు

జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల
మంగళంపేట
25-11-83

## శ్రీవినాయక గురుదేవోభ్యోనమః ఓం స్వామియే అయ్యప్పా శరణం

సీ ॥ రామ చంద్రారెడ్డి రమణీయ గాత్రుండు
శాసనసభ్యుండు సదయుడగుచు
చిత్తూరు మండల సిరులుల్ల సిల్లంగ
కాంగ్రెసు పార్టిలో కార్యదర్శి
దేశసేవారాధ్య దినకర ప్రతిముండు
ఎత్తారి పల్లెలో నుత్తముండు
భారతదేశాన ప్రాభవాంఛిత మైన
సత్కీర్తిగాంచిన సదయుడితడు

తే॥గీ॥ శబరి గిరి స్వామి చరణాలు చాలగొలిచి
హరిహరాత్మజ స్వామిని అతిశయముగ
తనదు పురమున నిల్పుచు తాల్మితోడ
ఆలయంబును గట్టించెనతి ముదమున ! 1

సీ ॥ రమణీయ మందిరా రామ పుంజమ్ముల
రమ్యత గుడిగట్టె రాజసముదు
మానసకాసార మహిమంబు జనియించ
త్రవ్వించె కోనేరు తాల్మితోడ
భూగర్భ గృహములు ముఖ్యమౌగుడులను
మున్ముందు నిలిపెను మోదమలర
అన్నదానపు సత్రమౌ అతిథి గృహము
భజనమందిరమును పరగ గట్టి

తే॥ గీ॥ గుడికి ముందు వినాయక గుడిని గట్టి
కన్నెమూలంపు గణపతి మున్నెనిలిపి
మాలికాపుర మాతను మంజులముగ
నిల్పి గుడిగట్టె స్వామికి నిలయమొప్ప 2

ఉ ॥ ఈ గుడి సొంపునెన్నగను ఈశ్వరుడో హరియో పితామహుం
డో గుణముల్ నుతింపగను నోరిమి నంతట నాదిశేషుడో
బాగుగ వాస్తు శిల్పముల భాగ్యములుల్లసిలంగ గట్టగా
సాగెను సర్వసంపదల సాగెను సుందరమందిరంబుగా 3

ఆ॥వె॥ స్వామి సన్నిధాన సదమ లాంచితమైన
సౌరు శాంతి నొసగి సాధువులకు
పరమహర్ష మొదవు ప్రార్థనల్ జేయంగ
సుధలు గురియు హృదుల శుభము లెసగ ! 4

శా॥ ఈ నైర్మల్యము లింపుసొంపులు ధృతిన్ ఈశక్తి ఈశత్వమున్
ఈ నైర్మల్య సుధాంశపూరములతో నింపైన ప్రాకారముల్
కానైనన్ దిలకించి పోవునట నాకాత్యాయినీ దేవితో
తానైనాశివుడప్పుడప్పుడును నీతారుణ్యతా శోబలన్ 5

మ ॥ అదె కైలాసనగంబు పై శివుడు నాయార్యా మహాదేవితో
కుదురై కూర్మిని గూడి క్రీడ సలుపఁ గూర్పంగ నామోదముం
గదురన్ కేలను గాంచనాజననియున్ గూర్చంగ నామోదమున్
ముదమందంగను ముఖ్యమౌ పెనుశిలన్ మోదించి తావైచినన్ 6

వ ॥ పార్వతీ దేవి అంశమైన సదుము ఎల్లమ్మ సదుమునుండి పర్వదినములలో రాత్రులందు ఈ బండవైకేతెంచి నాట్యము సేయుచుండగా శ్రీసదాశివుడును ఇటకేతెంచి తన నటనా ప్రావీణ్యముట్టిపడ అమ్మవారితో గలసి నాట్యమాడు చుండును. అట్టి యెడ ఒకనాడు ఆ పురాణదంపతులు అయ్యప్పను స్మరింపగా స్వామి వావరుస్వామి తోనేతెంచి సాష్టాంగ నమస్కారములు చేయగా తల్లిదండ్రులు స్వామిని కౌగలించుకొని ఆశీర్వదించి నాయనా మణికంఠా ! ఈ ఎఱ్ఱరాతి బండ కైలాసము నుండి నాచేవిసిరి వేయబడినది. శబరిగిరి వలె ఈబండ పవిత్రమైనది ఇచ్చోటనే నీవు వావరు స్వామితో గలసి దొంగలను తరిమి ప్రజలను గాపాడితివి.

రామనామాంకిత ధ్యాయియైన ఒక మహాభక్తుడు రాజకీయవేత్త ధర్మశాస్త్రా భూతనాథుడు పరాయగోపుత్రుడు మణికంఠేశ్వరుడును అయ్యప్పవైన నీకు గుడి గట్టగలదు అనిపల్కగా మహాప్రసాదమని నమస్కరింపగా ఆదిదంపతులు వారిని దీవించి అంతర్ధానమైరి స్వామి వావరు స్వామితో శబరిమలను చేరెను. 7

ఆ॥వె॥ ఎఱ్ఱరాతి పల్లె ఎఱ్ఱాతిపల్లెగా
బండ దండ నుండు ప్రజలు పలుక
పలుకు బడిని పల్లె పరిఢవిల్లెను చెంత
పరమ పురుషునాజ్ఞ ప్రతిభ దనర. 8

సీ॥ బండపైన బురుజు బలుసోయంగబుగా
గానిపించె ప్రభులు గణన గట్ట
రాజ్యములనునేలు రాజులె యలనాడు
రణము లిచట జేసి రప్పుడపుడు
ఈ బుర్జు బండపై ఈశ్వరి నిలుచుండి
ఇంపుగ భక్తుల నాదరించె
ఈ బుర్జు బండపై నింపుగ వావరు
'స్వామితో' నేతెంచి సరగనిలిచె

దొంగలం దోలి ధర్మంబు చెంగలింప
ప్రజల బాధలు బోకార్చె ప్రభుడునాడు
అనుచు ప్రజలంత కథలుగ అపుడు బల్క
పుణ్యసీమగ నీబండ గణ్యమయ్యె 9

వ॥ అంత ఒకనాడు శ్రీపెద్దిరెడ్డి రామచంద్రారెడ్డిగారు 10

చ॥ ఇరుముడి గట్టి స్వామిని ఇమ్ముగతా గరిమంబు పెంపునన్
సరగున నేగి కాంచెనట స్వాంతము రంజిల స్వామి రూపమున్
పరముడు శాంతి సంపదల ప్రార్థనలన్ గ్రహియించి బ్రోవగా
పరమ దయాకరుండగుచు ప్రార్థివుబోలిన రెడ్డి వర్యుడున్ 11

వ॥ ఇట్లు స్వామిని దర్శించి శబరి మలనుండి తిరిగి రాగా ఆనాటి రాత్రికలలో స్వామి గనిపించి బురుజు బండపై తనకు ఆలయమును నిర్మించుమని సకల శుభంబులు నీకగుని అంతర్ధానమయ్యెను. 12

తే॥గీ॥ దివ్యదేదీప్య సౌందర్య భవ్యరుచుల
సన్నిధానంబు గలుగంగ శాశ్వతముగ
దేవళం బెంతొ సొరుల దేజరిల్ల
రామచంద్రాఖ్యరెడ్డి దారయముగట్టె. 13

తే॥గీ॥ ఎందరో భక్తులిచ్చట మందగతిని
ధర్మశాస్తాను గొల్చుచు ధర్మమార్గ
నిరతులౌచుండి రెల్లడ నిరుపమాన
భక్తి పుంజంబులవి నిండ భద్రగతిని 14

ఆ॥వె॥ రమణ పెద్దిరెడ్డి రామచంద్రారెడ్డి
రాజసముడు కార్యరంగమందు
గాంధిమార్గగామి ఘనత గాంచిన వారు
ప్రజల బ్రోచునతడు ప్రతిభగాంచి 15

తే॥గీ॥ శరణమయ్యప్ప యనుచును స్వాంతమలర
నిండు గుండెల దండల నిలిపి మ్రొక్క
నిదియ కైలాస మయ్యెను నిక్కమిచట
అంబతోడి శివుండు నానందమంద 16

తరల॥ పరమపురుషుడొక్కడాధ్యుడు పార్వతీపతి పుత్రుడీ
సరణి పందళ రాజు కీతడు స్వామిగాగలభింపగా
కరియ వాహనమంచు నెక్కటు కార్యకారణరూపుడై
వరములియ్యగ భక్తులంగని వచ్చు వేడుక తోడుతన్ 17

తరల॥ కరము మోదము గుల్కగా మదిగానిపించుచునుండగా
హరుడు నా హరిగూడి చూడగ అంచితంబుగ నాతనిన్
బరమెభక్తులగావ పెన్నిధి బ్రహ్మమే మణికంఠుడీ
కరణినేలగ బ్రోచు నాతడు కాంచనాంగుడు నెల్లరన్ 18

ఉ ॥ ఉల్లము పల్లవింపగను ఊరట లందగ సాధుసత్తముల్
సల్లలితాంగుడై యెదుట స్వామి జరించెడి చూడు కన్నులన్
కల్లలుగాదు జూచినను కాంచగ వచ్చును కన్నులందునన్
ఉల్లము లోపలన్ వెలుగు ఉన్నతినందగ జేయు సత్ర్పభున్ 19

ఉ ॥ అక్షయమైన వెల్గులను అంచిత కాంచన దివ్యదీధితుల్
వక్షమునందు నామణులు వర్ధిలివెల్గెడి తీరుజూడగా
రక్ష యొసంగి భక్తులకు రాముని కృష్ణుని రీతి బ్రోచుతన్
అక్షయ సంపదల్ గలుగ నార్ద్రత తోడుత నిచ్చుస్వామియున్ 20

ఉ ॥ నీమము లొప్పుచుండగను నిక్కము మామణికంఠు గొల్వగన్
కామము వీడి సద్గతులు గాంచగ భక్త జనాళివేగమే
వేమరుప్రార్థనల్ సలుప విశ్రుత లీలల వెల్గ వైళమే
మారుని తమ్ముగుఖ్యయిటు మానసముల్ దగనిండి బ్రోచుతన్ 21

**- మధురాంతకం దొరస్వామి విద్వాన్**

# అష్టాదశ సోపానములు



సన్నిధానం

| ఉండునవి | తొలగవలసినవి | సోపానములు | ఉల్లాసములు |
|---|---|---|---|
| సర్వసౌభాగ్యదాయకము | అవిద్యారహితము | 18 సోపానము | షష్ఠోల్లాసము |
| సర్వాంగ సుందరంబు | త్రిగుణరహితము | 17 సోపానము | |
| సర్వవిఘ్న నివారణము | దుష్ట స్పర్శరహితము | 16 సోపానము | |
| సర్వమృత్యువుశమనము | జిహ్వానిగ్రహము | 15 సోపానము | పంచమోల్లాసము |
| సర్వదుఃఖవిమోచనము | దుర్వాసనారహితము | 14 సోపానము | |
| సర్వమంగళకరము | దోషశ్రవణరహితము | 13 సోపానము | |
| సర్వప్రియంకరము | దోషదృశ్యరహితము | 12 సోపానము | చతుర్థోల్లాసము |
| సర్వసంపత్కరము | తమోగుణరహితము | 11 సోపానము | |
| సర్వకామయుతము | రజోగుణ రహితము | 10 సోపానము | |
| ప్రాప్తియుతము | సత్వరహితము | 9 సోపానము | తృతీయోల్లాసము |
| ఇచ్ఛాయుతము | అహంకారరహితము | 8 సోపానము | |
| బుద్ధియుతము | దంబరహితము | 7 సోపానము | |
| ప్రాకామ్యయుతము | మాత్సర్యరహితము | 6 సోపానము | ద్వితీయోల్లాసము |
| వశిత్వయుతము | మదరహితము | 5 సోపానము | |
| ఈశక్తయుతము | మోహమహితము | 4 సోపానము | |
| మహిమాయుతము | లోభరహితము | 3 సోపానము | ప్రథమోల్లాసము |
| లఘిమాయుతము | క్రోధరహితము | 2 సోపానము | |
| అణిమాయుతము | కామరహితము | 1 సోపానము | |

ఉండవలసిన గుణములు మూడు కాలములు కలిపి చదివిన సీస మాలిక యగును

| | | | |
|---|---|---|---|
| సీ॥ | అణిమయు | 1 | |
| | లఘిమయు | 2 | నాదట |
| | మహిమంబు | 3 | |
| | ఈశక్త | 4 | మమరంగఈశుకరుణ |
| వసుధ॥ | వశిత్వంబు | 5 | |
| | ప్రాకామ్య | 6 | |
| | బుద్ధియు | 7 | |
| | ఇచ్ఛయు | 8 | దలపోయ ఇంపుదనర |
| | ప్రాప్తియు | 9 | ఈశ్వరప్రతిభతో |
| దనరార | సర్వకామంబును | 10 | సరిగనుండ |
| | సర్వసంపత్కర | 11 | |
| | సర్వప్రియంకర | 12 | సముదయంబులనెడి |
| | | | సంపదలను |
| | సర్వమంగళమును | 13 | |
| | సర్వదుఃఖవిమోచ | 14 | నాదుల వరుసనునాణ్యతగన |
| గీ॥ | సర్వదుఃఖప్రశమనము | 15 | సరిగజూడ |
| | సర్వవిఘ్ననివారణ | 16 | సదమలంబు |
| చారు | సర్వాంగసుందర | 17 | సారయుతము |
| | సర్వసౌభాగ్యదాయక | 18 | సదమలమగు అష్టదశకంబు |
| | | | గూడిన అమరుపడులు |

(పడులు = సోపానములు)

## తొలగవలసిన గుణములు

మ ॥ అరిషడ్వర్గము లారు (6) దంబమును (1) దానంతన్ నహంకారమున్ (1) సరిగా జూడ గుణంబులన్ త్రితయమున్ (3) సాగంగ పంచేంద్రియాల్ (5) విరిన్ జూడగ ఇంపుతోడుతను తావిద్యన్ (1) అవిద్యన్ తగన్ (1) సరిగా నాదశకంబు నష్టమును వేసాగంగ దాగూడుచోన్.

# అష్టాదశ మంత్రములు - (పాట)

ఒకటో శ్రీసోపానము ఓం శరణమయ్యప్పా తండ్రీ శరణమయ్యప్ప
బంగరు తండ్రీ శరణమయ్యప్పా

రెండో శ్రీసోపానము ఓం శరణమయ్యప్పా తండ్రీ శరణమయ్యప్ప
బంగరుతండ్రీ శరణమయ్యప్పా

మూడో శ్రీసోపానము ఓం శరణమయ్యప్పా తండ్రీ శరణమయ్యప్ప
బంగరుతండ్రీ శరణమయ్యప్పా

నా॥ ఓం శరణమయ్యప్పా తండ్రీ శరణమయ్యప్ప
బంగరుతండ్రీ శరణమయ్యప్పా

ఐదో శ్రీ సోపానము ఓం శరణమయ్యప్పా తండ్రీ శరణమయ్యప్ప
బంగరుతండ్రీ శరణమయ్యప్పా

ఆరో శ్రీసోపానము ఓం శరణమయ్యప్పా తండ్రీ శరణమయ్యప్ప
బంగరుతండ్రీ శరణమయ్యప్పా

ఏడో శ్రీసోపానము ఓం శరణమయ్యప్పా తండ్రీ శరణమయ్యప్ప
బంగరుతండ్రీ శరణమయ్యప్పా

ఎనిమిదో శ్రీసోపానము ఓం శరణమయ్యప్పా తండ్రీ శరణమయ్యప్ప
బంగరుతండ్రీ శరణమయ్యప్పా

తొమ్మిదో శ్రీసోపానము ఓం శరణమయ్యప్పా తండ్రీ శరణమయ్యప్ప
బంగరుతండ్రీ శరణమయ్యప్పా

పదో శ్రీ సోపానము ఓం శరణమయ్యప్పా తండ్రీ శరణమయ్యప్ప
బంగరుతండ్రీ శరణమయ్యప్పా

పదకొండో శ్రీ సోపానము ఓం శరణమయ్యప్పా తండ్రీ శరణమయ్యప్ప
బంగరుతండ్రీ శరణమయ్యప్పా

పన్నెండో శ్రీ సోపానము ఓం శరణమయ్యప్పా తండ్రీ శరణమయ్యప్ప
బంగరుతండ్రీ శరణమయ్యప్పా

పదమూడో శ్రీ సోపానము ఓం శరణమయ్యప్పా తండ్రీ శరణమయ్యప్ప
బంగరుతండ్రీ శరణమయ్యప్పా

పదునాల్గో శ్రీసోపానము ఓం శరణమయ్యప్పా తండ్రీ శరణమయ్యప్ప
బంగరుతండ్రీ శరణమయ్యప్పా

పదహైదవ శ్రీ సోపానము ఓం శరణమయ్యప్పా తండ్రీ శరణమయ్యప్ప
బంగరుతండ్రీ శరణమయ్యప్పా

పదహారో శ్రీ సోపానము ఓం శరణమయ్యప్పా తండ్రీ శరణమయ్యప్ప
బంగరుతండ్రీ శరణమయ్యప్పా

పదహేడో శ్రీ సోపానము ఓం శరణమయ్యప్పా తండ్రీ శరణమయ్యప్ప
బంగరుతండ్రీ శరణమయ్యప్పా

పద్దెనిమిదో శ్రీ సోపానము ఓం శరణమయ్యప్పా తండ్రీ శరణమయ్యప్ప
బంగరుతండ్రీ శరణమయ్యప్పా

కం ॥ అష్టాదశ సోపానము
లిష్టార్థములన్నినిండి ఇరులు తొలంగన్
శిష్టార్థులగుచు నెక్కుదు
రష్టాదశమంత్రములను అపుడ బలుకుచున్

(గమనిక :- ఒన్నాం తిరుపడి శరణమయ్యప్ప అను తమిళపాటకు స్వేచ్ఛానువాదము)

# నివేదన

కం ॥ శ్రీ స్వామి హరిహరాత్మజ
మా స్వామివి ధర్మశాస్త్ర మంజుల రూపా
ఓ స్వామి శరణమయ్యప
మాస్వాంతములందు నిలిచి మనుపుముమమ్మున్ 1

మ ॥ అమల జ్ఞాన సుధాంబు పూరములతో అత్యంతమోక్షప్రదం
బమితా ఖ్యానలతాల వాలమగుచున్ భాసిల్లు బ్రహ్మంబునై
విమలాంభః కణశీతవాత జనితా విర్భూత పీయూషమై
కమలాక్షుంబ్రతిరూపమై వెలుగు నీకావ్యంబుశోభిల్లెడిన్ 2

తే॥ గీ॥ అయ్యె సూర్యోదయంబయ్యె అవనియందు
డెంద మందలి సరసున అందమెసగ !
విచ్చుకొన్నట్టి తామరల్ వెలయుచుండ
అదియెజ్ఞానంపు సూర్యోదయాఖ్యబరగు 3

మ ॥ అరవిందంబులు గావు జూడమదిలో ఆఖ్యాన పుంజమ్ములన్
అరవిందమ్ములు శాంతమున్ విమల మానందంబు దాసత్వమున్
విరియన్ శోభలు ధర్మమున్ విరుల నా విఖ్యాత తీర్థంబు నన్
కరుణన్ గూరిచి ప్రజ్వలించెడిని నాకంజాక్షు వీక్షింపగన్ ! 4

ఉ ॥ బృంగ కుమారులై బరగి భృంగముల లట్టుల చెంగలించుచున్
సంగతి తీర్థసంపదల సొగసువాసనలంత నిండగన్
భంగము లేమిలేక వడి భాగ్యముగాగనుభక్తబృంగముల్
సంగతి కావ్య సంభరిత స్వాదుమరందములాను గావుతన్ 5

తే॥ గీ॥ పలుకు చుంటిని అయ్యప్ప భాగవతము
పలుక జేయుత మణికంఠ ప్రభుడితందు
పలుక కలుషంబు లన్నియు బడలిపోవు
వేరు పలుకులు పలుకంగ వేద్యమగునె 6

ఉ ॥ దైవ శిఖామణిన్ గురుని దైవసమున్ మదిలోననెంచెదన్
దైవము పోల్కినాంధ్రమున దాను సుబోధనలెన్నొ జేయగా !

భావన జేసి అయ్యపనుభాసురతన్ 'మణి' దీప కాంతులన్
సేవచియింప బూనితిని నీ ప్రభుభాగవతంబునిమ్మెయిన్ 7

తే॥ గీ॥ స్వామి శ్రీవివేకానంద సదయహృదయు
నాత్మ గురువుగ హృదయాన నధివసింప
జేసి మ్రొక్కితి జ్ఞానంబు చెంగలింప
ద్వైతముం బాపి కరుణన ద్వైత మొసగ 8

ఉ॥ క్రాంతి పథంబునన్ నిలుడు కాంతులు చిందగ బ్రహ్మభావనన్
శ్రాంతులు గాకుడీ పనుల సారెకు జేయుడి సత్పథంబులన్
భ్రాంతులు వీడు డీ యిహపుబాధలనెంచక నోర్మి తోడుతన్
స్వాంతములందు స్వామినిడి సాగుడు మోక్షపథంబు జేరగన్ ! 9

తే॥ గీ॥ హరిహరాత్మజుడెవడని అడుగబోకు
హరుడెహరియును బ్రహ్మంబు అగు సతండు
ద్వైత సంపదయసనెద్ది దలచిచూడ
బ్రహ్మమంతయు నొకటయి బరగు చుండు 10

తే॥ గీ॥ తానె సర్వంబు సర్వంబు తానె యగును
తానుగానట్టిదేదియు ధరణిగలదె ?
తేజమే తాను తేజమై తెరవుసూపు
భక్తబృందమ్ములకు వేడ్క పసదలిర్ప 11

తే॥ గీ॥ సత్యమేజ్యోతి జ్యోతియై సదమలముగ
డెందములయందు వెల్గయి సందడించు
పండువెన్నెల పోల్కిని ప్రభలుగుల్కు
చుండు భక్తుల హృదయాలు చూరగొనుచు 12

తే॥ గీ॥ పూర్వ పుణ్యంబె కావ్యమై పొల్పుగాంచ
కొండ లంతటి పాపముల్ క్రుంగిపోయి
భస్మముల రాసులై పోవ భవుని పుత్రు
దతుల యశములు శుభములు అమరజేయు ! 13

మ ॥ భవ బంధమ్ములు పాయ జేయుగద నీ బ్రహ్మంబు సందీప్తమై
భవమున్ బొందక సద్గతిన్ బొరయగా భాగ్యంబు దైవారగా

భవనం బందున శాంతి శోభిల నిటన్ పూర్ణుందు తా(బ్రోచెడిన్
భవుడై సద్గతిజూపు గావుతను నాభాగ్యం బగణ్యంబుగన్ 14

మ ॥ నను మర్ధింపుము నీదుపాదములతో నత్యంతమోదంబునన్
అనయంబట్టుల పాదతాడనములన్ ఆహ్లాదముంజెందగా
వినయంబొప్పగ వేడుచుంటినెడదన్ విశ్వేశనే నెప్పుడున్
సునయంబొప్పగ వావరుందనుపుచున్ సుశ్రీయుతుంజేయవే 15

మ ॥ కనులన్ కాయలుగాచునట్టలుగనే కాంచన్ మదిన్ గోరుచున్
వినయంబొప్పగ నుంటినే లగదవే విఖ్యాతినింజూపుచున్
వినిపింతుం వినునాదు డెందమున నీవిఖ్యాత చారిత్రమున్
కనిపింపంగను రావే బ్రోవగదె నీకంజాక్షతం జూపనే 16

శా ॥ సుశ్రీమంతుడ నౌచునుండగను నెచ్చోనేదలంపన్ తగన్
నే శ్రీలన్యిటగోరగా జనదునే ఏవేలుపుం గోరకన్
నీ శ్రీలం ధరగోరి కొంటి నిడవే నీ శ్రీలు శీలంబులన్
అశ్రాంతంబును ధర్మమార్గముననే నంతన్ ధృతిన్ నుండగన్ 17

ఉ ॥ నిత్యమె జీవనంబిది యనిత్యము జూడగ నెల్లవేళలన్
సత్యము నీదు నామమును స్వాంతమురంజిల భక్తి భావముల్
అత్యధికంబుగా బరప అంచిత రీతిని బ్రోతువో ! ధృతిన్
పత్యమె ధర్మమౌనటుల ప్రార్థనలంతట జేతునిత్యమున్ 18

ఉ ॥ కామము క్రోధలోభములు కాంచగమోహము నంతలంతలన్
నామదమత్సరంబులును ఆదట మానవ జాతి క్రుంగగా
నీమములన్ని దోచునట నిక్కమువానిని గెల్వగావలెన్
కాముని ద్రోచినప్పుడెద కల్గును అన్నిట ముక్తిభావముల్ 19

తే॥ గీ॥ దయయు సత్యంబు రెండును ధరను నిల్ప
శాస్త్రయుదయించె యుదయించె సర్వశుభము
లంత గల్గును జనతకు అంచితముగ
శోభనంబులు దైవారి శుభములెసగు 20

శా ॥ అద్వైతామృతమందు స్థానమిడుచున్ ఆరాధ్యదైవంబుగా
ఏ ద్వైతంబును లేక ఎల్లప్రజలన్ ఏర్పింప నిక్కంబుగా
అద్వైతామృత వృష్టి ధారలొలుకన్ ఆనందిత స్వాంతుడై
అద్వైతుల్ అగునట్లు బ్రోచునటనీ ఆరాధ్య శాస్తాధరన్ 21

ఉ ॥ స్వామి యటంచు నెల్లెడల సాగగ సర్వజనాళి బిల్చుచున్
స్వామిని ప్రీతిమైదలప స్వాంతము కాంతిమయంబె యయ్యెడిన్
స్వామికి సర్వమున్ వదలి సాగిలి మ్రొక్కుచు నర్పణంబుగా
స్వామిని వేదవైభవము సాగుచునుండును పౌరులందునన్ 22

ఉ ॥ స్వాంతము భ్రాంతమై జనక స్వాతి శయంబును జూపబోవక
శ్రాంతము ధర్మమార్గమును శాంతిని దాంతిని సత్యశోభలన్
క్రాంతులు గల్గ జూడుడిల కాంచనగర్భసమున్ మిమున్ గనన్
భ్రాంతపు భావముల్ విడిచి బాగుగ మోక్ష పదంబుజేరుడీ 23

చం ॥ కలియుగ మందు దైవమయి కాంక్షలు దీర్చగ నెల్లవారికిన్
నిలుపక సర్వపాపములు నీరజ నాభుసుతుండు త్రుంచుతన్
మలినములేని జీవనము మాటికి గూర్చుత స్వామి సన్నిధిన్
వలయునె జ్ఞానపుంజములు వర్ధిలగాంచుడు స్వామి పాదముల్ 24

ఆ॥ వె॥ సాధుపుంగవుండు సంస్తవనీయుండు
స్వామి స్వాంతములను సాగివెలుగ
ఏమి వైభవంబు ఏర్పరింపగరాదు
కనుల జూడు దయ్య కరముభక్తి 25

కం ॥ దనుజుల దునుమను హరియును
ఘనముగ సురువరుల కరుణ గనగను బ్రోవన్
అనయము సుజనుల దనుపగ
తనమహిమను గనగ హరియు ధరపై బుట్టెన్ 26

కం ॥ ధర్మము ధరపయి నెలకొన
అర్మిలి భక్తులను బ్రోవ అన్నియుగములన్
నిర్మలిన హృదయు లందరి
కర్మము లన్నిటిని బాప కర్తహరియగున్ 27

మ ॥ హరియే బ్రహ్మము నాసదా శివుడు సోహంబున్ సుదాసోహమున్
హరియే బ్రహ్మము బ్రహ్మమైబరగెడిన్ ఆ సృష్టియాద్యంతమున్
హరియౌ అయ్యపగూడనా హరియుదానైగాచు ధర్మంబునున్
కరినేలంగను జూచు విష్ణువన నా కంజాతనేత్రుండొగిన్ 28

కం ॥ సురలను కరుణను గనగను
మరలను జననంబు బొంది మహిషిని జంపన్
హరిహరులకు దయమందిన
హరిహర సూనుండు దలప హరియయి బరగెన్ 29

ఉ ॥ కేరళ కేళి విగ్రహము కేశవ సూనుడుదంచి తాత్ముడై
కేరళ వాసులన్ దనిపి కేరళ మాత్రమే గాదులోకముల్
పారము మీరగాచునట పద్మదళాక్షుడు సంతసంబునన్
కూరిమిదేశమంతటను కోరివిదేశములందు సైతమున్ 30

కం ॥ రాజ్యంబే ధృవమనకను
రాజ్యేందిర ద్రోసిపుచ్చి రామునిపగిదిన్
రాజ్యంబేలక భక్తుల
రాజ్యంబును నేలు ప్రభువ రాజ సుపుత్రా ! 31

చం ॥ పురహర సూను డంచిత సుపూజ్యుడనంతుడునైనతేజుడా
వరదుడు పూర్ణ పుష్కల లవారిత రీతిని చెట్టబట్టివే
వరములు కొల్లగా నిడడె వర్ధన మొందగ నెల్ల భక్తులన్
ఒరువడి ప్రార్థనల్ గొనుచు భాసురవృత్తి నమోఘమౌనటుల్ 32

వ ॥ అని ప్రార్థించి 33

మాలినీవృత్తము ॥ హరిహర సుతదేవా ! అంచితానంతరూపా !
సురగుణ నుత పూజ్యా సుందరాహ్లాద వంద్యా
పరమ సుగుణ సాంద్రా పార్థివేం (ద్రా) సుధీరా !
నిరుపమ గుణ స్వాంతా నిర్మలానంద రూపా ! 34

ఇది నివేదన - సమాప్తము

# అభినందనలు

## శ్రీ వాగ్దేవతాయై నమః

కం॥ శ్రీ కరమయ్యప చరితము
ప్రాకటముగ చదువవిన్న వారలకెల్లన్
చేకుఱు శుభముల వారిగ
నాకాధిపు సమ విభవము నాయువుగలుగున్ !

ఉ॥ అందము జాలు వార వికచాంబు జవాసినికాటపట్టనన్
కందుని తమ్ము జీవితము కమ్మని మాటల గూర్చిమోదమున్
బొందగ నల్లినావుభువిపున్నమి వెన్నెల తేట దీటుగన్
అందుకొనంగ జాలితి వహోయ శమిద్ధర సుస్థిరంబుగన్

శా॥ ఆసాంతంబుగజూచినాడ విధిగానయ్యప్ప చారిత్రమున్
భాసిల్లంగను వ్రాసినాడవు సఖాపాండిత్యమే పారగా
దోసంబించుక లేని రీతి రచనన్ దోదూయమానంబుగా
వాసింగాంచుతీనీదుకావ్య మిలలో భక్తాళిహస్తంబులన్

తే॥ భక్తుడవు కావ్యమును భక్తిభరితమగును
భక్తులెల్లరకిది ప్రీతి పాత్రమగును
విబుధవరుల మన్ననలంది వెలయుచుండు
అయ్యప చరితమాచంద్ర తారార్కమగుచు !

ఇట్లు
మిత్రుడు
**ముదిగొళము కృష్ణయ్య**
26-06-2002

# కృతజ్ఞతలు

కొన్ని పేజీలు మాత్రమే శ్రీ అయ్యప్ప స్వామికథలు కలిగి మిగిలినవి భజన పాటలతో గూడిన చిఱుపుస్తకములనేకములు (రచయితలు హక్కులు కోరనివి) చదివి వానిని సమన్వయించి ఈ గ్రంథమునునేను వ్రాసితిని. ఆచిఱుపుస్తకములనేకములు వ్రాసిన రచయితల కందరికి నా హృదయపూర్వక కృతజ్ఞతాంజలులు.

కావ్యము దాదాపుపూర్తికావచ్చినపుడు శ్రీ అయ్యప్ప విజయము మాసపత్రిక ఎడిటర్‌గారు శ్రీయస్. చంద్రమౌళిగురుస్వామితో పరిచయమేర్పడినది. వారు దయతో తాము సమకూర్చిన "అయ్యప్పఆరాధనం" అన్నపుస్తకమును నాకు బహూకరించి ఒక దీపమునుండి వేరొక దీపము అంటించబడినచో తొంటి దీపపు కాంతి తగ్గదు కాన ఇదివరకు మీరు వ్రాయనివిషయములేవి యైన నన్ను నాగ్రంథమునుండి వస్తువు స్వీకరించి పద్యములు గారచించి మీ కావ్యములో చేర్చుకొనుడని దయతో సెలవిచ్చిరి.

ఆలయ నిర్మాణమున దేవేంద్రునాటంకము – తత్ఫలితము నాతడందుట ఆలయనిర్మాణము పరశురామోదంతము పొన్నంబళమున రాజుకు స్వామిదర్శనము అనువిషయములు మాత్రము "అయ్యప్ప ఆరాధనం" నుండి గ్రహించి కావ్యమును పూర్తి చేసితిని. అందువలన శ్రీ యస్. చంద్రమౌళిగురుస్వామి గారికి వారి సహధర్మపత్ని శ్రీ రాజేశ్వరమ్మగారికి శతాధిక వందనములు హృదయపూర్వక కృతజ్ఞతలు.

కంబరామాయణ కర్త శ్రీపూతలపట్టు శ్రీరాములురెడ్డిగారి ప్రియశిష్యుడు నా సహపాఠి శ్రీముదిగౌళం కృష్ణయ్య శ్రీ అయ్యప్ప మహాభాగవతమును ఆసాంతముపఠించి సవరణలు సూచించిన వ్యాకరణపారంగతులకు ఇవేనా నమస్కార పూర్వక కృతజ్ఞతాంజలులు. దయతో పీఠిక వ్రాసి యిచ్చిన పి.వి.

అరుణాచలంగారు- ద్రావిడయూనివర్సిటీ - వైస్‌చాన్సలర్ గారికి నాశతాధికవందనములు. డాక్టరు వేల్మూరు దైవ శిఖామణిగారికి, జగన్‌మోహన్‌గారికి, పొన్నుస్వామిపిళ్లైగారికి పదిపుట్ల బయలు భక్తబృందములకు నాహృదయ పూర్వక కృతజ్ఞతాంజలులు. తిరుపతి టి.టి.డి. రిటయర్డు ఉద్యోగి శ్రీపి. సుబ్రమణ్యం గారికి అతనికుమారుడు చిరంజీవి రమేష్‌బాబుకు నాకృతజ్ఞతలు.

మిత్రులు చిత్తూరు విద్యావిహార్ ప్రధానోపాధ్యాయులు నాగరాజు గారికి మరియు దేవరాజులు వెంకటరమణ గార్లకును మరియు సాంఘిక సేవా దురందరులు శ్రీ కె. ఆరుముగం గారికిని వారి కుమారులు విజయకుమార్, జయకుమార్ గార్లకును వారిచ్చిన ప్రోత్సాహమే ఈగ్రంథరచనమునకు అంకురార్పణమైనది వారికివే నాశుభాకాంక్షలు శుభశీస్సులతోడి హృదయపూర్వక కృతజ్ఞతాంజలులు. ఫెయర్ కాపీలు చేసియిచ్చిన యం. అమరావతి, యం. శ్రీవళ్ళీప్రసన్నాంబిక, రేణుకలకు నా శుభాశీస్సులు సహాయ సహకారములందించిన కె. చంగల్‌రాయుడు రిటయర్డు హెచ్. ఎమ్. గారికి నా కృతజ్ఞతాంజలులు.

ఇట్లు

**మధురాంతకందొరస్వామి విద్వాన్**

రిటైర్డు సీనియర్ తెలుగు పండిట్ అండ్ జర్నలిస్టు

పదిపుట్ల బయలు

# విషయ సూచిక

## ప్రథమోల్లాసము



## ద్వితీయోల్లాసము



## తృతీయోల్లాసము



## చతుర్థోల్లాసము

## పంచమోల్లాసము



## షష్ఠమోల్లాసము





శ్రీమణికంఠేశ్వర చరిత్రమను నామాంతరముగల

# శ్రీఅయ్యప్పమహాభాగవతము

## ప్రథమోల్లాసము - ప్రథమసోపానము

### అణిమాయుతము - కామరహితము

శా ॥ శ్రీవిఘ్నేశ్వర పాదపద్మయుగళిన్ చెన్నొందు నాధ్యనమే
ఈ విశ్వాత్మకుడైన స్వామి వెలుగై ఇం పారు బీజంబుగా
భావాతీతగుణోజ్వలంబగుచునే భావింప భావాంబుధిన్
దైవాంశం బమృతమ్ము నీకవనమై దైవంబు వెల్గొందుతన్ 1

చం ॥ గణపతి బ్రోచు నన్నిక సుగంధము పూసినరీతికైతకున్
గుణమణియైన నా శివుని గూడిన పార్వతికిన్ సుతుండుగా
గణముల కాది పత్యమును గల్గిన వారితరీతి తోడుతన్,
గుణముల గూర్చి బ్రోచుగద కూరిమి కావ్యమువ్రాయుపట్టునన్ 2

తే॥ గీ॥ కమ్మ దనమున వ్రాయంగ కావ్య మిపుడు
అమ్మ జగదేక పావని ఆధ్య యగుచు
మమ్ము నేలును జనయిత్రి మంజులముగ
సమ్మతిన్ పార్వతీదేవి సదయ వృత్తి 3

మ ॥ అరయన్ తామర పూవునందునను నీ వత్యంత మోదంబునన్
గరిమన్ నిల్చుచు విష్ణుదేవుసతిగా గాంచంగ విఖ్యాతినిన్
భరమా భార్గవికావ్య సంపదలతో భాసిల్లబ్రోవంగదే
పురమాయింపుము అష్టలక్ష్మలను నీప్రోత్సాహమింపారగన్ 4

మ ॥ కలముంబట్టితి భారతీసతియు నా కాంక్షల్ స్థిరం బౌనటుల్
వెలయం కోమల వాక్కులందనుపగా వేద్యాంశముల్ పల్కుచున్
ఇలలో భక్తిని భావపుంజములతో నింపారగా వెల్గగన్
వెలయన్ కావ్యము వ్రాయగా మనుపుమో వేద్యంబుగాసత్కృపన్ 5

వ ॥ శ్రీ హరిహర బ్రహ్మల కంజలి ఘటించి షణ్మాతురుడును శక్తి ధరుడు నైన
శ్రీవళ్ళీ దేవసేనాంబికాపతి యునైన సుబ్రమణ్యేశ్వరులకు ప్రణామములు
చేసి 6

తే॥ గీ॥ నన్న పార్యుని తిక్కన నతిశయముగ
ఎఱ్ఱనార్యుని ధూర్జటి నెంతొ దలచి
సార్వభౌముని శ్రీనాథు సరగ నెంచి
ఇతర ప్రాచీన కవులకు న తులొనర్చి 7

తే॥ గీ॥ దాశరథి కృష్ణమాచార్య దలచిదలచి
నేటి సీనారె వారిని నెంతొ దలచి
కరుణశ్రీ మూర్తి దలపోసి కాంక్షహెచ్చి
వందనంబులు వారికి వరుస జేసి 8

తే॥ గీ॥ రామ నామాంకిత ధ్యాన రమణుడగుచు
బహుళ శబ్దార్థ విదుడుగ బరగుచుండి
సహజ పాండిత్యవరుడయి సాగెనెవడు ?
అట్టి పోతనామాత్యుని కంజలించి 9

వ ॥ వ్యాస వాల్మీకాది సంస్కృత కవులకు నమస్కరించి అష్టదిగ్గజకవుల కంజలి
ఘటించి ఆధునిక కవులకు శుభంబులు పలికి శ్రీమణికంఠేశ్వర చరిత్రమను
నామాంతరముగల శ్రీ అయ్యప్పమహాభాగవతమును వ్రాయంబూనితి 10

వ ॥ సీరు కరుణీక కులోద్భవులైన శ్రీముని రత్నం చిన్నమ్మల
ఏకైకపుత్రుండును మధురాంతకం దొరస్వామి నైన
నేను మాలధరించి శబరిమల కేగినప్పుడు ప్రభావి
తుడనై స్వామివారి వ్రతదీక్షానుభూతులను పొంది
వినతుండనై ఈ కావ్యము వ్రాయంబూను కొంటిని 11

## షష్ఠ్యంతములు

ఉ ॥ స్వామికి పంబ(ప్రాంతమున జన్మము నందిన జ్ఞానమూర్తికిన్
కామితముల్ (ప్రజల్‌గనగ కాంతినొసంగెడి దివ్య జ్యోతికిన్
నీమము లొప్పపూజగొను నిర్మలశీలికి సత్య శోధికిన్
కోమల మానసాబ్జముల కోర్కెలొసంగెడి యట్టిస్వామికిన్ 12

ఉ ॥ న్యాయికి ధర్మమార్గనుత నాద్యతపోధన స్థాయికిన్ సుధా
మ్నాయికి మంజుఘోషికిని మన్మథ మన్మథ రూప శాలికిన్
మాయలు (ద్రోయు స్వామికిని మాధవ పు(త్రునికిన్ సుకీర్తికిన్
కాయముడెందమున్ వెలుగ కాంచెడి నామణికంఠస్వామికిన్ 13

ఉ ॥ పందళ రాజ సూనునకు (ప్రాకట శౌర్యరసాధిననేతకున్
సుందర రూపుడై ధనరుసూటిగ మన్మథుతమ్ముగుట్టికున్
వందనముల్ తగన్ గొనుచు వాసవు(బోచిన నేతకున్ సదా
నందము బొంది డెందముల నందముచిందగ నుండుశాస్త్రకున్ 14

చం ॥ మహిషిని మర్దనంబుగను మాటికి జేసిన యట్టి స్వామికిన్
అహమును వీడజేయు(ప్రభు అంచిత జ్ఞాన సుధాంబు రాశికిన్
సహనము తోడ భక్తులను సంస్థవ నీయత (బోచుగంతకున్
మహిమలు జూపు దేవునకు మంజుల స్వాంతము జూపుకందుకున్ 15

వ ॥ సమర్పితంబుగానాచే రచియింపంబూనిన శ్రీమణికంఠేశ్వర చరి(త్రమను నామాంతరముగల శ్రీ అయ్యప్ప మహాభాగవతం బెట్టిదనిన 16

## నైమిశారణ్యవృత్తాంతము

కం ॥ నైమీశారణ్యములో
వేమారున్ మునులు గూడి వి(శుత లీలన్
సామూహికంబుగా తప
మేపారం జేయు చం(ద్రు మేలుగనచటన్ 17

ఉ॥ ఈశుని గూర్చి వారటుల నింపుగ ప్రార్థనలన్ని జేయగా !
ఈశు పదాంబుజంబులను ఎంతముదంబున గొల్వనచ్చటన్
పాశుపతంబులుంబడయ పార్వతినాథుని గొల్వకొందరున్
నాశలుమాని ముక్తికిని ఆరటలన్ మరికొందరుండగన్ 18

ఉ॥ కొందరు యజ్ఞకుండముల కొందరు శాస్త్రవిచార పద్ధతిన్
కొందరు గోష్ఠులందనరి కూర్మిని డెందము పండగాధృతిన్
మందులు గాక నెల్లపుడు మాధవుగొల్వగనుండి కొందరున్
వందనముల్ ధృతిన్ యిడగ వారిజనేత్రుని గాంచుకోర్కెమై 19

చం॥ తపములు చేయుచుండనటు తాపసిసూతమహర్షి రాగవే
తపములు పండెమాకనుచు తాపసులందరు గూడియచ్చటన్
కపటము లేని మానసము లందున కాంచనగర్భ బాడుచున్
కృపనటుబొంద సూతముని కిందగురీతిని మ్రొక్కిరందరున్ ! 20

చం॥ అనయము సామగానముల అంచిత రీతిని పాడుచుండియా
ఘనుడగు సూతునింగనుచు కాంచన గర్భసముండ వీవిటన్
పనివడి వచ్చినందులకు పల్మరుమ్రొక్కుచు, మోక్షప్రాప్తికై
మనమున నెవ్వనిందలప మాకగు భద్రమటంచు వేడగన్ 21

తే॥ గీ॥ శీతలచ్ఛాయ నిచ్చెడి చెట్లక్రింద
సూతముఖ్యుని గూడిరి సూరివరులు
నేతనీవైతి మముబ్రోవ నిక్కముగను
దైవ మహిమంబులం గూర్చి తెల్పుడనిన ! 22

తే॥ గీ॥ హరిని భజియింప మోక్షంబు అపుడెగల్గు
శివుని పూజింప జ్ఞానంపు సిద్ధిగలుగు
హరిహరాత్ముల పూజించు నంతఫలము
హరిహరాత్మజు పూజింప నపుడెగల్గు 23

తే॥ గీ॥ హరిహరాత్మజుడెవ్వండు అతడదెట్లు
జ్ఞానమోక్షంబులవిరెండు గలుగజేయు
అట్టి ఘనుడైన దైవంబు ఆద్యుడెవడు ?
అతని చందంబు జెప్పుడు ఆదరమున 24

చం ॥ అనిముని పుంగవుల్ అడుగ అంచిత రీతిని సూతుడంతటన్
వినయముతోడజెప్పెదను విస్తృత కీర్తిధరుండుశాస్త్రమీ
మనముల నింపవేడెదను మాధవు నా శివు వేడినట్లుగన్
ఘనయశులార జెప్పెదను గైకొనుడంచిత రీతి నాకథన్ 25

ఉ ॥ ధర్మము భూమిపై వెలయ ధార్మికుడై శివతేజమై వెసన్
మర్మములన్నింయుందలచి మాధవుగూడను మాధవున్ గన్
అర్మిలి భక్తులందనుప అంచితరీతిని ధర్మశాస్త్రమై
నిర్మల రూపుడై బరగు నీశ్వరసూనుని గూర్చి చెప్పెదన్ 26

మ ॥ బ్రహ్మనుండి క్రియాశక్తి విష్ణువునుండి ఇచ్ఛాశక్తి శివునినుండి
జ్ఞానశక్తి మరియు ముగురమ్మల శక్తితోడ హరిహరపుత్రుడు
ధర్మశాస్త ఉదయించెను ముగురు మూర్తులను వేరువేరుగా
ధ్యానించుటకన్న ఒక్క అయ్యప్పను ప్రార్థించిన ముగురమ్మలను
ముగురయ్యలను స్తుతించిన ఫలము లభించును క్రియాశక్తి
ఇచ్ఛాశక్తి జ్ఞానశక్తులతో అంతర్లీనమైనందున హరిహరాత్మజుని
సేవించిన ఫలితమును ఏకోన్ముఖ మగును శైవవైష్ణవులకే గాక సర్వ
మతాలకు ఉభయ తారకముగా "శరణం" అన్న పదం ఎంత ఉత్కృష్టమై
నదో ఊహించుకొనవచ్చును, అని చెప్పి స్వామి జన్మమునకు అవలంబన
మైన అమృత మదన వృత్తాంతమునిట్లు వివరింపదొడగెను. 27

చం ॥ దనుజుల బాధలన్ వెసను దాటగ తాలిమిలేక దేవతల్
గనగను దానవాంతకుని కంజదళాక్షుని విష్ణువేడగన్
బనివడి బ్రహ్మయున్ శివుని ప్రాపుగ గూడి వికుంఠుప్రోలికిన్ !
జనియుటు ప్రార్థన్ సలుప ప్రాంజలులైయటు వేడగాధృతిన్ 28

చం ॥ బలిని జయింప జాలమిక బాధ్యత లేకమరావతిన్ వెసన్
కలుగపు చిత్తవృత్తులతొ కార్ముకహస్తులు దానవాధముల్
మలినము జేసి మమ్మొడల మాటికిగొట్టుచు నుండగావడిన్
తలగితిమింక నీవెగతి తాలిమితో మము బ్రోవవే వెసన్ 29

మ ॥ అని దేవేంద్రుడు బల్కగా నపుడు నా విష్ణుండు తానిట్లనెన్
వినుడీ పాలసముద్రమున్ దరువగా విఖ్యాత చరిత్రులై
ఘనతన్ వేద్యత తోడనాయమృతమున్ గాంచంగ ద్రావన్ వెసన్
అనిలోద్భూత పరాక్రమంబునను మీ రారోగ్యమున్ బొందుడీ 30

తే॥ గీ॥ జరయు మరణంబు లేకున్కి జయము మీకు
నిక్కవంబగు గావున నీసుదక్కి
మీరు రాక్షస వరులతో మిగులగలిసి
తరువుడమృతంబు గలుగంగ తాల్మితోడ 31

ఉ ॥ మందర పర్వతంబుగొని మాన్యత కవ్వముజేసివైళమే
సుందరమూర్తి వాసుకిని సూటిగ దారముగాగ జేసిమీ
రందరు రాక్షసావళితొ రంగజిలపాలసముద్రమున్ వెసన్
అందము చింద చిల్కుడటు అంతటబుట్టు సుధారసంబొగిన్ 32

ఉ ॥ దేవగణాళికిన్ జయము తేజము గల్గును రాక్షసాళికిన్
ఏవగ లేక పాపముల నేర్పడ నాయమృతంబు దక్కదో
పావన మూర్తులార యిక ప్రాపయు నేనిటనుందు మీదటన్
చేవ జయంబునున్ గలుగు చేకొని కార్యము కూడి చేయుడీ 33

## అమృతోదయము

మ ॥ అని విష్ణుండపుడట్లు బల్కిపనుపన్ ఆ దేవతానీకముల్
జనియామందర పర్వతంబుదరికిన్ జాజ్వల్యమానంబుగా !
ఘనహుంకారరత త్రవ్వి మూలములతో గంభీరతన్ మోయగన్
జన నాపర్వత మెంతొ భారమగుటన్ జారంగద్రెళ్ళెన్ ధరన్ 34

ఆ॥ వె॥ కొండమీద బడిన కొందరుజచ్చిరి
కొండ నెత్తలేక గోడు తోడ
కొందరెంతొ ఆర్తికుంది విష్ణునివేడ
గరుడ వాహనుండు కానవచ్చె ! 35

ఆ॥ వె॥ కొండ నెత్తిహరియు కొంచకగరుడుని
మూపుపైనబెట్టి ముదితు డగుచు
కూరుచుండెతాను కూర్మితోగరుడుండు
అబ్ధి దరిని జేర్చె హరిని గిరిని 36

ఉ ॥ వాసుకి త్రాడుగన్ గిరిక వారిత లీలను జుట్టివైళమే
ఈసున దానవుల్ బెగడి ఈవిధితాము ఫణాగ్రముల్ వెసన్
భాసురవృత్తి బూనగను భాగ్యముమాకని పుచ్ఛమున్ ధృతిన్
వేసరకుండ దేవతలు వేగమెపూని తరించుచుండగా ! 37

ఆ॥ వె॥ పర్వతంబు గూలె ఫణితోడనబ్ధిని
దేవదానవాళి తేజమెడలి
అడల విష్ణుడంత నాయబ్ధిలోపల
కమఠమయ్యెనపుడు కడు జవమున 38

ఆ॥ వె॥ కొండతోడ ఫణిని కోర్కెమై దనవీపు
మీదనిల్ప జూచి మిగుల ప్రీతి
తిదియునదితి సుతులు ధీరత బ్రోవంగ
పొగడి రంత విష్ణు పోడిమిగన ! 39

ఆ॥వె॥ బ్రోచినట్టి దొరవు బ్రోవుము మమ్మింక
జయము జయము దేవ జయమటంచు
దేవతతులు వేగ ధీరత వేడంగ
వెన్ను డెంతొముదము వెసదలిర్ప ! 40

ఆ॥ వె॥ చిల్కుడనగ వారు చిల్కంగ జొచ్చిరి
పెరుగచిల్కునట్లు పేర్మితోడ !
పాలకడలి చిల్క ప్రాపుగ సవ్యాప
సవ్యగతిని వేగ సవనమట్లు 41

ఆ॥ వె॥ తరచునెడల శబ్ద తారళ్య మహిమంబు
ఆకసంబు నిండె నధికముగను
తరచుచుండ బడియె తానహి సంద్రాన
తరచువారలార్వ తద్దయపుడు 42

క ॥ హాలాహలంబుబుట్టగ
జ్వాలానలకీలలెసగ జాజ్వల్యముగా
వేలావతీర్ణభూములు
హేలాగతికాల్పదొడగె హీనాకృతితోన్ ! 43

ఉ ॥ కొండల కోనలం దపుడు కోయని యార్వగ జీవరాసులున్
మండగ జేసె నీ ధృతిని మానవలోకము సంచలించగన్
దండములోమహేశయని దండడి మాన్పగనీశువేడుచున్
గండము బాపుమంచనుచు జ్ఞానలు దేవతంలదరం తటన్ 44

మ ॥ చనికైలాసము జొచ్చి వేగముగనాశంభంప్రభూతాత్మునిన్
మనవిన్ జేకొను దేవదేవయనుచున్ మా బాధలన్ బాపవే
జనియించెన్ గననీ విషానలమహో శంభోదయాభిక్షమై
కనవే నీ విషవహ్నిమాన్పగదవే గౌరీ పతేనీవికన్ 45

మ ॥ అని ప్రార్థింపగ నీశుడంతటను తానశ్రాంత శాంతంబుగన్
మనవిన్ చేకొని బ్రోతుమిమ్మిపుడు నీ మాయావిషంబంచు తా
ఘనహుంకార రవంబుతో వెడలె నా కాత్యాయనీ దేవితో
జని తీరంబును జేరి జీరుచును నా జాజ్వల్య మౌవహ్నినిన్ 46

వ ॥ శివుడు పార్వతీ దేవికి ఆవిషాగ్నిని చూపి 47

ఆ॥ వె॥ ప్రజలపాట్లుజూచి పలువిధంబులు గాగ
రక్షసేయలేని రాజసంబు
ఇలను శూన్యమనుచు ఇంపుగా ప్రజలకు
రక్షసేయువాడే రాజటంచు ! 48

ఆ॥ వె॥ సుధతిజూచి పల్కె సూటియౌ మాటల
ఔనటంచు ఆర్య అతిముదమున
లోక విభుని జూచి లోకాలు బ్రోవంగ
నీవె ప్రభుడవనియె నీరజాక్షి ! 49

మ ॥ తనమాంగల్యబలంబు పెంపొదవగా తా గౌరియా శంభునిన్
తన మ్రోలన్ తపియించు భక్తతతికిన్ తాత్పర్యమేపారగా
ఘనతన్ త్రావుము త్రావుమంచనియెనా గంగాధరున్ వేగమే
అనయం బావిషవహ్ని నార్పగను నా యార్యామహాదేవియున్ 50

ఉ ॥ మంగళసూత్రమంతయును మాన్యతనొందెనటంచువైళమే
మ్రింగుమటంచు నా విషము మిక్కిలి ప్రీతిని వేడనంతటన్
సంగడికాడు కాడెమరి సారెకు సత్ప్రభుడంచు నిమ్ములన్
అంగన మ్రింగుమ్రింగనియె అంచితశక్తి ధరుండు గావునన్ 51

మ ॥ మగువా చూడుము చూడుమంచు విధతో మందస్మితాలోకనన్
తగునీ లోకుల బాధలందొలగగా తాల్మిన్ దయన్ బ్రోతునే
మిగులంద్రావెద నంచుతానువిదతో మీరింతలంజూడుడీ
పగవాడైచను నీవిషాగ్ని చటులన్ భక్షింతునేనంచొగిన్ 52

ఆ॥ వె॥ ఓరి ద్రోహిరారా ! ఓర్వను నినుజూచి
లోకములను గాల్చు లోభినీవు
పట్టిమ్రింగువాడ పదిలంబుగానని
చేయిజాచిపట్టి చేర్చిమింగె ! 53

తే॥ గీ॥ పొట్టలోనున్న పదునాల్గు భువనములను
కాచుకొనగోరి విషమున గందకుండ
కంఠసీమనునద్దాని కలుగనుంచి
నీలగళుడయ్యెనంతట నిక్కముగను 54

క ॥ హాలాహలమును ద్రావిన
హేలాగతియొప్పెగాని హీనాకృతినో
హాలాలసగతి గాదని
వేలావనిజనులు బొగడ వేల్పులతోడన్ 55

కం జేజేలు పల్కిరందరు
మాజీవన రుచులు హెచ్చె మంజుల రీతిన్
ఈ జీవితములు మాయవి
సాజీవనులై తిమింక సర్వజ్ఞనిధీ ! 56

ఉ ॥ భక్తుల పాలిదైవమవు భాసుర వృత్తిని బ్రోచి నాడవీ
భక్తులు మీదు పాదరజ పావన మూర్తులురక్షసేయవే !
ముక్తులు గాగ నెప్పుడు మోదముతోడుత నెల్లవేళలన్
రక్తిని బ్రోవుమంచనుచు రంజిలబల్కిరి సంతసంబునన్ 57

కం ॥ భవుడవు అభయ మొసంగితి
భవబంధములన్ని తెగెను భాసురవృత్తిన్
నివహంబులతో పనిగొని
సవనము వలె జిల్కిసుధను సాధింతుమికన్ 58

ఉ ॥ అంచుమహేంద్రుడున్ బలికె అంచిత రీతిని దేవదానవుల్
మించిన సంభ్రమమ్మునను మిక్కిలి ప్రీతిని జిల్కిరందరున్
సంచిత పాపముల్ వదలి స్వాంతములుల్లసిలంగ వేడుకన్
అంచిత రీతి వేడిరిటు ఆభవుకోరికలెత్తుచుండగన్ 59

తే॥ గీ॥ సర్వమంగళతోడుగా శంకరుండు
దీవెనెల చాలదనుపుచు తేజమెసగ
దేవదానవ వరులను తృప్తిపరచి
చనియెకైలాసమునకును సంతసమున 60

క ॥ హాలాహల కథ విన్నను
వాలాయముగాగ జదివి వన జాక్షుమదిన్
హేలాగతి దలచినచో
వాలాయము విషపుబాధ వైదొలగు ధృతిన్ 61

వ ॥ పాల సముద్రమును దేవదానవులు తరచునెడ 62

ఉ ॥ పుట్టెను పాలవెల్లి నటు పూర్వపుపుణ్యములన్ని బండగా
పుట్టెను కామధేనువది ముఖ్యులు మౌనులు సంతసింపగా
పట్టిరి హోమధేనువును ప్రార్థనలన్ వెసజేసియాఋషుల్
నట్టె ముదంబునుం బొరయ నా ననముల్ వికసించెవారికిన్ 63

ఉ ॥ చంద్రుని కాంతి పుంజముల చాలదలిర్పగ తెల్లగుఱ్ఱమ్మొ
సుందరమైన మోమమరి సూటిగవాటముగాగ తోకయున్
ముందలచాయ పెంపొదువ ముఖ్యమురమ్ము విశాలమై చనన్
కందువ లేనిదైబరగు ఖ్యాతిని నా హరిపుట్టె వేడుకన్ 64

వ ॥ ఇట్లు ఉచ్చైశ్రవంబు బుట్టిన దానిని బలిచక్రవర్తి గ్రహించె
తదనంతరంబున 65

ఆ॥ వె॥ వేల్పుమ్రానుబుట్టె వేలకోర్కెలకైన
దేవతాళికొసగు తేజసమున
నందనంబులోన నమర నాటించెను
సంతసంబుతోడ శక్రుడంత ! 66

తే॥ గీ॥ వేల్పుగరితలు బుట్టిరి వేగనంత
క్రొమ్మెఱుంగుల కైవడి కోర్కెలొదవ
సుందరాకారరూపముల్ మందగమన
లగుచు నడయాడ చోద్యంబు లగుచునుండ 67

తే॥ గీ॥ వివిధ మంగళరావంబు విమల ఫణితి
రాగరంజితవైఖరుల్ రాణగాంచ
దేవదుందుభి ధ్వానముల్ తేజమెసగ
అప్సరాంగన లాడిరి అతిముదమున ! 68

ఉ ॥ చల్లని కాంతి పుంజముల చాలగదన్నుచు లోకమెల్లనా
చల్లని చూపులన్ కళలు స్వాంతము లుల్లసిలంగనేర్పునన్
మెల్లగ మోహనంబొదవ మేకొన చంద్రుడు రూపసంపదన్
పల్లవితాంగజుండనగ ప్రాపుగ బుట్టగ జూచిరందరున్ 69

ఉ ॥ మంద సమీరణంబుగతి మాధవుయుల్లము పల్లవింపగా
నందమరంద బృందములు నందముచిందగ నా హరిన్ గనన్
మందవిలాస యానమున మాధవి తాతగుదంచు వైళమే
చందురుతోడ బుట్టవయి చానజనించెను మోహనాకృతిన్ 70

ఉ ॥ ఉల్లసితాంగముల్ ఉవిద ఉజ్జ్వలకాంతులతోడి పుంజముల్
మెల్లని వాలుచూపులును మేలగు పల్లవితాంగముల్ గన్
యుల్లము పల్లవింపగను యూరటతోడుత విష్ణుడంతటన్
చల్లని చూపులన్ బరపి సంతసమందుచుస్వాంత మందునన్ 71

చం ॥ ముదిత మరాళగామిని సమంచితరూపిణి దీనిజేరగా
యదనిదియంచు వేగముగ నంతట చక్రియు మోదమందగా
మదన వికాసయుక్తముగ మానిని వై చెగళంబునందు నా
సదయుని మంజులాత్మజుని స్వాంతమురంజిలునట్లు వేగమే 72

ఆ॥ వె॥ సకల జగతిలోన సంతసంబులు నిండ
హరికి రమకు వేగ అంచితముగ
వైభవంబుతోడ వరలెను పెండిలి
జగతి జనులకనులు జలజములుగ 73

చం ॥ వరుణడు వైజయంతినిడె వాసిగతానటు పట్టువస్త్రమున్
కరుణనొసంగెనబ్ధిపతి కాంచన శోభలభూషణంబులన్
వరుసనువిశ్వకర్మయిడె వైభవముల్ తులకొంపగావడిన్
మరియును వాణితానొసగే మాన్యత తారకహారమంతటన్ 74

కం ॥ మధువులు చిలికెడి పెదవులు
సుధలను కురియింపుచూపు సుధతికి యమరెన్
మాధవియగుదునటంచును
మాధవుకంఠాసమాల మాటికివైచెన్ 75

ఆ॥ వె॥ సాధురక్షకుండు సంస్తవనీయుండు
చక్రహస్తుడైన శౌరి యనుచు
విక్రమోజ్వలుండు వేదవేద్యుండగు
ఆదిదేవుడితటంచు దలచి 76

ఆ॥ వె॥ లోకములకు జనని లోకేశుపత్నిగా
సకల లోక జనులు సమత గొల్వ
భాసురాంగియగుచు భాసిల్లుడు నటంచు
విష్ణువక్షమందు వెలసె నంత 77

మ ॥ నవసౌధామిని బోలులచ్చిగనితా నానందమే పారగా !
నివహంబుల్ జయపెట్టుచున్ బొగడగా నేపారుమోదంబుతో
నవలోకించెను లోకముల్ బొగడగా నాశ్చర్యసంధాయియై
భువి తేజంబున నోలలాడ హరియా పూర్ణేందుకాంతుల్ బలెన్ 78

వ ॥ శ్రీవత్సకౌస్తుభ తులసీమాలికా వృతమైన విష్ణువిశాలోరస్కమున అయ్యాదిలక్ష్మి వసియించె దేవదుందుభులు మ్రోగె పూలవానలు గురిసె దిక్కులు తెలివొందె ఆదిలక్ష్మికటాక్ష వీక్షములతో ప్రజలును దేవతలును ధనవంతులై క్షేమముగా వర్థిల్లిరి పాలేటి రాచకన్నె కడగంటిచూపులులేక రాక్షసులు మినుకు మినుకంచు దారిద్య్రముననుభవించిరి 79

ఉ ॥ వారుణి బుట్టెనంతట న వారిత రీతిని రక్కసుల్ తగన్
ధారుణి దానిగైకొనిరి తాల్మియొకింతయులేక వైళమే !
సారెకునబ్ధినిం దరువ సాగిరి వారలు దేవదానవుల్
సారమతిన్ వివేకమున సాగుచు బుట్టెను వేల్పువెజ్జయున్ 80

సీ ॥ అచ్యుతాంశంబునై ఆదట సౌజన్య
మూర్తియై బరగెడు పుణ్యశాలి
అరుణాక్షుడై తాను అంచిత మైనట్టి
దీర్ఘబాహులతోడతేజరిల్లి
నల్లనైకురుచనై మెల్లగ వ్రేలెడి
వెంట్రుకల్ భుజములవ్రేలువాడు
నీలమేఘంబన నెక్కొను దేహంబు
ఉన్న తోరస్కుండు ఉత్తముండు

ఆ॥ వె॥ యాగభోక్తియగుచు అలరెడు ధన్వంత్రి
నిఖిలవైద్యశాస్త్ర నిపుణుడతడు
పుట్టెనబ్ధినుండి పూజ్యుండు చేతుల
అమృత భాండమపుడు అతడుబట్టి 81

ఉ ॥ రక్కసులంత దోర్బలపు రాయిడి జూపుచు వెజ్జుచేతిలో
చక్కగనున్న భాండమును చాలముదంబున దీసికొంచుతా
రొక్కని వెంట ఒక్కడుగ యోరిమివీడిటులాగి కొంచొగిన్
నిక్కమ పర్వులెత్తగను నేరకవేల్పులు మిన్నకుండగన్ 82

ఉ ॥ చక్కగ జూచినాహరియు సాగెను మాయలజాలు పెల్లునన్
మిక్కిలిమోహనాంగివలె మీరిన రూపముతోడ వేడుకన్
చక్కని చుక్కయై దనరె చానగమారె విలాస సంపదన్
ముక్కున వ్రేలుబెట్టుకొని మోదముతో గనిరందరున్ ధృతిన్ ! 83

ఉ ॥ మోహనమైన రూపమును మాదముగొల్పెడి వాలుగన్నులున్
సాహసమెంతోగల్గు పస చానకు గల్గెడి రూపసంపదన్
రోహటమైన వాలుజడ రూఢికుచంబులు శ్రోణిభారమున్
మోహమునంద జేసెగద మోదముతోడుతనందరన్ ధృతిన్ 84

తే॥ గీ॥ దైత్యులము మేము వనితరో తాల్మితోడ
మాకు సురలకు నమృతమ్ము మంజులముగ
పంచి యిమ్మటు గ్రోలుదు మంచితముగ
పాలు పోవని యర్థంబు ప్రాభవమున 85

చం ॥ అనవిని దేవదానవ స మంచిత రూపుల వేరువేరుగా
గొనకొని కూరుచుండుడని కోమలి బల్కిన వారలందరున్
మనముల సంతసంబొదవ మానిని జెప్పిన యట్లుజేయుచున్
బనివడి గూరుయచుండిరట బారులు గాగను రెండు వైపులన్ 86

ఆ॥ వె॥ వేగద్రాపుడనుచు వెలదిబోసెనుసుర
సురలు సంతసించి చోద్యమండ
దానవుండొకడు దాసుర సంఘాన
జేరి సుధను ద్రావి చెలగెనంత 87

తే॥ గీ॥ చంద్రభాస్కరులంతట సన్నసేయ
వెన్నుడంతట చక్రాస వేగదున్మ
వాని శీర్షంబు మింటను వెలయజేసె
బ్రహ్మరాహువుయన్పేర ప్రభలునట్లు 88

ఉ ॥ మోహిని రూపమున్ వదలి మోదముతోడుత విష్ణుడయ్యెనా
వాహిని వారలంతటుల వచ్చిరి యుద్ధముసేయరాక్షసుల్
సాహసమెంతొ జూపుచును సారెకు విష్ణునిజేరదేవతల్
వాహనమెక్కి వచ్చెనటు వార్దులు మ్రోగెడి చందమట్లుగన్ 89

ఉ ॥ దేవతలంతగూడుకొని తేజము నిల్పుమటంచు వేడుకన్
పావనమూర్తివిష్ణుపద ప్రాప్తుల గాగను విష్ణుడంతటన్
దీవనలిచ్చి బ్రోవగను తేజము నిల్పగనక్షయంబుగన్
ఆవనజాక్షుడంతటను ఆదటవచ్చెను రక్షసేయగన్ 90

ఉ ॥ వెన్నుని సాయసందల వేగసుధారసపాన శోభలన్
క్రన్నన రాక్షసుల్ బెగడ కాలుని బారికి బుచ్చివారినిన్
మన్నన లేక బాణముల మార్కొనవెన్నులు జూపిరక్కసుల్
మన్నులు దాకి పారిరట మాధవు సత్కృప చెంగలింపగా 91

మ ॥ బలి దేవేంద్రుని తోడ బోరగ వడిన్ పద్మాక్షుడేతెంచి తా
బలి సైన్యంబుల ద్రుంచి వేగముగ నా పక్షీంద్రు పైనేగినన్
కలియా రాక్షస వీరులన్ గలియగన్ కాంతార మధ్యంబునన్
చెలగెన్ కష్టపరంపారబ్దములటన్ చేరంగ వారచ్చటన్ 92

మ ॥ బలి సైన్యంబులతోడ తానరిగె పా పాకారులై క్రూరులై
కలిచే ఓడిన వారలై చనిరటుల్ కాంతారముల్ వీడుచున్
మలినంబింతయు లేని దేవతతులున్ మాన్యుండు శ్రీకాంతునిన్
బలురీతుల్ నుతియించి వెళ్ళిరటు ప్రా పైదేవలోకానికిన్ 93

ప్రథమ సోపానము సంపూర్ణము

శ్రీ అయ్యప్ప మహాభాగవతము

# ప్రథమోల్లాసము- ద్వితీయ సోపానము

## లఘిమా యుతము - క్రోధరహితము

### హరిహరుల సమాగమము

మ ॥ అదె కైలాస నగంబుపై శివుడు తా నార్ద్రాంతరం గుండుగా
పదిలంబై సుభటాళి గొల్వగ దనున్ ప్రాపై సురానీకముల్
సుధతామందరు గొన్నవేళ మదియున్ చోద్యంబుగా జెప్పినన్
అదనై పొందిన వేడుకల్ దలచి ఆ ద్యంతంబుగా నెమ్మదిన్ 94

తే॥ గీ॥ విశ్వమయుడైన విష్ణుండు వేద్యుడపుడు
విశ్వమోహినియై తాను వేడు కలర
ఎట్లు అమృతంబు బంచెను ఎట్లు సురుల
దన్పె నసురుల కమృతంబు దక్కనీక 95

వ ॥ అని శివుండు దేవిని దేవగణములను జూచి ఇట్లనెను. దేవతల కమృతముబోసి రాక్షసులనోడించిన విషయమలు ప్రత్యక్షముగగా అలనాడు చూడనైతిని. మరియొక పరి మోహినీ రూపమును ధరించి భస్మాసురాఖ్యదనుజుని బారినుండి నన్ను రక్షించెను. అటనుండి నేను కైలాసమున కేతెంచితిని అదిమొదలు మాయావిలాసి మధురమూర్తి లోకరక్షకుడైన విష్ణునితో గలసి మాటలాడ కుతూహలము కలుగుచున్నది. 96

కం ॥ భస్మాసురాఖ్యదనుజుని
భస్మముగావించినాడు బడలును దీర్చెన్
విస్మయములేక బ్రోచెను
సస్మితుడైనన్ను కరుణ చాలదనుపుచున్ 97

మ ॥ అని శంభుండును నార్యతో ననియె తా నానందసంధాయియై
జని వైకుంఠముజేరనే గెదమె జా జ్జ్వల్యంపునేతన్ గనన్
పని గొంచుంధృతితోడ మోహినిగ నెప్పాటన్ ప్రసాదంబుగన్
గని రావిష్ణుని దేవతల్ వెసనునో కంజాక్షి బ్రోవన్ వెసన్ 98

మ ॥ అని జింతించుచు నార్య జూచుచువడిన్ నానందమేపారగా
వినవే భామిని విష్ణుమాయలను నా విశ్వాత్ముడై తాను వే
ఘనతాపంబును పొందురక్కసులకున్ గానీక శ్రేయంబులన్
మనిచెం దేవతలందరున్ సుధను తా మ్లానాంగియై పోయుచున్ 99

శా ॥ ఆ చోద్యంబులు విష్ణుదేవువలనన్ ఆహ్లాదమున్ జెందగా
ఏ చోద్యంబులు జూపి దానవులకున్ ఎట్లుండి పీయూషముల్
వాచాలత్వము జూపి వారికిడకన్ వారించితే యెట్లనన్
ఏచాలున్ బదులాడునో ఉమయటంచే పారతాబల్కుచున్ 100

శా ॥ వైకుంఠంబున కేగగాదలచి తా వామాక్షితో గూడుచున్
నాకాంతన్ నను జేర్చుమావెసను శ్రీ నాధైక సంస్థానమున్
ఏ కాంతంబున మాట లాడవలె నీ యీశుండగన్ గూడుచున్
వీకన్ నందిని యట్టులే యనుచు దా వేగంబుగా వెళ్ళుచున్ 101

మ ॥ అనయంబంతట మోదితాశ్రువులతో నద్దేవుడర్ధాంగితో
వినయంబుప్ప తిలంగ మోయుచును నా విఖ్యాత వేగంబులన్
గనగన్ ఆకస వీధులందు మరియున్ గాంచంగయానంబులన్
జనియా శంభుడు విష్ణునింగనుచు తాసంతోషియై మ్రొక్కుచున్ 102

వ ॥ అంతట విష్ణుండు 103

ఉ ॥ సాదర పూర్వకంబుగను స్వాంతము రంజిలలేచి దిగ్గునన్
మోదముతో నెదుర్కొనుచు ముందు రమాసతి తోడుగాగ దా
మోదరుడంజలించుచును మోహనరూపునిగాంచివేడుకన్
ఆదరమొప్ప రమ్మనుచు అబ్జదళాక్షుని అంబికాసతిన్ ! 104

చం ॥ బిలుచుచు నర్ఘ్య పాద్యముల ప్రీతిమెయిన్యిడి పూజ్య భావనన్
బలుకుచు స్వాంతమందుగల భావబలంబులజేసివేడుకన్
కలుషములెల్ల బాపితివి కాంతినొసంగితివి దేవతాళికిన్
అలుకను మ్రింగియావిషము అంతట వారిని బ్రోవవే తగన్ 105

తే॥ గీ॥ దేవ దేవేశ నీవునీ దేవితోడ
ఏగు దెంచితి రిచటికి ఎంతొ శుభము
గలిగె వైకుంఠపురికిని ఘనత గల్గె
రండు మాపుజలందుండు రమ్యగతిని 106

ఆ॥ వె॥ ఆసనంబు పైన అధివసించిన స్వామి
స్వామి పత్నిజూచి సాదరమున
మందహాసరుచుల మాధవుడంతట
ప్రణవహర్షజలధి పలికెనిట్లు - 107

ఉ॥ లోకము లాకులమ్ముగను లోలత నీ విషవహ్నిలోపలన్
ఏకముగాగ భస్మములు ఏ విధి నాశము బొంద నీవటుల్
శోకము లన్ని మాన్పగను సుందరమూరితి యావిషాగ్నినిన్
వేకనుగల్గి మ్రింగితివి వేద్యతబ్రోచితి జీవులన్ తగన్ 108

ఉ ॥ నీలగళుండవైతివట నిక్కము భక్తులబ్రోవగా దగన్
శీలము, శోభలన్ దనర క్షేమములంతట నాశ్రయింపగా
కాలము లన్ని నీవగుచు కాంతినొసంగితి లోకముల్ గనన్
చాలదె మీదు కోమల విశాలదయాగుణముల్లసిల్లగన్ ! 109

మ ॥ అని విష్ణుండన నాశివుండపుడు తా నానంద సంధాయియై
కనవో వైష్ణవ మాయలంబొదవి నీ కాంతాకృతిన్ జూపి యే
కను బ్రామిన్ వెసదానవాళికిని నీ కన్ దేవతానీకముల్
మనగా బోసితి యాసుధారసము నీ మాధుర్యతన్ ధీరతన్ 110

చం ॥ వినుము సుధారసంబుగొని వేడుక తోడుత దేవతాళికిన్
ఘనముగ బోసిరక్కసుల కావరమంతయు ద్రుంచి వేగమే
అనఘుడవైతి మోహినిగ ఆదట రూపముజూపి అందరన్
అనయము మోహమందగను ఆద్భుత నేలితివెట్టులో వెసన్ 111

చం ॥ పురుషుడవౌచుకార్యముల పూనిక జేసెడి నీదు కార్యముల్
సరగున నేనెరుంగుదును సారెకునాడుదిగాగ మాయలన్
పరిగగనెట్లు జేసితివి పల్మరువేడెద జూపువైళమే
యరుదుగ మోహినీ సతిగ యాదట జూపుమునీ దురూపమున్ 112

వ ॥ అనగ విష్ణుం డిట్లనియె 113

ఉ ॥ చూపెద విశ్వమోహినిగ చోద్యముగాగనునాదురూపమున్
చూపిన మానసాంబుధిని చొక్కగనీయక నుండు మీధృతిన్
ఏపున సర్వమున్ మరచి ఏవిధిలీలలు సల్పనుంటివో
కావున జాగ్రతం గలుగు కాంచన రూపుడనుండు మీధృతిన్. 114

సీ ॥ జగతిలో నున్నట్టి జాజ్జ్వల్య మానమౌ
స్త్రీరూప చయములు నారు వోసి
ఆదిశక్తులతోడ ఆనందమును బొంది
ముగ్గురమ్మల రూపుముదము దాల్చి
పరమేశునర్ధాంశు పధమును గ్రహియించి
పడతుల చెలువంబుప్రభలుగొల్పి
మహిమమౌ స్త్రీ రూపు మహిమంబులం దాల్చి
సరస సుందరవృత్తిచాలదన్పి

తే ॥ సోయగంబుల గమియయి చోద్యమునను
మెఱుపు తీగెగ గనిపించె మేలనంగ
మోహనాకారమోహిని ముదమెలర్ప
దర్పకాంతకు మనమది దండడింప 115

వ ॥ ఇట్లు మనోహరమైన విశ్వమోహినీ రూపంబు ధరియించి 116

చ ॥ ఒక ఎలదోట నెంతయును ఓరిమి కూరిమి చూపుచందమై
వికసన కాంతులన్ దనరి వేడుక పూపొదరిండ్లలోపలన్
శుక పికరావముల్ దనర చోద్యముగాగనుపట్టి వైళమే
వికసన వృత్తితో దనరి వేడుకతోడవనాంతరంబునన్ 117

ఆ॥ వె॥ నందనంబు పోల్కి నలరారు ఉద్యాన
మందు దిరుగు చుండు అతివ జూచి
బంతినెగుర వైచి పట్టుచు నెగురుచు
క్రీడసల్పునువిద క్రేణినియె 118

ఆ॥ వె॥ బంతి వాలుగంటి బట్టంగ ప్రబలమౌ
మారు తంపుహతిని మగువ తనదు
చీర వీడి పడిన సిగ్గునతలవంచె
చంద్రధరుని మనసు సంచలింప 119

ఆ॥ వె॥ పవన చలిత దీప పరుషాకృతియువోలె
సంచెలించె శివుని స్వాంతమంత
తన్ను తాను మరచె తాలిమి లేకుండ
సన్నుతాంగి వెంట సాగెనంత ! 120

ఆ॥ వె॥ తనదు కాంతజూడ తా చంద్రధరుడంత
తవిలె వెంటనంటి తాల్మివీడి
మోహనాంగి జూచి మోహిని మెచ్చుచు
మోహవార్ధిలోన మునిగె శివుడు 121

తే॥ గీ॥ మదపుటేనుంగు నేనుంగు మదనవృత్తి
గదియునట్టుల దనకాంత తన్నుజూడ

సిగ్గు యెగ్గును దలపక చింతలేక
మగుపగూడంగనేగిన మనసు జూచి 122

తే॥ గీ॥ మరల మన్మథుడేతెంచి మనసుజొన్పి
భవుని నోడించెనోయన భండనమున
వీర్య పతనమ్మునయ్యెను విశ్వవిభున
కంత దెలిసెను మాయయు సుంత యగునె ? 123

చం పకపకనవ్వి విష్ణుడట ప్రాంజలియై నిజరూపసంపదన్
సకలము నాదుమాయయని స్వాంతమురంజిలబల్కెనెంతయున్
నికటమునందు నాశివుడు నీరజనేత్రి ఉమాసతిన్ ధృతిన్
సకలము జూచుచానగని సాగె శిరంబును వంచి సిగ్గునన్ 124

సీ॥ సకలలోకేశ్వర సకలకళారూప
దేవతవయ్యుంట తెలియదరమే
నీదుమంజులరూపు నిక్కంబు మోహినీ
దేవతవయ్యుంట తెలియదరమె
ఉమ జూచుచుండంగ ఉవిదవైనీవుండ
నన్ను నేమరచితి నఖిలవేద్య
నీమాయలోకాన నిభృతమై యలరారు
విష్ణుండవయ్యున్న విబుధయశుడ

షత్పాతగీతి చాలుచాలునునీ తోడి సరసవృత్తి
సంచలాత్ముండనైతిని సారెకిపుడు
ఐన నాకోర్కె ఫలియించెనతిశయముగ
హరిహరాత్మజుడు దయించు నాదరమున
ధర్మశాస్త్రగనుదయించె ధరను వెలుగ
మూడు లోకాలధర్మంబు ముచ్చటగన 125

వ ॥ అని సంభ్రమమ్మున నాశివపార్వతులు ఇందిరాసుందరుని వీడుకొని చిరంజీవి ధర్మశాస్తాతో గూడి కైలాసమున కరిగిరి. 126

## దత్తాత్రేయోదంతము

వ ॥ అని సూతమహర్షి వ్యాఖ్యానించగా శౌనకాది మహామునులిట్లనిరి దేవా కైలాసమునకు వెళ్ళిన ధర్మశాస్తా కలియుగమున ధర్మము అను గోవు ఒక్కపాదముపై నుండగా కలియుగ వరదుడై ధర్మశాస్తా ధర్మమునెట్లు ఉద్ధరించెను అనంతరకథను మాకు వివరముగా వివరింపుడనగా - సూతముని అయ్యలారా ! ధర్మశాస్తా పూర్వభవంబున హరిహరబ్రహ్మల ఆశీస్సులతో అత్రి అనసూయలకు దత్తాత్రేయుడుగా జన్మించి పరమతపోధనుడయ్యెను ఆపుణ్యఫలమే ఇప్పుడు ధర్మశాస్తాగా హరిహరాత్మజుడుగ జన్మమందెను అక్కథవివరించెద వినుండు. 127

ఆ॥ వె॥ కలహ భోజనుండు కడు మోదమందుచు
ఉక్కుసెనుగులంత నుడకబెట్టి
ఇమ్మటంచుకొసరి ఈశ్వరపత్నిని
విష్ణుబ్రహ్మసతుల వేడెనంత 128

ఆ॥ వె॥ పరిహసింపదలచి పలికితివో యిట్లు
పరమఋషివినీవు పల్కదగునె
కలహభోజనాఖ్య కలుగునునిక్కంబు
అనుచు బల్కిరపుడు అతివలంత 129

ఉ ॥ అత్రినివాస భూమియగు నాశ్రమ ప్రాంతముజేరి వేడుకన్
పుత్రునిగాగ దత్తునిక పూర్వపుపుణ్యములుల్లసిల్లగా
ఈ త్రితయంపు భూములను ఈశుని సత్కృపజేసి వేడుకన్
అత్రికి గుర్తుగాకనుచు ఆయనసూయయు జేరివైళమే 130

ఉ ॥ నాందిగ ఉక్కుశన్గలను నాదట దోసిట బోసి యంతటన్
పొందుగ పాచనంబుగను పోడియొనర్పుమటంచువేడగా

సుందరిదోయిటన్ ఇడుచు సూటిగ నాధుని భక్తితోడుతన్
మందసమీరణంబుగతి మానిని[ప్రార్థనసేయునంతటన్ 131

చ ॥ తుకతుయంచువేడుకను తోరపు భక్తియె ప్రజ్వలింపగా
నికటమునందునున్నముని నిర్మల రూపుని దోసిటన్ వెసన్
సకలము ఉక్కుసెన్గలవి సారెకుపక్వముజెందియుండగా
ఇక భుజియింపు మంచనుచు ఇంపుగ బోసెను సాధ్వివేడుకన్ 132

తే॥ గీ॥ ముగురు మూర్తులకాంతలు ముదముతోడ
చేయజాలని పనులను జేసెసాధ్వి
సాధ్వి యౌగాదెలోకాలు సంతసింప
రుచులు చూడుడటంచును ఋషియుజెప్పె ! 133

తే॥ గీ॥ పరిమళంబులు వెదజల్లు పసలుగల్గు
సెనగలంతను రుచిజూచి సిగ్గుపడిరి
నారదుండేమొ నాట్యంబునపుడు జేసె
ఘోరమైనట్టి అవమతి గునిసియాడ 134

తే॥ గీ॥ ముగురుమూర్తుల నప్పుడు ముఖ్యముగను
సుదతి అనసూయ మహిమంబు సూటితొలగ
జేయవలెనని పంపిరి చెలులు అంత
మానవాకారములు దాల్చి మహితులపుడు 135

తే॥ గీ॥ అత్రియింటికి జనియపు డాదరమున
భుక్తి కావలెనంచన పుణ్యమతులు
భక్తితోబెట్టు దలచిన పడతిజూచి
వస్త్రహీనంబుగా భుక్తివనిత బెట్టు 136

తే॥ గీ॥ మనుచు జెప్పంగ నప్పుడు మగువతనదు
ప్రాణనాథుని మనసమున ప్రార్థనంబు

జేసి దొయిట నీరమున్ జిలుకవారి
మస్తకంబుల వారంత మహితశక్తి 137

తే॥ గీ॥ శిశువులైరంత చింతలు చెలగనీక
గోరుముద్దలదినిపించె గోముమీర
ఉయ్యలలలోన నూచంగ నూర్వ్యగతిని
ముగ్గురమ్మల కవ్వార్తముదముతోడ 138

తే॥ గీ॥ నారదుండంత దెల్పంగ నతివలంత
దేవలోకాలలో నుండి దిగిభువికిని
నారదుని వెంట కొంగులు నపుడు బట్టి
పతుల భిక్ష గనిడుమంచు ప్రణుతులిడుచు 139

తే॥ గీ॥ ముగ్గురమ్మలు వచ్చిరి ముదము దప్పి
పడతి అనసూయ తన పతిన్ పుడమి దలచి
నీరమున్ జల్ల శిశువులు నిర్మలముగ
వారి రూపులు ధరియించి వరుస నిలిచి 140

తే॥ గీ॥ ముగురు మూర్తుల రూపాన ముదిత నీకు
దత్తుడుద యించునో సతి దవళనేత్రి !
అత్రిపుత్రుండు దత్తుడై అలరు గాత !
అనుచు దీవించి వారలు అరిగిరంత 141

వ ॥ అంతం దత్తాత్రేయుండు శుక్లపక్షమునాటి చంద్రుని భంగి దిన దిన ప్రవర్థమానుడై యుక్తవయస్కుండయ్యె అంత గాలవ మహర్షికి ముగురమ్మల అంశమున లీలావతి యను కుమార్తె యుదయించి షోడశవర్షప్రాయ కాగా నామెను దత్తుడు పరిణయమై కొంతకాలము వారు కామ సుఖంబులనుభవించు చుండిరి. 142

ఉ ॥ నా హిమశైల కాననము నందలి గాంగతటంబు నందునన్
మోహపు వార్ధులన్ మునిగి మోదముతోడుత కూడియాడుచున్

ఆహవమట్లు కామమున అంచిత రీతిని క్రీడసల్పుచున్
ఐహిక భోగలాలసత అంచిత రీతి వనాంత రంబులన్ 143

వ ॥ కొంత కాలముక్రీడలను సల్పి తదుపరి - దత్తుండు 144

ఉ ॥ వేడుక లుల్లసిల్లగను వేద్యత కేశవుప్రార్థనంబులన్
గూడక మాన సాంబుధిని గూర్చని చెయ్యుల కాదటంచునా
వాడల నుండ రాదనుచు వారిజ నాభుని సంస్తుతింపగా
వేడబమంత మానిధృతి వేగత పంబొనరింప నెంతయున్ 145

ఉ ॥ కోమలియాశ్రయంబునకు కూరిమిజేరుమటంచు జెప్పితా
కోమల గాంగతీరమున కోరి భజింపగ నాది విష్ణునిన్
వేమలి నంబు బాపగను విశ్రుత లీల దపంబు సేయగా
కామిని ఆశ్రమంబునను కాంతునకై వెసనూర్చుచుండగన్ 146

వ ॥ గంగా తీరమున దత్తుడు తపమాచరించుచుండగా 147

ఉ ॥ దండక మండలంబులవి దారుణ గాంగతరంగ మందులన్
మెండుగ దేలి యాడుచును మేకొని ముందుకువెళ్ళునంతలో
వెండిని దత్తుశాపభయ వీర్యతపఃపల వింత వైఖరిన్
దండను జేరు దత్తునికి దాలిమి వర్తులరేఖ దోచుచున్ 148

వ ॥ ఇటుల దండక మండలంబులను దర్భలును తరంగముల వెంట కొంత దూరము వెళ్ళి దత్తుని శాప భయమున తిరిగి అతని వద్దకు వచ్చుచు ఆ వర్తనలతో నుండుట వలన ఆస్థలమునకు కుశస్థలియనియు కుశావర్థమనియు నామము వచ్చెను. అంత దత్తాత్రేయుడు లీలావతిని రప్పించి ఆమెతో 149

తే॥ గీ॥ రమణి వైకుంఠ ధామంబు రహిజనంగ
దేహత్యాగంబు జేసెద తేజ మెసగ
నీవు నీదేహమున్ వీడి నిక్కముగను
ముగ్గురమ్మల జేరుము ముదితయనగ 150

## లీలావతీ దత్త్రాత్రేయుల పరస్పర శాపములు

శా ॥ నీపై కూరిమి గొన్న నన్ను వడిగా నిక్కంబుగా బ్రోవు మీ
కాపై యేపయి డెందముందవులగా కామింపగా బోలదే
నీపై కూరిమి వీడబోవను వెసన్ నీ దాసనైయుండుటన్
దాపై యుండుము ప్రేమ వీచికలతో దాంపత్యమేపారగన్ 151

ఉ ॥ ఈ వన భూములందనిసి ఇంపుగ కూడుచు నుండు నట్లుగా
పావన మౌనిపర్యయిటు ప్రాపయి డెందము కందళింపగా
నీ వెయిటన్నచో నికను నేమన నేర్తును ప్రాణనాయకా
కావుము మన్మధార్థిగని కాంచన దేహుడ కావవే తగన్ 152

ఆ॥ వె॥ నేను నీకు ముదము నింపునుగల్గించు
మహిషి గానె నేను మహిషిగాన
మన్మధార్మిబొంది భ్రమందుచుంటిని స్వామి
మహిషిపట్టమహిషి మమత బ్రోవు 153

తే॥ గీ॥ ననగ ననగను గోపంబు నతిశయిల్ల
దత్తుడనియెను నీవింక తరళనయన
మహిషియగు మిటరాక్షస మహిషి వగుచు
నుండు మంచని శపియించె నూర్పులిడుచు 154

తే॥ గీ॥ అంత నీతల పటులుండ అడల బోకు
నీవు మహిషంబ వగుదువు నిక్కమంచు
మారు శాపంబుగ్రమ్మర మగువ యొసగె
దత్తుడంతట హరిజేరె తనువు వీడి 155

ఆ॥ వె॥ అంత మహిషిగాగ నాలీల లీలగా
మహిషు చెల్లెలగుచు మహిని బుట్టె
మహిషి ముఖము గల్గి మనుజాకృతియుగల్గి
వరలు చుండిరంత వారుభువిని 156

## మహిషాసుర మర్ధనము

వ ॥ పూర్వకాలంబున రంభాసుర కరంభాసురలను రాక్షస సోదరులుండిరి. కరంభాసురుని కుమార్తెగా లీలావతి మహిషిగా జన్మించెను. రంభాసురుడు అగ్నిదేవుని నారాధించి అతని వరప్రసాదమున శత్రువులకభేద్యుడైన మహిషుని పుత్రునిగా బడసెను. రాక్షసులు దేవతలను జయింపగోరి శుక్రాచార్యునితో మంతనమాడి మహిషుని బ్రహ్మవరము గోర తపము చేయుమని ప్రోత్సహించిరి. అంత మహిషుడు 157

ఉ ॥ ఘోర తపంబు జేయగను కూరిమి తోడ విరించియంతటన్
గారవమెంత జూపుచును కంజదళాక్షుడు గానిపించగా
కూరిమి వైరులందునుమ కోర్కెమెయిన్ వెసగోరియంతటన్
సారెకు వందనంబు లిడి సత్కృప జూపుమటంచు వేడగన్ 158

మ ॥ వరమున్ బొందెను పూరుషావళులచేవధ్యుండు గాకుండగా
సురపూజ్యుండగు బ్రహ్మదేవువలనన్ సుత్రామునిన్ గెల్వగా
పరమానందముతోడ రక్కసులతో పల్మారు దేవేంద్రుపై
అరుణాస్త్రంబుల తోడ యుద్ధవిధితో నాతండు వెళ్ళెన్ ధృతిన్ 159

వ ॥ సైన్యముతో వర గర్వమున వచ్చు మహిషాసురుని రాక జూచి - 160

ఉ ॥ దిక్కును మొక్కుగానకను దీనత వాసవుడేగె నంతటన్
దిక్కును నీవె యంచరిగి దీనత బ్రహ్మను విష్ణువేడగా
దిక్కట మూడు కండ్లుగల దీన శరణ్యుడు ఈశ్వరుండనన్
దిక్కని యందరేగియట దీన శరణ్యుని వేడనంతటన్ 161

చ ॥ పురుషుల చేత జావకను ముఖ్యత బ్రహ్మవరంబు నీయడే
వరమదిగాన నాతడిక వాస్తవ మేమన శక్తి చేతగన్
పరమును జెందగా గలడు పార్వతి బంపుడు వాని జంపగా
సరగున మీర లేగుడని స్వాంతమురంజిల బల్కె శంభుడున్ 162

ఉ ॥ పార్వతి జూచి శంభుడనె పద్మదళాక్షిరొ పార్వతీ సతీ
పర్వత రాజ పుత్రివిగ పల్మరు శక్తివి శక్తి రూపివై
సర్వము చక్కబెట్టుమిక సారెకు నా మహిషాధమున్ ధృతిన్
గర్వమడంచి చంపుమిక కామిని మోదముతోడ నెంతయున్ 163

ఉ ॥ దీనికి నేను గావలెనె ధీరత చండిక నంపుదున్ వెసన్
దానవు జంపగా ననుచు తాల్మినికల్మిని బల్కి జూపగా
మానసమందు దాతలచె మానుగ చెండిని నంతయా మెయున్
కానగ వచ్చె యంబికకు కాంత ముదంబున బూనె కార్యమున్ 164

చ ॥ మహిషుని వీటికిం జనియె మంజుల రూపముగాదు చూడగా
మహిమలు జూపు వైఖరిని మానుగరూక్షణ వీక్షణంబులన్
మహిని వధింతు ర్కనుచు మానుగ వచ్చిన చండిజూచియా
మహిషుడు ఆర్చెనోర్వకను మానుగ రాక్షస భావమేర్పడన్ 165

తే॥ గీ॥ ఓసి నే బ్రహ్మవరమున గాసి లేని
మరణమే లేని వాడనై మలగు చుండ
గాసి జెందకు చెనకగ గానిపించ
బోక పోపొమ్మటంచుచు పొలతిననగ 166

తే॥ గీ॥ పోదుపోదును నిన్ననే ప్రోజ్వలముగ
ఇలను గూల్చిన పిమ్మట ఇంపుతోడ
ఇంతలోపల నేనెట్లు ఏగుదాన
నిన్ను యమపురి కంపక నీచ మహిష 167

తే॥ గీ॥ స్త్రీవి నీతోడ యుద్ధంబు జేయజాల
ఉవిద మన్నించి నాడను ఊరట గని
బ్రతుకుపై ఆశ గలదేని పడతివెళ్ళు
స్త్రీలతో యుద్ధమెప్పుడు చేయననగ 168

ఉ ॥ మానిని యంచునన్ దలిచి మార్గణముల్ గని పారిపోవకో
బానిస జాతివో పడతి భావన నన్నిటు లేల దల్చగన్
పీనుగ జేసి నిన్నువడి పేర్మిని వెళ్ళుదునన్ను జాడుమో
కానగ లేక పల్కెదవు కానవు నీగతి యంచు బల్కినన్ 169

ఉ ॥ నేదను జేంద్రుడన్ మఘువునిన్ దరిదాపులలేక తోలితిన్
ఆదరమొప్ప రక్కసుల నంతట బ్రోవగ బూనితిన్ వెసన్
మోదము తోడ దానవుల ముఖ్యత గావగ నెంచితిన్ వడిన్
ఏదరి జూచి వచ్చితివి ఎందుల దానవు నీరజాక్షిరో ! 170

ఉ ॥ ఈడగు వాని గూడుకొని ఇంపుగ రాగసుధాబ్ధిలోపలన్
షూడముగాగ ప్రేమమున కంజదళాక్షిరొనుండకుండనీ
వేదననున్ గనంగ నిట వేద్యత యుద్ధము సేయ వచ్చితో
ఆడెద వేలమాటలవి అంగన చాలును చాలు పొమ్మికన్ 171

చ ॥ భువనము లన్నియున్ వెతల బొక్కుచు నున్నవి నాదు బల్మిమై
భువనము లందు గల్గు ప్రజపూనిక సృష్టి యొనర్చుదైవమే
అవనతమైన యట్టులుగ అంచిత రీతిని యుండె నిప్పుడే
భువనము లందునన్ గెలువ పూజ్యుడు లేడిక పొమ్ముమానినీ 172

చ ॥ ఘనుడను యుద్ధవిద్యలను గాఢత బాణపరంపరాబ్ధిలో
నినుమును గంగజేసెదను నిక్కము నీవెటువచ్చితోయటుల్
పనవు చుపారి పొమ్మికను పాపము సుమ్మిది డెందమందునన్
ఏనిట స్త్రీల జంపనని ఇచ్చదలంచితి వేగ పొమ్మికన్ 173

ఆ॥ వె॥ దేవలోక మందు దేవేంద్రుతో గూడ
దనుజ స్త్రీల మగల దరుమలేదె
నీతులిచట బల్కి నీ విప్పుడిట్టుల
కదన రంగమునకు కలగెదేల ! 174

తే॥ గీ॥ బమ్మదేవర వరమున బలసినీవు
ఇమ్మహిన్ మహిషాసుర ఇటుల బల్మి
అతల కుతలంబు గావింప అర్హుడగు దె
మహిని నేనెంత ? నీవెంత ? మరలి జూడు ? 175

సీ ॥ అమరావతికి నేగి అచట దేవేంద్రాది
సురులను దరుమంగశూరుడగుదె ?
యజ్ఞయాగాదుల యజ్వుల దలపట్టి
ఈడ్చిన మదమది ఇంపుగనునె
అవనిలో గలయట్టి అఖిల జనావళిన్
దనుమంగవెడగైన తులువ మొక్కొ
ఇడుములంగనగను ఈ విధి లోకముల్
అలమటింపగ జేయ ఆఢ్యుడగుదె !

తే ॥ దుడుక; దుడకండ; దుడుకండ దోర్బలమున
కడిమి జూపితి వలనాడు కలదె సుఖము
భండనంబున నినుజంపి బ్రతుక జేతు
నెల్లలోకాలు చల్లగా నెపుడు నుండ 176

ఉ ॥ చీరికి నేగొనన్ విభుల శ్రీహరి బ్రహ్మను నాశివున్ వెసన్
ఏరిక లేరు పోరగను ఎమ్మిక లాడక పొమ్ము ఊరకే
ఘోర పరాభవంబు గొని గోడును జెందక కందళింపకే
వైరము మాని వెళ్ళుమిక వేగ జగజ్జను లెల్ల నవ్వగా 177

మ అన రోషారుణయుగ్మ నేత్రములతో నాశ్వంబు నాడించుచున్
వినరా రాక్షస ఘోరరూప మహిషా విఖ్యాత చారిత్రనే
నిను ఘోరాసురు జంపెదన్ వడిగ నా నేర్పుం జవింజూడరా
అనయం బీధర ద్రెళ్ళగా వయితునేన స్త్రంబులన్ ముంచుచున్ 178

సీ ॥ తూగుటుయ్యలలోన తూగుచుండుట గాదు
వనవిహారంబుల వరుసగాదు
ఉద్యాన వనముల ఊరట కొరకునై
శుక పికంబుల తోడి సుద్దిగాదు
వనదీర్ఘికల యందు వాంఛను జలక్రీడ
సల్పుచుండుటగాదు స్వాంతమలర
వనమయూరంబుల వరుస నాటంబుల
వీక్షించు చుండెడి విధముగాదు

ఘోరరణమిది భీకర ఘుమఘుమాయ
మానవర దుందుభి ధ్వాన మార్గణముల
మెఱుములు ఉరుములు వలె నుండు మెలత వేగ
రణము సేయంగ నేర్తువే రమణి నీవు 179

ఆ॥ వే॥ ఆడు దాని చేత ఆయువు దీరును
పురుషుడెవడు జంప పొసగు పడదు
బ్రహ్మవరము చేత బలసినాడవు నీవు
దైత్య మహిష నిన్ను ధరనుగూల్తు 180

ద్వితీయసోపానము సంపూర్ణము

### శ్రీ అయ్యప్ప మహాభాగవతము

# ప్రథమోల్లాసము - తృతీయ సోపానము

## మహిమా యుతము- లోభరహితము

వ ॥ అనగా ఆమహిషుడు 181

ఉ ॥ సింహము వాహనంబుగను సూటిగ శూలము ఆయుధంబుగా
సింహిణినా బెనంగెదవు చింతలు దీరిటువచ్చితో వెసన్
సింహము లెన్నియైన భువి చీరికి గైకొను వాడగానునే
సింహ బలంబు జూపుమిట చింతలు మానగ జేతుమానినీ 182

చం ॥ అని గదగొంచు ఘోరముగ ఆదట సింహము పైన వైవగా !
పనివడి నోటినిన్ దెరచి పల్మరు దంత వికీర్ణ పంక్తులన్
అనువుగ వాని వక్షమును నంతట జీరగ నంత లోపలన్
గనగను రక్తబిందువులు క్రాలె ధరాస్థలి యందు నందులన్ 183

ఉ ॥ ఒక్కొక రక్తబిందువున కొక్కరుడై ధరబుట్టి రక్కసుల్
నిక్కిరి వారు ధీరులయి నిల్చిరి వారు రణాంగణమ్మునన్
చక్కగ వాని రక్తమును సారెకు గ్రోలు మటంచు సింహమున్
వెక్కస మంద జెప్పగను వేద్యత సింహము గ్రోలెనంటన్ 184

ఉ ॥ పుట్టగ నీకరక్కసుల పూర్ణముగాగను రక్తముల్ వెసన్
దిట్టము గాగ సింహమది ధీరతగ్రోలగ నంత చండియున్
రట్టడి రాక్షసాధముని రాయుధుజేయుదు నంచుధీరతన్
నెట్టన శూలమున్ జొనిపి నేర్పడ ద్రుంచెగధాయుధంబునున్ 185

మ ॥ తన సైన్యంబుల వేగరమ్మని వడిన్ దావేల చందంబులన్
ఘనశాస్త్రాస్త్రచయంబుగుప్పుడనుచున్ గావించి రార్భాటముల్
గనగా పైచిరి బాణసంహతులు నా కాత్యాయని దేవిపై
ఘనసంత్రాసము తోడ భూతగణముల్ ఖండించె శస్త్రాస్త్రముల్ 186

వ ॥ బల ముడిగియు యుద్ధము చేయ బ్రయత్నించు మహిషాసురుని జూచి187

సీ ॥ ధర్మమధర్మంబు దలపోయ లేకుండ
దనుజ జీవింపంగ దలచినావు
కామాంధకారంబు కన్నుల గ్రమ్మగా
కామ పిశాచివై క్రాలినావు
అహముతో దినమున అధికుండ నేనని
దలపోసి ధర్మంబు దప్పినావు
ఈర్ష్యాళువైయుండి ఈశ్వరు బ్రార్థింప
దలపోయ జాలని దనుజుడైతి

తే ॥ మధువు మాంసబు మాటికి మరిగి నీవు
చేయరానట్టిపనులను జేసినావు
తులువ నిన్నేల మన్నింప దోర్బలమున
ద్రుంత శూలంబుతో లీల దుష్టచరిత 188

ఉ ॥ మాకును దేవతాళికిని మంజుల వృత్తి సుధారసంబునన్
ఈ కమనీయ రూపమున నిప్పుడు పంచుదునంచు వైళమే
మాకిట బోయకన్ సుధను మాటికి దేవగణాళికిన్ వెసన్
చేకొని బోసెనా హరియు చెల్లునె ధర్మము దెట్టుచెప్పుమా ! 189

కం ॥ భస్మాసురాఖ్య రక్కసు
భస్మము చేయించె హరియు, భవుకొరక చటన్
భస్మముగా మా కులమును
భస్మము చేయించె హరియు పడతి యెరుగవో 190

చం ॥ హరియును శంభుడున్ వరుస హాలహలంబును బోలె రక్కసుల్
వెరవున జావ జేయుచును వే తెరగుల్ పచరించు చుండగా
మరువగ వచ్చునా మగువ మాటికి శత్రులజంప కుందునే
పరువము గల్గు రక్కసుడ పామరుడంచు దలంప బోకు మీ 191

ఉ ॥ బ్రహ్మకు బుట్టినిల్లు గద ప్రాభవయుక్తిని విష్ణునాభియున్
బ్రహ్మకు తండ్రిగాడె హరి ప్రాపుగ నందనుడైన బ్రహ్మచే
బ్రహ్మము నీవె యంచడిగి బ్రహ్మవరమ్మును బొందినాడవో
బ్రహ్మకులంబు గాచుటకు ప్రాపయి వచ్చితి రాక్షసాధమా ? 192

మ ॥ హరిగెల్తున్ శివుగెల్తునేననుచు నీ యార్బాటముల్ చాలునా
హరియే మీదగు రాక్షసాళికులమున్ అంతంబుగా జేయగా
సరియౌ రక్కసులైన మీ గుణములన్ సంతాపముల్ జెందగా
సరియే లోకములంచు దాదు నెమెడున్ సాక్షీభవ స్వాంతుడై 193

మ ॥ శివుడున్ భక్తుల పాలిదైవముగ సుశ్రీలం జెలంగన్ వడిన్
భవ బంధంబులు బాపి బ్రోచెడిని నా భక్తాళిరంజిల్లగా
భవునిన్ వేడిన యంతటన్ గలిగెడిన్ భాగ్యంబు మీపాలుగా
భవితంబుల్ సుగుణాకరంబులయినే భాగ్యంబులంబొందరే 194

చ ॥ శివుడట చిద్విలాసుడట చింతలు దీర్చునటంచు వేడగా
అవమతి గాదెమాకిచట అంచిత రీతిని రాక్షసాళికిన్
పవలును రాత్రి యంచనక పల్మరు దేవ గణాళిద్రుంపగన్
నివహము లంత గూడుకొని నిక్కము యుద్ధముసేతుమెప్పుదున్ 195

వ ॥ అని 196

మ ॥ గద గొంచున్ ధృతి చండిపై విసరుడున్ కాంతాలలామంబుతా
గదతో నాగద నుగ్గునూచముగ దాకన్ వీకమై బోరగన్
వదనంబంత వికారతా గుణములన్ వాసించి తా ˘న్నులన్
గదు రంరక్తిమను గ్రరూపుడగుచున్ కాంతన్ విలోకించగన్ 197

తే॥ గీ॥ నారిటం కృతుల్ ఉరుముల నధికరింప
రక్కసులు జింకలగుచును రయముబార
విల్లు ఇంద్రధనుస్సుగ వెలుగుచుండ
బాణ వర్షమ్ము గురిపించె బడితివేడ్క 198

ఆ॥ వె॥ గదల మోదు బడిన గణుతింప రానట్టి
నేన్గుగములు గూలె నేపు మీర
బాణవర్షమునను బలు తెరంగులు గాగ
అశ్వదళములంత అవని గూలె 199

కం ॥ బిర బిర బరువిడ కుండగ
సరగున నిలునిలువు మహిష చంపుదు ననుచున్
పుర పుర బొక్కుచు తరిమెను
అరి వర్గము భీతి జెంద ఆహవమందున్ ! 200

తే॥ గీ॥ సింహ నాదంబు జేయుచు సింహమట్లు
మహిషుపై బడి శూలంబు మహిత వృత్తి
తీవ్రముగ ద్రిప్పి గుండెలో దివిచెనంత
రక్కసుండార్వ సైనికుల్ రయముపార ! 201

ఆ॥ వె॥ భూతగణము లార్వ భువనాల లోపల
బ్రతికి నామటంచు ప్రజలు దలప
రాక్షసాళియపుడు రయమున పారంగ
సింహమపుడు జొచ్చి చెలగుచుండ ! 202

తే॥ గీ॥ మహిషు రక్తంబు బడనీక మహిని వేడ్క
సింహమప్పుడు గ్రోలుచు చెలగు చుండె
మహిత శక్తిని నా శక్తి అహితు బొడువ
నిహతుడాతడు గాకుండె నెట్టి తెరగొ ! 203

వ ॥ అంత మహిషుడు 204

మ ॥ ఘన హుంకార రవంబుతో నెగసి కంజాక్షి పై బాణముల్
వనటం బొందగ జేతునేనని వెసన్ వాడంత వైవన్ ధృతిన్
తనయంతం తన వాహనంబు కడిమన్ దాజృంభమాణంబుగన్
అనిలోద్ధూత పరాక్రమంబుగ వెసన్ నాసింహ మత్యంతమున్ 205

శా ॥ పంజా విప్పుచు వాడి గోళ్ళదునిమెన్ ప్రాపైన నా సైన్యమున్
సంజాతంబుగ నోరు విప్పియటులన్ స్వాంతంబు రంజిల్లగా
కంజాతేక్షణ మెచ్చునట్టులుగ తా కాంక్షించి రక్తంబులన్
పుంజీ భూతము గాగ ఘోరముగ పూర్ణంబుగా ద్రావినన్ 206

వ ॥ అంత నాశక్తి 207

శా ॥ శూలంబున్ పటు రోష భీషణముతో శోభిల్లగా వైచినన్
శైలంబట్టుల నేలపై దొరల నా సాముల మందంతటన్
నేలం నెత్తురు టేరులైప దొరలగా నా రక్కసుండంతటన్
కాలుం గేలును కూడ దీసికొని దాకం బోరికిన్ వీకమై 208

తే॥ గీ॥ దేవతల నాట పట్టించి దనుజ నీవు
రాక్షసాధమ గైకొంటి రాజరికము
దేవలోకాన నీ వింక దనుజ నిలుతె
యమ పురంబున కనిపెద యసుర నిలుము 209

తే॥ గీ॥ అష్ట దిక్పాల చయముల నంతదరిమి
భువనములలోన వెల్గితి పూజ్యుడైతి
అబల సబలుడ నాతోటి ఆ వహంబు
చేయ జాలవు పొపొమ్మ చెల్వయనగ 210

చం ॥ సబలుడవా కడుంతులువ సాగవు నీదగు చెయ్వులింతటన్
అబలనటంచునాడెదవు అంచితరీతిని యుద్ధభూమిలో
సబలుడవైన నిల్వమిక సొరెకు నాదగు శూల సంహతిన్
కుబుసములూడ్చి చంపెదను కూలుటనిక్కము రాక్షసాధమా 211

చం ॥ అని తన శూలమున్ గొనుచు నాదటముందుకు సాగెనంతటన్
ఘనతర కాయసంపదను గర్వముమల్లడిగొంచు నాతడున్
ఘనతను దోపహుంకృతుల కామిని గెల్వగ జూచియంతటన్
పనవుచు నంత ఘాఢముగ తాగధత్రిప్పుచు వైచెనామెపై 212

శా ॥ శూలాగ్రంబున దానిదున్మి వడితాశుంభ ద్వీర సంరంభయై
ఏలా దానవ నీమదంబడతు నేలాలావు జూపింపగా !
నాలావుం గనిపింతు నీకనుచు నా నారీతులన్ బాణముల్
వాలాయంబుగ వేయగా నపుడు తావాల్లభ్యలభ్యంబుగా ! 213

చం ॥ మహిషుడవైతి నీవికను మంజులస్వాంతమునీకుగల్గునే
సహనములేక నోర్వనిక సారెకునేను కృపాణపాణినై
ఇహమునువీడజేసినినునింపుగ బంపుదు ధర్మనొద్దకున్
అహమును వీడరా తులువ అంత్యపుకాలము నీకువచ్చెరా ! 214

శా ॥ ఖడ్గంబున్ గొని వాడుశక్తినటుతాఖండింపగాబూనగా
ఖడ్గంబున్ తన ఖడ్గధార దునిమెన్ కాత్యాయనీదేవియే
ఖడ్గంబైనను నెత్తనీక వడిదా ఖండించె తద్బాహులం
ఖడ్గంబుల్ వెసదాక నేర్చునే ధృతిన్ కంజాక్షిచండీసతిన్ 215

శా ॥ శూలంబున్ ధృతితోడ ద్రిప్పుచును నా శూలంబుకంఠంబుపై
గా॰ ఁబట్టుల గ్రుచ్చి నెత్తురులు దా కంజాక్షి త్రావెన్ వెసన్
తూలెన్ రాక్షసలీరుడంతటను వేతూలేన్ ధరన్ వైళమే
కాలుంజేరెను వాడు తన్నుకొనుచున్ కాయంబుకొండైపడెన్ 216

చం ॥ గగనతలంబునంతటను గాంచెడిదేవతలంతనంతటన్
గగనముడిగ్గివచ్చిరటు గాంచగశక్తిని కొల్వవేగమే
మగువకువందనంబులిడి మాటికిగొల్చిరి లోకపాకుల్
దిగులును మాని వాసవుడు ధీరతమ్రొక్కెను శక్తికంతటన్ 217

## దేవతలు దూర్గంబికనిట్లు స్తుతించిరి

వ ॥ దేవేంద్రుడిట్లు స్తుతించెను 218

**దండము-** శ్రీశక్తి ఓం శక్తి లోకైక మాతాకృపాయత్త చిత్తాబ్జరేఖా మయూఖా ! సుధారాసి సంపూర్ణనేతామహానంద సందాయినీ దేవి బృందాకానంద సంధాయినీ దేవి మాతా జగత్పూజ్యవై దానవానీకముల్ ద్రుంచు మద్దేవతామూర్తివై ఆది

మధ్యాంత కాలంబు లందున్ సదా బ్రహ్మివై ! శక్తివై ! లక్ష్మివై ! నీవు నీపూర్వ జన్మంబులందున్ త్రిలోకంబు లందంతటన్ శక్తివై యుక్తిలోకంబులన్ సృష్టిగావింప మాయామయంబైన లోకంబునున్ నీవు సృష్టించి నావే గదా బ్రహ్మ విష్ణాదిశంభున్ ధృతిన్ నీవె కావించి నావే కృపన్ లోక సంరక్షణంబున్ వడిన్ బూని నక్షత్ర మాలాకృతుల్ సూర్య చంద్రాదికంబైన నాయంత రాశంబు నీవె కదా సృష్టిచేయంగ వెల్గెన్ సుధారాసికిన్ చంద్రుపోలెన్ మమున్ బ్రోచితేదేవి దేవేంద్రుపీఠంబునన్ నిల్పగా జేసి దేవాదిదేవుల్ నుతింపంగ నీతాండవాదిక్య యుద్ధంబునన్ గూలె నారక్కసుండంత లోకంబులెంతేని జీవింపగల్గెన్ సదానంద సంధాయినీదేవి నీపాదముల్ సోకగా మ్రొక్కుచున్ భక్తులంతర్గతంబైన నీ శక్తియుక్తుల్ మనంబందు భావించిరేకాలమందైన ఓంకార హ్రీంకార సాకారమూర్తి సదాజ్ఞాన సంపన్నదేవీ మమున్ బ్రోవవే తల్లి యుల్లంబునన్ కూర్మి సంధిల్లకాపాడి నావమ్మ మాయమ్మలోకేశ్వరీ తల్లీ నమస్తే నమస్తే నమస్తే నమః 219

వ ॥ లోకపాలకు లిట్లనిరి 220

కం ॥ దిక్కుల కధిపతులము మము
దిక్కుల గల పనులు జేయ తేజములేకన్
దిక్కొక్కటి లేకుంటిమి
దిక్కులు నీవైతితల్లి దీనతతొలగెన్ 221

శా ॥ తేజోరాసివి నీవు దేవి ధృతితో తేజంబు నిండారగన్
మాతారక్కసుద్రుంపు ద్రుంపుమనినీ మహాత్యమింపారగా
చేతోమోదముతోడ దేవతతులున్ చెల్వొంద పార్థింపగా
నీతేజో మహిమంబు జూపి కడకున్ నీచునింపితే ! 222

తే॥ గీ॥ నీకటాక్షంపు వీక్షణల్ నిజముగల్గి
బ్రతికి పోయిరి దేవతల్ బడలు వాసి
లోకముల సేమములగోరి వీకదనుజు
దాకిమడయించితివిదేవి దారుణముగ ! 223

తే॥ గీ॥ లోకముల మూలశక్తివి లోకములను
ముగురు మూర్తుల సృష్టించి ముగుదనాడు

లోక రంక్షణ గైకొంటిలోభముడిపి
మహిషప్రాణాల గొంటివి మహితశక్తి ! 224

చం ॥ విజయము నీకు లోకముల విశ్రుత కీర్తిలంభించుగావుతన్
సుజనుల బ్రోవనెంతయును సూటిగరక్షయొనర్పవైళమే
కుజనుల జంపగా నిపుడు కూరిమిదేవికి వందనంబులీ
అజుడును విష్ణుడున్ శివుడు అంచిత రీతి యొనర్తు మిత్తరిన్ 225

వ ॥ అంత బ్రహ్మ విష్ణులతపురన పరమశివుడు తానును ఇట్లు నుతించె226

ఆ॥ వె॥ ఆది కాలమందు ఆవిర్భవించితి
వమ్మమూల ప్రకృతి వన్నియెడల
శక్తిమాత నీదు శక్తిమై లోకాలు
బుట్టె తల్లి మమ్మ బుట్టజేయ 227

శా ॥ నీ మూలంబున ముప్వురమ్మలటు నీ నీమంబులంబుట్టగా
ఆమూలాగ్రము లోకముల్ బ్రతుకగా ఆరీతి మేముంటిమో
వామాక్షీ ధృతి లోక బాంధవతతో వర్ధిల్లగా లోకముల్
నీవే పాలన జేతువమ్మ జగతిన్ నిక్కంబు లోకేశ్వరీ ! 228

తే॥ గీ॥ లోక కళ్యాణ కరముగ నీకు పనులు
జేయ చెలువొందు ప్రకృతి చేజేత లెల్ల
ప్రకృతి పురుషుల డెందాలు పల్లవింప
లోక రక్షణ సేయుమో లోక జనని ! 229

వ ॥ అనగా నా దేవతల తల్లి దుర్గామహాదేవి చండిరూపంబున ఇట్లని ప్రతివచనములు పలికె 230

ఉ ॥ నీ మహిమాభిరామమున నిక్కము జంపితి నీదు నాజ్ఞచే
నీ మహిషాదమున్ యిపుడ నీవిట సంస్తుతి జేయ జెల్లునే
ఏ మహిమంబు లీవసుధ ఎంతయు గల్గును ఈశ్వరాజ్ఞచే
నామహితాఢ్యునిన్ గొలుతు నంజలిగైకొనుమో ప్రభూయిటన్ 231

వ ॥ ఇట్లు సురులును మునులును యక్ష కిన్నర కింపురుష గంధర్వాదులును లోకముల తల్లికి వందనములిడి సాష్టాంగ దండ ప్రణామములు గావించి నీరాజనములిడి పూలమాలికల నలంకరించి జయ జయధ్వానములతో లోకమాతను సంభావింపగా దేవిమహిషాసురమర్ధని వారిని దీవించి కైలాసకాననంబునకుం జనియె ! ముగ్గురుమూర్తులును దేవతలును వారివారి నివాసంబులకుం జనిరి. అంత దేవేంద్రుండమరావతికరిగి 232

ఉ ॥ అంచిత రీతి పట్టమును ఆదటగట్టుకొనెన్ వెసన్ ధృతిన్
వంచన సుంతలేకటుల వారలు దిక్పతులంత వెల్గగా
మంచి దటంచు దేవతలమన్ననసేయుచునేలేనాకమున్
పంచను విఘ్ననిందలచి ప్రాజ్ఞత వాసవుడుండెనెంతయున్ 233

## మహిషితపమాచరించుట

వ ॥ అంతమహిషి సోదరుని మరణమునకు జింతించి తనగురువగు శుక్రాచార్యు నభిమతంబున చండినోడింప జాలక ఇంద్రునిపై పగబూని బ్రహ్మను గూర్చి తపంబు జేసి మరణములేని వరమును పొందగోరి ఆమె తపోవనంబున కరిగి అందు 234

సీ ॥ ఫలములాహారంబు పడతి త్యాగైకొని
తపమెంతొ జేసెను తరళనయన
నీరుమాత్రముద్రావి నిరతిశయంబుగా
తపమెంతొ జేసెను తరళనయన
వాయుభక్షణముతో వరుసగ కొన్నాళ్ళ
తపమెంతో జేసెను తరళనయన
ఆహారమేమియు అతివభుజింపక
తపమెంతో జేసెను తరళనయన

తే ॥ మండు వేసంగి పంచాగ్ని మధ్యమునను
శిశిరరుతువున మహిషియు స్థిరముగాను

కంఠ గతమైన నీటిలో కాంతనిలిచి
ఘోరతపమాచరించెను కువలయమున 235

మ ॥ తపమే ఆతపమై తపోగ్నియయి సంత్రాసబునున్ జెందగా
విపరీతంబుగ లోకముల్ వడకగా విఖ్యాతుడౌ ధాతయున్
అపుడుత్కంఠతతోడ హంసపయి తానార్ద్రాంతరంగుండుగా
కృపతోడంజనుదెంచి వేగవరమున కీర్తిన్ గొనన్ కోరనన్ 236

చ ॥ మరణములేని జీవనము మంజుల రూపుడయిమ్మువేగమే
అరుదగు అస్త్రశస్త్రముల అంచితరీతిని డ్రుంగకుండగా
వరమును దేవయిమ్మనుచు వారిజలోచనవేడునంతలో
సరియదిగాదు లేమయిటు సారెకువేరువరంబుకోరవే 237

కం ॥ పుట్టుట గిట్టుటకొరకే
గిట్టిన మరి పుట్టుకొరకె గిట్టివసుధలో
పుట్టిన గిట్టకనుండుట
నెట్టుల సమకూరబోదు నేరవునీవున్ 238

కం ॥ వేరొండువరము కోరుము
సారంబగునట్లు గూర్తు సారెకు దానిన్
మీరంగ జాలవరమును
కోరంగను నిత్తు నీకు కువలయమందున్ 239

తే॥ గీ॥ హరిహరాత్మజుడై పుట్టి అవని యందు
ద్వాదశాబ్దముల్ రాజుకు దయదలిర్ప
సేవలందించి వచ్చిన చేవ గలుగు
పట్టి చేనాకు మరణంబు పడయజేయు 240

వ ॥ మనగా . . . 241

తే॥ గీ॥ కోర రానట్టి వరమును గోరితీవు
కొమ్మయిచ్చితి వనితరో కూర్మి తోడ

కువలయంబున నెమ్మది కుదురుకొనగ
సంచరింపమటంచును చాలజెప్పి 242

తే॥ గీ॥ వనజ భవుడంతవేడ్కతో వరమునిచ్చి
సృష్టిచేయంగ లోకాలు చెలగుచుండ
సత్యలోకంబు జేరెను సదమలముగ
విశ్వసృష్టికి మూలంపు విభుడుగాన 243

వ ॥ పురుష పుంగవులైన హరిహరులకు పుత్రుడకల్గుట అసంభవము అట్లు ఒకవేళ కల్గినను ఆ పసివాడు కలియుగమునందలి ఒకరాజును సేవించుట దుర్లభము కాన నాకు మరణములేదు అని మదిలో సంతసించి దేవతలకల్లి త్రిలోకములకు మాతయౌ దుర్గను . . . . . సమీపింప జాలక దేవేంద్రునిపై కక్ష సాధింపనెంచి 244

## మహిషిదేవలోకమాక్రమించుట

మ ॥ వర గర్వంబున నామహేంద్రుదునుమన్ వాంఛించి తానంతటన్
పరగెన్ రక్కస కాంతలన్ గలసిదా పాపాత్మురాలైన యా
పరిభూతాత్మకమైన యామహిషియున్ పూరించెదాశంఖమున్
అరియౌ ఇంద్రుని జూచిపల్కెనిటులన్ అత్యంత కృద్ధాత్మతన్ 245

ఉ ॥ శక్తిని బూన్చి నాయనుజు చంపితి వట్టుల ఓమహేంద్ర నీ
యుక్తులు యింక సాగవుగ యూరటలందుదుగాక చూడుమా !
శక్తులు రాక్షసావేశలు సారెకుకాగను జేతునిప్పుడే
రక్తిని గూర్తు రాక్షసుల రాజ్యము విస్తరిలంతగవేగమే ! 246

ఉ కొమ్ములతోడ దేవతల గుమ్ముచు దావడి కోర్కె వెంబడిన్
నిమ్ముల బాణవర్షమున నిక్కుచుముంచగ నామహేంద్రుడున్
అమ్ముల వాయజేయగను అంచితరీతిని నోర్వలేకనా
కమ్మును రక్షసేయగను గ్రాలగ జాలక నుండెనెంతయున్ 247

సీ॥ ఇంద్రుడైరావత మింతలోనెక్కితా
వజ్రాయుధంబుతో వనితనైవ
నిర్జరేంద్రునిప్రేట్లు నిరజాక్షికి నెంతో
దాకిన నిసుమంత దలపకుండ
కందకనుండంగ కలగుచు ఇంద్రుండు
అరివర్గమున్ ద్రుంపఅలసుడయ్యె
కారుమేఘంబులు క్రమ్మిన పగిదిని
క్రమ్మెను రాక్షస బలములంత

ఆ॥వె॥ ఆడు దానిచేత అన్ననుజంపించి
నావు ఆడుదాన నగుట నిన్ను
గూల్తు నింద్ర నీకు గూర్చు దిక్కెవుడుర
పిలువరోరి వారి పీచమడతు 248

వ॥ అనిన ఇంద్రుని ఆదేశమున అగ్నిదేవుడు రణాంగణమున ప్రవేసించెను. 249

చ॥ భగభగ మండెనగ్నియును బల్మరుదాకెను రాక్షసాంగనన్
భగభగలేమియున్ వనిత భంగపడంగు జాలదయ్యెడన్
వెగటువాయువంతటను వీచెను హోరుగ నంతలోపలన్
ముగుదనులీసమంతయిన ముట్టగజేయక పోయెనెవ్వియున్ 250

చ॥ వరదలతోడ ముంచెనటు వర్ణుడు దీర్ఘత తోడ సెంతయున్
వరమది మాకు గల్గగన వారిత రీతిని వర్షమెంతయున్
అరుదుగ వచ్చినన్ వెరువ నేమహిషాంగనన్ గదా
అరిమురి నీరమందిపుడు నాడెదనంచనెనామెయెంతయున్ 251

ఉ॥ దిక్కులు దోచకందరును దీనత నుండగయింద్రుడంతటన్
దిక్కనిబ్రహ్మగొల్వగను దేవతలందరిగూడి వెళ్ళితా
మ్రొక్కటులున్న వైణమును మోసమునున్ దగజెప్పనాతడున్
వెక్కసమంది వారిగొని వేద్యతనాశివుజాచెనంతటన్ 252

ఆ॥ వె॥ హరిని గూర్చి శివుడు అపుడు ధ్యానింపంగ
తరలివచ్చె హరియు తాల్మితోడ।
ముగురుమూర్తులపుడు ముచ్చటగాగను
చేరి తెరగుకొరకు చింతజేసి 253

వ ॥ వరగర్వంబున బలసినమహిషి నేమియు చేయజాలక దత్తాత్రేయుని శాపముందలచి ముగ్గురుమూర్తులు తమ తమ యంశంబులతో దత్తాత్రేయమూర్తిని సుందరమహిషముగ సృష్టించి ఇంద్రలోకమునకు బంపిరి. 254

మత్తకోకిల- రామణీయకమై సుధారసరంజితంబుగ వేడుకన్
కోమలైక విరాజితంబగుకూర్మిడెందముపండగా
ఆమనిన్ కడుదున్నయైనది ఆమహామహిషంబుదా
నీ మమున్ కడునొప్పజేరెను నిక్కుచున్ అమరావతిన్ 255

ఉ ॥ సుందర రూపుడౌ మహిషు సూటిగ జూచుచుడెందమందునన్
సందడిచేయమారుడటు సత్వరమేడిగి యాసనంబునున్
కొందలమందడెందమున కోరికలీరికలెత్తసాగినన్
మందమరాళయానయయి మాటికియామెయుప్రేమవీచికన్ 256

వ ॥ ఇట్లు ఆమె సుందర మహిషము వెంటనంటి భూలోకమునకు వచ్చి క్రీడింపందొడంగె. ఇంద్రుడిది సందుగదయని సింహాసనమునధిష్టించి పాలించ దొడంగెను. రాక్షస స్త్రీలును రాక్షసులును మహిషిని జూచి ఇది ఇంద్రుని మాయయని తెలుపనంతలో సుందరమహిషము మహిషి మరణ మాసన్నమయినదని తెలిసికొని తానుమాయమై ముగురు మూర్తులలో నైఖ్యమయ్యెను. అంతట మహిషి ఇంద్రుడు కావించిన మాయను తెలిసికొని 257

శా ॥ ఆక్రోసించుచు నామహేంద్రుని పయిన్ అత్యంతబీభత్సతన్
సక్రోధంబున యుద్ధమున్ సలుపగా సంతాపితస్వాంతయై
సక్రూరంబుగ జంపవేగ వెడలెన్ సంతాపితస్వాంతయై
ఓ క్రూరాత్మక ! ఓమహేంద్రయనుచున్ ఓ ద్రోహియంచున్ వడిన్! 258

ఉ ॥ నాకములోని కేగి యటు నాధ్యత ఇంద్రుని బట్టి యాడ్చి తా
నాకమునేలు దాననని నంతట కొమ్ములజిమ్మ నాతడున్
వేకను గల్గి వజ్రమున వారిజనేత్రిని వైచెనంతటన్
సోకిన గడ్డిపోచవలె సూటిగ గైకొనకుండెదానినిన్ 259

ఉ ॥ దిక్కులు తోచకన్ సురులు దీర్ణత ఆయుధపాణులై వెసన్
వెక్కసమందనామహిషి వేగమెవైవగ దానినెంతయున్
రక్కస తొల్మితోదునిమి రంజిల యుద్ధమునందునంతటన్
దిక్కులు వీడిదేవతలు దీనత వెళ్ళిరి వీడి స్వర్గమున్ 260

చ ॥ అడవుల జేరిరాసురులు అంచిత రీతిని వీడి స్వర్గమున్
ఇడుములు మూలమై దనర ఇంద్రుడు దిక్పతులందురున్ వెసన్
బడలుచు ఆకులందినుచు ప్రాపు నొకింతయులేకనచ్చటన్
కడుజడులౌచునుండిరట కాంచగ కర్మమటంచునెంచుచున్ 260



చం ॥ కరుణ వహింపుమో ప్రభువ కారణజన్మడ బ్రోవు వెల్గులన్
మురి పెముతోడజూపివడి మూర్కతబాపి సుధారసంబునన్
బరువడి మోక్షసంపదల భాసురవృత్తినిగల్గజేయుచున్
మరువగ రాక నీమహిమ మంజులతాగరిమంబు పెంపునన్ 262

మ ॥ మురియన్ సాధుజనాళి బ్రోవగను నీ వానందసంధాయివై
సరియౌ రాజకుంబమున్ గదసినీ సామీప్యంబునున్ జూపుచున్
మరియున్ రాజుకు పంబతీరమున నీ మూర్తిన్ బ్రసాదించితే
వరముల్ గుప్పగ భక్తసంతతకి నీ వత్యంతసంరంభతన్ 263

క ॥ కరిగాచిన విష్ణునివలె
బరమన౯ను భక్తజనుల ప్రార్థించంగన్
పరముడవై రక్షింతువు
పరమదయాకరుడవగుచు పార్థివపుత్రా ! 264

వ ॥ అనిప్రార్థించి 265

మాలిన- వినుత జనత కీర్తీ విశ్వరూపాంతవర్తీ
అనుపమశుభమూర్తీ అంచితానందకాంతీ !
ఘనతరగురుమూర్తీ కాంక్షితానందదీప్తీ
అనయమమృత దీప్తానంతజాజ్జ్వల్యమూర్తీ ! 266

ఇది శ్రీ కామాక్షీ చలంబ్రమ నామాఖ్యుల పౌత్రుండును శ్రీ చిన్నయమ్మయన్వేరి నామాంతరముగల శ్రీమునెమ్మమునిత్నమాఖ్యుల ఏకైక పుత్రుండును నన్ను పెంచి విద్యాబుద్ధలను నేర్పించిన శ్రీమంగతాయారమ్మ నారాయణాఖ్యుల దౌహిత్రుండును శకుంతలా సద్ధర్మపత్నీ సమేతుండును శ్రీతిరుత్తని పురసుబ్రహ్మణ్యేశ్వరుల వరప్రసాదలబ్ద శివసుబ్రహ్మణ్య ప్రసాద సుపుత్రసమేతుండును శ్రీహరిహరాత్మజస్వామి శ్రీ చరణ రేణువును ఐన మధురాంతకం దొరస్వామియను నాచే రయించిపబడిన శ్రీమణికంఠేశ్వర చరిత్రమను నామాంతరముగగల శ్రీ అయ్యప్ప మహాభాగవతమునందు ప్రథమోల్లాసము సంపూర్ణము.

### శ్రీ అయ్యప్ప మహాభాగవతము

# ద్వితీయోల్లాసము - చతుర్ధ సోపానము

## ఈ శక్త్యయుతము- మోహరహితము

కం ॥ శ్రీ రాజశేఖరాంచిత
సారామల సుతుడవైతి సదయ హృదయతన్
మారారూప సుధాకర
ఆ రామాఖ్య సముడవగు హరిహరపుత్రా !

వ ॥ ఇట్లు సూతుండు శౌనకాది మహామునులకు అయ్యప్ప మహాద్భుత చరితంబు వినిపింపదొడంగె 2

## పుత్రోదయము రాజువేటకు వెళ్ళుట

వ ॥ ఇట్లడవుల పాలైన ఇంద్రాదులు మరల హరిహర బ్రహ్మల శరణువేడగా వారు మహిషి వరమును తలపోసి హరిహర పుత్రుడ-కాబట్టి పన్నెండేడులు భూలోకమున ఒకరాజు సేవ చేసిన బాలునిచే జచ్చునట్లు వరముండుట దలపోసి వారు ధర్మశాస్త్రను రావించి- శిశువుగా మారి - భూలోకమున పంబప్రాంతమున నుండవలసినదిగా గోరిరి. ధర్మశాస్త్ర ధర్మోద్ధరణకు సమయము వచ్చునపుడు పంబప్రాంతమున పసిబాలుడుగా నుండుటకంగీకరించెను. దేవతలడవులలో అజ్ఞాత వాసములో నుండిరి. అంత

ఉ ॥ బాలకుడై జనించెనట భాసురవృత్తిని భక్తకోటినిన్
ఏలగ జాలుకాంతులను ఏవిధిజూడగ చోద్యమౌనటుల్
బాలకు కంఠసీమ గన భాగ్యముగాగను కంఠహారమున్
జాలవెలింగెనంతటను సాగెను కాంతులును జ్వాలంబులై 4

ఉ ॥ శ్రీమణి కంఠనాముడయి చిత్తమురంజిల భక్తకోటులన్
వేమరు గాచు నీతడని విశృత కీర్తిధరుండు గావునన్
కోమలమైన నీ ప్రకృతి కోమలిపల్కిన పల్కు లోయనన్
నీమము తోడ భక్తులను నీతి మెయింధృతి తోడబ్రోచుతన్ 5

ఉ ॥ పందళ రాజశేఖరుడు ప్రాభవయుక్తిని రాజ్యమేలుచున్
సుందరమూర్తి యాతడటు సూటిగ మేటిగ రాజ్యపాలనన్
కందువ లేని రీతినటు కాంచన గర్భసముండు నేలగా
మందులులేరు నా ప్రజల మంజుల భావములుల్లసిల్లగా 6

ఆ॥ వె॥ కల్పవృక్షమతడు కల జనంబులకును
మహిత భక్తి శివుని మంజులముగ
స్వాంతమందు నిల్పి సాగగడెందంబు
పరమ భక్తితోడ పరవశించు 7

తే॥ గీ॥ అన్నపూర్ణకు నుద్దియౌ అతనిరాణి
అన్నదానంబు నిరతంబు నాచరించు
నాల్గుపాదాల ధర్మంబు నాచరించు
దేవబ్రాహ్మణకార్యముల్ తేజమెసగ ! 8

సీ ॥ గగనాంగ నామణి కంఠ హారంబునా
తూరుపు కొండపై తోచెనినుడు
రాగరంజితమైన రమణీయ కిరణాళి
పర్వత సీమల ప్రభలు నింపె
హరితవర్ణములైన ఆగిరుల్ లతలతో
ఆ వృక్షతతితోడ నలరెనంత
కొండకోనలలోన కోకిలాంగనులును
కేకి యూధమ్ములు కెరలిపల్కె

తే ॥ బాలభానుండు ప్రాగ్దిశన్ ప్రబలు గొల్పె
ఝరులు గిరులును తరులును పరువముగను
స్వర్ణకాంతుల తులతూగి చాలవెలసె
రామణీయకమై యొప్పె రాజగృహము 9

ఉ ॥ ఆలయ మందు గంటలవి యంతట మ్రోగెను సుప్రభాతమున్
మేలుగ గానమాధురులు మేకొన బాడిరి బ్రాహ్మణోత్తముల్

బాలరసాల వల్లరుల చాలపికంబులు పాడినట్లుగన్
నేలను కాంతి పుంజములు నేర్పున బ్రాకగ జేసెభానుడున్ 10

తే॥ గీ॥ పిచ్చుకలు చూరులందున ప్రిదిలియాడె
ధేనుకోటులు తెల్వితో తేజమెసగె
కుక్కుటంబులు కూతలు కొసరి చేసె
ప్రకృతి కాంతా విలాసంబు ప్రభలుహెచ్చె 11

ఉ॥ మంగళ వాద్యముల్ వినుచు మానసమందు ఉమామహేశులన్
పొంగుచు వేడుచున్ నిదురవోవక మేల్కొని కాలకృత్యముల్
చెంగున దీర్చి రాజిపుడు చేరెను కొల్వుకు వేగనంతటన్
రంగుగ రాజవైభవము రమ్యత రాకృతి శోభిలెన్ వెసన్ 12

వ॥ అంత అటవీప్రాంత మందలి కిరాత జాతి వారలును రైతులును రాజునకు సాష్టాంగ నమస్కారములు జేసి స్వామీ ! అడవులలోని మాపంట పొలములందు క్రూరమృగములు పాడిపంటలను పాడు చేయుచున్నవి వేటాడి రక్షింపుడు. 13

తే॥ గీ॥ అడవి పందులు జింకలు అచటి లేళ్ళు
ఏన్గుగుములును దున్నలున్ యేపు మిగిలి
పంటపొలముల బడిమేసె బలు తెరగుల
స్వామి వేటాడి రక్షింపు స్వాంతమలర 14

వ॥ అన్నంతట నా రాజశేఖరుడు 15

తే॥ గీ॥ తనడు ప్రియ జూచి జాయరో తనదుప్రజల
రక్షసేయంగ నేరని రాజసమ్ము
రాణగాంచ డటంచును రయముతోడ
ప్రజల పాటులు జూచి ఆ ప్రభుడు పల్కె 16

తే॥ గీ॥ కన్నబిడ్డల వంటి ఈ కలజనులను
కావ కాంక్షించి బ్రోవుము కలుషహరణ
రయము వేటాడి బ్రోవుము నయము గదుర
రాజ సమ్మదిి యంచు నా రాణి బల్కె 17

శా ॥ అంతన్ రాజటు వేటలాడదలచన్ ఆ సైనికానీకముల్
సంతోషంబున రాజు వెంట బడుచున్ స్వారస్యమేపారగా
పంతంబుల్ సరిజూపుచున్ వెసను నాపంజాలకుద్వేగముల్
వింతం వెంబడి సేవకాళి యచటన్ వెన్వెంట రాగన్ ధృతిన్ 18

ఉ ॥ విల్లును అంబులున్ దనర విశ్రుత లీలను అశ్వరాజముల్
ఉల్లము పల్లవింపగను ఉత్కటమైచననెక్కి వేడుకన్
ఉల్లసమాడుచుం ధృతిని ఊరట లెంతయు లేక వేగమే
సల్లలితాంగులై పడిరి సారెకు క్రూరమృగాళి జంపగన్ 19

వ ॥ ఇట్లు వేటగాండ్రును సైనికులును రాజువెంట అరణ్యమున ప్రవేశించునెడ అటనట ఏపగు నారికేళరసాల సాలతమాల వృక్షతతులును నీటియూటల వెంటనంటి యుండు అడవి అరటి తోటలును మరియు అంబర చుంబ నాసక్తమగు గిరులతో జలజలప్రవహించు జలంబులతో గూడిన ఝరులతో కరులతో పులులతో సివంగులతో ప్లవంగులతో ఏపగు పేటుల, పేటులకు పేటులకు మధ్య లోయలును లోయల వెంట వనాంతర కాసార తీరంబుల మనోహరఫల సంభృత వృక్ష వాటికలును కేకి క్రేంకార జలకుక్కుట చక్రవాక నానావిధ పక్షి సంకుల నినాదములతో చెలువొందు నదీతీరమందలి మనోహరమగు వన సీమలను గమించి పంపానదికి ఐదు క్రోసుల దూరమందు తరులతాగుల్మములతో చెలువొందు వనాంతరంబున రాజు తన పరివారముతో వేటకై వెడలునపుడు. 20

సీ ॥ దంతి యూధమ్ములు తలగుచు పర్విడె
కొండల వలె వేడ్క కొనలు సాగ
పులుల మొత్తంబులు పొదలలో దూరెను
భల్లూకముల్ గుహల్ బరగజేరె
వనమయూరంబలు వాసిగ గనిపించె
గగనాని కెగురుచు గాసి నొందె
కారెను పోతులు కలగి పోవుచు నుండె
పర్వత ప్రాంతాల ప్రాపుగొనుచు

హరణ చయములు దుప్పులు అడవి గల్గు
జంతు జాలంబు కలగుచు జాలవెడలె
రాజు తన కలగుచు జాల వెడలె
ప్రాణములు పోవు నంచని పరుగు లిడియె 21

ఉ ॥ వీర విహారముల్ సలిపి విశ్రుత కీర్తి ధరుండుగావునన్
సారమతిన్ వివేకతను సారెకు పక్షుల జంపకుండగా
వారికి ఆజ్ఞలన్ యిడెన వారిత రీతిని బ్రోవపక్షులన్
సారపు ధర్మమై బరగె స్వాంతమురాజున కంతలోపలన్ 22

తే॥ గీ॥ ఏన్గులన్ పీన్గులన్ జేసి యెల్లపులుల
తరిమి తలలుత్తరించుచు తమకమునను
ఘోర భల్లూక చయముల కొసరి చంపి
అడవి దున్నల బోకార్చి రతిశయమున ! 23

ఉ ॥ పందులు దుప్పులున్ వరుస పారుచునుండగ నేదు బందులున్
కొందరు వానినన్నిటిని కోర్కెమెయిన్ ధృడబాణసంహతిన్
కొందల మంద జేసిరటు కూలగ నేసిర వాని నన్నిటిన్
మందలు గాగ నున్నయవి మ్రగ్గెను మారణహోమమందునన్ 24

చం ॥ అలసిన సేవకాళిగని అంచిత రీతిని రాజు వేగమే
బలములు వేడుకందనర బాగగ పర్ణకుటీరముల్ వెసన్
విలసనమైదలిర్పగను విస్తృత వైఖరితోడగట్టుడీ
అలసట లేక నంచనగ అంతట నిర్మితి జేసిరందురున్ 25

వ ॥ అంత పర్ణకుటీరములలో రాజును పరివారామును విశ్రమింపగా 26

మ ॥ కమనీయంబగు కాంతిపుంజములతో గాంధర్వమేపారగా
సుమనోజ్ఞావహమై దలిర్పగనుసు శ్లోకుల్ తగంబాడగా
విమలామోదములైన వీనుల కటన్ వీరుల్ ప్రశంసింపగా
కమనీయంబుగ రాజుతావినగ నా కాంక్షించుచుండన్ ధృతిన్ 27

శా ॥ అంతన్ చంద్రుడు తూర్పు కొండ పయినన్ ఆనంద మేపారగా
వింతంబుట్టెను శోభనంబు లిడగా వే వేల చందంబులన్
సంతోషాంబుధితేలరాజు భటులన్ సంతోషిత స్వాంతులై
పంతంబుల్ దగనాడు వీరులకు నా ప్రాపున్ దగన్ జూపెదన్ 28

మ ॥ అని చేంద్రుడటు హాస్యమాడినటులన్ ఆనందమేపారగా
వనియెల్లన్ పులకింప చంద్రకళలన్ వ్యాజంపు ప్రేమన్ గనన్
వనియందుం జరియించు వారలకునై వ్యాహ్యాళికిన్ దోడ్పడన్
ననయంబంచితరీతి వెల్గెశశితా నార్ద్రాంతరంగుండునై 29

ఉ ॥ రెండవ కన్నునేననుచు రేలను దన్పెద రాజునేనిటన్
కొండల కోనలందునను కోరిక కాంతులు చిందసూర్యుడున్
మెండుగ నాసదా శివుని మేనునతొల్లిటికన్ను తానైయై
మండన మానుడై ధరణి మంజుల రీతి పగళ్ళ వెల్గుచున్ 30

ఉ ఉండెనటంచు చందురుడు ఊరట లోకములందుజెప్పగా
నుండిన రీతిగానబడి నూర్ధ్వము నుండి ధరిత్రిపైకినిన్
నిండగ చంద్రికారుచుల నేర్పులు కూర్పులుమెండుగావెసన్
పండగశోభసంబులవి ప్రాప్తిని లోకుల దేల్చెడిన్ కనన్ 31

వ ॥ వేడుకలు వినోదములు ముగిసిన తర్వాత రాజును పరివారమును ఇష్ట మృష్టాన్నములు నగరినుండి అశ్వములపై తేబడిన వానిని భుజించిరి. పరివారము భోజనానంతరము పర్ణకుటీరమున శివధ్యానైక పరాయణుడై మహాదేవుని ఆర్యామహాదేవిని మనసారా ధ్యానించి నిదురించెను. అంత వేకువ జామున రాజు స్వప్నమున కాత్యాయనీ నాథుని గూర్చి ధ్యానించుచుండ బాల చంద్రుని శిరోభూషణముగ ధరించినవాడును నాగభూషణుడును నీలగళుడును నిటలాక్షుడైన పరమశివుని దివ్యరూపము సాక్షాత్కరించెను. అంతట నారాజురోమాంచము కల్గగా హర్ష పుల్కలెసగ ససంభ్రమమ్మున

లేచి ఫాలతలఘటిత అంజలిపుట విభ్రాజమానుడై అనేక సాష్టాంగ నమస్కారము లొనర్చి "ఓ భక్తవరద నీదర్శనము వలన నేను ధన్యుడనైతిని అపుత్రస్యగతిర్నాస్తి" అని పెద్దలందురు అపుత్రకుడనైన నాకు పుత్రప్రాప్తి కలిగించుము అని దీనముగా వేడుకొనెను. స్వామి రాజు చేతికి నిమ్మపండునొకదానినిచ్చి "మనోవాంఛాఫలసిద్ధిరస్తు" అని దీవించి అదృశ్యుడయ్యెను. అంత నా రాజుమేలుకాంచి అంతరంగమున భక్తియను అమృత తరంగములు పెల్లుబకగా 32

కం ॥ హర హర పురహర భవహర
హరహర హరిసఖుడవగుదు హరనేనున్ మీ
చరణములను గొలువగలిగె
బరమనకను రక్షసేయ బ్రతికితి మీశా ! 33

కం ॥ నీదయ గలిగిన నెగడును
నీదయలేకున్న నెపుడు నెగడవు జగముల్
నీదయ నీకూరిమియిది
ఔదల కాంక్షింతునయ్య అనవరతంబున్ 34

మ ॥ అని రోమాంచము కల్గగా హృదయమత్యంతంబు గాదేవునిన్
మనమందుందలపోసి వేగమెకడున్ మార్గంబులం బోవుచున్
జనివేటాడుచు జంతుజాలములనో జన్ సైనికానీకముల్
వెనవెంటన్ జనుదేర రాజపుడు వే వేలంధృతిన్ లీలమై 35

చం ॥ పులులను నేన్గుగుంపులును పూనికజంపి జనాళిబ్రోవగన్
పలురకమైన పందులను పల్మరుజింకల దుప్పులన్ వెసన్
నిలువగనీక బాణహతి నీల్గగ జేయుచు సేవకాళితో
సలిపెను వేటనాటగను సారసనేత్రుడు రాజు వేడుకన్ 36

మ ॥ అటులన్యోన్యము రాజువెంట జనుచున్ ఆ సేవకానీకముల్
నటపంబానది తీరప్రాంతమున నా నందంబుగా నచ్చటన్

చటుల స్ఫూర్తిని జంతుజాలముల నే చంగా వనంబందునన్
పటు సంభ్రంభము తోడనేద్వగను పంబాబాలకుండంతటన్ 37

ఉ॥ బాలుని యేడ్పువిన్న యొక భాసురుడౌ భటుడొక్కడంతటన్
నేలిక చెంత కేగియట యేలొకొ ఆర్తరవంబు వీనులన్
చాలవినంబడెన్ ప్రభువ సొగెద మాదెస పంబతీరమౌ
పోలునె చిన్ని కందువటు ప్రోజ్జ్వలవృత్తినినేడ్పు చుండుటల్ 38

మ॥ అన నా రాజు దళంబులంగొనుచు తా నావైపు వేగంజనం
అనిలోద్భూత నితాంతవేగమున నా యశ్వంబులందొలచున్
జని కాంతారపుటెల్లదాగడచి చం "చత్తుంగభంగాంగయౌ"
వనిలో నంబ్రవహించు పంబగని వా రద్దాని తీరంబునన్ 39

ఉ॥ బాలరసాల మూలమున బంగరు బాలుని జూచిరందరున్
చాలవినోదముల్ గదుర స్వాంతమురంజిల రాజుకంతటన్
బాలశశాంతకమౌళియట భాసురవృత్తిని స్వప్నమందునన్
చాలదయార సంబోదువ సంతతిగల్గునటంచుజెప్పడే 40

వ॥ అని రాజు మనంబునం దలపోసి 41

శా॥ ఆ గంగాధరుడంబికా పతియునౌ ఆవిశ్వనాథుండటన్
ఈ గంగానదివంటి పంబదరిలో నీ ఈశ్వరాంశంబుగా
వేగం బాలుని కాంతిపుంజములతో వెల్గొందు బాలార్కునిన్
నేగాంచంగను జాలునట్లుగ దయన్ నేలేన్ ననున్ బ్రీతితో 42

తే॥ గీ॥ అనుచు దలపోసి మనమున ఆదరమున
సైనికావళి విడియించి సాదరమున
స్నాన పానాదివిధులను జక్కజేయ
నాజ్ఞనిడి రాజు శుచియయి నాదరమున 43

వ॥ బాలుని సమీపించెను 44

శా ॥ పంబాప్రాంతపు సుందరోల్లసితమౌ పార్శ్వానుదేశంబునన్
నింపారంగను చిన్నిపాపడయి నింపాది శైవాంశమై
సొంపుల్ మీరగ చోద్యమౌనటు వెసన్ చొక్కంపుదైవంబుగా
సంపూర్ణంబగు భక్తసంతతికి తా సంభావ్యుడై పుట్టగన్ 45

ఆ॥ వె॥ హరిహరాత్మజుండు అచట నుద్భవమంద
మందపవనుడంత మందగతిని
వీచె దిక్కులంత వెల్గెను ధృతితోడ
అమృతవర్షమంత అచట గురిసె ! 46

మ ॥ కమనీయంబగు కాంతి పుంజములతో కంజాక్షుపాలాక్షులన్
సుమనోరూపుల గాంచితావెసనునా సొంపారురూపంబునన్
కమనీయంబుగ దాల్చి నాడుగద తా కంజాక్షుడైవైళమే
విమతుల్ నీల్గగ భక్తులందరునుతన్ విశ్వేశుపూజింపగన్ 47

వ ॥ అనుచు నా రాజు . . . 48

ఉ ॥ కొందరు సేకావళులు కోరి భజింపగ రాజువెంబడిన్
చందురు బోలు పట్టిగని సంతసమింపెసలార వెళ్ళియా
సుందర వృక్షమూలమున సూటిగనేడ్చెడి బాలునిన్ వెసన్
మంద సమీరణంబుగతి మానసమింపెసలార రాజటన్ 49

ఉ ॥ ముందుగ తాను గైకొనుచు ముద్దుల పట్టిని చేతులన్ వెసన్
అందము చిల్కు మోము గని హారము నందలి మేటి రత్నమున్
పొందుగ దాల్చి యుండుటను పొడిగ జూచుచు నుండెరాజటన్
డెందము పండెనంచు మది డాగిన దుఃఖము వేతొలంగగన్ ! 50

తే॥ గీ॥ లాలి లాలంచు లాలంచు లలిత వృత్తి
జోలగాగట్టి వృక్షాన జోయటంచు
బాలునూపుచునుండ నా ప్రాంతమందు
తపసి యొక్కండు తేజాన తరలివచ్చి 51

వ ॥ కాషాయాంబర ధారియు పాలతలమున విబూది రేఖలు గంధపు బొట్టును చేతదండకమండలములును ధరించి కంఠసీమరుద్రాక్ష మాలికలతో తన తపఃప్రభావంబువలన ముఖమండలము నుండి కాంతులు చిందగా రూపుగొన్న పరమశివుడోయన్నట్లు ప్రకాశించునొక్క తపోధనుండట్లు అక్కడికిరాగా రాజు ఆఋషి పుంగవునికి నమస్కరించి అర్ఘ్యపాద్యాది విధులపూజించి ఓతపోధనా ! పరమపావనా ! ఈ చిన్ని కందు నీవనంబున విడిచివెళ్ళిన తల్లిదండ్రులెవరు ? ఇందులకు కారణంబెయ్యది యో మీ దివ్య చిత్తంబునం బరికించి చెప్పంగదవేయని ప్రార్థించిన 52

మ ॥ మణికంఠంబున నుండుటల్ యితనికిన్ మాధుర్యధుర్యంబు గా
మణి కంఠాఖ్యుడటంచు బిల్వగవడిన్ మార్గంబుగానుండెడిన్
మణి కంఠుండను పేరనుంబరగితా మాయా కృతుల్ ద్రోయుచున్
గుణి యా మోక్షపథంబు జూరగొనుచున్ గూర్చున్ జనామోదమున్ 53

ఉ ॥ ఈశ్వర పుత్రుడీతడగు యింపేసలారగ బ్రోవుమోవెసన్
నాశ్వరమైన దేహులకు నాదటముక్తి పథంబునీయగా
నీశ్వరుజేర్చు నీతడును ఇమ్మైయినీవు నపుత్రకుండుగా
నీశ్వరువేడగానిపుడు నేర్పున నీకిటనిచ్చె పుత్రుగా 54

ఉ ॥ ఈతడు చక్రవర్తియగు ఇంపుగ నాదట గాక యుండినన్
గాతర నేత్రులన్ దలప కంజదళాక్షుని డెందమందునన్
నీతి మెయిందలంచుచును నిక్కము యోగిగనుండి యీతడున్
పాతక జాతముల్ దునిమి ప్రాంజలులొ ప్రజబ్రోచు నెంతయున్ 55

మ ॥ అని యా స్వామియు జెప్పగా నపుడు తా నారాజరాజేంద్రుడున్
మనమందుందగ చక్రవర్తియగు నీ మాన్యుండు యీకుఱ్ఱడున్
అనిమోదించుచు గోరికొంచొగిని తా నానందమేపారగా
వినయంబందగ నాతపోధనుని తా వీడ్కొంచు నంతన్ వెసన్ 56

ఉ ॥ బాలుని గొంచురమ్మనుచు భాసురవృత్తిని సేవకాళికిన్
జాలగ నొప్పజెప్పియటు జాగునొకింతయులేక వైళమే
మేలగు యానసంపదల మేకొనసైన్యము తోడనేగుచున్
జాలముదంబునన్ నగరి చాయలకున్ జనుదేరనంతలో 57

చ ॥ పురమున మేళతాళములు ముఖ్యముగా వినింపించెనంతటన్
సరగున రాజురాకవిని సారెకు రాణియువచ్చెనంతటన్
అరిమురి తోడ రాజపుడు ఆదట బాలుని చేతికిచ్చినన్
బరుపడి బాలుగైకొనియె పద్మదళాక్షియు ప్రాభవమ్మునన్ 58

ఉ ॥ ప్రాప్తుడు వీడు శంకరుని ప్రార్థనలన్నియువమ్ముగావు నీ
ప్రాప్తుడు పుత్రుడయ్యె మన ప్రాప్తము తేజములుల్లసిల్లగా !
సుప్తములయ్యె పాపములు సూటిగశంభుని లీలగావునన్
నాప్తుని వీనియారసుని యట్లుగ గావుము సుందరీయనన్ 59

ఉ ॥ భాగ్యముగాదె యీ శిశువు భానుసమాననిభుండు గావునన్
యోగ్యత నీశ్వరాంచితము ఈ విధిచంద్రకళాధరుండుతా
భాగ్యము భాగ్యమట్టులుగ భాసురవృత్తిని నిచ్చె గావునన్
యోగ్యము గాగ జెంచెదను యూరటజెందగడెందమెంతయున్ 60

తే॥ గీ॥ చిన్ని నాన్నరార చరికాలమునమండి
సంతులేనిదాన సాధ్వసమున
కన్నతండ్రిరార ! కరుణించి బ్రోవరా !
కన్న సుతుడవీవె కలుషహరణ ! 61

చ ॥ అని మన మందు నెంచగను నప్పుడెరాణికి పల్లవింపగా
సునయరీతులందనరి సూటిగపాలవి చూచుకంబులన్
అనయముచిందెనంతటను అక్కునజేర్చెను బీలునంతలో
వినయముతోడ రాణియును విస్మృతకీర్తులు పొందగా వడిన్ 62

తే॥ గీ॥ అంతిపురిలోన సందడి అతిశయించె
పూలహారాల ఉయ్యలల్ పొల్పుగాంచె

చిఱుత బన్నుండ చెట్టిరి చెల్మిగుల్క
రాజు రాణియు మోదంబు రహివహింప ! 63

తే॥ గీ॥ నిండు జాబిల్లి వెల్గెలోనుండినట్లు
నుండె పరివారమంతట నుదయమంద
రండు రండని రమణులు రాజసమున
బిల్చుకొనుచును వచ్చిరి బ్రియముతోడ 64

శా ॥ నీరాడించిరి ధూపదీపములతో నిక్కంబు నీ పట్టియున్
వీరాగ్రేసరుడౌనటంచు ధృతితో విఖ్యాతుడౌ నంచొగిన్
కారాముల్ వెసబోవునంచు మదిలో కాత్యాయనీ దేవినిన్
ఆరామల్ వెసగొల్చిరందరును నా రామాభిరామంబుగన్ 65

ఉ ॥ పున్నమ చంద్రుబోలు ముఖ మ్ముంగన కాంతు బర్వురీతులున్
కన్నులు కల్వలై బరగ కాంతులు నాకరయుగ్మముల్ కడున్
అన్నువలైన కాళ్ళు మరి అంగజు తమ్ముడు గాదె జూచినన్
మన్నన సుందరాకృతుల మాన్యత కందుడు వోలె నొప్పగన్ 66

కం ॥ జో జో కలువ దళేక్షణ
జో జో శివతేజ మూర్తి జో జో యనుచున్ !
జో జో అచ్యుత రూపా
జోజో యని పాడిరపుడు సూటిగ సుదతుల్ 67

ఆ॥ వె॥ నాదు చిన్నియన్న నా యన్న యనుచును
రాణి బాలునెత్తి రంజిలంగ
ముద్దులుంచెనతని మోముననప్పుడు
తనువు పులకరింప తన్వికంత ! 68

తే॥ గీ॥ తనువు పులకాంకు రావళుల్ దాల్చుచుండ
ప్రేమ వీచుల పాలిండ్లు పొంగుచుండ
చూచు కంబుల పాల్గార సుదతి వేడ్క
పాలు త్రాపెను సుతునకు ప్రాభవమున ! 69

తే॥ గీ॥ మేను పొంగ శిశుస్పర్శ మిగుల ప్రీతి
ఆయుమేశుని కరుణతో నంచితముగ
గల్గె నీబిడ్డనా బిడ్డ గాడెయనుచు
రాణితాపొంగె మనమది రంజిలంగ 70

ఉ ॥ రాజును రాణియున్ మిగుల రాజ సవృత్తిని వేడుకన్ వెసన్
మోజున కన్న బిడ్డవలె మోహనరూపుని బెంచిరంతటన్
నీ జగమందు నీశ్వరుడు నిర్మలరూపుని నిట్టిబాలునిన్
యోజను రాజ్యమేలగను యోగ్యుడు గాగను నిచ్చెనంచొగిన్ ! 71

ఉ ॥ పండె తపః ఫలంబనుచు పావనతన్ ధృతితోడ నీశ్వరున్
నిండుగ డెందముంగదుర నెక్కొన భక్తియు జాలువారగన్
మెండుగ నాలయంబులను మేకొన పూజలు నిర్వహింపగా !
పొండని సేవకావళుల పొందుగ బంపెను రాజు అంతటన్ 72

ఆ॥ వె॥ ఏమి నోము నోచె నీ దేశమునరాణి
వింటిమ బలలార వింతవార్త
శివుని తేజమెసగ చిద్విలాసముగాగ
పంబ శిశువు రాణి పంచజేరె ! 73

కం ॥ గజగమనలు కలువలవలె
నిజ నయనములలర భువిని నీరజ పాణుల్
గుజ గుజల జనుచు గుములుగ
నిజమగు సంబరపు వేడ్క నెక్కొనుచుండున్ 74

ఉ ॥ చందురుబోలు మోములును చక్కని చిక్కని దేహకాంతులన్
సుందరులందరున్ గడిగి చోద్యముగాగను పట్టి జూడగా
మంద మరాళ యానలుగ మంజుల వేషములుల్ల సిల్లగా
పందళ రాజు నందనుని ప్రాభవయుక్తిని చూడగోరుచున్ 75

తే॥ గీ॥ ఉల్లములు పల్లవింపంగ చల్లగాను
సల్లలిత యుక్తి తోడుత సాగివచ్చి
వినుత పల్లవ పాణులన్ వేడ్క నెత్తి
హరిహరాత్మజు గాంచిరి అతివలంత ! 76

ఆ॥ వె॥ పనులు చేయునపుడు బ్రహ్మదేవుని బోలు
నవ్వినంత తాను నరహరియగు
శివుడె కోపగింప చిత్రంపు శిశువగు
ముగురు మూర్తులట్లు మడితుడగుచు 77

కం ॥ దుందుభులు మ్రోగెనంతట
కందువయై భూసురుండు కడు మోదముతో
పొందుగ దీవెన లన్నిట
చందరువలె నుండుమనుచు సారెకు బలికెన్ 78

సీ ॥ నామ రూపంబుల నటియింప నేరని
శుద్ధ బ్రహ్మంబుగా సూటిగనక
నా సదాశివు పట్టి నాధ్యత హరి పట్టి
యగుచుండె మనుజుడై అవనిబుట్టి
భక్తసంతతులను ప్రాభవ యుక్తితో
పాపముల్ శమియింప ప్రభలు కొల్పి
ఇహలోక మందున నహము వీడుటకునై
శరణఘోషలతోడు జనుల దన్పి

తే ॥ ధర్మశాస్త్రగ ధరబుట్టి ధర్మములను
తాను శాసించి భక్తుల ధరను బ్రోవ
జగతి కైలాసమైయుండ జనులు మెచ్చ
పంబ ప్రాంతపు శిశువుగ పరగ బుట్టె 79

ఆ॥ వె॥ దైవ దత్తమైన తమపుత్రునిన్ గంట
జూచి రాజురాణి చోద్యమంద

ప్రేమ ఎదల నుండ పేర్మితో తగురీతి
సాదరమున పెంచ సాగిరపుడు ! 80

ఆ॥ వె॥ పసిడి కాంతులీను పసిబాలుదేహంబు
మోము చందమేమె మోహనంబు
దివ్యవదన కాంతి దేదీప్యమానంబు
కలువ కన్నులందు కాంతి దనర 81

ఉ ॥ పుణ్యపు రాశి భూమి పయి పూర్ణముగా విలసిల్లి నట్లుగా
గణ్యత తోడ తానడువ గల్లురమంచన గజ్జెలందియల్
పుణ్యమె లోక పాలనకు పూర్తిగ కావలెనంచు భక్తులన్
గణ్యమెరింగి బ్రోచుటకు కంజదళాక్షుడు వృద్ధినొందగన్ 82

కం ॥ బుడి బుడి నడకలు నడువగ
సిడి ముడి తడబడగ శిశువు చిందులు ద్రొక్కన్
కడు మెరయగ మణిహారము
పడయంగను మోదమపుడు ప్రాభవయుక్తిన్ 83

ఆ॥ వె॥ గృహము స్వర్గసీమ గృహమె పావనమైన
పాల సంద్రమందు పవ్వళించు
విష్ణుదేవునంత విమల తరాధ్యుండు
విభుదుడగుచు శిశువు వెలసెనంత 84

తే॥ గీ॥ ధేనువులు పాల నొసగెను ధృతిని నెలకు
మూడు వానలు గురిసెను ముచ్చటగను
దిక్కులన్నియు కావిరుల్ దేలిపోవ
తేజమున నొప్పె దీదితుల్ దిశలునిండ ! 85

తే॥ గీ॥ ఈతి బాధలు తొలగెను ఇలను ప్రజకు
శుక పికంబుల రవళులు శోభిలంగ
మందమలయాని లంబులు మంజులముగ
వీచె కొలకుల తామరల్ వెలసెభువిని ! 86

ఆ॥ వె॥ రాజ నాలు బండె రమణీయముగ నాడు
రాజ్యమెల్ల గతుల రాణగాంచె
ప్రభుని యెడల మరియు పరమేశ్వరునిపైన
వెలసె భక్తి ప్రజల విస్తృతముగ 87

ఉ ॥ క్షామము లేమిలేవు ధృతి క్షాంతియు దాంతియు శాంతితోడుతన్
నీమముతోడ సర్వులును నిక్కము శ్రేయము లొందుచుండగా
కామిత వృత్తముల్ గనుచు కాంక్షలు దీరగ సంబరంబునన్
ఏమరుపాటులేనియుట ఏర్పడనుండిరి పాలకుల్ ప్రజల్ 88

తే॥ గీ॥ సర్వశుభములు దాత్రిపై సాగుచుండ
హరి హరాత్మజు నామంబు అమలముగను
భక్తతతి జిహ్వలందున బల్కుచుండ
శాంతి సౌభాగ్య గరిమంబు చాలగల్గె ! 89

మ ॥ ఘనక్రేంకారరవంబు తోడుతవెసన్ గానంబులన్ జేయుచున్
కనిపించెంధృతి నాట్యసంపదలతో కారాములన్ బాపుచున్
జనులున్ మెచ్చగ కేకియూధముల నోజం సల్ప నాట్యంబులన్
గనియానంద పదంబులన్ ప్రజలు వే గాంక్షించి చూడన్ ధరన్ 90

మ ॥ మణి కంఠుండని కేకి యూధములు వే మారుంబ్రశం సింపుచున్
అణి మాద్యష్టములైన నీ మహిమతో నానందమింపారగన్
మణి యాడంగను మేము యాడెదము నీ మాధుర్యతన్ దుర్యతన్
గుణియౌ స్వామిని జూడుమంచు శిఖులున్ గూసెన్ ధృతిన్ నవ్యతన్ 91

శా ॥ నానా మోదము గుల్క పాలితులు తా మానంద సంభ్రమ్ముననన్
నానా సూన వితానముల్ గొనునెడన్ నానాట్యముల్ సేయుచున్
నానా రీతుల కాన్కలంగొనుచు నానా గాన సంశోభలన్
నానా రీతుల గొల్వవచ్చిరట నా నందున్ తగన్ రేనినిన్ 92

వ ॥ శ్రీ రాజశేఖరుల పూజామందిరమున రమణీయ ఘంటికా నాదములు మ్రోగినవి. పంచాక్షరీమంత్రములు లింగాష్టకములు మంగళాష్టకములు పఠియింపబడినవి. హరి హరులొకరేయనునట్లు నడుమ ఓంకార రూపమైన హరి ఓంహర అను ధ్వానములు భక్తజనుల నాల్కలపై పఠియింపబడినవి. సర్వజనామోదమై ధర్మము నాల్గు పాదముల విలసిల్లగా పందళ రాజ్యము భోగభాగ్యములతో శాంతి సౌభాగ్యములతో అక్షయమైన సిరిసంపదలతో విలసిల్లినది. 93

చతుర్థసోపానము సంపూర్ణము

### శ్రీ అయ్యప్ప మహాభాగవతము

# ద్వితీయోల్లాసము - పంచమ సోపానము

## వశిత్వయుతము - మదరహితము

సీ ॥ మణికంఠుడీయింట మంజుల స్వాంతత
కాలు మోపినయంత కలిగె సుతుడు
రాణికి మరియొక రమణీయ మూరితి
రాజ బింబంబునా రాణగాంచ
రాజ రాజనునామ మోజనుదనరంగ
అనుజన్ముడుగ స్వామి కతడు బెరుగ
జన పథంబులలోన జనులు వేడుకతోడ
నాటపాటల తోడనధివసింప !

తే ॥ రాజు రాణియు మోదంబు రహివహింప !
అన్నదమ్ముల బెంచిరి ఆదరమున
అక్షయానంద సామ్రాజ్య మపుడు పొంది
డెందములు పొంగ మోదించు చందమెసగ ! 94

తే॥ గీ॥ ఈశ్వర జ్ఞాన సుతుడును రయము గల్గె
రాజ రాజను సుతుడును రయముగల్గె
ఐన మణికంఠుడే జ్యేష్టుడయ్యెగాన
రాజ్యమాతని కివ్వంగ రాజు దలచె 95

తే॥ గీ॥ సద్గుణంబుల రాశియై సదయవృత్తి
జనుల గాంచుట చేతను జనకుడంత
ఈశ్వరాంచిత భక్తిచే నితడు నాకు
వారసుండని రాజును గారవించె 96

తే॥ గీ॥ నేను రాముడ నీవిట నేర్పుమీర
లక్ష్మణుండవు అనుచును లాలసగతి

అంచితానంద సామ్రాజ్య మధిగమించి
ఆటలాడగ బాలురు అపుడు రాజు 97

ఉ ॥ వీరలు రామలక్ష్మణులె విస్తృత కీర్తుల నింపబోదురీ
వీరులు వైరియూధముల విశ్రుత లీలవధించి పౌరులన్
గారము మీర బ్రోచెదరు కంజదళాక్షిరొచూడుమంచు నా
సారమతిన్ ఇలా పతియు సారెకు రాణికి జెప్పవేడుకన్ 98

ఉ ॥ బాలురె వీరి జూడ ధృతి భండన భీములు భావి భారతిన్
చాలముదంబుతో బెనుప చాలుదురెంతయు భావిలోపలన్
కాలును కేలుగూడుకొన కాంచగ పేర్మిని పెద్దవారలై
ఏలుదు రెల్లలోకముల ఏర్పడ పుణ్యము ఉల్లసిల్లగా 99

## గురుకులవాసము

ఉ ॥ నాటల పాటలన్ మిగుల నాఢ్యత తోడుత నున్న బాలురన్
ఘాటపు ప్రేమతో బెనిచి కార్ముక విద్దెల నందజేయగా
సాటియొకండులేనటుల సాగగ విద్దెల నేర్పనెంచితా
వాటము గాగ సద్గురుని వద్దకు చేరగబిల్చి వారలన్ 100

సీ ॥ స్వాధ్యాయ నిరతుండు సారస్వతాంబుధి
పరమతపోధన పావనుండు
కరుణార్ధచిత్తుండు కలవిద్యలెరిగెడి
బ్రహ్మదేవుని వంటి ప్రాజ్ఞుడితడు
నిఖిల పౌరాణిక నిగమార్థవిదుడగు
అస్త్రవిద్యలలోన నధికుడితడు
గణితశాస్త్రాదుల ఘనమగు విద్యల
గణుతిగాంచిన యట్టిఘనుడితండు

తే॥ గీ॥ బుద్ధియందు బృహస్పతి బోలునితడు
విద్దెలందున భారతి యుద్దియితడు

రాజగురువుకు సాటియే రమ్యఫణితి
అనుచు గురువుల నెన్నుచు అపుడురాజు 101

వ ॥ తన కుల గురువును జూచి 102

ఉ ॥ మాన్యులు మాకు పెద్దలు సమాదరణంబున జూచి బాలురన్
అన్యులు గారు రాజ సుతులంచును గారవమొప్పుచుండగా
అన్యపుమార్గముల్ వదలి అర్భకులీ బటువిద్యలాయన్
మాన్యత నేర్పి గణ్యతను మాకుముదంబును గూర్పరేవెసన్ 103

మ ॥ అనుచున్ చేతులనెత్తి రాజపుడు నా నందసంధాయియై
మునుమున్ మ్రొక్కుచు వేడెతాగురు నియా పుణ్యంబగణ్యంబుగన్
గనగా బాలుర యుద్ధవిద్యలను నే కాంక్షించినట్లుండగా
మనుపంబాడిగ సర్వవిద్యలను నీ మాధుర్యతన్ నేర్పవే 104

వ ॥ అనగా . . . . 105

ఉ ॥ రాజులు మాకు మీరు గద రాజగురుండను నాదుధర్మమున్
ఏజనులైన మెచ్చునటు లేర్పడవిద్దెల సద్దులందునన్
నోజనువిద్యనేర్పెదను ఓ యని మెచ్చగ సర్వభూపతుల్
యోజన సేయగా వలదు యోరిమి కూరిమి జూపుమాయెడన్ 106

మ గురువే బ్రహ్మము సత్యమై బరగు తా గూర్చున్ జనామోదమున్
గురువే విష్ణువు నా సదాశివుడుగా గూర్చున్ శుభం బెప్పుడున్
అరుదౌ విద్దెల నేర్పి బాలకులకున్ నా నందమే పారగన్
వరమున్ నిచ్చిన యట్లునే దలచెదన్ వారింపరక్షింపవే 107

ఆ॥ వె॥ అనుచు రాజు బొగడ అంచిత రీతిని
గురుడు వేడ్కతోడ గురుడెవండు ?
పరమశివుడు గాక పరమ ధార్మికతను
మనకు గురువు మనల మనుచునతడు 108

ఆ॥ వె॥ అనుచు గురుడు బల్కె నానందవార్థిని
దేలరాజు, అపుడు దేజమెసగ

బాలలందు నిలిపె భాసురవృత్తిని
గురుకులంబునందు గోము మీర 109

మ ॥ పరిచర్యల్ దగురీతి జేసి గురునిన్ పల్మారు సేవించుచున్
సరిగా విద్దెలు నేర్వగా దొడగిరే శాస్త్రంబులం జెప్పినన్
వరుసన్ నాలుగు వేదముల్ జదవుచున్ వాంఛించి విద్యారతిన్
బరమౌ శాస్త్రపురాణముల్ దడవుచున్ భాగ్యంబరణ్యంబుగన్ 110

ఉ ॥ విద్దెలు నేర్వగా నపుడు వేద్యత నామణికంఠుడెంతయున్
సుద్దులు మీర నేర్వగను సూటిగ నధ్యయనంబుతో ధృతిన్
బుద్ధులు పెద్దవై జనగ పూర్ణుడు ఈతడటంచు నెంచుచున్
ఇద్దర ఈశ్వరాంచితుడు ఈతడటంచు దలంచె యొజ్జయున్ 111

ఉ ॥ శాస్త్రములారు వేదములుచక్కగ నాల్గును నేర్చియంతటన్
అస్త్రచయంబు గూర్చువిధ మంచితరీతినెఱింగి యంతటన్
శస్త్రములన్ ప్రయోగవిధి చాలజలంగుచు నేర్పుమీరగన్ (నే)
అస్త్రపు మంత్రజాలముల ఆఢ్యత నేర్చిరి రాజనందనుల్ 112

తే॥ గీ॥ మోము చందురు బోలెడి మోహనంబు
కన్నులందున కాంతులు కళలుదేరు
పూర్ణపురుషుండు గాగను పూజ్యుడగుచు
పరగ మణికంఠు డీతండు భవుని సుతుడు ! 113

మ ॥ అనుచున్ నా గురుదేవుడున్ మదిని దా నంతర్గత స్వాంతతన్
గనుచున్ తత్త్వవిధుండు గావున వడిన్ గాంచెన్ మనంబందునన్
తనదౌ తాపసవృత్తితో గనెను వే దాత్పర్య మే పారగన్
వినయంబందగ విష్ణురూపుడగుచున్ విశ్వేశురూపుండుగా 114

ఉ ॥ కారణ జన్ముడీవనుచు కాంచితి నాదగులోని చూపునన్
సైరణ సేయుమయ్య నను స్వాంతము రంజిల శిష్యుగాగనే

పారగ నుంటి భాగ్యమిట పావన రూపుడ భాగ్యరాసిగా
సారెకు నిన్ను నేదలతు స్వాంతము రంజిలె బ్రోవవే వెసన్ 115

మ ॥ అనగన్ నా మణి కంఠుడున్ పరగ తా నానందముంజెందుచున్
వినయం బొప్పగ వందనంబు లిడుచున్ విఖ్యాత చారిత్రతన్
ఘనమౌయోగి వరేణ్య మద్గురు వరా గాంచంగ మార్గంబిటన్
అనయంబున్ ప్రకటింప బోకుమిట నా నాంతర్యమున్ స్వాంతమున్ 116

తే॥ గీ॥ మర్మ మెడలింప బోకుము మనసులోన
నింపు భావన ప్రకటింప నిపుడు జనదు
కాంతు నీ శిష్యుడై నేను కల జగతిని
దేవ కార్యంబు దీరిచి తేజమునను 117

ఉ ॥ బ్రహ్మసృజింపగా హరియు బాగుగ బ్రోవచరాచరంబులన్
బ్రహ్మ మయంబె యౌ జగతి భాసిలద్భంపమమేశుడుండగన్
బ్రహ్మమెరూపుదాల్చినటు భాసుర వృత్తిని దేవతాళినిన్
బ్రహ్మమయుండ బ్రోవగను భాగ్యముగా జనియించినాడవో 118

తే॥ గీ॥ హరిహరాఖ్యుల సుతుడయి అదయవృత్తి
మహిషిమర్ధన సేయంగ మహితుడగుచు
పుట్టినాడవు నీవయ్య పూర్వపుణ్య
ఫణితి తపమున గనుగొంటి ప్రాజ్ఞడీవె ! 119

మ ॥ ననునోమంగను శిష్యుడైతివిగదే నాపాలిభాగ్యంబుగా
నినునే వేడెద నాదుపుత్రకుడిటన్ నిక్కంబుగా చీకునున్
గనగా మూగయు రెండు మార్గములతో గాసించెరక్షింపవే
మనమందున్ దలపోతు నీశునిగనిన్ మాన్యుండరక్షింపవే 120

సీ ॥ అలనాడు కృష్ణుడై అవతరించిననాడు
గురుపుత్రుబ్రతికించి కూర్మిగంటి

అలనాడు రాముడై ఆయహల్యాశాప
మడగింప వేమున్న మంజలముగ
బలిని మూడడుగుల బలువుగయాచించి
దేవేంద్రుబోవవే తేజమెసగ
దూర్వాసనస్త్రంబు ద్రుంపవే చక్రాన
అంబరీషుని ఆర్తి అపుడు తొలగ

తే॥ గీ॥ ఇపుడు చీకును మూగయు నేర్పడంగ
నున్న నాపుత్రునోముము కన్నతండ్రి
హరిహరాత్మజనాస్వామి ఆర్తిబాపు
మనుచుగురుడంత వేడంగ మనసువిప్పి 121

తే॥ గీ॥ మీదు శిష్యుండ నన్నిట్లు మిగుల బొగడ
వలదు పలదయ్య అయ్యవు దలచిచూడ
గురుని మించిన దైవంబు కువలయమున
లేదు లేదెందు నీపంపు లేను జేతు ! 122

మ ॥ అనుచున్ నా గురుతోడ యింటికినిదా నత్యంతసంతోషియై
జనియెన్ పుత్రునిజూడ నంచి తముగాజాగింతయున్ లేకదా
గనియా బాలుని కన్నులన్ నిమురగా కాంక్షన్ స్వహస్తంబులన్
కనియెన్ బాలుడు సర్వవస్తువుల నా కంజాక్షుడంతనన్ వేసన్ 123

ఉ ॥ నాలుకపైన నక్షరము నాదట వ్రాసెను యంతలోపలన్
మేలుగ మాటలాడగను మిక్కిలి మోహనమైదలిర్పగా
వేలనమస్కృతుల్ సలిపి విస్తృత కీర్తులు కల్గునట్లుగా
మేలుగ బ్రోచితే యనుచు మిక్కిలి వేడెను పుత్రుడంతటన్ 124

ఉ ॥ చేతులనెత్తి మ్రొక్కుచును చేరి ప్రదక్షణలంత జేయుచున్
భీతిని మాని పాడుచును పేర్మిని గానము నింపుగొల్పగా

మాతరమా మహేశుడవె మంజుల రూపుడ నిన్ను గొల్వగా
కాతర నేత్రు నన్ను దయ గాచితి ఈశ్వర బ్రోచితే వెసన్ 125

చం అనిగురు పుత్రుడుం బలుక నాదట నాగురు వర్యుడంతటన్
వినయము మీరగానపుడు విస్తృత కీర్తిని వేడనాతడున్
వినుమిట నాదుపుట్టుకను వేద్యుడ తెల్పక యుండుమీగతిన్
కనగను నాదు రూపమును కానగ జేతు సకాలమందునన్ 126

చం ॥ అనఘుడు అట్టులేయనుచు అంతట నాగురుసత్తముండొగిన్
అనయమునేర్పగా దగిన అంచిత విద్దెలు లేవు నా దెసన్
వినయము తోడ నేర్పితిని విస్తృత కీర్తుల పొందునీవికన్
అనుచును దీవెనల్ యిడియె అంచితరీతిని నాగురుండటన్ 127

ఆ॥ వె॥ విద్యలన్ని నేర్చి విమలులుగా నుండి
రనుచు తెలిపెగురుడు రాజునకును
రాజువేగవచ్చె రమణ తాసుతులను
గురు కులంబు నందు కూర్మి జూడ ! 128

ఉ ॥ భాను సమాన దీప్తులగు బంగరు బిడ్డల జూచి వైళమే
గానము నందు బాణమున గాంచగ విద్యల సుద్దులందునన్
మానితమైన రూపులను మాటికి వారిని జూచి ప్రశ్నలన్
దానొక యింత్మవెచినను దాలిమి చెప్పిరి నుత్తరంబులన్ 129

సీ ॥ బాణ ప్రయోగోప బహువిధ విద్యలన్
గణియించి చూచియు ఘనత తోడ
గదయును శూలంబు కార్ముకంబు నువేగ
గదియించు వేడుకల్ గాంచి యటుల
కావ్యనాటకముల కలతెరంగెరిగెడి
విజ్ఞాన మంతయు వేడ్క తెలిసి
సంగీత సాహిత్య సముదయంబుల యందు
స్వారస్య మెంతయు సరసతగని

తే ॥ అవుర అద్దిర భళి భళి అవునటుంచు
విద్దెలందున తనయుల విభవమెంచి
గురునికిని కాన్కలన్నియు గూర్చియిచ్చి
సుతుల తోడ్కొని పోవంగ సుముఖుడగుచు 130

ఉ ॥ నేర్పితివన్ని విద్దెలును నీరజనాభుని సత్కృపాంబుధిన్
వేర్పడకుండ శాత్రవుల విశ్రుతలీల జయించు నట్లుగా
గూర్పగ ధర్మశాస్త్రములు కూరిమి, నేరిమి మీరు నట్లుగా
మార్పడ కుండ జ్ఞానముల మంజులతా గరిమంబు పెంపునన్ 131

ఉ ॥ సద్గురుమూర్తి నీవిటుల సంస్తవనీయము గాగ విద్దెలన్
మద్గురు వర్యనేర్పితివి మాటికి నాసుతులంత నేర్వగన్
సద్గురు దైతివీశ్వరుని సారెకు బోలిన లింగమూర్తిగా
మద్గురుదేవ ! వందనము మాటికి జేకొను మంచుతేడనన్ 132

తే॥ గీ॥ ధర్మ పథమున నేనిట్లు ధరను మీదు
సుతులకును విద్యనేర్పుట సూటిగాను
నాదు భాగ్యంబుగాగను ననవరతము
దలతు చేకొను పుత్రుల ధరణి నాథ 133

మ ॥ అని సంతోష భరంబునన్ గురుడు తా నారాజుతో నిట్లనెన్
చను నీ బిడ్డల తోడ నీ పురికి నీ స్వాంతంబు రంజిల్లగా
కను మీ విద్దెల పెల్లు వీరలకు నే కాంతంబుగా చక్కగా
మనుమీ రాజ్యపదంబునన్ ధృతిగనన్ మాధుర్యతన్ ధీరతన్ 134

మ ॥ అని ఆశీస్సులు బల్కగా నపుడు తా నానందమున్ బొందుచున్
వినయంబున్ గదురంగ వీడ్కొనియె నా విఖ్యాత చారిత్రుడౌ
ఘనుడౌ రాజును వేడ్క బాలకులతో కార్యంబు సిద్ధింపగన్
మన మందున్ తగురీతి తృప్తిగని తా మంతఃపురిన్ చేరగన్ 135

ఉ ॥ వచ్చిరి రా కుమారులని వాంచిత రీతిని రాజ బంధువుల్
వచ్చిరి నా ప్రజావళియు వచ్చిరి వారల జూడ వేగమే
వచ్చిరి రాచ కాంతలును వారిజ నేత్రియు రాణి వెంబడిన్
వచ్చిరి స్వాగతంబులిడ వారిజలోచనులన్ గనన్ ధృతిన్ 136

ఉ ॥ మెచ్చిరి వారి విద్యలకు మేదిని పొంగినయట్లు దోచెనా
మచ్చిక నాసదాశివుని మంజుల రూపులటంచు వేగమే
నిచ్చయముల్ గనంగ నటు నీరజ నేత్రలు హారతుల్ యిడన్
సచ్చరి తాత్ములన్ గనిరి సారెకు డెందము కందళింపగన్ 137

ఉ ॥ పూవుకు తావియచ్చినటు పుణ్యులు రాజకుమార వంశజుల్
కావగ నెల్ల భూప్రజల కార్ముక విద్యల నెల్ల నేర్వగా
ఈ వనజాతలోచనలు యింపుగ రాజ్యము పూజ్యభావనన్
భావనచేసి బ్రోచెదను భారతి మోదము నొందునట్లుగన్ 138

వ ॥ అనుచు రాజోద్యోగులును, ప్రజలును సంతసించిరి. అంతఃపురమున సంతసమును సంబరమును అతిశయించెను. పున్నమి నాటి చంద్రుని గన్న మహాంబోధి చందంబున రాజు హృదయము ఆనంద కందళిత హృదయారవిందమై యొప్పారెను. సర్వజనులు సుఖంబుండు నెడ నా రాజ శేఖర మహారాజు ఒక శుభముహూర్తమున కొలువుండి మంత్రులతో రాజ బంధువులతో ప్రజలతో కూడిన యా సభలో రాచకార్యమును గూర్చి చర్చించుచుండిరి. 139

## అయ్యప్పస్వామిని యువరాజ్యపదమునరాజుగ నిలపగోరుట

ఆ॥ వె॥ వయసు మీద పడెను వాస్తవమ్ముగ నాకు
సుతులలోన వేగ సూటిగాగ
యౌవ్వరాజ్యపదము యేర్పింపదలచితి
సభ్యులార వినుడు సాదరమున 140

ఉ సూర్యుడు, చంద్రుడున్ గలిగి శోభలు ధాత్రికి కల్గునట్లుగా
వీర్యత బాలకుల్ గనగ వేగమే రాజ్యము రంజిలంగనే
కార్యములైన దీర్పగల కాంచన దీప్తులు వీరి లోపలన్
వీర్యము ఉల్లసిల్లగను వేద్యుడు యీ మణికంఠుడుద్ధతిన్ 141

ఉ ॥ ప్రాప్తుడెయైన ఈశ్వరుని ప్రార్థనలంగని పెంచినాడనీ
ప్రాప్తుడు వచ్చునంతకును ప్రాప్తియొకించుక లేక సంతతిన్
ఆప్తులలోన నేజడిసి అంతట నుండగనంత లోపలన్
సుప్తుడు మేలుకాంచినటు సూటిగ నీతడులభ్యమౌటచే 142

ఉ ॥ రాణియు మోదమందగను రంజిల పెంచెను నీతనింధృతిన్
రాణియు గాంచె పిమ్మటను రంజిలరాజిని రాజ రాజునున్
వీణియ మీటినట్లుగను విస్తృత కీర్తుల బెంచి నామిటుల్
రాణ దలిర్ప నేరినిక రాజుగ జేతును చెప్పుడీ వెసన్ 143

మ ॥ అని సందేహము లేల పొందగనిటన్ నానందమున్ జెందకన్
ఘనుడౌ యీ మణికంఠుడే తగిన నా కంజాక్షుడైయుండగన్
ఘనతన్ రాజ్యపదంబునన్ నిలుపగా కాత్యాయనీ సత్కృపన్
గనగా నీతని యౌవరాజ్యపదవీ గమ్యుండుగా జేసెదన్ 144

చం ॥ సభికులు యందరీగతిగ స్వాంతములుల్లసిలంగ నప్పుడే
నభిమతముల్ దమంతటను నంజలులుంచుచు దెల్పవేగమే
సభయె మహార్ణవంబువలె సాగెను చందురు కాంతిపుంజముల్
నభమున జూచి పొంగినటు నాదట పొంగిరి సభ్యులందరున్ 145

ఉ ॥ సభ్యుల మానసంబులను సారెకు తృప్తియొనర్చి రాజటన్
అభ్యుదయంబు గోరుచును అంచిత రీతిని కొల్వువీడగా
సభ్యులు చేరిరిండ్లకును సాగును తాయువరాజుగానగున్
మభ్యతమేమి లేమికిని మామణికంఠుడు మాకు భావినిన్ 146

వ ॥ అని రాజోద్యోగులు, ప్రజలు, సభ్యులు తలంచుచు ఇండ్లకు వెళ్ళిరి. 147

## మంత్రికుతంత్రములు

ఆ॥ వె॥ మంత్రి స్వార్థపరుడు మాలిన్య చిత్తుండు
ప్రజల పాలికతడు కుజనుడగుచు
తనదు లాభమునకు తాపత్రయంబంది
కుటిల చిత్తుడగుచు క్రూరుడయ్యె 148

తే॥ గీ॥ తేనె పూసిన కత్తిగా తివిరి యతడు
మిత్రభేదంబు సేయుచు మిగుల ప్రజల
వంచనాశిల్ప గరిమతో వరుసనేల
రాజరాకు రాజ్యంబు రయము గూర్ప 149

వ ॥ మంత్రి తలంచెను 150

సీ ॥ మణికంఠుడీరీతి మహనీయ పాండిత్య
గరిమతో రాజ్యంబు గణన మీర
ప్రజలకు మోదంబు ప్రభలు మార్గంబుల
ప్రభుతను సవరించ బలుతెరగుల
మంత్రికి లోలోన మలగుచు నీతండు
నాకడ్డపడునని నవని దలచి
ఈతడు ప్రభుడైన యింతయు తనస్వార్థ
మహిమంబు లేమియు మలగవనుచు

తే॥ గీ॥ మంత్రి తంత్రాంగమును జేసి మనసులోన
వంచనాశిల్ప మెలయింప వనట గుంది
చేయ నభిచార హోమంబు చెలగియతడు
మంత్ర తంత్రాంగ విధులను మహితయుతుల 151

తే॥ గీ॥ బిలిచి హోమంబు చేయించ దలచి చేయ
తత్ఫలం బందె బాలుండు తనదు దేహ
మందు వ్రణములు చెలుగుచు మందుడగుచు
మంజుల స్వాంతుడా స్వామి మలగు చుండె 152

ఉ ॥ కారణమారయం జనక కాయము బాలుని దట్లు గాగనే
కారణమేమొ యంచనక కర్మమటంచని వైద్యముల్ దగన్
కూరిమి జేసె రాజటను కుందుచు డెందము కందళింపగా
పారము ముట్టడయ్యె కడు పావని యైనను మంత్రిచర్యలన్ 153

ఉ ॥ తంత్రము గాగవైద్యులకు తానటుబోదలు చేసి మంత్రియున్
జంత్రపు కీలు బొమ్మవలె జాణగ నేమి యెరుంగ నట్లుగా
మంత్రియు తానుదాజరిపె తాముద మందుచుడెందమందునన్
తంత్రము లేమియున్ గనక తాలిమి లేమికి రాజు కుందుచున్ 154

ఉ ॥ మోదముదక్కి భేదమున ముందుకు సాగగలేక నంతటన్
వేదనతోడ నుండగను విస్తృత కీర్తుల గల్గవేగమే
వేదన లెల్ల బాపగను వైద్యుడు శ్రీ శివయోగి యంతటన్
మోదము తోడ డెందమున ముఖ్యుడు తో చెనురాజుకున్ వెసన్ 155

గేయము ఢం, ఢం, ఢం ఢమరుక ధ్వని
ఝుం, ఝుం, ఝుం, ఝణ నాట్య పదధ్వని
ప్రచలిత, విచలిత ఢమరుక ధ్వని
ఝణ, ఝణ, ఛణ, ఛణ నాట్య పదధ్వని
ఢం, ఢం, ఢం, ఢమరుక ధ్వని
ఝుం ఝుం ఝణ నాట్యపదధ్వని 156

వ ॥ జేయు శైవయోగి తనమనమునకు దోచి ప్రత్యక్షము కాగా 157

తే॥ గీ॥ నాదు మణికంఠునకు నీవు నభయమొసగి
రణములన్ మాన్పి రక్షించు రాజసమున
నీకు శతకోటి వందనాల్ నిక్కముగను
చేతుప్రణతుల తోడను శ్రేయమొసగు 158

మ ॥ అని ప్రార్థించుచునుండ నాత్మమయుడౌ ఆ స్వామి యేతెంచెనో
యననే తెంచెను శైవయోగి యటకున్ యశ్రాంత శ్రాంతంబుగన్
వినయంబుప్ప తిలంగ మ్రొక్కుచును తా వేద్యుండు తానిట్టులన్
కనిపించంగను రాజు చేరి యటకున్ గాంక్షించి సద్భక్తి తోన్ 159

మ ॥ మునుయోగీశ్వర సంబ్రాంత మచటన్ మున్నీవె నీ బాలునిన్
అనయంబున్ మముబ్రోవనిచ్చితివహో ఆనందమున్ జెందగా
గని సంతోష భరంబునన్ నిలువగా గారాములేతెంచెనో
ఘన సంత్రాసము బాపి బ్రోవగదవే కారుణ్య సంధాయకా 160

ఉ ॥ బ్రోవుము మాదుపట్టి నిటుబ్రోవుము వర్ధిల శంబుసత్కృపన్
కావుము దేవదేవుడన కాంచగ గల్గితి నీ వె ఈశుడై
పావన రూపయోగివర ప్రార్థన జేతును రక్షసేయవే
రావె వెసన్ మమున్ కరుణ రంజిల బ్రోవుము సత్కృపాంబుధిన్ 161

మ ॥ అని ప్రార్థింపగ నంతలో నతిథియున్ ఆనందమున్ జెందుచున్
గని ఏకాంతము నందు బాలకుని దా గాంచెన్ సుధాపూర్ణతన్
గని తా కౌగిలిలోన చేర్చినతనిన్ కాంక్షన్ శివుండై కృపన్
గన దేహంబున మానెనా వ్రణములున్ గంగాధరున్ తాకిడిన్ 162

వ ॥ అంత నామణికంఠుని మేనవ్రణముల దృశ్యమై నవ చైతన్య గరిమతో
నాతని దేహము ప్రకాశించెను. 163

చం ॥ పరమశివుండె నేననుచు పట్టివి నీవని పంకజాక్షుడున్
వరమున బుట్టి తీవనుచు వర్ధిలు నామహిషీ విదూషినిన్
సరగున ద్రుంచి దేవతల సారెకు బ్రోవుమటంచు నెంతయున్
కరము ముదంబుతో బలికి కానగ రాకను పోవు చుండితా 164

ఆ॥ వె॥ తెలిసి గాని లేక తెలియ కుండగగాని
నీదు మేను నెవడు నిక్కముగను
స్పర్శ చేయువాడు సారెకు పుణ్యుడై
పాపచయము డుల్లి పరవశించు 165

ఆ॥ వె॥ అనుచు వరములిచ్చి అంతట నాతండ
దృశ్యుడయ్యెనంత తేజమెసగ
బాలుడుండెనంత భాసిల్లు అర్కుని
పగిది వేడ్కదనర ప్రభలు గనుచు ! 166

ఉ ॥ రాజట శైవయోగి గనరామికి డెందము కందళింపగా
యోజన చేసి తానిటుల యూరట నందెను ఈశ్వరుండటన్
యోజన శైవ యోగిగను యోర్పుమెయిన్ జనుదెంచిబాలకున్
బ్రాజన మానుడై బరగ ప్రాపుగ దేహము బాగు చేసెగా 167

తే॥ గీ॥ అంతి పురిలోన రాణికి అతిముదంబు
డెందమందున కలిగెను నందనుండు
కందళింపగ నారోగ్య మందనంత
పండెనా భాగ్యమనుచును పరవశించె 168

ఆ॥ వె॥ మంత్రి లోనకుందె మాటికి క్రుందుచు
తంత్ర మెల్లపార తంత్రమయ్యె
ఎట్టి తంత్రమునను యేర్పింప నీపట్టి
త్రుంతు నంచు నతడదృశ్య గతిని 169

ఆ॥ వె॥ వంటశాల లోని వనితల దరచేర్చి
వారిలోన మిగుల వాసిగాంచు
చేటి నపుడు బిలిచి చేర్చికానుక లిచ్చి
విషము బెట్టబంచె వేగిరమున 170

పంచమ సోపానము సంపూర్ణము

## శ్రీ అయ్యప్ప మహాభాగవతము

# ద్వితీయోల్లాసము - షష్ఠమసోపానము

## ప్రాకామ్యయుతము - మాత్సర్యరహితము

ఆ॥వె॥ పాలలోన విషము పడతిబెట్టుటువెళ్ళ
బాలుడంత దాని బడయకుండ
గరుడు డపుడు వచ్చి కలపాత్ర దొరలించె
విషపుపాలు ధరణి వేగడుల్లె 171

చం ॥ మరియొక చేటి వచ్చియట మంజులరీతిని పాలుగిన్నెలో
సరిగమ బోసి పోయనటు స్వాంతము లోనను సాగెభావనన్
గరిమను నీ విషంపు సుధ గాగను తొల్లిటిచేడియ తాదలంపగన్
మురిపెముతోడ ద్రావెనటు మున్నుగ బాలుడు సంతసంబుగన్ 172

మ ॥ వరపుత్రుండుగ నీతడీగతిని నీ పల్మారు నామంత్రియున్
భరమే యించుకలేక పోయెనని తాపల్మారు నామంత్రియున్
బరమోనేశితి కంఠ దేవునకు నీ బాలుందగన్ బ్రోవగన్
అరుదందంగను చేటి యుందలచెనే యానందమున్ బొందకన్ 173

ఉ ॥ ఇంతలు సేసియున్ శుభగు నీ పసిబాలుని జంప జాలకన్
వింతలటంచుమంత్రియును వీనుల కెక్కగ రాణితో వెసన్
మంతనమాడగాదలచి మార్గము సూటిగ దానుదెల్పనో
రంతలు ప్రొద్దుగాచుకొని రాయిడితోడుత నుండునంతటన్ 174

శా ॥ ఏకాంతంబున నుండు రాణికడకున్ యేతెంచియామంత్రియున్
వీకం జెప్పదొడంగె నారమణికిన్ వేడ్కందలిర్పంగతా
ఏకం జాక్షుడునీదుగర్భమున దానెంతో ముదంబొప్పగా
జోకంబుట్టెను వానికిమ్ము వసుధన్ శోభిల్లగాధర్మమున్ 175

ఆ॥ వె॥ తల్లిదండ్రులెవరొ తనయుండుయెవ్వడో
తెలయనట్టి బాలు తెలివిమాలి
రాజు జేయబాడి రంజిల్లగా రాదు
తగవుగాదు తనదు తనయువీడి 176

మ ॥ తనగర్భంబున బుట్టినట్టి శిశువున్ తావీడిసంప్రాప్తునిన్
తనయుండంచని రాజ్యమిచ్చుటయు నే తన్మాత్రమున్ న్యాయమా ?
వినయంబొప్పగ విన్నవించెదను నీ వేద్యాంశమున్ యోజనన్
గను మీ నిర్ణయ మీ వుగ్రైకొనుము వే గన్ మాతరో యంచనన్ 177

ఉ ॥ నా పతి దేవు కాదనుచు నానయొకింతయులేక నీ విధిన్
కోపము గల్గగా నెటుల కోరిక నిట్టుల జెప్పనేర్తునే
పాపము గల్గునో వెసను బాలుడు నా మణికంఠు డింతటన్
నాపయి కోపగింపడొకొ నాడ్యత నేనెటుబల్కజాలుదున్ 178

ఉ ॥ పెంచితి పెద్దజేసితిని పేరిమి కూరిమి యుల్లసిల్లగా !
గాంచితి పిమ్మటన్ వసుధ గాంచితిప్రీతిగరాజరాజునున్
ఎంచగ ప్రాప్తుడే తగును యేర్పడరాజుగ నుండగా దగున్
సంచిత మార్గమే యనుచు సారెకు రాణి దలంచెనంతటన్ 179

ఉ ॥ కాదనకెట్లు జెప్పెదను కాంచన గర్భసముందు బాలునిన్
వేదన యయ్యె నేనిటుల విస్తృత కీర్తిధరుండు గావునన్
మోదము పొందనుండకను మోహనరూపుని నాయసాధ్యునిన్
కాదన నోరురాదనుచు కామిని జెప్పగ నాతడిట్లనెన్ 180

మ ॥ నవ మాసంబులు మోసినీవిటుల నా నారీతులన్ నీసుతున్
నవ మానించిన యట్టెకాదె యిటులన్ నానంద మింపారగా
అవనింబూన్పుము యౌవరాజ్యపదమున్ నాంతర్యమేపారగన్
నివహంబుల్ నినుమెచ్చునట్టులగ నీ నేర్పుందగంజూపుమా ! 181

వ ॥ అనిన అట్లయిన కాదగు కార్యమెటుల చేయదగు ననిన మంత్రి వర్యుండు మణికంఠుడు రాజయిన నీ గర్భశుక్తిముక్తాఫలంబయిన రాజ రాజు మణికంఠునికి సేవకుడుగా నుండుట తమకు ఆమోదము కలిగించునా ? పరంపరగా రాజ్యము మణికంఠుని సంతతికి లభించునుగాని నీ పుత్రుడు అతని పుత్రులు రాజ్యము లేక సేవకులగుదురు గావున మీదు శ్రేయోభిలాషిగా ఇట్లు వంచింతిని. ఆలోచింపుమనగా రాజశేఖర రాజునకు నేను చెప్పునంతటి దానను గాను ఇపుడు ఉపాయాంతరము మీరే యోచింప వలెనని రాణి చెప్పగా తలనొప్పి తీవ్రముగనున్నట్లు మీరు నటింపుడు తక్కిన విషయములు నేను చూచుకొందును. మీరింత సాహసము చేసిన మీదికార్యము సాధించి మీకు విన్నవింతుననగా నారాణియు 182

ఉ ॥ వాసెన కట్టుగట్టి ధృతి వారిజ నేత్రియు చీకటింటిలో
వేసిన పాన్పుపై బొరలె విస్మృతమై తలనొప్పి యంచటుల్
గాసిని దెల్పగా నటుల కన్నుల నీరము గ్రుమ్మరింపగా
వేసిన వేషమై దనర వీరుడు రాజటు వేదనన్ గనన్ 183

తే॥ గీ॥ ఓసి మన్ మనోహారిణి గాసి యేమి
వింతనటునిటుపొరలెద వేల చెపుమ
వేల చందంబులైనను వేడ్కదనర
నీకు గూర్తునుమోదంబు నివ్వటిల్ల 184

మ ॥ అన నారాణియు వేదనన్ బొరలుచున్ ఆరాజుతోనిట్లనెన్
ఘనమౌ నాదు శిరోభరంబిటువలెన్ గల్గెన్ వెసన్ బ్రోవవే
ఘనులౌ వైద్యుల బిల్వగా బనుపుమో కాంతుండనే నోర్తునే
మనమందుగలబాద మాన్పగధవే మాదేహమున్ గుందెడిన్ ! 185

మ ॥ అని నారాజటు మంత్రి వర్యుగనుచున్ అర్థించె వెజ్జంతగన్
గని పిల్వంగను వైద్యమున్ సలుపగా కాంతన్ వెసన్ లేర్పగా
వినయంబున్ గనుపట్టు రీతినటునా విఖ్యాత చారిత్రునిన్
గనిదా రక్షణసే యవేడెనుగదా కంజాక్షిసంభ్రాంతతన్ 186

తే॥ గీ॥ వెజ్జు లెందరు వచ్చిన వేగిరమున
రాణితలనొప్పి బాపంగ రాకయున్న
వైద్యునొక్కని చెవిలోన వినిచెనెదియొ
మంత్రి తంత్రంబు నెరపిన మాత్రమతడు ! 187

ఆ॥ వె॥ రాజ శేఖరునకు రంజిల్ల ప్రణమిల్లి
మందుకలదుగాని మహిత యశుడ !
మందనకును గలుప మహిని వ్యాఘ్రపుబాలు
వలయు తేరబంపువలయువారి ! 188

కం ॥ పులిపాలు తెచ్చి యిచ్చిన
నలినాక్షా రాణి నొప్పి నాదట తీరున్
పులి పాలు కలిపి మందున
కలయంగసునూరి యిడగ కలతయు దీరున్ ! 189

ఆ॥ వె॥ గుండె ఝల్లు మనియె గుబులు గల్గగ రాజు
దండిమగ డెవండు ధరనునేడు
పులిని జంపె నేని పులిపాలు పిండంగ
జనదు పాలురావు చచ్చెనేని ! 190

ఉ ॥ పిండుట ఎట్టులొపులిని పీడితుడై ధరగ్రుంగుగాని తా
నుండిన నా పులిన్ గదిసి ఊరట నెవ్వగ నిల్వగాదగున్
దండిమగండు లేడొకడు దారత తేరగ పాలుపిండగా
భండన భీముడై దనరి భాసిలి తేరగ నెవ్వడోపునో 191

ఆ॥ వె॥ అర్ధరాజ్యమిత్తు ఆదట పులిపాలు
దెచ్చు వానికంచు తేజమెసగ
రాజు చాట బంచె రాజ్యమందంతట
రాణిబాధమాన్పరయముతోడ 192

వ ॥ అని రాజు చెప్పగా. . . 193

## స్వామి పులిపాలు దెచ్చుటకు వెడలుట

ఆ॥ వె॥ తల్లి తండ్రి గురుడు తలపగా దైవంబు
నవని ప్రజకు నెల్ల నధికులగుదు
రట్టి వారి బాధ అపనయింపగలేని
పుత్రుడేల పుట్ట పుడమియందు 194

వ ॥ అని మణి కంఠస్వామి చెప్పుచు 195

ఉ ॥ నేపులిపాలు దెత్తునని నేర్పున అర్భకుడాడువాఖ్యముల్
ఏపున వీనులంబడగ ఎంతయుడెందము కందళింపగా
ఏపగదిన్ ఘటింపగను యెంతయు వ్యాఘ్రపుపాలు దెత్తువే
నీ పని గాదలంచుకుము నేర్పున జూడుమటంచురాజనెన్ 196

ఉ ॥ బాలుడు రాచబిడ్డడు కృపాళుడు శీలుడు భావిరాజ్యభూ
పాలుడు కానకుంజనిన పాలన సేయగ నెట్లు నోర్తునో
వీలగునే కృపాళునకు విక్రమతన్ పులిపాలు తేరగన్
బాలుని బాసినే క్షణము భాసురవృత్తి భరింపనేర్తునే 197

కం ॥ పండ్రెండేడుల బాలుడ
తీండ్రంపులి పాలు తేగ తీవ్రత తోడన్
గాండ్రించు పులల జోలికి
తండ్రీ పోవలదటంచు తనయుని కోరెన్ ! 198

ఉ ॥ బాలుడ గాను నేనిపుడు భండన భీమ పరాక్రముండనన్
బాలుడటంచు నెంచకుడు భానుసమానప్రదీప్త సంపదన్
బోలగజాలి నేపులుల పొంతను పాలనుపిండగా వడిన్
చాలనె పోదుకానలకు సాగెద నేపులిపాలుదెచ్చెదన్ 199

చం ॥ అనవుడు రాజు పల్కెనటు అంచిత రూపుని నిన్నిటన్ వడిన్
మనమున జంకులే కిటుల మాటికి బంపిన శంకరుండిటన్
ఘనమగ కోధమూర్తియయి కాంచుమనన్నని డెందమందునన్
మనమురి యాడుచుండె నిటు మానుము నో మణికంఠనీవికన్ 200

చం ॥ పనుపను నిన్ను నేనిపుడు పాలును తేరగవల్వ దెప్పుడున్
మనవిని వింటివోయిటను మంజుల రూపుడటంచువేడితిన్
అనయము మాకు నాశ్రయము ఆదట నీవిటనుండకపోతివేనియున్
మనమున చింతవీడదిట మానుము ఓమణికంఠబోకుమా ! 201

మ నిను నేబంప నరణ్య సీమలకునున్ నేర్పేర్పడన్ నీవికన్
ఘనతన్ యాపులిమూకలం బొదవియాకాంతారమధ్యంబునన్
జనివేగంబున పాలునీవిటుల నో జంజాలుడే తెత్తువో ?
వినుమోయర్భకచాలుచాలుగరిమన్ విశ్రాంతితోనుండుమా ! 202

ఉ ॥ ఊగిసలాడుడెందమున నుండెను రాజట కంఠగించుచున్
వేగమె రాణిబాధనటు విస్తృత కీర్తి ధరుండు రాజటన్
బాగుగు చేయజాలకను బ్రహ్మప్రయత్నము తోడనుండగా
సాగగ స్వామి అయ్యపయు స్వాంతమురంజిలరాజు తోననెన్ ! 203

తే॥ గీ॥ తండ్రి నాలోన నొక కోర్కె దనరు చుండె
అట్టినా కోర్కె దీర్పంగ ఆనతిడిన
తెల్పువాడను అప్పరోవేల్పు సముడ !
అనగ నారాజు తనయుని అంతగనుచు ! 204

ఆ॥ వె॥ ఎట్టిదైన గాని - ఏమి యైననుగాని
నీదు కోర్కెదీర్తు నిక్కముగను
చెప్పుమన్ననతడు చిఱునవ్వునవ్వుచు
పంపునన్ను పులుల పాలుతేగ 205

చం ॥ అనుటయు రాజుడెందమున అంచిత రీతిన బద్ధముల్ దగన్
పనివడి చెప్పరాదనుచు పంపగ బాలుని కోరియంతటన్
మనమున సందడింపగను మాటికి మాటను దప్పజాలకన్
సునయపు సూనృతంబుగని సూటిగ బాలునిబంపగోరుచున్ 206

శా ॥ నీతో సైన్యసమన్వితంబుగ ధృతిన్ నిక్కంబు పుత్తెంతునే
నాతో వాదములాడకుండగ నిటన్ నాకుజ్జనీవింతటన్
చేతో మోదముతోడ కొండలకునీ చెల్మిన్ గనన్ వెళ్ళవే
నేతే రంగదె పాలనుందనుపగా నీ వెల్లచందమ్ములన్ ! 207

ఆ॥ వె॥ సైనికాళితోడ చనుదేరునంతట
పులులమొత్తములును పొల్పుమీరి
పరుగులిడుచుపోవె పాలెట్లుచేకూరు
పులుల జంపియైన పడయరాదు 208

తే॥ గీ॥ కాన నేనొక్కరుండనే కాననమున !
తిరిగి పులిపాలు దెత్తునో ధీరయుతుడ !
నన్ను బంపుము నడవికి నవయబోకు
నిశ్చితార్థంబు పడయంగ నిక్కముగను ! 209

ఆ॥ వె॥ తల్లి బాధదీర్చి తనయుండననుటకు
తగిన వాడననుచు ధరణి ప్రజకు
మార్గ దర్శకముగ మనువాడ కనువాడ
ఘనతరంపు కీర్తి కలుగునట్లు 210

వ ॥ అని రాజశేఖర రాజు నొడంబరచి నేనొక్కండ పులిపాలు దెత్తుబాలుండని సంశయింపవలదు అని స్థిరచిత్తంబున మణికంఠస్వామి చెప్పిన రాజశేఖరుండు అడవిలో తిను బండారములకు పూజాద్రవ్యములకు కావలసిన ద్రవ్యములు ఇరుముడులుగల సంచిలో నమర్చి తలపైన ఇరు ముడులుగల సంచినుంచి ఎడమ చేత విల్లును కుడిచేత బాణమును కుడి భుజమును ఆనుకొని అమ్ములపొదియునుం కలుగునట్లు అడవికి మణికంఠుని సిద్ధమొనరించి పంపెను. 211

ఉ ॥ బాలుడమాయకుండనుచు బారులు దీరుచు బాలులందరున్
చాలునె ఈతడింతకును సారెకు తాపులి పాలు దెచ్చునే
ఏల వితండ వాదమని ఏర్పడ బల్కిరి హేళనంబుగా !
చాలడె శక్తి పుత్రుడట స్వాంతమురంజిల పాలుదెచ్చునే 212

తే॥ గీ॥ పులుల దరికేగు అయ్యప్ప పుడమిపైకి
తిరిగి రాగలడాయని స్థిరత నుండి
రాజరాజకు రాజ్యంబు రయముగూర్తు
నంచు మంత్రియు తంత్రంబు నంత దలచి ! 213

తే॥ గీ॥ రాణి తో జెప్పి రంజిల్లె రాజసమున
అయిన నేమయ్యె ! నేమయ్యె ! నంత జూడ !
వెడలె మణికంఠస్వామియు వేడ్కతోడ
గహనమున కంత వింతగ గనగజనులు 214

ఉ ॥ చీమలు దూరనట్టివగు చిట్టడవుల్ గమియించుచున్ వెసన్
నేమము తోడ బాలకుడు నేర్పున నావన సీమలందునన్
వేమరి ద్రిమ్మరున్ వరుస వేగమెకానన సీమలందునన్
కామ విరోధి సూనుడటు కార్ముకహస్తుడు చూడవేడకన్ 215

వ ॥ అట్లు తీయని పండ్లతో రాగ రంజితమైన మృదువగు చిగురాకులతో గుండ్రముగా నుండి ఏపుగా బెరిగి నీడనిచ్చు వృక్షవాటికలతో బదరి, పనసరసాల సాల వృక్షములతో సురసిద్ధమునిగణ సేవితంబయిన పంపానదియందు స్నానము చేసి పంపాతీరమున నారు దినంబులుండు నంత నదీతీరంబున కదళీషండ మండితంబును సర్వకుసుమ వాసనా విలసిత గంధాఘ్రాణంబున అతిమధురఫల రసాస్వాదనంబుల ప్రమోద హృదయుండై కేచర సిద్ధ సురభుజంగ గరుడ గంధర్వ సముదయంబులచే చూడబడిన వాడై చనుదెంచుచుండ 216



సీ ॥ రామణి కంఠరా రమ్ముమాధవు పుత్ర
రమ్య పందళ రాజరాజసుతుడ !
రమ్ము ఈశ్వరపుత్ర రంజిత తనుగాత్ర
మారునిగన్నట్టి మహితుకుక్షి
రామనోహరగాత్ర రాజీవదళనేత్ర
రమ్ముపావనగాత్ర రాజవినుత
రామహిషాంగనా రమ్య మర్థన స్వామి
రమ్ము అయ్యప్పస్వామి రాజవదన

ఆ॥ వె॥ అనుచు భక్తజనులు ఆదట బిలువంగ
తరలివచ్చివారి దరుల నిలచి
ఎడదలందు మొలచి ఎంతోబ్రోతుపు స్వామి
అమృత బిందువులను అపుడు చిలికి ! 217

మాలిని: విజయ వినుత స్వాంతా విశ్రుతానంత క్రాంతా !
నిజ జనకుని బ్రోచే నీరజాక్షావనీశా !
గజగమన సుధీరా కాంచనోత్ఫుల్ల దీక్షా !
విజన సుజన కాంతా విశ్వవ్యాప్త్యైకచిత్తా ! 218

ఇది శ్రీ కామాక్షీ చలంబ్రమనామాఖ్యుల పౌత్రుండును చిన్నమ్మ యన్పేరి నామాంతరముగల శ్రీమునెమ్మ మునిరత్నమాఖ్యుల ఏకైకపుత్రుండును నన్ను పెంచి విద్యాబుద్ధులను నేర్పించిన శ్రీమంగతాయారమ్మ నారాయణాఖ్యుల దౌహిత్రుండును శకుంతలా సద్ధర్మపత్నీ సమేతుండును శ్రీతిరుత్తని సుబ్రహ్మణ్యేశ్వర వరప్రసాదలబ్ద శివసుబ్రమణ్య సుపుత్ర సమేతుండును శ్రీ హరిహరాత్మజస్వామి శ్రీ చరణరేణువునగు మధురాంతకం దొరస్వామియను నాచే రచియింపంబడిన శ్రీమణికంఠేశ్వర చరిత్రమను నామాంతరము గల శ్రీఅయ్యప్పమహాభాగవతము నందు ద్వితీయోల్లాసము సంపూర్ణము ! 219

ఓం స్వామియే శరణమయ్యప్ప !

**శ్రీ అయ్యప్ప మహాభాగవతము**

# తృతీయోల్లాసము - సప్తమ సోపానము

## బుద్ధి యుతము - దంబరహితము

కం ॥ శ్రీశంభు సుతుడ దేవా !
శ్రీ శుండగు విష్ణువునకు చింతలు దీర్చన్
శ్రీ శాంభవి సుతబుట్టితి
ఆశా పాశంబు బాపు హరిహరపుత్రా !

వ ॥ ఇట్లు సూతుండు శౌనకాది మహామునులకు శ్రీ అయ్యప్ప మహాద్భుత
చరితంబు వినిపింపందొడంగె ! 2

చం ॥ ఇరుముడి దాల్చి యాదలను యింపుగ నేగెను స్వామికానకున్
ఇరులు దొలంగి కాంతులవి ఇంపుదలిర్పగ కాననంబునన్
సరులుగ పుష్పగుచ్ఛములు చాలగ విచ్చెను మెచ్చునట్లుగన్
బరువడి కాంతి పుంజములు భాసురవృత్తిని నిండి నట్లుగన్ 3

ఆ॥ వె॥ దేవ నాథుడంత తేజంబు గోల్పోయి
మహిషి వలన తాను మందుడగుచు
శరణమంచువచ్చి స్వామి పదంబుల
శరణు శరణటంచు సాగిలబడి

ఆ॥ వె॥ దేవరాజనియెను దేవదేవుని తోడ
మహిషి దేవలోక మాక్రమించె
దానిదుండగములు దారుణంబులు స్వామి
దాని ద్రుంచిబ్రోవు దయదలిర్ప

ఆ॥ వె॥ ఎల్లలోకములను చల్లగబ్రోచెడి
శివుని పట్టివయ్య చింతలుడుపు
పసిడిఛాయవాడ పరమాత్మ బ్రోవరా !
శరణొసంగి బ్రోవు స్వామిశరణు !

వ ॥ అనగ స్వామి ఇట్లు పల్కెను 7

చం ॥ అనపుడు స్వామి పల్కెనిటు ఆధ్యత దేవత లందరున్ మిమున్
వినయముతోడ గొల్వగను విస్తృత లీలలు నుందురెంతయున్
పనివడి నన్ను గోరినను ప్రాభవయుక్తిని బ్రోవకుందునే
ఘనముగ వేడగావలదు కామితముల్ వెసదీర్తునెంతయున్ 8

## మహిషిమర్ధనము-లీల ఆవిర్భావము

మ ॥ అని దేవేంద్రుమనంబు ప్రీతిగన దా నత్యంత సంతోషియై
వినయంబారగ పల్కి వీడ్కొలిపి దా విఖ్యాత చారిత్రుడై
జనియాదేవ పథంబునన్ జనుచు దా జాజ్జ్వల్య మానాంగుడై
జనియామానిసితిండి జంపగను దా శంఖంబు పూరింపగన్ 9

శా ॥ సక్రోధంబున స్వామిజూచి యటులన్ స్వాంతంబుమండంగ దా
ఆక్రోశంబుగ జేసి జూడగని తా నాక్రోశముల్ జేయుచున్
ఏక్రోవం జనుదెంచి తీవిచటికిన్ ఏర్పింపుమోబాలకా !
నాక్రోధంబు శమింప జేసెదనునే నిక్కంపుయుద్ధంబునన్ 10

ఉ ॥ బాలుడ నీవు భండనము భాసురవృత్తినిజేయలేవు నీ
పాలస వైఖరిన్ గనిన బాగుగ నవ్వగ బుద్ధిపుట్టెడిన్
మేలుర ! మేలురా ! భళిర మేలము లేలిక వెళ్ళరావెసన్
కాలును కేలు గూడు కొనకాంచగరమ్మిక నాజిలోనికిన్ 11

ఉ ॥ మీసము లైన బుట్టకనె మిక్కిలి భండన భీముడైతివా ?
కాసర బీసరంబుల ఁ నిట చాలదలంచితివేమి నీవికన్
జాలములేకనిన్ దునిమి చాలముదంబును దేవతాళికిన్
మేలిమి గాగగూర్తునిక మేలములేలిక రాక్షసాంగనా ! 13

ఆ॥ వె॥ హరిహరాత్మజుండ ఆయువు నీకిట
దీరిపోవ నేడు దేవలోక
మునకు వచ్చినాడ ముదము తోడుతనేను
నిన్ను జంపువాడ నిక్కముగను ! 14

మ ॥ అన క్రోధారుణ నేత్రముల్ బరగతా నాశ్యంబునాడించుచున్
వినవో నేమహిషాంగనా మణిగదా విఖ్యాత చారిత్రనే
ననిలోనిన్ గనివీడగా దగునెనే నత్యంత కృద్ధత్వతన్
పనిగొందుం నినుద్రుంతుయేమరకు నీ ప్రాబల్యమున్ జూపినన్ 15

మ ॥ అనిలోద్ధూత నితాంతవేగమున అత్యంతంబె బాణంబులన్
అనిలో దాగురిపించెనంతటను దానద్దేవుడం తన్ధృతిన్
ఘనసాంద్రంబగు బాణవర్షములవే గాఢించగా నంతలో
తన ఖడ్గంబునుద్రిప్పివైవగవెసన్ దాస్వామి దున్మెన్వెసన్ 16

ఆ॥ వె॥ బాణవర్షమునను బడలుచుబలుపాట్లు
పడిరి రక్కసులును పరుగులెత్తి
మహిషియొకటినిలిచి మాటికిస్వామిపై
గదను గొంచువైచె కదనమందు 17

చ ॥ గదగదతోడమోదగను కంజదళాక్షి గదాయుధంబొగిన్
వెదవెదలౌచుముక్కలుగ వేద్యతనుండగ నంతలోపలన్
సుధతియుమల్లయుద్ధమున సుందరమూర్తినినొంపజూచినన్
మదమొనరంగ స్వామియటు మానినివైచెను రెండుచేతులన్ 18

చం ॥ మదము దలిర్ప బాహువుల మాటికినొడ్డుచు మల్లయుద్ధమున్
అదనుగ జేయునంతటను ఆహరిసూనుడు దంచితంబుగన్
సుదతిని బాహులంబొదివి సూటిగముష్టినిబట్టి కొట్టగన్
మదము దొరంగినామహిషి మార్గముగానక కుందెనెంతయున్ 19

వ ॥ మహిషి తన శక్తినంతయును ఉపయోగించి స్వామిని నిర్జింతునని తలంచి
నా పరాక్రమము చూడుము . . . . 20

చం ॥ అనితనకొమ్ములన్ జొనిపి అంచితరీతిని వంపజూడగా
తన దగురెండుచేతులను తాలిమితోడుత కొమ్ములన్ వడిన్
అనువున బట్టి వంచటుల ఆననమున్ అరచేతదట్టుచున్
అనువుగ కూలద్రోసెనటు అంచితరీతినిభూమిపైబడన్ 21

తే॥ గీ॥ మేలిఇరుమేలి యడవులమేనువడిన
మహిషి ఘీంకారరవముల మరలలేచి
వెంటదుమికిన స్వామితో వేగ నపుడు
మల్లయుద్ధంబు సేయగా మగువతొడరె ! 22

ఉ ॥ రక్తపుచుక్క నేలబడ రాయిడి నామహిషంబులందులో
యుక్తముగాగబుట్టటయు యూరటలందుచు వచ్చుచుండగా
యుక్తిని బాణఘాతముల యుర్విని గూల్చెను వానినన్నిటన్
ముక్తికిమార్గదర్శకుడు ముగ్గురుమూర్తుల సూనుడంతటన్ 23

ఉ ॥ రక్కసినేలగూలగను రంజిలనామెశరీరమంతటన్
చొక్కపునృత్యరీతులవి చోద్యముగాగనుజేసె స్వామిదా
నక్కజమంద దేవతలు నౌదలలుంచటు మ్రొక్కుచుండగా !
మిక్కిలిపూల వర్షములు మేధిని నిండెను మ్రోగెదుందుభుల్ 24

ఆ॥ వె॥ ప్రాణమువీడె నామెయును ప్రాపుగ వింతగనంతలోపన్
వేణుస్వనంబుతోడుగను వేగమెమానిని యోర్తు నామెపై
వైణము తోడబుట్టియట వందనముల్ వెస జేయుచున్ వడిన్
మాణవ కుండుగావెలయు మాధవుపట్టిని జూచితాననెన్ 25

ఉ ॥ లీలను తొంటిజన్మమున లీలగశాపముతోడ నేనిటన్
పోలగ నేమహిన్ మహిషి బోలితిరక్కసకాంతనై వెసన్
కలియుగమందునిన్నుగ నికాంచితిస్వామిముదంబుతోడుతన్
నిలుపుము నీదు జాయగను నిర్మలరూపిగనన్ను నెంచుమా ! 26

వ ॥ అనుచులీలస్వామిని ఇట్లు ప్రార్థింపందొండగెను. . . . 27

**దండకము:** శ్రీదేవ చూడామణీలోక రక్షామణీ దేవ దేవేశులైనట్టి సర్వేశుకున్ విష్ణుకున్ నీవు జన్మించి బ్రహ్మాది దేవుల్ నుతింపంగ భక్తాళినిన్ దన్ప వేంచేసి-ఈ లోకమున్ నీవు పాలింపగా పావనంబయ్యె వైరాగ్యభాగ్యంబులన్ నీమనిష్టల్ ధృతిన్ భక్తినిష్ఠాగరిష్ఠాత్మతన్నిన్ భజింపంగ వేవేల చందంబులన్ వెల్గులీసంగ నక్షత్రమై వెల్గవేపారగా భక్తకోటుల్ నుతింపంగ సామ్రాజ్యసంపన్నతన్ వీడిసౌఖ్యంబుగా దంచు

బ్రహ్మంబునేనంచు ప్రఖ్యాత ఆనందసంధాతవై దేవదేవుండవై వెల్గవే స్వామి మూర్తి త్రయంబైన బ్రహ్మాది విష్ణ్వంశ సంభూతుడై ఈశుడై నీవు ఓంకార రూపాత్మకుండై సదానందసంధాయి నాఈశ్వరుండంచు భక్తుల్ నుతింపంగ వేదాంత సారంబపారంబుగా జూపి భక్తాళికిన్ ముక్తికాంతాసముల్లాసముంగూర్చవే ! వేదవిద్యన్ బ్రసాదించవే నన్నుమన్నించి బ్రోవంగదే రక్షసేయంగదే నీవె సదాముక్తిసంధాయకా కాయముల్ శాశ్వతంబంచు లోకుల్ దలంపంగ రాదంచుమాయామయంబైన ఈ లోకచర్యల్ సుధాపూరముల్ గావు ఓంకార రూపుండవే నిన్నుగొల్వంగ నెల్లప్పుడున్ వారు చేరంగ ముక్తిన్ ప్రసాదింపవే స్వామినన్ జాయగా నేలవే స్వామిదేవేశ బ్రోవంగదే ఓదీనరక్షామణీ పాహిమాం పాహి దేవాదిదేవా నమస్తే నమస్తే నమః 28

ఆ॥ వె॥ పూర్వజన్మమంద పూర్వముగాగను
దంపతులముగాగ తరళేత్ర
ఉన్నఛాయలన్ని ఒక్కింతదలపోని
చెట్టబట్టవయ్య చెల్మితోడ ! 29

మ ॥ కలికాంబిది జ్ఞానమున్ గలుగగా గర్వాంధతన్ బాయగా
మలినంబౌజన జీవనంబు వలెనే మాలిన్యమున్ లేకనీ
వలనం జ్ఞానము బొందు నట్టులుగ నే వారింతునెల్లప్పుడున్
వెలయన్ జాయగ నేలవేవ సుధలోవెల్గం సుధాపూరముల్ 30

సీ ॥ హరిహరబ్రహ్మల ఆజ్ఞమైయిట బుట్టి
బ్రహ్మచర్యంబున బరగుచుంటి
అహరహంబును భక్తులిహలోకమందున
వరలంగనాచెంత వరలుచుంటి
ఇహభోగములువీడి ఇటు బ్రహ్మచారినై
బ్రహ్మజ్ఞానంబున ప్రభలుగాంతు
సహనము తోడుతా సహియించి నీమముల్
సలుపుదు నిక్కంబు సదయవృత్తి

తే॥ గీ॥ మనుజులందరి తరియింప మనసుగల్గి
శబరిమలవాసుడగుచును సాగుచుందు
బ్రహ్మచారికి గల్గునే భార్యయెందు ?
తన్వి నీకోర్కెతీరదు తరలుమనియె 31

తే॥ గీ॥ నీపదంబులు విడువను నిర్మలాత్మ
నిక్కముగ నేను అనుచును నీమమొప్ప
పదములంబట్టి ప్రార్థింప ప్రభుడుపల్కె
లెమ్మనీమూర్తికిని భక్తులెపుడు మొక్క 32

తే॥ గీ॥ నీ దుగుడినాదుగుడి చెంత నిలువువాడ
మాలికాపురవాస్తవ మమల జ్యోతి
మాతయన మాలికాపుర మాతగాగ
నిలువు మచ్చట స్ఫూర్తితో నిక్కముగను ! 33

ఉ ॥ ఎన్నడు కన్నెసాములిట ఎవ్విధిరాకయునుందురోవెసన్
పన్నుగ నాడునిన్నువెస ప్రాపుగ పెండిలియాడెదన్ ధృతిన్
అన్నిదినంబులున్ నిలువు ఆదట మాలికయన్ పురంబునన్
క్రన్నన నీవు నాదినము గాంచగ నెన్నుచునుండుమంచనెన్ 34

తే॥ గీ॥ కన్నెసాములు రానట్టి కాలమెద్ది ?
కలిని లేకుండుటంజేసి కాంతనపుడు
నిటులనోదార్చె స్వామియు నిటలఘటిత
అంజలుల్ జేసియువిదయు అచట నిలిచె ! 35

తే॥ గీ॥ కొండవలెమహిషి శవమా దండనుండ
ఆమె కార్చిన కన్నీరె ఆళుదాన
దియన బరగెను నిరుమేలి దిశనునేడు
భక్తులందరు స్నానాలు బరగజేయ 36

కం ॥ కాలేకట్టను చోటున
వేలాయుధు తండ్రితోడ విష్ణుండంతన్
హేలాగతి స్వామినటన
మీలీలం జూచిరపుడు మిక్కిలిప్రీతిన్ 37

ఆ॥ వె॥ మహిషి తనువుపైన మాటికి నాట్యంబు
చేయుస్వామిపాద సేవనంబు
ప్రాప్తిగాగలీల పడసిన జన్మంబు
జూచిరపుడు వారు సూటిగాను 38

మ ॥ పదవిన్యాస రవంబు జూడనచటన్ పల్మారు శోభాకృతిన్
ఎదలోలోతుల గానసంగతులకున్ యేరీతివిద్యావిధిన్
ముదమందంగనుపించుచుండగను మోదంపుఘాతంబులన్
అదనందంగను కాళియున్ పడగలన్ ఆకృష్ణునాట్యంబనన్ 39

ఆ॥ వె॥ తకిట తకిట యంచు తాళంపుగతులతో
ఝణత ఝణత యంచు ఛలముమీర
నాట్యమెంతొజేయ నపుడు శ్రీస్వామిని
మెచ్చి రపుడ ప్రభులు మిగులప్రీతి 40

ఆ॥ వె॥ నందివాహనుండు నటరాజువీక్షించి
స్వామినటన మపుడు సదమలముగ
హరికి జూపితాను అతిశయంబును బొంది
నటన మాడెనంత నద్భుతముగ 41

ఆ॥ వె॥ గరుడగమనుడంత గంగాధరుంజూచి
భళిర సుతునిజూడ భాసురంబు
నీదునటన కన్న నిక్కంబు నాదగు
నటన కన్నమిన్న ఘటన మిదియ ! 42

తే॥ గీ॥ మూడు లోకాలు ముదమంద ముఖ్యముగను
భక్తసంతతి దనియింప ప్రాభవమున
ఇతడుమణికంఠుడైపుట్టె నిలనటంచు
హరియు బల్కెనుశివునితో నాదరమున 43

చం ॥ హరిహరులిట్లుబల్కికొని అంచిత రీతిముందబు తోడుతన్
మురిపెముతోడ దీవెనలు మోదముతోడుత నిచ్చివైళమే
పురముల కేగిరట్లపుడు పూజ్యులుదంచితరీతి సత్ప్రభుల్
బరమగునే సుపుత్రులను బాగుగ బ్రోవనిలాతలంబునన్ 44

తే॥ గీ॥ మహిషి మరణింప ఇంద్రుండు మహిత పదవి
చేకొనియె దేవతలతోడ చేరె నమర
పురిని అంత నా స్వామియున్ ముందునిలిచి
దేవలోకాన దేవేంద్రు తేరిచూచె 45

వ ॥ అంత 46

## స్వామి దేవేంద్రాదులతో స్వర్గమునకేతెంచుట

శా ॥ సాష్టాంగంబుగ మ్రొక్కిరందరును ధీశాంతంబులన్ జూపుచున్
ఇష్టార్థంబులజేర్చి స్వర్గమున తా రిష్టార్థముల్ దీర్పగా
మృష్టార్థంబగు కోర్కెదీరగ వడిన్ మేనున్ దగన్ వెల్గగన్
శిష్టార్థంబులుగూడివచ్చెననుచున్ సుశ్రీలతోదేవతల్ 47

సీ ॥ ఇంద్రుడు ఆసనం బిడె కూరుచుండగా
పవనుండు వీచెను పసదలిర్ప !
వరుణుండుజలముల వైభవంబున నిచ్చె
అర్ఘపాద్యంబుల అపుడుదన్పి
ధనదుండుమణులను తనదోసిళులదెచ్చి
కాన్కగానిచ్చెనుకడుముదమున
తక్కినదేవతల్ తమకుగూర్చిన యట్లు
అర్పణంబులు జేసి రఖిలధనము

గీ॥ అట్లుఅమరేంద్రుమందిర మందు స్వామి
అతిముదంబున గూర్చుండి ఆదరమున
పల్కెకాన్కలు నాకేల పడయరాదు
గైకొనుడు మీరలేయంచు ఘనతపల్కె 48

ఆ॥ వె॥ తల్లికోర్కెదీర్ప తరలివచ్చితినేడు
పూజ్యమాతశీర్ష మునను నున్న
బాధపనయింప వలసె భాసురముగ
దానిదెల్పవలయు ధర్మవిధులు 49

తే॥ గీ॥ అపుడు పిండిన పాలతోఔషధంబు
జేయగావలె గావున చెల్మిగుల్క
సాయపడవలె మీరలు సదయవృత్తి
ఏర్పరింపుడు మార్గంబు ఈశుకరుణ 50

ఆ॥ వె॥ దేవనాథుడనియె తే జంబునిండార
మేమ పులులమగుచు మిగులప్రీతి
మీరువెంటరాగ మీపురంబునకును
తరలిపోదమయ్యా దనుజహరణ ! 51

వ ॥ అనిన స్వామి తనవెంటవారిని పంబవరకు వచ్చి సమయమును బట్టి అటనుండి పులులగుడని ఆదేశించెను 52

శా ॥ భూలోకంబున పంబతీరమునకున్ పోదమ్ము వేగంబటన్
నాలోలంబుగ స్నానపానవిధులన్ నా యాసముందీరగన్
వాలాయంబుగ వ్యాఘ్రరూపములతో భాసించుచున్ మీరలున్
నాలా వుంగనిపింప రండనగనానా రీతులన్ వేల్పులున్ 53

ఉ ప్రస్తుత లందజేయుచును పల్మరుమ్రొక్కుచు స్వామివెంబడిన్
స్వస్తులు గాగవచ్చిరటు సాగివనంబులలోన నెంతయున్
నిస్తుల మైన భావముల నిర్మలరూపులు పంబచెంతకున్
ప్రస్తుత భావసంపదలు పల్మరు తోచవనాంతరంబులన్ 54

ఆ॥ వె॥ కనుల కరువు దీర కాంచిరి పంబను
దేవ గంగబోలు తేజమెసగు
నారి పూరములను వసుధలోవిమలంపు
పుణ్యాగణ్యమన నగణ్యమనుచు 55

సీ ॥ అవగాహనంబులు ఆచరించిరివారు
స్వామితో పాటుగా సదయవృత్తి
చంద్రమౌళిని గూర్చి సారెకు జపియించి
సంతోషిత స్వాంతస్వాంతులయిర
పరిధానములు దాల్చి పరంగగ బూదియు
గంధంబు వరుసగా గణన దాల్చి
యున్నంత కొందరు ఉరుదీర్ఘకాయులు
ఋషులము మేమంచురూఢిగాగ
స్వామిపాదములకు సాగిల బడిమ్రొక్కి
హర్షజలధి తేలి రపుడు వేడ్క
కాంతిమలకు స్వామి కలదేవతాళితో
రమ్మటంచు బిలువ సమ్మతించె 56

ఆ॥ వె॥ విశ్వకర్మచేత విఖ్యాత మైనట్టి
స్వర్ణమందిరంబు స్వామికపుడు
కాంతిమలను నాడు కట్టించెమఘవుండు
స్వామి కొల్వుతీర స్వాంతమలర ! 57

సీ । కిటికీలు ద్వారముల్ పటురీతి నమరెను
చల్వపందిళ్ళును సారెకమరె
దీర్ఘకలటనట తేజాన వెలసెను
నిర్మలోదకరుచి నిజముతెల్ప
వనమయూరంబులు వాసిగజను దెంచి
నటనంబు జేసెను నాట్యగరిమ !
సామజంబుల గూడి సరసత నాలయ
ప్రాంగణావళి చుట్టుపరగ తిరిగె

తే॥ గీ॥ గరుడ గంధర్వకిన్నెర గములువేడ్క
దేవతావళి తోడను తేజమెసగ
తాపసావళి గూడటు తరలివచ్చి
కొల్వుదీరిన స్వామిని కొల్చిరపుడు ! 58

కం ॥ అష్టాదశ సోపానము
లిష్టార్థములన్ని నిండి ఇరులు దొలంగన్
శిష్టార్థులగుచు నెక్కిరి
అష్టాదశ మంత్రములను అపుడు పలుకుచున్ 59

శా ॥ ఆస్థానంబున స్వామియుండ మఘవుం డానంద సంధాయియై
ఆస్థానంబును జేరవచ్చు ఋషులన్ ఆతండు తాగూడుచున్
సంస్థాపన్ ధరధర్మమున్ వెసనటన్ సంప్రీతి దేవేంద్రుడున్
ప్రస్థానోచిత భేరి భాంకృతులతో పల్మారు చెల్వొందగన్ 60

సీ ॥ దిక్పాల కాళియు దివిజుల భక్తితో
రక్షింపు దేవేశ రయముననిరి
ఆర్తిని బాపుమో హరిహర పుత్రకా
హరియించు పాపముల్ అనిరి బుధులు
గరుడ గంధార్వాది కిన్నర తతిగూడి
ప్రణతులు గొను మంచు పల్కిరపుడు !
గజములున్ నెమళులు గల జంతుజాలంబు
గుడి చుట్టు దిరుగుచు కొల్చెనపుడు

తే॥ గీ॥ మందమలయాని లంబులు మరియు వీచె
కొలని తామర లందున కొసరి యళులు
తేనె సోనల రుచి జూచి తేజమెసగ
గానములు చేసె ప్రకృతియే గారవింప ! 61

ఆ॥ వె॥ పుష్పవృష్టి గురిసె పూవులు నాలయ
ప్రాంగణంబు నిండె ప్రభలు హెచ్చె
దివియు భువియు నిండె దీన బాంధవుకృప
సురలు మునులు మిగుల చోద్యమంద 62

తే॥ గీ॥ ఇష్టకార్యంబులందీర్చి ఇంపుతోడ
దేవనాథుండు దేవతల్ తేజమునను
హరిహరాత్మజు పాదాల నాశ్రయించి
జ్ఞానమోక్షంబులం గోరి ఘనత గనిరి 63

ఉ॥ రక్కసి బాధమాన్పితివి రాయిడి మాన్పితి దేవనీవికన్
నిక్కము బ్రోవవేయనుచు నిర్మలరూపుని స్వామివేడగా
అక్కజ మేమి లేదెదియు అంచితరీతిని పొందగా ధృతిన్
మిక్కిలి మోదమయ్యెనని మేల్మి భజించిరి భక్తులందరున్ 64

ఉ॥ అందరి పూజలన్ కరుణ అంచితరీతి గ్రహించి స్వామియున్
అందరి కోర్కెలన్ దనిపి ఆదట మోదము తోడుతన్ వెసన్
అందరి వీడుకొల్పెనట ఆగుడి మాయముగాగ జేసితా
నందరు దేవతల్ జనగ నాజ్ఞయిడెన్ యిరుమేలికిన్ ధృతిన్ 65

వ॥ మీరు యిరుమేలిలో నాకొరకై వేచియుండుడు, కాగల కొన్ని కార్యములను దీర్చి వచ్చెదను అని స్వామి వారిని బంపి ముందునకు సాగి శబరి తపముజేయు స్థలమున కరగి 66

## శబరికి మోక్షమొసగుట

చం॥ అటజనికాంచెనాశబరి అంచిత రీతిని వృద్ధ తాపసిన్
నిటల తటంబునన్ ధృతిని నిర్మల భావములుంచి వేడుకన్
పటుఘనదీర్ఘ బాహువుల పల్మరు మ్రొక్కుచు రామనామమున్
అటునిటు చూడకన్ జపము ఆవన సీమను జేయు ధ్యాననున్! 67

ఉ॥ తిన్నగ కన్నులన్ దెరచి తీయని చూపుల స్వామి జూచుచున్
ఫన్నుగ రామనామమును బల్కుచు మెల్లగ లేచి మ్రొక్కుచున్
మున్నుగ స్వామి పాదములు ముట్టగ శీర్షముతోడ మ్రొక్కగన్
ఉన్నతి గన్ననాశబరి ఊర్జిత జ్ఞాన పరంపరాంబుధిన్ 68

వ॥ శ్రీ రామాయణ కాలంలో శబరి తారక మంత్రమును పఠించుచుశబరి మలపైన తపమొనరించినది. శ్రీరామలక్ష్మణులటకు రాగా ఎంగిలిపండ్లను ఫలహారముగానిచ్చినది. లక్ష్మణుడు అన్నాలవి ఎంగిలి పండ్లు తినకుమని ఆక్షేపింపగా భక్తితో సమర్పించినది పవిత్రమైన దని రామవిభుడు భుజించెను.

శబరి తరించి శ్రీరామపాదారవిందములందు భక్తినుంచి మరణించగానామెకు శ్రీరామచంద్ర ప్రభుడు స్వర్గప్రాప్తిని కలిగించెను. పుణ్యమున్నంతవరకు స్వర్గముననుండి ఆమె శబరిపేరుతోనే విద్యాధరవనితగా బుట్టి శబరిమలపై తపమాచరించు చుండెను. 69

ఉ ॥ మోక్షము గోరి నాయువిద మోహము నొందగ జీవితాంబుధిన్
ఏక్షణ మందునైన కృప యేర్పడ అంచిత మైన భక్తితో
అక్షయ మైన మోక్షమును అంచితరీతిని గోరి యాదటన్
రక్షణకై తపించుచును రాముని రాకను గోరుచుండగన్ 70

కం ॥ వచ్చెడి వాడు ప్రభుండని
వచ్చెడి తా మోక్షమివ్వ వరదుడెయనుచున్
మచ్చిక నెదురుగనంతట
అచ్చెలువయు వెళ్ళి మ్రొక్కె ఆనందముతోన్ 71

తే॥ గీ॥ స్వామి దీవించె నామెను స్వాంతమలర
స్వామి పాదాలుసోకంగ సాగి మ్రొక్కి
పదియు నెనిమిది మారులు పడతి వేడ్క
తాప్రదక్షణలంజేసె తాల్మితోడ 72

ఆ॥ వె॥ రామ రామ రామ రమణీయ గుణధామ
విష్ణువీవె శివుడ వెంచనీవె
ఎందునుంటివయ్య ఏవిధిరక్షింతు
రమ్ము రాజవదన రయము బ్రోవ 73

ఉ ॥ యోగమె భోగ సంపదగ మోర్మిమెయిన్ యిటులుంటి బ్రోవవే
సాగెద తారకంబునను సంతస మింతట రాముడే వడిన్
సాగిటు వచ్చినట్టులుగ స్వాంతములోపల నేదలంచెదన్
మ్రోగెను ఘంటికారవము మోహము దీరెను ముక్తినివ్వవే 74

ఉ ॥ పండెను జీవితంబిదియు పండెను నాదగు నాయుపుంజముల్
పండెను దీర్ఘమౌ నెరులు పండెను నాడు తపఃఫలంబిటన్
పండెను జ్ఞానమున్ మరియు ప్రాపుగ మోక్షము నివ్వవే ధృతిన్
దండితపంబు జేసితిని దానవహంతక బ్రోవవే వెసన్ ! 75

తే॥ గీ॥ విష్ణుమూరితి రాముండు విమలయుతుడు
హరిహరాత్మజుడీవిట హరియు హరుడు
కూడి వచ్చిన స్వర్గంబు కువలయమున
గాగ దలచెద బ్రోవవే ఘనతతోడ 76

ఉ ॥ ఈగిరిపైన నుండెపుడు ఇంతిగ ఈయుగముల్ తరింపగా
సాగితి రామనామమున శాంతపు చిత్తములుల్లసిల్లగా
మ్రోగెనురామనామమిట మిక్కిలి పర్వత సీమయంతయున్
బాగుగ నాదు నామమున పర్వతమున్ తరియింప జేయవే 77

సీ ॥ అలనాడు రాముడై అవతరించిన నాడు
శబరికొండకు నీవు సాగివచ్చి
తారక మంత్రంబు తపియించి పఠియింప
నెంతయు కరుణతో నేలినావు
నేనిచ్చునట్టివి నీవు భుజింపంగ
ఎంగిలి పండ్లని యెంచకపుడు
భక్తితో భుజియింప పద్మాక్ష నీవప్డు
స్వర్గంబునకు నన్ను సాగనంప

తే॥ గీ॥ నిశ్చలానంద గరిమతో నెగడినీవు
వత్తుకలియుగమందున వాస్తముగ
వ్యాఘ్రవాహనమూర్తిగా వత్తునిటకు
నీవు జన్మంబు దాలిచి నిలుతువిచట 78

వ ॥ అని అలనాడు అంటిరని శబరి అనగా నాస్వామి శబరిని దీవించగా ఈ జన్మమున మోక్షము కొరకు తపస్సు చేయుచు నీకై ఎదురుచూచుచుండ అరుదెంచితిరి. అలనాడు 79

ఉ ॥ వారధి దాటిలంకకు న వారితరీతిని నేగివైళమే
ఆరసి దైత్యులందునిమి ఆదట సీతను గొంచురావెనీ
వేరయమంద లక్ష్మణుని వేగమె గూడి అయోధ్య జేరవే
భారము నీది స్వామియిక భాసుర వృత్తిని మోక్షమివ్వవే 80

ఉ ॥ ఆ ప్రభుభక్తి భావముల ఆహరిమూర్తి సుకీర్తినిన్ గన్
ఏ ప్రభుడైన జాలడన ఏపుననిన్గన నట్టిమూర్తిగా
నీ ప్రజలెల్లగాచుటకు నిక్కమువచ్చితి వీవురాముడే
నా ప్రభుడంచునెంచెదను నాదగువందనముల్ గ్రహింపవే 81

తే॥ గీ॥ హరిహర బ్రహ్మలప్పుడు అవనిపైన
దుష్టశిక్షణ చేయంగ దురమునందు
నిన్నుబంపిరి తెలిసితి నీరజాక్ష
స్వామి నాపూజలందుడు స్వాంతమలర ! 82

సీ ॥ సద్ధర్మ మొనరింప సద్ధర్మశాస్త్రవు
సత్యంబు జరిపింప సారమతివి !
విద్దెల వెలయింప వివరణంబుగ స్వామి
బ్రహ్మయంతటివాడ ప్రభుడవీవు
నీతిని బోషింప నిర్మలాత్ముడ వీవు
నీ భక్తులను బ్రోవనియమముతుడ
శబరినామపుకొండ స్థానంబుగా నీవు
సర్వవ్యాపకుడుగ సాగుచుండ

తే॥ గీ॥ అఖిల బ్రహ్మాండ భాండముల్ అధివసించి
కృపను భక్తుల బ్రోతువు కేలుమోడ్తు
అరసి రక్షింపు స్వాముల నక్షయముగ !
నిఖిల పావన నిర్మల నీరజాక్ష 83

చం అడుగులు తామరల్ గనగ ఆదట కన్నులు గూడ తామరల్
పుడమి పఠింప నామమ పూర్వము డెందములందు నిండగా
ఉడుగక భక్తులందరిని ఊరట జెందగ బ్రోతు వెంతయున్
విడువవు భక్తులందరిని విశ్రుతకీర్తిని ముక్తినియ్యవే 84

తే॥ గీ॥ స్వామి యంటిని ఓ స్వామి స్వామి యంటి
సాధుశీలుడ బ్రోవవే స్వామియంటి
కృపదలిర్పంగ మోక్షంబు కృపనొసంగు
రక్షనిడు మయ్య నిడుమయ్య రాజవదన 85

ఉ ॥ సింహము నేను గున్నిచట చిందులు ద్రొక్కగశాంతమూర్తులై
సంహరణాది కార్యముల సాగక స్నేహపు శీతలన్ గనెన్
సంహరణాది కార్యముల సాగగ రాక్షసశ్రేణి ధ్వంచుచున్
సింహబలుండ వైదనరు శ్రీపతి పుత్రుడకావవే వెసన్ 86

ఉ ॥ ఈ గిరి నీదు పాదములు ఇంపుగ సోక పవిత్రమయ్యెడిన్
ఈ గిరి నాదు నామమున ఈ జగమందున నిల్పవే ధృతిన్
బాగుగ నాదు నాత్మయును భాసిలమోక్షపదంబు నీయవే
వేగమే విష్ణులోకమును వేధ్యత నేగగ దారిజూపవే 87

తే॥ గీ॥ శబరి గిరియంచు నామంబు చాలగల్గ
నీదు కొండకు నామంబు నిక్కముంతు
శబరి గిరిపైన ధ్యానాన సాగుచుందు
భక్తసందోహములు భక్తి సల్పుచుండ ! 88

ఆ॥ వె॥ హరియు హరుడు గూడ అవనీతలంబున
వేరువేరుకాదు వెలది చూడ
హరియు హరుడె జగతి హరుడును హరియగు
ద్వైత బుద్దిజూడ తగదు శబరి 89

ఉ ॥ శ్రీరఘురామ మూర్తిగని చేరి ముదంబున భక్తిసల్పవే
ఆ రఘురామ మూర్తికిని అంతట యెంగిలి పండ్ల నీయవే
సారెకు భక్తులన్ దనుపు స్వామటుపండ్లు భుజింపడే వడిన్
కూరిమి నిన్ను బ్రోచెగద కోమలి కోమలమైన రీతులన్ 90

శా ॥ సాక్షాద్విష్ణుడు రామమూర్తి యటులన్ స్వాంతంబు రంజిల్లగా
ఆక్షేపంబుల సేయలక్ష్మణునికిన్ అడ్డంబుగా నప్పుడే
నిక్షేపంబుగ తాభుజించె ఫలముల్ నిక్కంపుప్రేమంబునన్
రక్షాధీ నిధికాంతులన్ దనిపె నా రామన్ శుభాశీస్సులన్ 91

తే॥ గీ॥ పతిత పావన మైనట్టి పరమపురుషు
రామతారక దశరథ రాము దలచి
కొండ బండల తపమును కొనసరిచేసి
రామ నామాంకిత ధ్యాన రమణివైతి 92

ఉ ॥ ఈ గిరి నీదు ప్రార్థనల ఇంపుగ తా గ్రహియించి వేడుకన్
మ్రోగగ రామ నామమును మ్రోగహృదంతర సీమలోపలన్
మ్రోగగ మౌనమూర్తియయి మూర్ధమురామపదాంకితంబుగా
సాగెను రామరామయని స్వాంతమురంజిల భక్తకోటికిన్ 93

ఉ ॥ పావన మయ్యె నీగిరియు ప్రాపిత మోక్షపదంబు నీయగా
పావన మయ్యె నీ హృదియు సాటిగ మోక్షపదంబు నీయగా
కావున నిచ్చెదన్ మగువ కాంచుము మోక్షపదంబు నీవిటన్
దీవెనలిచ్చి బ్రోచెదను తేజము నిల్పెము భూతలంబునన్ 94

ఆ॥ వె॥ శబరి ధ్యాననిష్ఠ స్వాంతంబులోనుండ
భవుని పట్టివేడ్క పడతి శిరము
పైన చేయినుంచి పల్కెను ఓం నమః
శ్శివ యటంచు పరమశివుని గూర్చి 95

వ ॥ అంత శివుడు ప్రత్యక్షము కాగా 96

ఆ॥ వె॥ దివ్యకాంతులంత దేదీప్యముగ వెల్గి
శబరి తనువు నుండి స్వాంతమలర
శివునిలోన జేరె శ్రీఘ్రంబుగా నాత్మ
చిన్మయంబుగాగ చెలగె నంత 97

ఆ॥ వె॥ మిథ్యసుఖము లేల మిక్కిలి గోరగా
నిత్యసుఖము నిత్తు నిర్మలముగ
సర్వవ్యాపకంబు సాయుజ్యమియ్యది
కొమ్మటంచు నిచ్చె కోమలికిని 98

ఉ ॥ నిత్యసుఖంబు నిచ్చితివి నిర్మల రూపుని జేసితీ సతిన్
నిత్యము నిన్ను గొల్వగను నీదగు నాత్మను నాత్మమై చనన్
ముత్యము పోల్కినీవనిత మున్నుగజేసిన పుణ్యసంపదల్
అత్యతిమోదమందగను అంచిత రీతిని మోక్షమిచ్చితే 99

తే॥ గీ॥ శబరి గిరిపైన నెలకొని స్వాంతమలర
అభయముల నిచ్చి రక్షించి ఆదరమున
ప్రజల బ్రోవుము మహితుడై ప్రాభవమున
శబరితపమును జేసిన స్థలముగాన 100

ఆ॥ వె॥ అనుచు బల్కి శివుడు అంతట మాయమై
వెండికొండ జేరె వేడుకలర
స్వామి ముందునకును సాగివచ్చుచునుండ
కానిపించె హనుమ కాంతులలర ! 101

## హనుమద్దర్శనము

ఆ॥ వె॥ శివుని తేజమగుచు శ్రీహరి గొల్చుచు
రామ రామ రామ రామ యనుచు
నిత్య జపము సేయు నిర్మల రూపుని
హనుమ గనియె స్వామి హర్షజలధి ! 102

శా ॥ కల్పాంతంబిటు రామ నామమును దా కాత్యాయనీ సత్కృపన్
నిల్పుంభక్తినిడెందమందునను నీ నిక్కంపు సద్భావనన్
కల్పాంతంబగు కాలముంజనినచో కాకుండునే భక్తిమై
నిల్పంజాలడు రామనామజపమున్ నీవాయు పుత్రుండిటన్ 103

తే॥ గీ॥ కన్నులంతట దెరచితా పన్నుగాను
వాయు పుత్రుండు జూచెను వాసిగన్న
హరిహరాత్మజు నానంద భరితుడగుచు
హరియు హరుడును నీవని అతిముదమున 104

తే॥ గీ॥ వచ్చినాడవు నా స్వామి వరదుడగుచు
కాంచితిన్ నిన్ను నారాము గాంచినట్లు
తరమెనిన్నెంచ మణికంఠ తరమెనాకు
హరిహరంబగు రూపంబు అమలచరిత 105

తే॥ గీ॥ బ్రహ్మతేజమ్ము రుద్రరూపమ్ము తోడ
పదియు నెనిమిది యైనట్టి పదిలమైన
శివుని యవతార మీవయ్య చిద్విలాస
అంజనానంద నందన హర్షమయ్యె ! 106

ఆ॥ వె॥ అబ్దిదాటి సీత నంతట మాటాడి
రావణునకు బుద్ధిరయముగరపి
లంక గాల్చి వచ్చి లలన చందమువేగ
రాఘవునకు జెప్పి రంజిలితివి 107

తే॥ గీ॥ రామ కార్యార్థివైనాడు రయముతోడ
తెచ్చిసంజీవ పర్వత మిచ్చినావు
లక్ష్మణుని మూర్ఛతేర్చంగ నక్షయముగ
పావనీ పావనుండవు పరమపురుష ! 108

శా ॥ మీ పాదంబుల సాక్షి సేవకుడనే మీ కుందగం జేయగా
మీ పాదంబుల భక్తునిన్ బొగడగా మీరెన్ భవావేశముల్
శ్రీపాదంబుల రామచంద్రప్రభునిన్ చిత్తంబులో నిల్పితిన్
నీ పాదంబులు రాము పాదములునున్ నిక్కంబొక్కటే సత్ప్రభూ ! 109

చం ॥ కలియుగ మందు భక్తియది క్రన్నన తగ్గెను గాన సత్ప్రభూ
నిలుపుము భక్తిభావముల నిర్మలరూపులు గాగ నీప్రజల్
కలుషములేని జీవనము గాంచగ నీ జనులెల్ల వేళలన్
మలచుము వారి బుద్ధులను మంజుల రీతుల సత్పథంబులన్ 110

ఉ ॥ జ్ఞానముతోడనీ జనులు గాంచగ మోక్షము దేవదేవుడై
మానవ జాతులందనుప మార్గమునీవిధితోడ నుండగా
గానలనీగిరిన్ దరిసి గాంచగ జన్మతరించగా ధృతిన్
మేనులు ఆత్మలున్ కరుణ మేకొననీపదముల్ భజింపరే 111

ఉ ॥ ద్వాపర మందు కృష్ణుడయి దాతగు రీతిని జాంబవంతుతో
నేపున యుద్ధముం జరిపి నేర్పున నాతని కన్నె గోరుచున్
ఏపగదిన్ రఘూద్వహుడు ఏపుగ సత్కృప జూపెనంతటన్
ఆ పగదిన్ గదాయనుచు అంచిత రీతిని గానిపించితే ! 112

చం ॥ అని మనమందు తాదలచ అంచిత రీతిని జాంబవంతుడున్
పనిగొని వచ్చెనంతటను ప్రాభవయుక్తిని స్వామి గొల్వగా
వినయముతోడ వందనము విశ్రుత రీతిని జేసెనంతటన్
ఘనముగ పాదపద్మముల గాంచెను గాంచగరాముడేయనెన్ 113

చం ॥ అటులను సంభ్రమంబునను అంచిత రీతిని జాంబవంతుడుం
పటుగతి మారుతీ మణియు ప్రాంజలులందనియించి వేగమే
నిటల తటంబు సోకగను నిర్మల భావములుంచి చేతులన్
పటుగతి చేర్చి మ్రొక్కుచును ప్రార్థనలన్ వెసజేసెనచ్చటన్ 114

**సప్తమ సోపానము సమాప్తము**

## శ్రీ అయ్యప్ప మహాభాగవతము

# తృతీయోల్లాసము - అష్టమ సోపానము

## ఇచ్ఛాయుతము- అహంకార రహితము

ఉ ॥ వారిజ నేత్రుడంతటను వారిని చేతుల కౌగిలించుచున్
మీరలు రామనామమున మిక్కిలి పావనులైతి రచ్చటన్
కోరి భజించువారలకు కొంగున బంగరు దైవమయ్యెడున్
సారపు ధర్మముంగలుగ సారెకు నుండుడు విష్ణుభక్తితోన్ 115

ఉ ॥ మాల ధరింపజేయుదును మాధవు సత్కృపగల్గునట్లుగా
మేలుగ భక్తితోడుతను మేకొన నీప్రజనెల్లబ్రోచెదన్
చాలగ మీదు కోరికను సొంతము సాగగ జేతువైళమే
మాలధరించి నంతటనె మాన్యత గల్గు ప్రజాళికిన్ వెసన్ 116

చం ॥ కలియుగ మందు నేడిటుల కాపురముల్ వెసదీర్చిదిద్దగా
మలినము లేని జీవనము మాటికి గల్గగ జేసి పౌరులన్
సలలిత భక్తిబ్రోచెదను సాగెద భక్తుల స్వాంతమందునన్
తొలగుడు చింత మీరలని తోయ దళాక్షుడు వారితోననెన్ 117

ఉ ॥ వారలవీడు కొల్పిటుల వాసిగదాయిరుమేలిచేరగన్
మీరిన భక్తిదేవతలు మిక్కలి ప్రీతిని మ్రొక్కిరందరున్
కోరి భజించి రందరును కోమల రూపునిడెందమందునన్
మీరిన భక్తివాసవుడు మీదగు కార్యము జెప్ప వేయనన్ 118

## వ్యాఘ్రవాహన స్వామి బయలుదేరుట

చం ॥ మగ పులిగాగ వాసవుడు మాటికి దేవతలందఱున్ వెసన్
సుగతిగ నాడు వ్యాఘ్రములు సూటిగ గాగను కొందరందునన్
వెగటన కుండ కూనలుగ విశ్రుత రీతులరండు వేగమే
మగపులి పైన స్వారియయి మాటికి వచ్చెదరండు మీరలున్ 119

వ ॥ మగపులిపైన స్వామి స్వారియయి వచ్చుచుండగా నాడు పులులను కూనలును వారిననుసరించి ఇరువైపులను వెనుక వైపునను వచ్చుచుండగా అడవులలోని మృగములు భయముతో నలువైపులకు పరుగిడ జొచ్చినవి 120

ఉ ॥ జింకలు దుప్పులున్ వెరచి చేరెను కొండలు కోనలన్ వడిన్
సంకట మంది యేన్గులును సారెకు పర్విడె నాల్గువైపులన్
మంకువ తోడ కేకులును మాటికి వ్రాలెను వ్రాకులందునన్
యుంకవ తోడుతన్ గుహలు యూరట జేరెక వీంద్రసంఘముల్ 121

ఆ॥ వె॥ మహిష సముదయములు మడుగుల జారబారె
సర్పజాతులన్ని సరగ వెడలి
పుట్టలందు జేరె పుడమి పైగలపుల్గు
లన్నిచెట్ల జేరె నతిశయముగ 122

వ ॥ ఆవనశోభ చూడచూతకేతకీ సముదయంబును పుష్పఫలవృక్ష సంశోభిత నానావిధ తరులతా గుల్మ సంశోభితంబగు వృక్షవాటికా కాంతార మందు ముందునకు బోవు పులుల గుంపుచూడ సంభ్రమాశ్చర్య భయవాహంబయి యొప్పె ! 123

ఆ॥ వె॥ దేనికైనగాని తేజంబు నిండార
మలగ వెందు పులులు మగటిమిగన
స్వామితోడ రాగ స్వాంతంబులవినిండ
ముందునకును సాగె మోదమలర 124

వ ॥ ఇట్లు కాంతారంబు వెలువడి గ్రామసీమలకు సమీపమందు ప్రవేశింపగనే ! 125

సీ ॥ వ్యవసాయ ముంజేయ వచ్చెడి రైతులు
పశువుల వదలుచు పరుగులిడిరి
పశువులు ఒక త్రోవ పరుగు లెత్తుచునుండ
రైతులు ఒకత్రోవ రయముజనిరి
నాగళ్ళు భుజముల నాణ్యాత ధరియించు
వారలు వానిని వదలిచనిరి
కూలినాలియు జేయు కోమలాంగులు గూడ
పరుగులు దీసిరి ప్రాణభీతి

తే ॥ పచ్చికలు మేయు పశువులు పరుగులిడియె
గొఱ్ఱెలును మేక లంతట గూడి చనియె
పల్లెసీమల ప్రజలంత భయము నంది
సందడింబడి జడిసిరి సరగనంత ! 126

ఉ ॥ పల్లెల పట్టణంబులకు ప్రాపుగ స్వామియు నేగుచుండగన్
ఎల్లలు దాటి ఆపులులు ఏపున పందళరాజ్యమంతటన్
సల్లలితంబుగా జనిన స్వామిని జూచుచు పౌరులందరున్
యుల్లములంభయంబులవి యూకొని నంతటసంచలిపంగన్ 127

ఆ॥ వె॥ చెట్లపైకినెక్కి చేరిగీముల పైకి
నిక్కినిక్కి చూచి నేపుమీర
భయదచిత్తులగుచు బలుపాట్లుబడుచును
భయముతోడ ప్రజలు బడలిరంత 128

ఉ ॥ ఈ మణికంఠస్వామియిటు ఈ పులిపైనను ఎక్కి వచ్చుటల్
ఏమనవచ్చు నీపులులు ఎవ్విధ వెంటను నంటి వచ్చుటల్
కోమల రూపుడైనప్రభు కోమల చిత్తమదెట్టిదో కదే !
పావనులైన నీజనులు పావనతన్ గలిగింపనేమొకొ ! 129

ఆ॥ వె॥ అనుచు కొందరంత ఆదటచనుదెంచి
రాజశేఖరాఖ్య రాజుతోడ
పులిని స్వారియగుచు పులులతోనేతెంచు
నతని పుత్రుగూర్చి అపుడుదెల్ప ! 130

ఆ॥ వె॥ సంభ్రమమ్ముతోడ స్వాంతమ్ము లోపల
భయదచిత్తుడగుచు పరగనుండి
తనదు పుత్రుడగుట తలపోసియెదలోన
తరలివెళ్ళి నిలిచె తనయునెదుట 131

ఉ ॥ ఈతడు మానవుండనగ నిత్తరిచెల్లదు ఎట్లుజూచినన్
కాతర నేత్రులన్ దనుప కాంచనగర్భసమానుడీతడే !
ఈతను రూపసంపదలు నేర్పడజూచిన దేవుడీతడే
నాతరమౌనె పంబసుతు నాసుతుడంచుదలంపబోలునే ! 132

సీ ॥ పులి వాహనుండుగా పులులతో నేతెంచు
పుణ్యాత్ముడితడెట్లు పుత్రుడయ్యె
శక్తిసుతుండుగా సదమలంబగు రీతి
బలువ్యాఘ్రవాహన ప్రభుడితండు
నిశ్చయంబుగ నీశు నిఖిలాంశ వేద్యమై
పంబ సీమనునాకు ప్రభుడు దొరికె
కాత్యాయనీ దేవి కలరూప సంపద
కల్గిన సూనుడై గల్గె నితడు !

తే॥ గీ॥ పులులు గోవులవలె వెంట పాల్పుగాంచి
వచ్చు చుండెను పులిపైన వచ్చు నితడు
శక్తి సుతుడంచు దలచెద స్వాంతమందు
నిస్తులంబైన భక్తిని నెరపవలయు 133

వ ॥ అని దూరమందుండి తలపోయుచు మణికంఠస్వామి పులులతో భవనము
సమీపంపగనే రాణియు- మంత్రియు దూరమునుండి చూచుచుండ రాజశేఖర
సార్వభౌముడు పుత్రుడను చనువుకొలది సమీపించి 134

ఉ ॥ ఓ మణికంఠసూనయిది ఉత్కటమయ్యెను వ్యాఘ్రపుంజముల్
వేమరు రాజధానికిని విశ్రుత లీలలవచ్చునంతలో
ఏమరు పాటులేక ప్రజ ఎంతయుపర్వులు పెట్టుచుండగా
నీమతిలో దలంపుమిక నిక్కమువీనిదొలంగజేయవే ! 135

చ ॥ అనవుడు స్వామి యిట్లనియె అంచితరీతిని క్షీరముల్ వెసన్
ఘనతను పిండగా వలయు గాదెయిటన్ పులులందు వేగమే
అనవున నౌషధంబునకు అమ్మకు గూర్పగనెంతయేనియున్
వినతుడనౌచుదెచ్చితిని వీరత నీ పులిబృందముల్వెసన్ 136

చం ॥ పిలువుడు మంత్రిపుంగవుని ! పిండగ సేవక బృందమున్ వడిన్
పిలువుడు పాలనుంబితుక ప్రీతిగక్షీరములుల్లసిల్లగా
పిలువుడు వైద్యునీదెసకు ప్రీతిగనౌషధమింతలోపలన్
కలుపగ పాలతోనిటను ప్రాపుగ నమ్మకు ఔషధంబుగా 137

ఆ॥ వె॥ అమ్మకిడగ వలయు ఔషధంబిప్పుడు
లెమ్ము తండ్రి వేగ లేశమైన
కాలమిట్లువృధగ గాకుండఅమ్మకు
తలను గలగు నొప్పి తొలజేతు ! 138

ఆ॥ వె॥ అమ్మఋణము దీర్చ ఆవిర్భవించని
పుత్రుడేల పుట్ట పుడమి యందు ?
మాతృ ఋణము దీర్చు మనుజుండె మనుజుండు
మమత లేని సుతుడు మనగనేల ? 139

తే॥ గీ॥ తల్లికంటె వేరు దైవంబు లేదిల
తల్లి-తండ్రి -గురుడు దైవమనుచు
తలచు వారిలోన తల్లియే ప్రథమంబు
తల్లి కోటిదైవ తలముల సమము 140

చం ॥ అనగను రాజశేఖరుడు ఆదట పుత్రునితోడతాననెన్
వినుమటు నీవు కొండలకు వేగమెవెళ్ళిన యంతలోపలన్
తనతలలోని భారమది తల్లికిబాసెను చోద్యమందగన్
వినుతయశుండ వ్యాఘ్రముల వేగమెబంపువనంబు లోనికిన్ 141

ఆ॥ వె॥ పులులజూచి ప్రజలు మూలలడాగిరి
భయద చిత్తులగుచు బడలినారు
కాన పులులబంపు కానకువేగంబ
కరణజూడు ప్రజల కలుషహరణ ! 142

ఆ॥ వె॥ నీ వరణ్యపథము నిక్కంబుగమియింప
నంతలోనె మాసె నతిశయముగ
రాణిశీర్షమందు రాయిడి యాబాధ
పులుల పాలు వలదు పుణ్యచరిత ! 143

ఆ॥ వె॥ పులుల రూపుగొన్న పుణ్యాత్ములైనట్టి
దేవతతులువేగ తేకువ గని
మాయమగు డటంచు మంజులస్వాంతుండు
స్వామి పలికినంత సరగవారు 144

ఆ॥ వె॥ మాయమైరి అంత మహిమకు వెరగంది
(మ్రాను పడిరి జనులు మరలనచట
స్వామి పాదములకు సాగిలబడి(మ్రొక్కి
చనిరి జనులు వారి సదనములకు 145

తే॥ గీ॥ సాదరంబున స్వామిని సదన మునను
అమరియున్నట్టి సభలోన అధివసింప
జేసి రాజును రాణియు జేరియచట
సచివు తోడను గూడిరి సభనుజేయ 146

వ ॥ ఓ మణికంఠస్వామీ - నీవు నాకు పంబచెంత లభించిన బిడ్డవని నాకుమారుడవని తలంచితిని స్వామి నీవెవరవు ? నీనిజరూపమును తెలువగోరుచున్నాను. ఈ పులులపై మీరు వచ్చుటయు అవి మాయమగుటయు పరమాద్భుతముగా నున్నది. నన్ను మన్నించి కలరూపు తెలియవేడెదను అనగా నా స్వామి నేను హరిహరులచే భూలోకమునకు బంపబడిన హరిహరాత్మజుడను అడవులకు వెళ్ళి మహిషిని మర్ధించి సంహరించి దేవేంద్రునకు దేవలోకాధిపత్య మిప్పించితిని మగపులిగా మారిన దేవేంద్రునిపై స్వారిచేయుచు ఇతర దేవతలు పులులు గాను పులిపిల్లలుగాను మారి నావెంటరాగా ఇటకు వచ్చితిని హరిహరాత్మజుడుగా పుట్టి భూలోకమందు పండ్రెండు వత్సరములు ఒక రాజుసేవ జేసిన వానిచే తనకు మరణము కలుగునట్లు వరమిమ్మని మహిషి కోరి(బ్రహ్మవలన వరము పొందినది ఆమెను సంహరించుటకే నేను జన్మించితిని అనగా .... 147

## స్వామి రాణిని మంత్రిని మన్నించి తనకు పట్టాభిషేకము వలదనుట

ఆ॥ వె॥ స్వామి పాదములకు సాష్టాంగముగ(మ్రొక్కి
సచివుడనియెనంత విచలితుడయి
నాదు తప్పులన్ని నధిపమన్నింపుము
కృపణుడైతి(బ్రోవు కేలుమోడ్తు 148

వ ॥ స్వామీ ! రాజరాజునకు రాజ్యమిప్పించదలంచి మీకు విషమిప్పించితిని. యాగము చేసి రోగమును గల్గించితిని - చివరకు రాణికి దుర్బోధచేసి తలనొప్పి నటింపజేసి పులిపాలు తెప్పించ గోరిన పాపాత్ముడను. ఇవి

మహిమాఢ్యులైన మీకు తెలియనివి కావు నన్ను మన్నించినను సరియే లేదా శిక్షించినను సరియె. నాపాపమునకు మితిలేదు అని విన్నవించగా రాణియిట్లనియె 149

ఉ ॥ పెంచితి పెద్దజేసితిని పేరిమి కూరిమితోడుతన్ వెసన్
అంచిత రీతినంతటను గల్గెను సంపదలెన్ని యేనియున్
సంచితమెల్లబాసివెస సన్నుతికెక్కగ పుత్రుగాంచితిన్
మంచి తనంబులేకిటుల మాత్యుని బోధకులొంగితిన్ ప్రభూ ! 150

ఆ॥ వె॥ నీవు గల్గ సుతుడు నిక్కంబు గల్గెను
నీవు గల్గ సుఖము నిండె ధాత్రి
నీవులేక జగము నిజమంధకారంబు
నీవుకల్గుటరుదు నిరతిశయము 151

ఆ॥ వె॥ రాజ రాజుకంటె రమణీయమూర్తివి
రాజువగుము స్వామి రాజ్యమునకు
మాదు తప్పులన్ని మన్నించి బ్రోవుము
కన్నతండ్రివంచు కాంతుమయ్య ! 152

ఆ॥ వె॥ రాణి, మంత్రి కుట్ర రాజుకు దెలిసెను
చంద్రనిప్పులయ్యె చాలకనులు
ఎంతద్రోహమంచు ఎంతొదూరెను రాజు
రాణి మంత్రివరుల రాజసమున 153

మ ॥ మణికంఠుండిటు పట్టువట్టగనెనే మాధుర్యతన్ మానుచున్
గుణసంయుక్తుడగాక వన్యములకున్ ఘోరంబుగా బంపితిన్
మణికంఠానను వేద్యమౌనటులమున్ మన్నింపగాబోలునే
ప్రణతుల్ జేసెద రక్షసేయవెయికన్ ప్రార్థింతునశ్రాంతమున్ 154

తే॥ గీ॥ నీవే జ్యేష్ఠుండవగుదువు నిక్కముగను
నాయదృష్టంబు సర్వంబు నాదు బ్రతుకు
సర్వమున్ నీవ సదయత సరగ స్వామి
పట్టముంగట్టెదను నేడె పదిలముగను 155

తే॥ గీ॥ రాజ్యపాలన విదులను రయముజేసి
మమ్ము ప్రజలను గాపాడు మంజులముగ
కాదటంచును బలుకంగ గాదు నీకు
వేదమయుడవు మముబ్రోవు వేద్యముగను 156

చం ॥ అనుచున్ అందరున్ బలుక అంతటస్వామియు బల్కె నిట్టులన్
ఘనముగ భక్తులన్ దనుప గాంచితి జన్మమునీశుపట్టిగా
వినుత యశుండగా నిటను విస్తృత కీర్తులు నింపగా ధృతిన్
మనమున హెచ్చె కోరికలు మాటికి దీవెనలిచ్చిబ్రోవరే ! 157

వ ॥ అనగ మంత్రి స్వామీ పూర్వయుగమున మందర ఉపదేశముతో కైక శ్రీరామచంద్రుని అడవులకు బంపెను. నేడునేను మహాపరాధము జేసి కైకపాత్ర ధరించుటేగాక రాణిగారి మనస్సును మార్చి కానకు నిన్ను బంపిన నీచుడనునన్ను దండింపుడు అనగా రాణియు పుత్రామణికంఠా నేను ఆడిన కపటనాటకమును మన్నించుమనగా మణికంఠ స్వామి ఇట్లనెను. విష్ణ్వంశసంభూతుడైన శ్రీరామచంద్రుడు జన్మించినది దండకారణ్యమున ఖర దూషణాదులను సంహరించుటకు లోకకంఠకుడై దిక్పాలురను దేవేంద్రుని హడలెత్తించిన రావణుని సంహరించుట కొరకు మందర ప్రేరణ నిమిత్తమాత్రమే కైక వరములు గూడ నిమిత్తమాత్రమే నేడు నేను రాజ్యపాలన జేయుటకై జన్మించలేదు శబరిమలపైనుండి భక్తులను బ్రోచుటకై జన్మించితిని దైవకార్యమును దీర్చితిని మీరుచేసినవి కేవలము కుట్రలుకావు. జరుగవలసిన పనులకు దోహదకారులు ఎవరి తప్పు ఇందులోలేదు. ఎవరిని మన్నించ బనిలేదు. నాతండ్రి యైన రాజశేఖరరాజు ఆజ్ఞతో శబరిమలకు వెళ్ళెదను అని చెప్పెను. 158

అష్టమ సోపానము సమాప్తము



## శ్రీ ... ఎహాభాగవతము

# తృతీయోల్లాస... - నవమ సోపానము

## ప్రాప్తియుతము- సత్వరహితము (త్రిగుణరహితము)

వ ॥ నేనెవడనో చక్కగా మీకు దెలియునట్లు నావిశ్వరూపమును చూపెదను చూడమని ఎన్నికోరలు ఎన్నిమిన్నగ జూపుచూపులు చూడుమా ఇటు చూడు చూడు హరియునేనే హరుడనేనే ఆపరబ్రహ్మంబునేనె నేను కానిది ఈ జగంబున నేదియును లేనెలేదు. జయమునేనె అధ్వయమునేనే సర్వాంతర్యామినినేనే త్రికాలములలో సంచరింతును కాలమూర్తిని వేలమూర్తుల రూపములు నేనే అన్నినేనే అంతనేనే నేనే శక్తిని నేనె ప్రకృతిని ప్రకృతికి నాథుడను సైతమునునేనే పరమశివుడను సృష్టిచేసే బ్రహ్మనేనే లోకముల గాచే విష్ణుమూర్తిని గూడనేనే నేనె సత్యం జగన్నాథులకు నాధుడ భవబంధముల కతీతుడ భాసురాంచత జ్ఞాన మూర్తిని నిత్యవర్తిని సత్యవర్తిని బ్రహ్మాండవర్తిని నాదు విశ్వరూపము జూపెదను జూడు మనుచు 159

తే॥ గీ॥ వివిధ వర్ణాలు ఆకృతుల్ విశదముగను
మానుషేయంబులవి గావు మహిమదనర
వసువులును రుద్రులంతట వారునాదు
దేహమందున నొకచోటె తేరిచూడు 160

వ ॥ అనగమిరిమిట్లు గొల్పు విశ్వరూపంబు చూడలేక భయభ్రాంత చిత్తంబున .
. . . ఆ రాజు . . . . . . 161

గేయము: "నీతేజ మజేయమయ్యా నిక్కంబుగనాస్వామి
దుర్ని రీక్ష్యమది చూడగ జాలను దివ్యచక్షువుల
బ్రసాదింపుము. దీన బాంధవా అరసిరక్షింపుము
దేహి దేహి దేహిని ప్రభూ పాహి పాహి పాహియంటిని
పరమాత్మానన్నేలుము -
మీ పాదముల చెంత నేనుంటినో ప్రభూ
నా పాపపుంజముల హరియింపుమో ప్రభూ" అని ప్రార్థింపగా 162

తే॥ గీ॥ చూడ జాలవు నీకంట చోద్యముగను
దివ్యదృష్టి ప్రసాదింతు దీన జూడు
నాదువిశ్వరూపంబును నమలచరిత
ఋషులు దేవతల్ చూడని రూపుగనము 163

తే॥ గీ॥ కోటి సూర్యప్రభా భాస కోహటంబు
కాంతిపుంజాలు ఘోరంబు కనులజూడు
వివిధ దృశ్యాలు రూపాలు విస్తృతంబు
ఘోర వీరంబు గాగను గోచరించు 164

తే॥ గీ॥ హరిహరులు బ్రహ్మరుద్రులు అచటదేవ
దానవ గణాధి పతులును ధరను గల్గు
వారలందరు గనిపించి వరలు చుండ
బరమె బ్రహ్మంబు తానైయె బరగుచుంట 165

చం ॥ మిడుతలు అగ్నికుండముల మిక్కిలి చేరుచుభస్మమౌనటుల్
విడువక జీవులందరును విశ్వస్వరూపుని నోళులందనన్
తడబడి చేరుచుండిరటు తానెజగత్ప్రభుడౌచునుండగా
గడవగ నేర్పునే యొకడు గల్గిన కర్మమువేలమై చనన్ 166

ఉ ॥ చాలును చూడజాలనిక స్వామివిబ్రోవుము నీదురూపమున్
బాలుని గాగ పూర్వమున భాసిలుభంగిని చూడగోరెదన్
చాలభయంబు తోడుతను స్వాంతము భ్రాంతము అయ్యెనోప్రభూ
మేలగు దీవనల్ ఇడుచు మోదముతోడుత నాదరించవే 167

వ ॥ స్వామి బాలుని వలె తనతొంటి రూపమును జూపెను రాజు - ప్రభూ తనయుడవని తాలిమి వీడి ఎప్పుడెప్పుడు ఏమనంటినో జగత్పతివి - మన్నింపుము అనగా ప్రభుడిట్లనియె . . . 168

తే॥ గీ॥ కడలి గలిసిన నదులన్ని కడలిలోన
రూపములు వేరుగా లేక రూఢినొక్క
సంద్రమైనట్టు బ్రహ్మమే సంద్రముగను
జీవులందునముక్తులై చెలగు చుంద్రు 169

ఉ ॥ రాముడు కృష్ణుడున్ పరశురాముడు బూభరణంబుమాన్పగా
వామన రూపమున్ గలుగ వారిత రీతిజరించినట్లుగా
వేమరు రాక్షసాధముల విశ్రుత లీలవధించి భక్తులన్
కోమల మానసాబ్జముల కూర్మినిబ్రోచితి నాయుగంబులన్ 170

తే॥ గీ॥ సంభవింతును యుగయుగ సముదయముల
సాధురక్షణ సేయంగ స్వాంతమలర
నాటికృష్ణుడన్ విష్ణుడన్ నవనినేనే
నేనే సర్వంబు సత్యంబు నేనెయగుదు 171

చం ॥ శివుడని విష్ణుడంచనుచు చిందులుద్రొక్కుచు పుట్టుచుందునే
భవముల నైన నేనెయిటు భాసురవృత్తిజరింతు మోదినై
భువనము శాంతిసంపదల పూర్వముగాగను పొందునట్లుగా
సవనము పోల్కి సాగునటు సంతసమందగ బుట్టిబ్రోచెదన్ 172

కం ॥ దత్తాత్రేయుడ నగుచును
చిత్తానంద కరుడగను శ్రీశుల కృపచే
చిత్తామల సంస్కృతినై
అత్తరి బుట్టితి త్రిమూర్తులంతట బ్రోవన్ 173

తే॥ గీ॥ మహిషి మర్దన స్వామిగా మహిజనించి
దేవనాథుని బ్రోవంగ తేజమెసగ
బుట్టినాడ పరబ్రహ్మ మిట్టియెడల
మహిషి దునుమాడిబ్రోచితి మఘవు నంత 174

తే॥ గీ॥ హరిహరాత్మజుడగుచును అతిముదమున
పుట్టినీపట్టి నైతిని నిట్టియెడల
దేవనాధుని రాజ్యంబు తేకువగన
దేవనాథునికిచ్చితి తేజమెసగ 175

తే॥ గీ॥ దేవలోకానికేగినే తేజమెసగ
మహిషి భువిపైకి బడదోసి మహితవృత్తి
జంపి దేవేంద్రుబ్రోచితి జనకనేడు
పులులతో గూడవచ్చితి పుడమిపైకి 176

తే॥ గీ॥ దేవకార్యంబు దీర్పంగ తేజమెసగ
హరిహరాత్మజుడై పుట్టి అచటమీకు
పంబశిశువుగ జేరితి ప్రణతులివిగొ
రాజ్యపాలనవలదయ్య రయముతోడ 177

తే॥ గీ॥ రాజ రాజును నను జన్మ రాజ్యపథమ
నందు నిల్పంగ యువరాజనంగ నిలుపు
దేవకార్యంబు దీర్చితి తివిరినేను
శబరిమలయాశ్రమంబున చాలనిలిచి 178

తే॥ గీ॥ ధ్యానమగ్నుడ నగుదును ధరణినాకు
శబరిమలపైన గుడిగట్ట సంభ్రమమున
నన్నునిలుపంగ వలయును నాదు భక్త
వరులు వత్తురు కొండకు వైభవమున 179

చం ॥ దృఢ భుజశక్తిబాణమును దీర్ఘత తోడను లాగివైచెదన్
తడబడకుండబాణమది తాకినచోటికి వెళ్ళియచ్చటన్
గుడిని కడంక గట్టదగు కూరిమినేరిమి తోడవైళమే
సడియొకయింతరానటుల సాకెద భక్తులబ్రోచెదన్ధరన్ 180

తే॥ గీ॥ ధరణి భక్తులబ్రోవంగ తనువుదాల్చి
యున్న నాకేల రాజ్యంబు బన్నమిదియె
శాశ్వతానంద సామ్రాజ్య సదమలంబు
మోక్షపదమున నేనుందు మోహమంద 181

తే॥ గీ॥ లోకమొక అద్దమై యుండ లోలవృత్తి
అందు ప్రతిబింబముల జూచు నట్లు ప్రజకు
వారికర్మం పురీతుల వ్వారిగాగ
సారెకందులక గనిపించు సదమలముగ 182

తే॥ గీ॥ ఈ శరీరము సైతము యిపుడు మనకు
అద్దమౌగాదె ప్రతిబింబ మంతజూడ
విశ్వమంతయు మనతను వింతగనుము
విశ్వవిభుడొక్కడే యని వేగగనుము 183

తే॥ గీ॥ జనన మరణంబుల విరెండు సాగవెపుడు
మాయతోనిండి యట్టుల మనకు దెలియు
మనకు భిన్నంబుగానెద్ది మనగ లేదు
ప్రేమ భావంబు అన్నింట పెరుగవలయు 184

తే॥ గీ॥ విశ్వరూపంబు విశ్వాత్మ విమలయశుడు
విశ్వనాధుండు ఒక్కడే విశ్వమందు
తక్కినట్టివి మాయలు ధరణిలోన
మాయ మార్మిక జీవనాల్ మనకువలదు 185

తే॥ గీ॥ సర్వజీవులయందును సాగునాత్మ
అగ్ని గాలక గాలిచే నారిపోక
ఆయుధంబుల చేతను అణగిపోక
నీటిచే దడుపబడక నెగడునాత్మ 186

ఉ ॥ ఆత్మకు చావులేదెపుడు అంచితరీతిని చూడగాధృతిన్
ఆత్మల కాత్మయౌ విభుడు ఆత్మయే గావున విశ్వనాథుడై
సర్వము నిత్యమైబరగు సారెకు సంతసమందుచుండగన్
ఆత్మలకాత్మయౌగురుడు అంచితరీతిని విశ్వనాథుడే 187

కం ॥ ఓం కారంబేమంత్రము
హ్రీం కారము దానితోడు ఇంపుదలిర్పన్
శ్రీం కారంబగు లక్ష్మికి
నోం కారంబు పఠింపగ నున్నతిగలుగున్ 188

ఆ॥ వె॥ వేరుచింతలేక వేదవేద్యుని భక్తి
తోడగొలువ ప్రభుడు తోడుపడును
వారియోగములను వారిక్షేమంబుల
వెలయ జేయు వసుధ వేడుకలర ! 189

తే॥ గీ॥ అన్నిధర్మాలు వదలుచు అతని గొల్వ
సర్వపాపచయంబులు సరగద్రుంచి
మోక్షగాముల నొనరించు నక్షయముగ
రక్ష సేయడె ప్రభుడంత రాజసమున 190

కం ॥ సర్వము బ్రహ్మార్పణముగ
సర్వము హోమంబెయగును సదమలరీతిన్
పర్వీన యఘములు ద్రుంగును
సర్వము సర్వేశునాజ్ఞ సత్కృపతోడన్ 191

తే॥ గీ॥ ఏప్రకారంబుదైవంబు ఎటుల గొల్తు
రాప్రకారంబు గాగను రమణతోడ
దైవదర్శనమగు చుండు ధార్మికులకు
మతము జాతులుమన్నించు మార్గమునను 192

ఉ ॥ రాగము కోపమున్ భయము రాజసవృత్తిని వీడివైళమే
త్యాగులు గాగనుండి యటు తాలిమితోడుత నన్నుగొల్వగా
వేగమె రక్షగైకొనుచు విశ్రుత లీలల భక్తిభావముల్
బాగుగ జేయుచుండగను భాగ్యము గల్గదేముక్తిభావనన్ 193

తే॥ గీ॥ ఫలిత మాసించకుండంగ పనులు జేసి
పరుల కోసముపనులను పరగజేసి
కామ రహితంబులైనట్టి కలపనులను
చేయ నిష్కామఫలమది చెందుజనుల . . 194

మ ॥ అరిషడ్వర్గము లారుమాపవలెనా నందాబ్ధిలో దేలుచున్
పురమాయించవలెన్ ధరన్ ధృతినిదా పూజ్యుండహింసారతిన్
వరమై సత్యము ధర్మమున్ వసుధలో వాసింపదానెప్పుడున్
కరుణన్ జీవులజూచుచున్ మనవలెన్ కారుణ్యమేపారగా 195

తే॥ గీ॥ నా శరీంరబె విశ్వమ్ము నను నమ్మ
కొనవలె ప్రజల యుల్లంబు కుదురుకొనగ
విశ్వమందుండు సుఖములు వెలయుచుండ
ఆయురారోగ్యభాగ్యముల్ అన్ని ఇడుదు 196

తే॥ గీ॥ విశ్వరూపుడ నేనంచు విశధముగను
భావనంబులు జేయంగ బడయుముక్తి
విశ్వమేనేను నేనిట విశ్వమగుదు
విశ్వమందలి సుఖములు వెలయుచుండ 197

కం ॥ విశ్వము నాలోనున్నది
విశ్వములోనుంటినేను విశ్వుడనేనున్
విశ్వాకృతి భావనలో
విశ్వేశ్వరు జూడవలయు విబుధుల మదులన్ 198

తే॥ గీ॥ ప్రతిఫలించెడి క్రియలన్ని ప్రభలు చుండు
మానవాత్మలలోబుట్టి మనుచునుండు
సంద్రమందలి అలవలె సరసవృత్తి
వున్న మనమును సంద్రంబె కన్నయంత 199

తే॥ గీ॥ అలలు లేకుండ సంద్రంబు నిలనులేదు
సంద్రమునులేక అలలును సాగబోవు
ఆత్మపరమాత్మ లట్టుల అరయవలయు
ఏకమై జ్యోతివెలుగుట జోక మిదియె 200

ఉ ॥ భావనబ్రహ్మదీప్తియగు భాసిలు డెందములందు జూడగా
భావనదాటి బుద్ధిపటు భాసురవృత్తిని నాత్మవైపునన్
చేవనుదీసికొంచుజన చెల్మిని భక్తిని శాంతచిత్తతన్
ఏపుగ జీవునాత్మయును ఇట్టులె నాపరమాత్మ జేరుతన్ 201

ఆ॥ వె॥ మనసు ఆత్మకాదు మరిబుద్ధియున్ గాదు
బుద్ధిదాటినంత బుధులు మెచ్చ
ఆత్మశుద్ధివలయు అహరహంబునువేగ
మనసుబుద్ధులందు మలయకుండు 202

ఉ ॥ యోగము నభ్యసింపవలె యోగుల చందముభక్తులందరున్
యోగమె మోక్షదాయకము యోచన సేయగ దానినంతయున్
యోగుల చెంత నేర్వవలె యోగము పావనతన్ దలిర్పగా
సాగును బుద్ధిజ్ఞానముల సంస్తవనీయము మోక్షమిచ్చుతన్ 203

ఉ ॥ భక్తిని కర్మజ్ఞానముల ప్రాభవయుక్తిని గూడ మోక్షమున్
భక్తులు చేరవచ్చుదురు భాగ్యవిధాతను దేవునిన్ వెసన్
శక్తత తోడవేడగను శాశ్వతమోక్షపథంబునీయడే
ముక్తులు గాగ నవ్విధము మోదము సత్కృపతోడనుండెడిన్ 204

మ ॥ తులసీమాలను కంఠసీమనిడితా తోయంబులన్ గ్రుంకియున్
అలసత్వంబొక యింతలేకునికినా యాసంబు సక్రోధమున్
కలలో నైనను లేక యుండునటులన్ కాత్యాయనీ సన్నిధిన్
విలసింపంగను నుండుమార్గములు నే విన్నింతువేద్యంబుగన్ 205

తే॥ గీ॥ పాలమందు విభూతిని పరగబెట్టి
గంధమును కుంకుమను గూడ గురుతుగాగ
తిలక విన్యాసమొనరించి తీర్చిదిద్ది
మాలయందలిమణులకు మరియునట్లె 206

తే॥ గీ॥ తిలకముల దీర్చి ఒడలంత తిలకములను
భస్మముల తోడ బెట్టుక భక్తితోడ
వెలయ రెండవశివుడుగా వేడుకలర
నుండగావలె భక్తులు నుత్తములుగ 207

ఉ ॥ నల్లనిబట్టలన్ ధృతిని నల్లన భక్తులు దాల్చగా వలెన్
ఉల్లముపల్లవించుచును ఉన్నను లేకయుండె నేనియున్
సల్లలితంబుగా శనియు సాగకఅంటక యుండుగావుతన్
నల్లని బట్టలేవలయు నాణ్యతనాదగుభక్త కోటికిన్ 208

ఉ ॥ రంగులతోడివస్త్రములు రాయిడిమాన్పగ కట్టగాదగున్
బంగరు గాగదాల్పవలె భక్తులు నిట్టివె వేషజాలముల్
చెంగున దాల్పగా వలెను చేరగనాగుడి సంతసంబుగా
పొంగగ భక్తిభావములు పోడిగనుజ్జ్వలకాంతి పుంజముల్ 209

చం ॥ నలువది యొక్క రోజులును నాణ్యత మాలధరించిభక్తితో
సలిపి ముదంబుగా వ్రతము సంతసమందగ దేవళంబులన్
నిలిపిననున్ భజించుచును నిక్కమునాదెసవచ్చిరేనియున్
కలుగును కాంతిసంపదలు కాముని బారికి చిక్కకుండగన్ 210

చం ॥ వ్రతములు జేయుచుండునెడ వాస్తవముంగననింటి శుభ్రతన్
మతిని దలంచి చేయవలె మాటికినేటికి సూటిగాతగన్
గతులును గల్గు కామినుల కంతట భర్తల పాదపూజలన్
వెతలును మాను నెప్పుడును వేద్యత నన్నుదలంచినంతటన్ 211

ఆ॥ వె॥ తల్లిచేతగాని తండ్రిచేతనుగాని
గుడిని పూజసేయు గురునిచేత
స్వామియైన గురుని సదమలంబగు చేత
మాల వేసికొన్న మహిమ దనరు ! 212

మ ॥ ఉదయాత్పూర్వము స్నానమాడి ధృతితో నోంకారరూపున్ ననున్
సదయుండైన వినాయకున్ శివుని దా సత్వంబుతో మ్రొక్కుచున్
గదురన్ శ్రీహరి సుబ్రమణ్యునుతులన్ కాంక్షించిచేయున్ కడున్
పదిలంబైన పదంబుగల్గుగదవే ప్రార్థింప మమ్మెప్పుడున్ 213

తే॥ గీ॥ సూర్యుడస్తమించ సూటిగ స్నానంబు
జేసి ఉదయమందు చేసినట్లు
భక్తిసలుపవలయు ప్రాభవయుక్తిని
శరణ ఘోషలిడుచు చాలప్రొద్దు 214

తే॥ గీ॥ బ్రహ్మచర్యంబు బాగుగ బరగజేసి
స్నానమెన్నంగ చన్నీట సరగజేసి
అంగనలు తల్లులట్లుగా నమరజూచి
ధరణియే సెజ్జగాగను దాల్పవలయు 215

ఆ॥ వె॥ మాలవేయునపుడు మాలదీయునపుడు
గురునికిడగవలయు గురుతుగాను
దక్షిణంబులిచ్చి ధరమ్రొక్కగావలె
గురువు సర్వమనుచు కూర్మితోడ ! 216

ఆ॥ వె॥ గురుని దైవములను గురుతుగా నొకపరి
దర్శనంబుజేసి ధరనుమ్రొక్కి
ప్రతిదినంబు నిట్లు పడయంగవలె భక్తి
ప్రార్థనంబులన్ని ప్రతిభగాంచ 217

మ ॥ కాఫీ టీలను త్రాగరాదు మరియున్ గంజాయి సారాయియున్
నేపాటన్ గన మత్తువస్తువుల వేనిన్ ముట్టగారాదెటన్
సాపాటైనను నొక్కపూట యదియున్ సాధ్యంబు మధ్యాహ్నమున్
ఏ పారంగ భుజింపగా వలె టిఫన్ ఈ రెండు సంధ్యాంతముల్ 218

ఉ ॥ కోపమొకింత లేకునికి కూర్మిని సత్యముమాటలందునన్
ఏపున సర్వమానవుల ఎవ్వరిజూచిన స్వామియంచొగిన్
మాపును రేపు జూచుచును మంజులతాగరిమంబుతోడుతన్
నేపగనేవగల్గలుగ నేరని భంగిని నుండగాదగున్ 219

తే॥ గీ॥ మంజుమాతలు మగువలు మరియు బాలు
రందరు మణికంఠ స్వాములరయు
స్వాములందరు అయ్యప్ప స్వాములుగను
సరగ శిశువులు కొచ్చిక స్వాములనగ 220

తే॥ గీ॥ పిలువ వలయును ప్రీతితో పేర్మితోడ
కలువ లట్టుల సరసిలో కానిపించు
పూవులట్టుల పుడమిలో పూజ్యులగుచు
వారిజూడగ వలయును పూజ్యులగుచు 221

ఆ॥ వె॥ అనుచు పెద్దప్రొద్దు అతిముఖ్యమైనట్టి
నీతినియమములను నెరుగజెప్పి
వింటబాణమపుడు వీరుడు సంధించి
విడిచె విమలముగను వేగనంత 222

ఉ ॥ వేవురు సైనికావళుల వేద్యడు రాజటు బంపెనంతటన్
లావున బాణమెచ్చటను లాలితవైఖరిగ్రుచ్చుకొన్నదో
ఏపున నట్టి చోట ధృతి ఏర్పడ దేవళమంత గట్టగన్
నావిధమంతయున్ నరయ నంచితరీతి దలంచెనంతటన్ 223

తే॥ గీ॥ గుడిని గట్టజేతు కువలయం బున వేగ
నీదు నాజ్ఞలెల్ల నిక్కముగను
అతిమదంబుతోడ నాచరించెద తండ్రి
పురము వెడలి పోకు కరముబ్రోవు 224

మ ॥ వనవాసంబున కొంతకాలమటులన్ వాంఛించినేనుండెదన్
వినతన్ జేకొను తండ్రినేనెచటనున్ విఖ్యాతుడైయుండెదన్
విను సంసారమలంబుద్రోచుటకు నే వేడ్కన్ ధృతిన్ యుండెదన్
ఘన శైలంబుల ధ్యానసంపదలతో గాంతున్ మోదమెల్లప్పుడున్ 225

మ ॥ అనుచున్ కానలనుండగా దలచగా నారాజు శోకంబునన్
ఘన సంత్రాసముజెంది పోవలదు వే గన్నీవుపోనెంచినన్
అనయంబున్ మము గొంచుపోవలయునీ వంతంప్రఫుల్లాత్మతన్
మనవిన్ జేకొను మేమువచ్చెదమహో మాన్యుండమన్నిపంవే 226

చం అనగను మంత్రియున్ మరియు నాఢ్యత తల్లియు పల్లవింపగా
మనమున శోకమూర్తులయి మాటికిమేమునువత్తు మంచనన్
వినిప్రజలందరున్ గలసి విశ్రుతలీలలరాదలంచినన్
చనువున వారి జేరియటు స్వామియుబల్కెనుదారమూర్తియై 227

తే॥ గీ॥ బ్రహ్మచారిని బాలుడన్ పరగనేను
ధ్యానమొనరింప నేగుచో ధ్యానమునకు
భంగముగ మీరు వత్తురో భావ్యమగునె
అరయుడాయంచు వారించె అపుడు స్వామి 228

ఆ॥ వె॥ రాజ రాజువచ్చె రమణీయమూర్తియై
అన్నపాదములకు అపుడు మ్రొక్కి
నీవు రాజవగుట నిర్ణయంబిటుగాదె
నన్న వదలిపోకు మన్నయన్న 229

ఉ ॥ అన్నవు నీవు యుండగను అంచిత రీతిని రాజ్యపాలన్
మన్నతోడ జేయకను మాన్యత వీడిటు వెళ్ళజెల్లునే
బన్నము పాలు జేయకుము భాగ్యవిధాతగ మమ్ముబ్రోవవే
సన్నుతి సేతునెంతయును సారెకు బ్రోవుము పందళంబికన్ 230

మ ॥ అనుచున్ బల్కెడి తమ్ము గుబ్బమదికిన్ ఆనందమున్ కల్గగా
వినుమోతమ్ముడ నీకు సాయముగనే వీర్యంబవార్యంబుగన్
జనినే దిగ్విజయంబుగా వసుధలో జాజ్వల్యమానంబుగా
అనయం బీధరలోని రాజులను నే నశ్రాంతమున్ గెల్చెదన్ 231

ఉ ॥ వారలు నీకు లోబడిన వారుగ జేసెద నెల్లకాలమున్
సారెకు నీకు గూర్చెదను స్వాంతమురంజిలవారిరాజ్యముల్
కూరిమి నేలికోగదవె కోరిన రీతిని ధర్మపద్ధతిన్
సారెకు భోగభాగ్యముల సంపదలింపుగ గల్గుచుండగన్ 232

ఉ ॥ రాజుల గెల్చి నీకటుల రాజసవృత్తిని కప్పముల్ గొనన్
నోజను సిద్ధమౌనటుల నోరిమితోడుత జేసివేగమే
నీజనులెల్లనిన్ బొగడ నేలుము పందళరాజ్యమున్ వెసన్
రాజగు మయ్యతంద్రిగన రాజిగరాజును బోలెకాంతులన్ 233

## నవమ సోపానము సమాప్తము

❋ ❋ ❋

చ ॥ మహిషి మదాంధ సంహరణ మంజుల స్వాంతమనోహరప్రియా
మహిని నరేంద్రనందన స మంచితరూపుడ దీనబాంధవా !
సహనము తోడ భక్తులను సంతసమందగ బ్రోవు సత్ప్రభూ
ఇహమున నున్న మమ్మువడి ఇంపుగ మోక్షపదంబు జేర్చవే ! 234
ఉ ॥ ఓజగదేకవంద్యసుగు ణోత్తమ సుందరరూపపెన్నిధీ
ధీజనపందితాఖిల సు తేజమనోహరచంద్రచంద్రికా
భ్రాజిత సౌకుమారవర ప్రాంజలిజేసెదరమ్మువేగమే !
నోజను మమ్ముగావవలె ఓ జగదీశ్వరధర్మరక్షకా ! 235
చం ॥ మదగజవాహనుండగుచు మన్మథసోదరుడౌచువేడుకన్
ముదమున చేతివిల్లలర మోహనరూపముతోడ భక్తులన్
సదయత గావరమ్మికను సంస్కృతి సంపదలుల్లసిల్లగా
మదన సమానరూపుడవు మంజులస్వాంతుడ దీన రక్షకా ! 236

**మాలినీ వృత్తము**

అనయము మముబ్రోచే ఆగమాంత స్వరూపా !
మునులు ఘనులువేడే మోహనాంగాసుధీరా !
మనుజుల మదివెల్గే మాధవాంచిత రూపా !
వినుము మొరలు స్వామీ ! విశ్వవిఖ్యాత మూర్తీ ! 237

ఇది శ్రీ కామాక్షీ చలంబ్రమనామాఖ్యుల పౌత్రుండును చిన్నమ్మ యన్పేరి నామాంతరముగల శ్రీమునెమ్మముని రత్నమాఖ్యుల ఏకైక పుత్రుండును నన్ను పెంచి విద్యాబుద్ధులను నేర్పించిన శ్రీమంగతాయారమ్మ నారాయణాఖ్యుల దౌహిత్రుండును శకుంతలా సద్ధర్మపత్నీ సమేత శ్రీతిరుత్తని శ్రీ సుబ్రహ్మణేశ్వర వరప్రసాదలబ్ధ శివసుబ్రమణ్యప్రసాద సుపుత్ర సమేతుండును శ్రీహరిహరాత్మజస్వామి శ్రీచరణరేణువైన మధురాంతకందొరస్వామి యను నాచేరంచియింపబడిన శ్రీ అయ్యప్ప మహాభాగవతంబున తృతీయోల్లాసము సంపూర్ణము 238

## శ్రీ అయ్యప్ప మహాభాగవతము

# చతుర్థోల్లాసము - దశమ సోపానము

## సర్వకామ్య యుతము - రజోగుణరహితము

క ॥ శ్రీ పురహరనుత వాసవు
నేపున గాపాడినట్టి నిర్మలహృదయా
పాపపుదనుజుల గూల్చిన
ఆపద్బాంధవుడ నీవు హరిహరపుత్రా 1

వ ॥ ఇట్లు సూతుండు శౌనకాది మహామునులకు శ్రీ అయ్యప్ప మహాద్భుత చరితంబు వినింపింపందొడంగె 2

## అయ్యప్ప స్వామివిజయయాత్ర

తే॥ గీ॥ తపము జేయంగ పిమ్మట తరలువాడ
ఎల్లజనులకు మోదంబు లుల్లసిల్ల
కల్లగాదిది తమ్ముడ కలగ బోకు
విజయమును గూర్తునీకని వెళ్ళదలచి 3

మ ॥ పటు సంరంభముతో రథావళులతో పల్మారు సైన్యంబులన్
నటులన్ వేగమె కూడి తాజనెను నా నారీతియుద్ధంబులన్
నటు, నా కేరళ రాజ్యమున్ గదిసెదా నత్యంత విక్రాంతతన్
అట రాజన్యుడు సైన్య సంపదలతో నంతన్ విజృంభింపగన్ 4

ఉ ॥ మాధవు పుత్రుపైగదిసి మాటికి కేరళదేశ సైన్యముల్
శోధన జేయు నట్లుగను సూటిగపైబడునంతలోపలన్
గాధలుగాపు సత్యములె గావె కృపాళుని యస్త్రజాలముల్
మేదిని దిద్దిరందిరుగ మేకొన కేరళ సైనికావళిన్ 5

చం ॥ దునుముచు రక్తపాతముల దూసుకవెళ్ళెను అస్త్రజాలముల్
ఘనతను నేస్సగున్నలను గారియవెట్టె గదాది ఘాతలన్
ఘనతర బాణవర్షముల గ్రమ్మెను శాత్రవసైనికావళిన్
వినుతి యొనర్పగా వలెనె వీరుని భండన పాండితీ ధృతిన్ 6

తే॥ గీ॥ కేరళేంద్రుని బలములు గూలుచుండ
కనులజాడంగ లేకను కలగిరాజు
శరణు గోరుచు స్వామిని శరణమంచు
సాగిలంబడి కాన్కలు చాలనిచ్చె ! 7

తే॥ గీ॥ కప్పములు గట్టకట్టడి కల్గజేసి
స్వామి స్వాంతంబు రంజిల్ల చాలదన్ని
సాగనంపంగ స్వామియు సాగియంత
శూరపద్మాసురాఖ్యపై సూటిగాగ 8

తే॥ గీ॥ యుద్ధముంజేయ వెడలెను యుద్ధతుడయి
బుద్ధిలేనట్టిరక్కసున్ బుధులు మెచ్చ
బాణవర్షాన ముంచెదన్ బడలునట్లు
గెల్చెదన్ నేనునేనంచు నిల్చెనెదుట ! 9

సీ॥ నారాజధానికి ననువున నేతెంచి
కయ్యానికిని కాలుకదువునెవడు ?
శూరపద్మాసుర శోభాంతరంగుండ
నను గెల్వననయంబు నెవ్వడోపు ?
దేవతా వళులును తేజంబు గోల్పోయి
పరుగులు దీసిరి పసలు చెడగ
దేవేంద్రుడంతటి తేజస్వినను జూచి
సంధిచేయంగను చాలగోరు

తే॥ గీ॥ బాలుడట యుద్ధమున్ చేయజాలునంట
బేలగాకున్న వచ్చునే గోలయతడు
చాలు చాలును విననోప బాలుడ్రుంతు
నంచు సైన్యాళి తన్గొల్వతరలివచ్చె ! 10

మత్తకోకిల: పంచబాణుని నీఱు చేసిన పార్వతీపతి పుత్రుడన్
వంచనంబున పూనిగెల్వగ వాసిగాడని వేగమే
పంచ రాక్షసవీరులన్ గని ప్రాంగణావళినిండగన్
ముంచరాక్షస వీరులందరి మూర్ఛలన్ వెసజంపగన్ 11

ఉ॥ సంచలితాత్ముడై బరగ సారెకు మేఘపు వర్షధారలన్
ముంచిన యట్లు బాణముల ముంచుచు బాణపు వర్షధారలన్
పంచను నున్న రక్కసుల పల్మరుద్రుంచుచు శూరురాక్షసున్
సంచిత పాపముల్ పడగ సారెకు వేసెగధాయుధంబునన్ ! 12

ఉ॥ వాడును రౌద్ర రూపమున వాహినులన్ గడతేర్పగా వడిన్
పోడిమి తోడయుద్ధమును బోరున సల్పగ స్వామియంతటన్
ఘాడగ వాని దేహమును ఖడ్గపు ధారల గొట్టెనంతటన్
వాడతి మాయలంసలిపి వాసిగ మేఘపదంబు మాటునన్ 13

చం॥ నిలిచటు క్రోధమూర్తయయి నిక్కపుచొక్కపుటగ్నిధారలన్
పలుమరు యుద్ధమున్ సలుప ప్రాపుగ స్వామియు వారుణాస్త్రమున్
నిలుపగ యగ్నిజ్వాలలను నిర్మలుడాతడు వైచెవేడుకన్
సలిపెను నీటివెల్లువల సారెకు శాత్రవులన్ వధింపగా 14

పంచపాది॥మేఘ పథంబునన్ దిరుగ మేఘములన్ ధృతిగూలగా వడిన్
యాఘనసాంద్ర బాణముల యగ్నుల గూరిచియంతవైవగన్
మేఘము లన్ని మాయమయి మిక్కిలి రక్కసుడంతభూమికిన్
దాఘన సాంద్రబాణముల దానటు గుప్పుచు వచ్చెనంతటన్
నీఘనతన్ సుదీర్ఘముగ నిక్కము జూతుమటంచు స్వామియున్ 15

చ॥ పటుతర బాణఘాతముల పల్మరు రక్కస సైనికావళుల్
అటునటు పర్వులెత్తగను అంచితరీతిని వైచెబాణముల్
నిటల తటంబుఘాడగను నీశుని పట్టియు ఖడ్గధారలన్
అటునిటు గొట్టరక్కసుడు ఆదటమూర్ఛమునింగెనత్తరిన్ 16

ఉ॥ మూర్ఛను దేరిరక్కసుడు ముందుగ నిల్చిన వానిరెక్కలన్
వేర్పడ పాశబద్ధముగ వేగమె గట్టెను సంభ్రమమ్మునన్
మూర్ఛలు పోయి రక్కసులు మోదము దక్కకనుండునంతలో
నేర్చిన విద్దెలన్నియును నిక్కమునీఅయె స్వామిసన్నిధిన్ 17

తే॥ గీ॥ పాణములతోడ కావుము ప్రణతులివిగొ !
ఓడితిని నేనటంచును ఓర్మివీడి
మ్రొక్కె నంతట స్వామియు నిక్కమితడు
వేడరక్షింతుననుచును వేడ్కదనర 18

ఉ ॥ నీ మరణంబు నిక్కముగ నీశునిపుత్రుడు సుబ్రమణ్యుడె
కామవిరోధిపుత్రుడటు కార్ముకవిద్దెల జంపబోయెడిన్
వేమరు నిన్నుజంపదగ వేయనినిన్ విడిపుచ్చితిన్ వెసన్
ఈ మహినాదు అన్నకును యిచ్చితి నీ పనిబట్టభావినిన్ 19

తే॥ గీ॥ దేవకార్యంబులకు నీవు తేజమునను
అడ్డుపడకుండ బ్రతుకుము ఆదరమున
పొమ్మటంచును బంధముల్ పుడమివిప్పి
వదలనంతట వాడును ప్రాణభీతి 20

ఉ ॥ కాన్కలతోడ స్వామినటు కాంచనరత్న చయంపురాసులన్
మిన్కుచు యిచ్చి పంపెనటు మిక్కిలి భీతిని జెంది వేగమే
కాన్కలు నాకు నేలయని కాంచన ధీధితులుల్లసిల్లగా
పున్కను ఊడగొట్టెదను పూనికనుండుమటంచువేగమే 21

తే॥ గీ॥ పాండ్యదేశాన మధురపై ప్రభుడు వెడలె
పాండ్యరాజున కదియంత ప్రాపుగాగ
తెలిసి తెలివొంది పంపెను తేటపరుప
స్నేహభావంబుతెలుపంగ సేవకులను 22

ఉ ॥ వారలు వర్ధమానుడగు వారిజనేత్రుని లక్ష్మిపుత్రునిన్
గౌరవమెంతొ జూపుచును కాంచిరివించిరి సంధికార్యమున్
పారము మీరమోదమున పావనునాతని కొల్వులోనికిన్
వారటు పిల్వగా జనెను వాంఛిత రీతులు యుల్లసిల్లగన్ 23

ఉ ॥ సందడిగాగ కొల్వునకు సంతసమందగ పాండ్యరాజటన్
వందన మాచరాంచుచును వచ్చెను స్వామికి యింపుగుల్కగన్
పందళ రాజసూనయటు పల్కరుమాకును సాయమెంతయో
సుందర రూపజేయుచును సూటిగనుంటివి యెన్నిమారులో 24

ఉ ॥ పందళరాజు గూడ యటు పార్శ్వముతోడుతజూడ పాండ్యుడే
పందళరాజ్యమున్ వసుధ పాంధ్యమునొక్కటిగాగ నేలవే
ముందటనీవులేనిదిక మూర్కులుమాకును ప్రొద్దువోవునే
పందళ పాండ్యదేశముల ప్రాభవ యున్నతి నీదెకాదగున్ 25

చం ॥ అనుచును సంతసాంబుధిని అంచితరీతిని పాండ్యుడంతటన్
వినచెను స్నేహవీచకల విశ్రుత కీర్తిధరుండుస్వామికిన్
కనగను కాన్కలన్నియిడె కాంచగనెన్నగరాని సంపదల్
అనయము ముందుగా నిడెను ఆదట స్వామియుమోదమందగన్ 26

ఉ ॥ మీదరి కేనువచ్చుటలు మీపయియుద్ధమొనర్పగాదు మే
మాదర వృత్తిజూచుటకు అంచిత రీతిని శాంతచిత్తతన్
ప్రోదిగ కొంతకాలమిట పోడిమి మీరగ శ్రాంతి బాపగన్
వేదురు నొందనేలయిటు వేద్యుడనీవిట నుండునంతటన్ 27

ఉ ॥ పందళ రాజ్యసూనుడను పాండ్యసుతుండని పేర్మిగాంచగా
ఎందుధరాతలంబునన ఎంతయు కీర్తివహించి భక్తులన్
క్రందుకొనంగ బ్రోవగను కాంచితి జన్మముమీరెరుంగరే
పందళరాజసోదరులు పల్మరుమాకును పూజ్యులౌటచే 28

వ ॥ పాండ్యరాజును జూచి స్వామి "ఓ రాజా కాశీపురాధీశునికి రామేశ్వర పురాధీశునికి నేను విజయాత్రకై వచ్చునట్లు మీదూతలచే సందేశము బంపుము. వారునా యధికారమునకు లోబడినట్లు వార్తలంపినచో యుద్ధమునకు రానని తెలియజేయుడనగా - పాండ్యరాజు మహాప్రసాదమని"అట్లు దూతలను బంపగా వారును ఆయా రాజులకు వార్తలనందించిరి. 29

ఆ॥ వె॥ కాశిరాజు వెడలె కాత్యాయనీ పుత్రు
జూచు వేడ్కతోడ శుభములెసగ
మంది మార్బలంబు మాటికి జనుదేర
కాన్కలన్ని గొంచు కాంచెప్రభుని 30

ఆ॥ వె॥ నీదు భక్తితోడ నెగడువారము స్వామి
నీదు ప్రభుతమాకు నీరజాక్ష
మోదమెదలగల్గు మేలుగ ప్రజలకు
మమ్ము కరుణజూడు మనుచు మ్రొక్కె 31

ఆ॥ వె॥ రామభక్తుడైన రామేశ్వరుండు తా
రామరామయనుచు రయముతోడ
కాన్కలన్ని దెచ్చి కాళ్ళదగ్గర నిడి
మమత తోడ బ్రోవుమంచువేడె 32

వ ॥ అంతనాస్వామి వారల నాశీర్వదించి పందళరాజునకు ఆకాన్కలన్నింటిని బంపి - మీరు ధర్మయుక్తముగా రాజ్యపాలన గావింపుడని పాండ్య, కాశి, రామేశ్వర రాజుల కాజ్ఞనిడి శ్రీలంకలోని కదిరికామమను క్షేత్రమైన శ్రీసుబ్రహ్మణ్యేశ్వర నిలయముంగన సముద్రతీరంబునకుంజని ...... 33

చం ॥ అలలకరంబులన్ జొనిపి అంచితరీతిని హోరు సల్పుచున్
కలగగ సైనికావళులు కాంచగనబ్ధియు భీకరంబుగన్
బలములు బెండువారగను భానుసమానుని చెంతనుండియున్
మెలగిరి దీనతన్ వసుధ మేకొనజాలక సైన్యముల్ వెసన్ 34

చం ॥ అలిగెను స్వామి యతంటను అబ్ధిపయిన్ కనులెఱ్ఱజేయుచున్
బలువగు అగ్నిబాణమున భాసురవృత్తిని వేయబూనినన్
కలగుచు అబ్ధి రాజపుడు కాంచగవచ్చెను స్వామిచెంతకున్
మెలగుచు వందనంబులిడి మేకొన గావుమటంచువేడుకన్ 35

తే॥ గీ॥ అబ్ధిరాజును లచ్చికి అగుదు తండ్రి
లోకమాతకు సుతుడవు లోకములను
గావనేతెంచితివి నీవు గాంచినాడ
మనుమడైతివి ఈరీతి మహితయశుడ 36

ఉ ॥ వృద్ధుడ కోపగింపకుము ఊరటనందుము నీదుడెందమున్
నిద్దరమోదమందగను నిక్కము ఓడల సృష్టిజేసినీ
వద్దను నిల్పువాడనిట వైభవమొప్పగ సేనతోడుతన్
గ్రద్దన నేగిచ్చుటకు గల్గును సాధ్యము రక్షసేయవే 37

ఉ ॥ తాతవు దాతవైతివిగ ధార్మికతన్ నినుగాంచకుండగన్
నేతలవంపుగానిపుడు నీపయికయ్యము సేయ బూనుటన్
నీతియె యోర్పుమైగనుము నిక్కముమన్ననసేయవేధృతిన్
ఈతరి యోడలన్ ఇడితి ఇంపుగధార్మిక చిత్తవృత్తితోన్ 38

తే॥ గీ॥ అంత నోడలపై సేన నధివసింప
స్వామియుల్లంబు తెల్లన సరసవృత్తి
చెలగ పయనించి లంకను జేరెనట్లు
అబ్ధిరాజు అదృశ్యుడై అపుడు జనగ 39

ఆ॥ వె॥ తమదు వార్తనపుడు తాలిమితోడుత
బంపలంకలోని ప్రభుడువేగ
వచ్చెస్వామిగొల్వ వసుధ తాశరణంచు
వైభవంబు హెచ్చి వరలుచుండ ! 40

ఆ॥ వె॥ నే విభీషణాఖ్యు నిర్మలహృదయుని
వంశమగుటదనరు వాస్తవముగ
రామ నామ సదృశ రంజిల్లునాస్వామి
రమ్మకేలుమోడ్తు రాజునైన 41

ఉ ॥ క్షేమములంతనారయుచు చెల్మిని కల్మిని గుల్కనినాతడున్
కామము వీడికొల్వగను కాంచన గర్భసమున్ కృపానిధిన్
వేమరువెళ్ళి చూచిరట విశ్రుత కీర్తిధరుండుకావునన్
కోమలమానసాంబుధిని కోరిభజించిరి సుబ్రమణ్యునిన్ 42

తే॥ గీ॥ కదిరి కామము అనుసీమ కాంచినారు
చిగురుకొమ్మల మృదువైన చిగురులందు
మెలగెకలకంఠ రవములు మేల్మిగాగ
అళుల ఝుంకార రవములు ఆవహిల్ల 43

తే॥ గీ॥ వనమయూరంబులటనట వాసిగాంచి
నటన మొనరించె అందంబు అచట చింద
ఆలయంబున ప్రాంగణమందువేడ్క
వెలసె కల్యాణగుణములు వేడ్కదనర 44

చం ॥ నిలయమునొప్పుచుండెనట అంచితరీతి సుబ్రహ్మచ్ఛటన్
వెలసెను ధ్వాంతమున్ దునిమి వెల్గులుసింహాళదీవినింపగన్
కలజనులందరున్ కృపను కాంచగబ్రోవగ దేవదేవుడై
వెలసెను ఆలయంబునను వేద్యతధ్వాంతము బాపివెల్గులన్! 45

ఉ ॥ రాజును స్వామియుంగలసి రంజిల మ్రొక్కిరి తారకారికిన్
భూజను లందరుంగలసి పూజ్యతమ్రొక్కిరి వారింవెంబడిన్
ఓజను సైనికావళులు ఓ పరమేశ్వర యుంచుమ్రొక్కగా
నేజను లైన బ్రోచెదను నేనని నట్టుల దోచెదైవమున్ 46

శా ॥ లంకంగొన్ని దినంబులుండియటు లీలానంద సంధాయియై
లంకేశుందగ వీడివచ్చెనటులన్ లావణ్యుడై సంద్రమున్
సంకాశంబుగ నోడలన్ దరలుచున్ సాగెన్ బలంబుల్ వెసన్
శంకాతంకము లేక సాగరమటన్ సాధించి దాటందగన్! 47

ఆ॥ వె॥ దైవదత్తమైన దేదీప్యమానమౌ
ఓడంలందుసేన ఒనర నెక్క
సామితోడవచ్చి సంద్రంబు దరిజేర
కడలిరాయడంత కదలివచ్చి 48

ఆ॥ వె॥ దీవనంబులనుచు దీవించి మనుమని
పోయి రమ్మటంచు పొసగ ననుప
తనదు ఓడలన్ని తనమాయగావున
మాయామయ్యె వేడ్క మంజులముగ 49

ఉ ॥ సాగెనుసేనలుంగదల స్వాంతము రంజిల స్వామియంతటన్
మ్రోగెను ఘంటికారవము మ్రోగెను శంఖము లూదనంతటన్
మ్రోగెను దుందుభుల్ వెసను మ్రోతగదిక్కులుపిక్కటిల్లగన్
మ్రోగెను తూర్యనాదములు ముందుగ స్వామిజయంబుదెల్పగన్ 50

ఉ ॥ పందళ రాజు వచ్చెనట పద్మదళాక్షుడు రాజరాజుతో
ముందుగ మేళతాళముల మోహన రూపుని స్వామి జూడగన్
చందురు పోల్కిచల్లగను స్వామియటన్ వడివచ్చు చుండగా
కందువ తోడ వచ్చెనట కాంచనధీదితులుల్లసిల్లగా ! 51

తే॥ గీ॥ మంగళాంగులు హారతుల్ మాటికొసగ
సౌధములపైన నుండెడి సాధ్వులపుడు
పుష్పవృష్టిని గురియింప పూజ్యమాత
హారతుల నివ్వ ఎదురుగా అపుడు వచ్చె ! 52

ఆ॥ వె॥ రాజగృహముసొచ్చి రంజిల్ల రాణువ
పోవబంచి యపుడు పోడిమిగన
రాజ్యపాలనమున రంజిల్లు విధమెల్ల
దెల్పరాజరాజు తెల్విగనగ 53

తే॥ గీ॥ కప్పములు గొంచు వచ్చిన కలధనంబు
తండ్రి కప్పుడు యిచ్చెను తయుడంత !
దెప్పరము లేక తేజంబు తేకువగన
తల్లిదండ్రుల మోదాన దనరుచుండ 54

వ ॥ ఇట్లు స్వామి తండ్రికి తమ్మునికి తగిన రీతిని ధర్మపాలన మొనరించునట్లు ఇదివరకే బోధించిన ధర్మమును సత్యమును, శాంతమును, అహింసను అనుసరించి ఈశ్వరధ్యానయుతులు గానుండుడు, మీరు తలంచినప్పుడు నేను మీకు దర్శనమిత్తును అని చెప్పి అదృశ్యుడై పొన్నంబళమున నున్న స్వర్ణమందిరమున కరిగెను. 55

దశమ సోపానము సమాప్తము



## శ్రీ అయ్యప్ప మహాభాగవతము

# చతుర్థోల్లాసము - ఏకాదశ సోపానము

## సర్వసంపత్కరము - తమోగుణరహితము

వ ॥ రాజశేఖర రాజు తన పరివారముతో మరియు పనివారలతో శబరిమలపై స్వామి బాణమానిన చోట గుడిని కట్టుటకేతెంచి నపుడు రాత్రియగుట వలన పరివారమును పనివారలును నిద్రించుచుండిరి. ఆలయ నిర్మాణమును గూర్చి ఆలోచించుచు రాజునిద్దుర పట్టక మేల్కొని యుండెను. 56

ఉ ॥ అర్ధమరేయి నిద్దురను ఆ గుడిగట్టెడి వారు కూర్కొనన్
నిద్దురరాక నా ప్రభువు నిర్మలతన్ గుడియుద్ధరింపగా
గ్రద్దన యోజనల్ సలుప కాంచెను కాంతులు ముందుముందునన్
అద్దిరవింతయౌననుచు ఆదట రాజటచూచుచుండగన్ 57

తే॥ గీ॥ కాంతి వలయంపు పరివ్యాప్త కాంతులందు
దివ్యదేదీప్య మానంబు తేజమెసగ
నిల్చె నొక్కండు రాజును నిల్చిచూచె !
వాపరందరు నాపేరు వారిజాక్ష 58

వ ॥ అని ఆ వచ్చిన దివ్యపురుషుడు రాజునకు నమస్కరించి ఇట్లనెను. 59

పంచపాది ॥ తే॥ కాంతిమలలోన నా స్వామి కాంతులెసగ
స్వర్ణమందిర వాసియై సాగు చుండె
మిమ్ము గొని తేరనన్ బంచె నీరజాక్ష
వీరు మేల్కొనునంతలో వేగిరమున
వత్తు గాకను వేగంబ వారిజాక్ష ! 60

తే॥ గీ॥ గగన మార్గాన నా స్వామి ఘనతగల్గ
రాజుదోడ్కొని వెళ్ళెను రయముతోడ
స్వర్ణమందిర వాసిని సరగజూప
స్వామితండ్రికి వందనాల్ సరగజేసె ! 61

వ ॥ తండ్రిని తగిన ఆసనముపై కూర్చుండని యోగించెను. రాజు చూచుచుండ
స్వామికి 62

తే॥ గీ॥ వెల్లగొడుగును ఇంద్రుండు వేగబట్టె
వాయు దేవుండు మెల్లన వసుధవిసరె
ధనదుడంతట హారముల్ తాల్మివేసె
వరుణుడంతట హారతుల్ పరగజేసె 63

సీ ॥ ఎలుక వాహన మెక్కి ఏ తెంచె గణపతి
తమ్ముని జూడంగ తాల్మితోడ
వనమయూరముపైన వాసిగగనుపించి
శరవణ భవుడంత సాగివచ్చె !
నందివాహనుడౌచు నయముననేతెంచె
పరమేశ్వరుండంత సరగనపుడు
సింహవానముపై సిరులుల్లసిల్లంగ
రాజేశ్వరీ దేవి రయమువచ్చె

తే॥ గీ॥ వెల్లనేనుంగు నెక్కటు వేడ్క స్వామి
వచ్చి క్రిందికి దిగి మ్రొక్కె వాసిగనగ
తల్లిదండ్రుల కప్పుడు తాల్మితోడ
అన్నలకు గూడ అంజలుల్ అపుడ జేసె ! 64

తే॥ గీ॥ శివుడు మదిలోన దలపోయ శీఘ్రగతిని
పక్షివాహనుడై హరి పరగ వచ్చె
హంస వాహనారూఢుడై హరిసుతుండు
బ్రహ్మపలుకుల వెలదితో పరగవచ్చె 65

ఆ॥ వె॥ ఆదిలక్ష్మి అపుడు ఆవిర్భవించిన
స్వర్ణమందిరంబు స్వర్ణమయపు
కాంతులందు దనర కల్యాణకరముగ
విభవమెసగ నెంతొ వేడుకలర 66

తే॥ గీ॥ సురలు నిలుచుండి సేవలు సుగతిజేయ
పరగకైలాస మట్టుల ప్రభలు నిండ
దేవతలు లేచి సేవలన్ తెల్విసేయ
స్వర్ణమందిర కాంతులు సరగహెచ్చె ! 67

వ ॥ శ్రీహరికి లక్ష్మిదేవికి, బ్రహ్మకు, స్వామి అంజలులు ఘటించి తగిన ఆసనములపై వారినందరిని కూర్చుండని యోగించెను. 68

తే॥ గీ॥ తగిన ఆసనములపైన తగనరీతి
వారు గూర్చుండ స్వామిని వాసిగాంచ
బంగరుం గద్దె నెక్కంగ పరమశివుడు
ఆజ్ఞ నిడగూరు చుండెను ఆప్రభుండు · 69

ఉ ॥ పుత్రుని నేత్రపర్వముగ పుణ్యుడు పందళ రాజు జూడగా !
పుత్రును మామహేశ్వరుల పూర్వముగాగను దీవనల్ యిడన్
మిత్రులు దేవతాతతులు మిక్కిలి సేవలు చేయుచుండగన్
శత్రుల గూల్చువారలటు శాంబవి పుత్రులు సంతసింపగన్ 70

తే॥ గీ॥ స్వర్ణమందిర వాసికి సాటియెవరు ?
స్వర్ణసామ్రాజ్య మేలెను స్వామియపుడు
కర్ణపేయము గాగను కలుగసురలు
సామ గానంబు జేయగా సాగిరపుడు 71

మ ॥ ఇది నా భాగ్యము భాగ్యమైకడుమదిన్ ఇంపారు చుండెన్ మదిన్
సదయుండాతడు పుత్రుడయ్యెనిచటన్ స్వారస్యమే పారగా
ముదమందంగను జూచినాడ నితనిన్ మూర్కొండ నేనింతటన్
సదయంబ్రోవుముబ్రోవు మంచెద నటన్ స్వాంతంబులో మ్రొక్కుచున్72

తే॥ గీ॥ దేవ దేవేశులందరి తేజమెసగ
జూచు భాగ్యంబు గల్గెను చోద్యముగను
పుత్రుభాగ్యంబు జూచితి పుడమి నింక
పండె జీవిత పథమింక పరవసించి 73

మ ॥ అదె వైకుంఠము సత్యలోకమదియే ఆశంభునావాసమున్
అదియే ముక్తికి తావలంబగుచు తా నారాధ్యదైవంబుగా
సదయుండాతడు శాస్తగా ఒరువడిన్ సాగంగ సద్దైవమై
ముదమందంగను సర్వదేవతతికిన్ మోదంబు దైవారగన్ 74

శా ॥ దేవేంద్రుండటు లోకపాలకులటన్ తేజంబు నిండారగా
నీవే సత్యము దేవతాతతులకున్ నిక్కంబు రాజౌదువే
నీవే నాతనయుండుగానగుట నిక్కంబైన నాభాగ్యమే
నీవే విష్ణుడ విట్టిరూపము తగన్ నీనేర్పు నంజూపితే ! 75

చం ॥ తనయుడ వెంతమాత్రమును తాలిమికావిట సార్వభౌముడై
ఘనయశమందబ్రోచితివి గౌరవ మొప్పగ దేవతాతతిన్
అనయము అంజలించెదను అంచిత రీతిని గొమ్ముమేడుకన్
మనమున నీప్రభావమును మాటికి దల్చుచునుండునో ప్రభూ ! 76

ఉ ॥ కన్నుల పండువయ్యెనిట కాంచగ నీ గుడిచందమౌనటుల్
పన్నుగ నేను గట్టెదను ప్రాపుగ తీరిచి దేవళంబునా
పన్నుల బ్రోవబుట్టితివి పద్మదళాక్షుడ కొండపైనిటన్
మిన్నుగ గట్టెదన్ గుడిని మిక్కిలి గావుము భక్తులన్ ధృతిన్ 77

కం ॥ పదునెనిమిది పడికట్లుగ
పదునెనిమిది దేవతతులు పడుకొనియుండన్
పదునెనిమిది పడికట్లుగ
కుదురుగ నెక్కితివిగద్దె కూర్చుండంగన్ 78

కం ॥ ముక్కోటి దేవతతులున్
అక్కజముగ నిన్నుగొల్వ ఆనందమునన్
చక్కని బంగరు స్వామివి
నిక్కము భక్తులను బ్రోవనేర్తువు యెపుడున్ 79

చం ॥ మనుజుల కంటికింగనక మాయగ చూడగ జాలకన్ వెసన్
దనుజులు మానవావళులు దర్శనముల్ పొరయంగ జాలకన్
అనయము దేవతాతతులు అంచిత రీతిని గట్టినారహో
వనమున తూర్పు ప్రాంతమున వాసిగ కాంతిమలందు నీగుడిన్ 80

వ ॥ దేవతలు మానవాకారములతో నుండరు కనిపించరు కావలసినప్పుడు తపః
ఫలితముగ మానవరూపమున దర్శనమిత్తురు. వాయుదేవుడు అగ్నిదేవుడు
వరుణుడు మానవరూపములలో లేరు వారును దేవతలును మానవుల కంటికి
కనరాని స్వర్ణాలయమును పొన్నంబలమున నిర్మించిరి . . . 81

ఉ ॥ స్థూల శరీరముల్ గనెడి సూటిగ భౌతిక సీమలందునన్
మేలుగ సూక్ష్మలోకములు మేకొన జూడగ జాలరెవ్వరున్
కాలముతోడ శాంతముగ గ్రాలగ యోగము చేత నేర్పడన్
జాలుదు రెవ్వరైన కడు జ్ఞానులు జూతురు వాని నన్నిటిన్ 82

ఆ॥ వె॥ కానిపించునవియు కానిపించనియవి
కలవు అణువులందు గలుగు చెలువు
అవని యందు కలవు ఆత్మికాదు లవన్ని
గనుట భౌతికమున కలుగదెట్లు 83

ఉ ॥ లోకము లోన లోకములు లోలత గల్గెను ధీరతన్ గనన్
వేకను గల్గి చూచినను వేడుకగల్గును జ్ఞానవీధులన్
మేకొన జూచువారలకు మేటిగ అర్థచయంబుగ్రాలగా
ఏకములన్ని లోకములు ఏవిధినున్నవి చూడుమెంతయున్ 84

తే॥ గీ॥ నీవు గూర్చున్నచోటనే నిక్కముగను
సూక్ష్మజీవుండు గూడను సూటిగాను
గూరుచుండును గనలేవు గోముతోడ
కానిపించని జీవులు కలవు జగతి ! 85

తే॥ గీ॥ ఎక్సురే కిరణావళి ఎట్లుకాన
బడవొ యట్టుల యవి కానబడవు సుమ్ము
కలవు సూక్ష్మంపు జీవులు గలిగెనిట్లు
కలుగు నంచని జ్ఞానులు పలుకుచుంద్రు 86

వ ॥ ఇట్లు రాజు ఊహించి ప్రజలకు కానిపించని స్వర్ణమందిరమున స్వర్ణసింహాసనమున దేవతలు కొలువుండ బంగారు స్వామి యుండుటకు అమందానంద కందళిత హృదయారవిందుడై స్వామికి అంజలించి ఇట్టనెను. 87

ఉ ॥ ఈ గుడి పోల్కినీగుడిని నింపుగ నాశబరాఖ్యమౌగిరిన్
వేగమె గట్టెదన్ యిపుడె వేద్యతకాంతులు యుల్లసిల్లగా
మీ గుడి సర్వమానవుల మిక్కిలి స్వాంతములుల్లసిల్లగా
సాగును సర్వకాలమును స్వామియటంచును సాగిమ్రొక్కగన్ 88

కం ॥ సోపానంబులు ఎనిమిది
ఏపారం దశము గూడి ఏర్పడగుడికిన్
మీపాద పద్మయుగముల
ఏపారం గొలచి యెక్క ఏర్పింతువెసన్ 89

తే॥ గీ॥ శబరిమల స్వామిమా స్వామి స్వామియంచు
ఓ గురూత్తమ ఉత్తమా ఓ గుణాఢ్య
ఓర్మితోడుత మముబ్రోవు ఓ శివసుత !
సచ్చిదానందమూర్తివి సాగిరమ్ము ! 90

ఆ॥ వె॥ అనుచు స్వామి వద్ద ఆజ్ఞను గైకొని
గగనగామిగాగ ఘనతగాంచి
గుడిని జేరవచ్చె గుడిలోని పనివారు
నిదురలేచులోన నిక్కమపుడు 91

## ఇంద్రుడు ఆలయ నిర్మాణము నాటంకపరచి విఫలుడగుట

వ ॥ తోడుగా వచ్చిన పావరుండు రాజాజ్ఞగొని అదృశ్యుడయ్యెను. స్వర్ణమందిరము నుండి వచ్చునపుడు ఒకక్షురికాయంత్రమును స్వామి తనపెంపుడు తండ్రి యగు- రాజశేఖరునకిచ్చి ఇది నిన్ను శత్రుబాధల నుండి రక్షించును అని చెప్పెను.

రాజు ఆలయము జేరి ఒకరోజు తాను తన పరివారమును విశ్రాంతిలో నుండి మరుదినము ఆలయ నిర్మాణమునకు పూనుకొనగా ఇంద్రుడు, తన సింహాసనమున కితడు అడ్డుపడునేమో యని తలచి ఓర్వలేక బోయరూపముతో శబరిమలపై గుడిని కట్టనీయక, యుద్ధమునకు దలపడెను. 92

తే॥ గీ॥ అడవియే నాదు రాజ్యంబు అట్టులుండ
ఎవ్వడవు నీవు గుడిగట్ట నివ్వనమున
వచ్చినాడవు సైనికుల్ వచ్చుచుండ
వెళ్ళుమిచ్చట నుండియే వేగననిన 93

తే॥ గీ॥ నేను రాజును గుడిగట్ట నీవెవండ
వోయి ! తొలగుము ఇటనుండి బోయవాడ
వనిన వజ్రియు వజ్రాన వనట గుంద
రాజుపై వైవ నారాజు రయముతోడ 94

తే॥ గీ॥ స్వామి నామంబు దలపోసి స్వాంతమందు
ధ్యానమొనరింప నంతట ధరణిపతిని
బ్రోవ, స్వామియుదలపోసె పోడిమీర
క్షురికకున్ ఆజ్ఞనిడెనంతక్షుణ్ణముగను 95

మ ॥ క్షురికాయంత్రమురాజుఅమ్ముల పాదిన్ చోద్యంబుగాలేచితా
పరిమార్చంగను బోయనంతటను వే ప్రాముఖ్యముంజూపగా
వెరపున్ జూపుచు వజ్రమున్ వెసజన్ వేగంబనావజ్రియున్
పరుగుల్ వారగవెంబడించెనదియున్ ప్రాణంబులన్ దీయగా 96

శా ॥ ముల్లోకంబుల సంరచించుచు వడిన్ ముమ్మూర్తులన్ వేడగా
కల్లోలంబది మాన్పరాదు మరలన్ కాత్యాయనీ నందనున్
యుల్లంబందున నిల్పివేడుమనగా యూర్ధ్వంబునందుండి తా
ఉల్లాసంబదిమానివేగవెడలెన్ ఊర్వల్ నిండగా నంతటన్ 97

తే॥ గీ॥ స్వామి పాదంబులంబడ్డ స్వామియంత
లేవనెత్తుచు ఓ యింద్ర లేశమేని
నాదు భక్తుండు నాతండ్రి యనక నీవు
వజ్రమున్ వేసినాడవు - వజ్రపాణి 98

తే॥ గీ॥ నాదు భక్తుల కడ్డంబు నకట జనగ
నీకు బుట్టెను నీగతి నిక్కముగను
శరణు వేడుము నా తండ్రి శాంతముగను
క్షురికయున్ మానునంతట చోద్యముగను 99

చం ॥ అనవిని వేగతాజనుచు అంచితరీతిని రాజుగాంచుచున్
వినయముతోడ అంజలులు విశ్రుత రీతిని చేయుచున్ వడిన్
ఘనమగు స్వామి తండ్రివని గాంచక ద్రోహిని యైతి నక్కటా
మనమున నెంచబోకుమని మాటికి కాళ్ళను బడ్డయంతటన్ 100

ఆ॥ వె॥ లేవనెత్తవజ్రి లేచిముందంబున
తనదు రూపుజూపి తాల్మితోడ
బ్రోవుమంచువేడె బ్రోచెను నారాజు
వజ్రివెళ్ళెదివికి వనట గుంది 101

వ ॥ రాజు గుడిని కట్టుటకు విఘ్నేశ్వరుని ఈశ్వరుని అయ్యప్పస్వామిని మనసులో తలంచుకొని సూర్యోదయముతో గుడిని కట్టుటకు ప్రారంభించెను. 102

ఏకాదశ సోపానము సమాప్తము



## శ్రీ అయ్యప్ప మహాభాగవతము

# చతుర్థోల్లాసము - ద్వాదశ సోపానము

## సర్వప్రియంకరము - దోషదృశ్యరహితము

### ఆలయ నిర్మాణము

ఉ ॥ తూరుపు కొండపై నినుడు తోరపువృత్తిని కాంతిపుంజముల్
పారముమీర వెల్గుచును ప్రాంజలి తాఘటియించి పుట్టగా
హారతి ఎత్తినట్టులుగ అంతట వెల్గెను స్వామిసన్నిధి
ఘోరతమంబు బాపగను గొబ్బున గట్టగ నాలయంబునున్ 103

తే॥ గీ॥ నాదు సహకార మియ్యది నాలయంబు
గట్టు సద్ధర్మ శాస్త్రకున్ ఘనత గాను
రాఘువుని కీర్తిరంజిల్లి రాణగాంచి
నట్లు లోకాన వెలుగును నధిపుకీర్తి 104

తే॥ గీ॥ అనుచు ప్రార్థించి ఘటియించి అధిక భక్తి
స్వాగతమ్ముగను బల్కిన సరణిదనర
కాంతి పుంజాలు గలుగంగ కాంతిమలను
దోచెవే వెల్గులంజూపి తోరముగను 105

తే॥ గీ॥ మంద మలయాని లంబులు మాటికపుడు
వీచె తరులతల్ తాల్మితో వేడ్కతోడ
తమదు సంతోష భరమున తలులు ఊపి
నటుల కదలెనునంతంత నయము గదుర 106

తే॥ గీ॥ ఆలయము గట్టు జనులపై అతిముదమున
పుష్పవర్షంబు గురిపించె పూలతరులు
జనుల అలికిడికిని జంతు చయములేళ్ళు
మరియు కుందేళ్ళు దుప్పులు మలగితొలగె 107

తే॥ గీ॥ శబరి గిరిపైన తాపస సముదయములు
పంబలో స్నానమాడియు పరవశించి
వేదమంత్రాలు జదువుచు వేడ్కదనర
శబరగిరి జేరి రందరు సాధుజనులు ! 108

తే॥ గీ॥ ప్రకృతి శోభాయ మానమై పరవశింప
భూసురులు విఘ్నరాజును భూరియశుని
ధర్మశాస్తాను దలపోసి ధర్మమెసగ
ప్రాంజలుల తోడ ప్రార్థించి పరవశింప ! 109

తే॥ గీ॥ దీవెనంబులు యిడుచుండ దీప్తిగదుర
తూర్యరావంబు లెసగంగ తోరముగను
వాద్యములు మ్రోగుచుండంగ వచ్చెనంత
నిర్ణయించిన సమయంబు నిక్కముగను 110

శా ॥ శంకుస్థాపన జేసెరాజపుడు తాశాస్త్రంబులంజూచుచున్
శంకుస్థాపన జేసినంతటనె తా శాస్త్రోక్తి జూడంగ వే
శంకం బాపగ విశ్వకర్మయపుడే శాంతాకృతిన్ వచ్చెనే
పంకంబేమియు లేక నాలయమునున్ ప్రారంభముంజేయగా 111

తే॥ గీ॥ వచ్చెనాయగస్త్యమునితో వచ్చెనపుడు
పరశురాముడు ఆగమ పారశాస్త్ర
సంబర మతియగుచును నా శబరిమలకు
అర్ఘ్య పాద్యంబులన్ రేడు ఆదరింప 112

తే॥ గీ॥ స్వామిబాణంబు ఆనిన స్థలము నందు
చురిక నొక్కటి స్థాపించె చోద్యముగను
సర్వరక్షక సారమై సదమలముగ
రాజు సంతోషిత స్వాంత రాజిదనర 113

తే॥ గీ॥ భార్గవ స్వామి చూపెట్టు బయలు నందు
దివ్యదృష్టి ప్రసాదించి ధీరమతిని
క్రిందికిం జూడుడనగను క్రిందనున్న
వస్తుతతులేమి అనుచును పరగజూడ ! 114

చం ॥ చురికలు బాణ సంహతులు జూడగ వేడుక గాగవైళమే
ఇరవుగ నిట్టి బాణములు ఇంపగుచూరిక లుల్లసిల్లగా
మరియొక కారణం బెటుల మాటికిగల్గునటంచు వారలున్
అరిమురి యాడుచుండగను ఆదట భార్గవ స్వామియిట్లనెన్ ! 115

మ ॥ ప్రతికల్పంబున నిట్టి స్వామియిటులన్ ప్రాబల్యముంజూపగా
నతివిశ్రాంతతయావిధిన్ ఇచట తా నత్యంత మోదంబునన్
గతులన్ గల్గగ భక్తసంతతికి తా కారుణ్యతాభావనన్
మతితా మంజుల రీతితో తపమున్ మానంగ లేకుండెడిన్ 116

ఆ॥ వె॥ రాజశేఖరాఖ్య రాజును బుట్టును
ప్రతియుగంబునందు ప్రభలుగుల్క
బాలుడగుచు స్వామి పడయంగ నారాజు
ప్రభుతనేలు శిశువు ప్రభుని గుణుని 117

తే॥ గీ॥ ఎన్నికల్పాలనుండియో ఏలునిట్లు
బాణములు చూడ చురికలు బలసెనిట్లు
కల్పకల్పంబు నందున కలుగునిట్లు
నాటి శాస్త్రాయె ప్రభుడగు నాడు నేడు 118

ఉ ॥ సత్యముధర్మమున్ నిలుప సారెకు బుట్టుచు భక్తులందరిన్
నిత్యము బ్రోవగా దలచి నిర్మలతన్ ధృతితోడ కొండపై
అత్యతిమోదముం గొలుప అందరి డెందము లుల్లసిల్లగా
పత్యముదీన బాంధవుడు ప్రాపుగ బ్రోవగ బుట్టెనిచ్చటన్ 119

ఉ ॥ ఈయుగమందు యీ గుడిని ఇంపుగ గట్టగ వచ్చినారమో
మాయలు వాపి దర్మములు మాటికి గల్గగ మాన్యమౌనటుల్
కాయము డెందమున్ వెలుగ కాంచగ మోక్షపదంబుభక్తులన్
నీయతిలోకమాన్యుడయి నిక్కము నిల్చుని తండుకొండపై 120

చం ॥ ఎచట తపంబు నాశబరి ఏర్పడజేసెనౌనట్టి కొండపై
అచటనె కొండదండగను ఆదట కోరికలెత్త స్వామియున్
నిచయములంతబ్రోవగ తపంబునుజేయుచు నుండనచ్చటన్
అచటనె నాగిరిన్ తగిన రీతినివెల్గుల తోవజేయుచున్ 121

చం ॥ తన మహిమాభిరామమున తానటుజూపెను భార్గవుండటన్
తన మహిమంబుతో నటుల తానవిమాయముగాగజేసియున్
మనమున స్వామి గూరిచిసుమార్గముగా గుడి గట్టగావడిన్
తన మదికాటుకాంజనము తానది జూచియు తెల్పెనవ్విధిన్ 122

తే॥ గీ॥ శబరి శిఖరాగ్ర భాగంబు చదును చేసి
ఎత్తుగావించి చదురించి ఎత్తుజేసి
దానిపై నాలయంబును దారమతిని
గట్టి నాజ్ఞలు యిడెరాజు గరిమతోడ 123

తే॥ గీ॥ క్షురిక నాటిన చోటికి క్షుణ్ణముగను
ఎగువ భాగాన నా స్వామి నేవ్వరింప
స్థానమనినిర్ణయంబును సదమలముగ
జేసె రాముండు రయమున చెలగి మెచ్చె ! 124

తే॥ గీ॥ తాంత్రికాచార్యుడప్పుడు తరచి చూచి
అగ్నిదహియించు బాధలు అటుల గల్గు
ననుచు శాస్త్రంబుజెప్పెను అంతరాజు
అట్టి చందాలు లేకుండ అరయుడనిన 125

తే॥ గీ॥ పాపపుంజంబులప్పుడు ప్రభలునంత
అగ్నిదహియింప భస్మమౌ అఖిల పాప
చయము లంతట గుడిగట్ట చాల శుభము
వసుధ కల్గని ఆకాశ వాణి జెప్పె ! 126

తే॥ గీ॥ కల్పకల్పాంతరంబుల కలడు స్వామి
అతడు లేనట్టి కాలంబు అవనిలేదు
యుగ యుగంబుల మూర్తులు నుండజూచి
పరశురాముండు మహిమతో పరఢవిల్లి 127

తే॥ గీ॥ ఒక్కమూర్తిని ఆ రాజు ఒనర జూచి
దాని బోలిన ప్రతిమను దయదలిర్ప
ఎన్నుకొనియెను జేయంగ నేర్పరించి
విశ్వకర్మయు జేసెనా విగ్రహమును 128

తే॥గీ॥ మంజుమాత కడూరువు మంజులముగ
విగ్రహంబుల జేయించె విశ్వకర్మ
అయ్యగస్త్యుండు సంతోష మందుచుండ
ఋత్విజుండుగ రాముండు ఋషులు జూడ
ధర్మశాస్త్రాను నెలకొల్పె ధర్మమెసగ (పంచపాది) 129

శా ॥ ఆచార్యుండు బ్రతిష్ట చేసెనపుడున్ ఆమంజుమాతన్ వెసన్
ఆచార్యోత్తముడే కడూరువునువే అచ్చో బ్రతిష్ఠించగా
అచ్చోద్యంబులు జూడముచ్చటగనన్ అయ్యాలయంబందువే
వాచాగోచర మయ్యె నాశ్రుతులు వారంతప్రార్థింపగన్ 130

తే॥ గీ॥ మేళతాళాలు విశ్రుత మేళనముల
మెలగె నాలయ ప్రాంగణ మెంతొముదము
ప్రకృతికాంతావిలాసంబు ప్రభలు గుల్క
నాట్యమాడె నెమళ్ళవి నాట్యగరిమ 131

తే॥ గీ॥ మకర మాసంబు నొకటవ మంచిదినము
నుండి ఏడగు దినములు నూర్ధ్వగతిని
అన్నదానాలు భజనలు నున్నతముగ
సాగవలె ప్రతిఏడును స్వామికొరకు 132

తే॥ గీ॥ దివ్యదర్శన కాంతుల దీప్తులెసగ
దివ్యజ్యోతియె కనిపించు దీప్తితోడ
భక్తులందరు తరియింప బడుదురంత
భక్తిసల్పుడు ప్రతియేడు భజనలెసగ 133

తే॥ గీ॥ మకర వెళకు సాగవలెను మంజులముగ
ఏడు దినములు వలయును యేర్పడంగ
కురుడి జరుపంగవలయును కూర్మితోడ
కడపటి దినంబునందున కాంతులెసగ 134

తే॥ గీ॥ ఇటుల భార్గవ రాముండు ఇంపుతోడ
బల్కి కట్టడి చేసెను బలుడతండు
మహిమతోడనదృశ్యుండు మహితుడయ్యె
విస్మయంబున భక్తులు వేగ జూడ 135

తే॥ గీ॥ వేయి నామంబులను పూజ వెలయజేసి
రాజునకు మోదమందంగ రాజితోడ
తనదు గమ్యంబు జేరెను తాల్మితోడ
నాయ గస్త్యుండు మునులును అపుడు జూడ ! 136

వ ॥ పరశురాముడు ముఖ్యముగా ఇచట గుడిని స్థాపించుటయే గాక కేరళ దేశమున ఎన్నియో గుడులు కట్టినట్లె తిహ్యము కలదు.

తర్వాత స్వామిని పూజించి కుంభాభిషేకాదులు కావించి అభిషేకాదులు చేసిరి. రాజును పరివారమును ప్రజలును ఆనందముతో స్తుతించిరి. 137

కం ॥ నెయ్యాభిషేక ప్రియుడవు
కుయ్యాలించుచు మొరలను కూర్మిని ప్రజలన్
వెయ్యారు దురితములనున్
అయ్యా బాపెదవు స్వామి అంజలి గొనుచున్ ! 138

తే॥ గీ॥ చూడవలెగాని అభిషేక సుందరంబు
అపుడు అభిషేక మొనరింప అలరుముదము
కనుల పండువ కాంతులు కలుగుచుండ
పసిడి విగ్రహరూపుడై ప్రభుడు వెలయు 139

తే॥ గీ॥ ఏమి చిన్ముద్రరూపంబు ఏర్పరింతు
తనదు కుడిచేయి చిన్ముద్ర తరచి చూడ
జ్ఞాన ముద్రగ దీనికి గణన గలదు
జ్ఞానులగుటకు భక్తులు ఘనతజూప 140

ఉ ॥ ఆత్మయు జీవితాత్మయును అంచితరీతిని గల్పునట్లుగా
ఆత్మయె సర్వమున్ బరగు అంచితరీతిని జీవులంతటన్
ఆత్మమయుండెదైవమయి అంతట నిండిన ప్రోఢయాతడే
ఆత్మను గల్పుమార్గమిది అంతట జీవుల ఆత్మలంతటన్ 141

తే॥ గీ॥ జీవుడే దేవుడగుచుండు చెలగిదేవు
డప్పుడప్పుడు మనుజుడై అలరుచుండు
దైవమాయయెరుంగగ తరముగాదు
ఒకట సర్వంబు సర్వంబు ఒకట నుండు 142

తే॥ గీ॥ దుర్గుణంబులె చీకటి దురితములకు
సద్గుణంబులె పుణ్యంబు సాధువులకు
సర్వమాత్మ మయంబుగా సాగుగాన
మెలగ నలయును సత్యంబు మెలకువగన 143

శా ॥ చిన్ముద్రం దిలకించితోనె జనులున్ చిత్తంబు బ్రహ్మంబుగా
చిన్ముద్రన్ దలపోసి యుందురు నిటన్ శీఘ్రంబుగా వేడుచున్
చిన్ముద్రే పరమేశుతత్వమగుటన్ చెందంగదా ముక్తికిన్
చిన్మాహత్యము గ్రోలుడంచు భువిలో చింతల్ వెసన్ బాపగన్ 144

తే॥ గీ॥ ఎడమ మోకాటి పై చేయి యెటు లొచాచి
తన పదంబుల జూపుచు తాల్మితోడ
పాద పద్మాల జేరెడి పావనులను
జేతు నానంద మందంగ చెలిమి బ్రోతు ! 145

తే॥ గీ॥ అనుచు స్వామియు అపరంజి తనువుతోడ
దీపముల్ వెల్గ చీకటుల్ తెరలిపోవ
ఆత్మకాంతులె ఆనంద మాస్పదంబు
పాదపద్మాల జూపంగ ప్రభలెసంగు 146

తే॥ గీ॥ నీవు లేకున్న మే మెట్లు నిక్కముగను
బ్రతుక జాలము మాస్వామి బ్రమలు మాన్పి

మాయ లోకాన మనుజుల మనుపుమయ్య
జ్ఞాన మోక్షంబు లవి రెండు ఘనతనిచ్చి 147

తే॥ గీ॥ శివుడవై జ్ఞానమొసగుము చిద్విలాస
విష్ణువై మోక్షమిడుమయ్య విపులయశుడ
ఒక్కప్రార్థన ఫలములు ఒసగ రెండు
ధన్యులయితిమి మాస్వామి ధరను బ్రోవు 148

తే॥ గీ॥ అనుచు భక్తులు భజనలు అటులజేయ
చూచు చున్నావు మాస్వామి సుందరాంగ
రాగరంజితతను కాంతి రంజిలంగ
బ్రోవుమయ్యప్ప అయ్యప్ప బ్రోవుమనుచు ! 149

వ ॥ భక్తులందరు భజనలు చేసి ప్రార్థించి అభిషేకముల చేసి శబరిమలపైన కొన్ని రోజులుండి రాజును మంత్రి శేఖరుడును ప్రజలును వారి గమ్యస్థలముల కరిగిరి. పూర్వము శ్రీపరశురాముడు -కార్తవీర్యార్జునాది రాజులను ఎందరినో సంహరించి ఆ పాపమును బాపుకొనుటకై అతడు బ్రయత్నించెను. 150

## ద్వాదశ సోపానము సమాప్తము

ఇది శ్రీ కామాక్షీ చలంబ్రమ నామాఖ్యుల పౌత్రుండును శ్రీ చిన్నయమ్మయన్నేరి నామాంతరముగల శ్రీమునెమ్మమునిత్నమాఖ్యుల ఏకైక పుత్రుండును నన్ను పెంచి విద్యాబుద్ధులను నేర్పించిన శ్రీమంగతాయారమ్మ నారాయణాఖ్యుల దౌహిత్రుండును శకుంతలా సద్ధర్మపత్నీ సమేతుండును శ్రీతిరుత్తని పురసుబ్రహ్మణ్యేశ్వరుల వరప్రసాదలబ్ధ శివసుబ్రహ్మణ్య ప్రసాద సుపుత్ర సమేతుండును శ్రీహరిహరాత్మజస్వామి శ్రీ చరణ రేణువును ఐన మధురాంతకం దొరస్వామియను నాచే రయించిపబడిన శ్రీమణికంఠేశ్వర చరిత్రమను నామాంతరముగగల శ్రీ అయ్యప్ప మహాభాగవతమునందు ద్వాదశ సోపానము సంపూర్ణము.



## శ్రీ అయ్యప్ప మహాభాగవతము

# పంచమోల్లాసము - త్రయోదశ సోపానము

## సర్వమంగళకరము - దోషశ్రవణ రహితము

కం ॥ అయ్యప్ప దొరవు స్వామీ !
నెయ్యప్పవు బ్రోతు జనుల నిర్మల రూపా !
ముయ్యేడు జగములందున
అయ్యా ఆలింపు మొరలు హరిహరపుత్రా ! 1

వ ॥ ఇట్లు సూతుండు శౌనకాది మహామునులకు అయ్యప్ప మహాద్భుత చరితంబు
వినిపింపందొడంగె 2

చం ॥ దశరథ రాముచే బడలి తానట భార్గవరాముడంతటన్
భృశముగ రాజులందరిని భాసురవృత్తిని జంపి దోషమున్
నిశితము గాగ్రదుంచగను నిర్మలతన్ వరుణాఖ్య దేవునిన్
వశమొనరింపగా తపము వారిజనేత్రుడు చేసెనంతటన్ 3

ఆ॥ వె॥ వరుణ దేవుడంత వాసిగ గనుపించి
ఏమివరము వలయు ఏర్పరింపు
కోరుమనగ నంత కోరెను రాముండు
గొప్ప వరమునొకటి గోముమీర ! 4

చం ॥ పరశువుపారవైచెదను ప్రాపుగ పశ్చిమ సంద్రమందున్
పరశువు పడ్డచోటునకు ప్రాపుగ తూరుపుతీరమంతకున్
సరిగ జలంబు రాకయును సాగవలెన్ ధరదోచునట్లుగా
వరమది ఇమ్మనంగ వడి వారిజనేత్రుడు ఇచ్చెనంతటన్ 5

చం ॥ పరశువు పారవైచెనట భార్గవరాముడు సంద్రమందున్
సరిగను భూమియేర్పడిన సంతసమందుచు రాముడంతటన్
సురలు నుతింప నచ్చటను సూటిగకేరళదేశమేర్పడెన్
వరము ఘనంబుగా గలుగ వారియుతీరముదాకనిల్చినన్ 6

తే॥ గీ॥ అట్టి కేరళ దేశాన నుట్టి పడగ
నూట ఎనిమిది క్షేత్రాలు నుండునటుల
శివునికి నిగట్టె శక్తికి చెల్మినంతె
గట్టెమరియును శాస్తాకు గట్టెనంతె 7

తే॥ గీ॥ అట్టి భార్గవరాముండు అవని యందు
ధర్మశాస్తాకు శబరిపై ధర్మమెసగ
గుడిని స్థాపింప జనులంత కూర్మిగనిరి
శబరగిరికిని యాత్రకున్ జనులు చనగ 8

వ ॥ శబరిమలపైన స్వామిబాణము వేయగా అది ఐదు బాణములగాచీలి 1. శబరిమలపైన బడినది అచట పరశురాముడు గుడిని కట్టుటయెగాక 2. అచ్చన్ కోవిల్ అనుచోట గృహస్థుని రూపములోనున్న అయ్యప్ప స్వామి గుడిని 3. అరియంగావు అనుక్షేత్రమున యువకుని రూపములో నున్న స్వామిగుడిని 4. మరియొక చోట కుళుత్త పుళాఅనగా బిడ్డరూపమున ఉన్నఅయ్యప్ప స్వామిగుడిని 5. ఎరిమేలిలోన పరశురాముడు గుడులను కట్టించి ప్రతిష్ఠించెనని ప్రతీతి.

ఇవిగాక కేరళలో అనేక దేవాలయములను పరశురాములవారు కట్టించిరని ప్రతీతికలదు. శబరిగిరిపై కేరళలో బ్రహ్మచారిగాఉన్న అయ్యప్ప స్వామి గుడిని ప్రతిష్టించిన కొంతకాలమునకే దొంగలు ఆగుడిని దోచుకొని అగ్నిజ్వాలలకాహుతి చేసిరి. రాజశేఖర రాజు స్వామిని ధ్యానింపగా పొన్నంబళమునుండి స్వామి ఏతెంచి రాజగృహమున రాజునకు దర్శనమిచ్చెను గుడిని దొంగలు దోచుకొన్న సంగతిని స్వామికి శ్రీరాజశేఖరరాజు తెలిపి గుడిని పునరుద్ధరింప సహాయమును కోరెను 9

ఆ॥ వె॥ అటవి సీమగాన అటనెవ్వరునులేమి
నిట్లు జరిగెతనయ నిజముగాను
వెసను వారిద్రుంచి వేగంబె బ్రోవుము
నీదు గుడిని కావు నిర్మలాత్మ ! 10

## వావరుస్వామితో స్వామిదొంగలను జంపిగుడినుద్ధరించుట

తే॥ గీ॥ తల్లిదండ్రులనోదార్చి తమ్ముగుట్టి
కునుశుభములను పల్కియు కువలయమున
దొంగలం ద్రుంతు గుడినిక దోచుకొన్న
క్రూరులంద్రుంతునేనని కోపమునను 11

తే॥ గీ॥ స్వామి వెడలెను కానకు సదయుడగుచు
పుడమిలోనున్న కలుషంబు పూజ్యముగను
ద్రుంతు నేనని వెడలెను తోయజాక్షు
డతుల విభ్రాజమానుండు అతులయశుడు 12

కం ॥ పులిపాలు దెచ్చినాడను
బలువుగ దొంగలను జంపి బరగుదు నేనున్
బలములు వెంటను వలదని
బలయుతుడై బయలుదేరె భాసురవృత్తిన్ 13

వ ॥ ఇట్లు అయ్యప్ప అంబర చుంబనాసక్తమగు పర్వత శిఖరములతో ఫలసంభరితములైన వృక్షములతో కదళీ తరుషండ మండిత ప్రదేశములును హరిత వనములను గడచి ఎరుమేలి ప్రాంతమునకు చేరుకొనెను. కుడిచేత బాణమును ఎడమచేత విల్లును ధరించి అయ్యప్ప వావరుఅను గజదొంగ ఎదుట నిలబడెను. 14

ఉ ॥ సంద్రపు తీరప్రాంతముల సారెకు దోపిడిజేసి యంతటన్
భ్రమందగ జేసి వర్తకుల మాటికి బాధలు వెట్టుచున్ కడున్
సంద్రముపైని ఓడలను సైతము దోపిడి జేయుచున్ వడిన్
క్రిందుగ జేసి వర్తకుల కీడ్పడజేసెను విఱ్ఱవీగుచున్ 15

చం ॥ ఘన భుజశక్తి దోపిడుల కాలము బుచ్చుచునుండెనాతడున్
అనయము వర్తకాళికిని ఆదట భీకరుడయ్యె నంతటన్
వనమున గూడదోపిడుల వారిగ జేయుచు నుండెనంతటన్
పనివడి స్వామిరాగనటు వచ్చెను వాడును దవ్వుదవ్వుకున్ 16

కం ॥ ఓరీబాలక భయమును
నేరీతియు లేక యిటకు నెటువచ్చితిరా
పోరా నేనిట "వావర్"
గారాములు సేయకనుచు కనలుచు పలికెన్ 17

తే॥ గీ॥ విల్లునంబులు దాలిచి విశదముగను
వీరుడైనట్లు వచ్చితి వేమి చెప్ప
ధీరుడను వస్తుచయమును దించుమిచట
ఒప్పజెప్పక యుండిన దెప్పరమగు 18

ఆ॥ వె॥ మూట దింపకున్న ముక్కడి నినుజంపి
సంద్రమందు వైతు సారెకిపుడు
నిలువు ముందటంచు కలుషచిత్తంబున
వావరుండు పల్కె బలముమెరయ 19

వ ॥ అంతట నా స్వామి 20

ఉ ॥ వింటిని నీదు నామమును విశ్రుతరీతిని నాదుతండ్రిచే
గంటిని నిన్నునేనిపుడు కార్ముక హస్తుడచూడుమోవెసన్
దంటను పందళాఖ్యనృపు ధార్మిక పుత్రుడజాడుమీననున్
వెంటను పుణ్యసంచయము వేద్యతలేక నెఱుంగ జాలవో 21

ఆ॥ వె॥ పరుల సొమ్ములేల పడయంగ జాతువు
అరులటంచు ప్రజల అలుగ బోకు
కరులపోల్కి మదముగలవాడుగా కుండ
నిరుల గోరకుండు నింపుయశము 22

ఉ ॥ దోపిడి దొంగ నేనిటుల దోర్బలవృత్తిని దొంగలింపగా
నోపితె నాదు చేష్టలను నాఢ్యత చక్కగ జేయబూనితో
రేపకు నాదు డెందమును రేపిన జూపుదు నిన్ను నిచ్చటన్
కోపుడనన్ను జాచితివి గోమున ఆడుటకాదు పొమ్మురా ! 23

ఉ ॥ వింటిని నీదు నామమును విశ్రుతకీర్తిధరుండు కావునన్
కంటిని నీదురూపమును కాదెయిలన్ మణికంఠనామ నీ
వింటిని గూర్చి బాణమును వీరుడి భంగటు వైవనచ్చటన్
దంటగ నీదుతండ్రి అట తాగుడిగట్టె నమాయకుండుగా 24

ఆ॥ వె॥ వెఱ్ఱి వాడు తండ్రి వెఱ్ఱిగాకుండిన
గుడిని గట్టునేమి కువలయమున
నీవు దేవుడంచు నీల్గుచుండుటచాలు
చూడు నేడు నిన్ను చోద్యముగను 25

ఆ॥ వె॥ చంపి పారవైతు సారెకు నాతోడ
మాటలాడబోకు మనిషినీవు
దేవుడనుచుదలచు దీనుండనేగాను
ఏమనందు చెపుమ ఏర్వడంగ 26

ఉ ॥ ఆపద వచ్చెనేయపుడు ఆ ఉదయుండట నీగుడిన్ వడిన్
నేపున నగ్ని జ్వాలల కునిక్కముమండగ జేసె నాగుడిన్
నీపసయేమియయ్యేనది నీవొక మానిసిమాత్రుడేసుమా
ఏపున దానిగాచుకొన ఏపధినివటు జాలకుంటివో 27

శా ॥ నాతోయుద్ధము సేయకుండగ వెసన్ నందీయ నామూటనే
నాతో నున్నధనాదులన్నియును నే నానందసంధాయినై
నాతో యుద్ధము జేసిగెల్చినను నే నంతంతనీకిచ్చెదన్
నాతో యుద్ధము చేసి యోడినను నీ నానందొలంగుంగదే ! 28

ఉ ॥ గెల్చిన వారికిన్ ధృతిని గెల్వక ఓడిన వారువైళమే
నిల్చిన నిల్వకాళ్ళపయి నిక్కముబంటుగనుండగావలెన్
గెల్చుట నాకు సాధ్యమవు గెల్చెద జూడుము వావరాఖ్య నే
నిల్చితి రమ్ము యుద్ధమిట బీతిలకుండగ జేయుమెచ్చెదన్ 29

తే॥ గీ॥ మల్లయుద్ధంబు సేతము మరియటంచు
భుజములున్ అప్పళించుచు బూనెనతడు
చూతునీదగుబలమని చోద్యమంద
వావరుని తోడ యుద్ధంబు వసుధజేసె ! 30

చం ॥ పటపట పండ్లు దా గొరికి పర్వత మట్టుల వావరుండొగిన్
పటుతర బాహులంబొదివి పల్మరుస్వామిని కూలద్రోయగా
నెటులను జాలకన్ ధృతిని నెక్కొనజక్కగ సాగిబాహులన్
నటునిటు ద్రిప్పజాలకను నొదలవంచక నుండెనంతలో 31

చం ॥ భుజములనప్పళించుచును బొక్కుచునుండెడి వానినొదలన్
నజిబిజిగాగమోదుచును నాననమున్ వెసరెండు చేతులన్
విజయము పొందమోదగను వీరుడు వావరుకుందెనెంతయున్
నిజముగ నీతడెవ్వడని నిల్చుచుమాటికి లేచినాతడున్ 32

ఉ ॥ రోసము అగ్గలంబగుడు రోయుచుకాళ్ళను బట్టి లాగుచున్
మీసము ద్రిప్పుచున్ వడిగ మిక్కిలిలోగిన జూచునంతలో
వీసము గూడవానికిని విశ్రుత లీలవశంబుగాక నా
దాసుడవై పడుండుమని దాకెను దాపిడికెళ్ళమోదుచున్ 33

సీ ॥ తాకు తాకున దేహ దారుఢ్యతను వీడి
తెలతెల్ల బోయను తెలివి దప్పి
తాకుతాకున తన తాపత్రయాభీల
కాముకత్వము వీడెకలుషముడిగి
తాకుతాకునజేసి తనతన్వుపావన
మైనట్టి ప్రతిభలుమరలజూచి
తాకు తాకున తాను తలవంచవలసిన
దాసత్వచిహ్నముల్ దలచిదలచి

తే॥ గీ॥ ఈత డెవ్వడొ వేలుపై ఇచట నుండె
లేక యుండిన నను గెల్వ లేశమేని
వీలుపడదంచు వావరు వినుత యశుడు
గాక యుద్ధంబు సేయగా కాంక్షసేయ 34

చం ॥ పిడికిటిపోటుతో శిరముపిండియొనర్చొడి యిట్లుమోదగా
వడివడిదాకనాతడును వారిజనేత్రుడు వానినేత్రముల్
సుడివడి చూపులన్ దునిమె సూటిగ నాతడు చూపులేమిచే
వడవడదా వడంకుచును వారిజనేత్రుని కాళ్ళపైబడెన్ 35

శా ॥ నీవేవేలుపు నీరజాక్ష కరుణన్ నిక్కంబునన్నేలవే
నీవీదీనునిజూచి దృష్టినిడవే నీ సేవ కుండన్ ననున్
రావే బ్రోవగ నాదుగర్వముడుపన్ రంజిల్లగాడెందమున్
నీవే శంబుడవో త్రివిక్రముడవో నేనెంతవాడన్ ప్రభూ 36

క ॥ ఇస్లాము మతమువాడను
ఏస్లాముల కింతనేర్పు ఏర్పడనుండెన్
గోస్లాములెన్నొ జంపితి
నాస్లాములె యనుచు మదిని నా సామియనెన్ 37

శా ॥ అల్లాయన్నను నీవుగావలయు నా యల్లాయు నీవయ్యయో
గుల్లామాదును నేనునీకిపుడు నా గుండెన్ తగన్ యిచ్చెదన్
అల్లాతోడుత నిక్కమంచనుచు అల్లాయె నీవంచొగిన్
"నిల్లిల్లా" యనివేడెనంతటను దానిక్కంబవార్యంబుగన్ 38

ఆ॥ వె॥ స్వామి చేతితోడ చల్లగనిమిరెను
కండ్లపైన నపుడు కలకదేర
కండ్లుదెరచెనంత కనిపించెలోకంబు
కాళ్ళబడుచువేడె క్రాంతుడగుచు 39

ఉ ॥ నీగుడి బాగుసేయగను నిక్కము రాముడు కృష్ణుడున్ తగన్
వేగమె తోడుగానిపుడు వేద్యత నేగుద మట్టులైనచో
దాగిన వారిగన్గొనుచు దాకివెసన్ ధృతితోడనం తటన్
నీగుడి చక్కజేయుదము నేర్పున సేవలు గొంచుబ్రోవే 40

ఉ ॥ ఏమతమైన నేమిపుడు నేర్పడ సత్యమునిక్కమౌమతం
బేమనెదీవు నేనిపుడె చెల్మిననున్ కృపజూతునెప్పుడున్
కామపు బాధలన్ విడువు కల్గును నీకు యశంబు బ్రోచెదన్
వేమరు దీన బాంధవుడ వేగమెనిన్ కృపజాడకుందునే 41

ఉ ॥ ఒక్కడు పెక్కురూపములనోరిమినుండు ననంతరూపుడై
నిక్కము ఏమతంబయిన నిర్మలరూపుని సత్యధర్మముల్
నెక్కొన నుండగాధరనునీరజనాభుడహింస రూపుడై
చక్కగ నెల్లలోకములు చక్కగ బ్రోచునతండుదైవమై 42

తే॥ గీ॥ కడలిలోపలనదులన్ని కలయునట్లు
వెడలు మతములు విభునిలో వేగజేరు
భువిని గలయట్టి మతముల పూర్వముగను
దైవముంజేరు నిక్కంబు ధర్మమెసగ 43

ఉ ॥ సత్యము ధర్మమున్ వెలయ సారెకహింసయు గూడియుండగా
నిత్యము ప్రేమవీచికల నిర్మలబుద్ధిని జీవులంగనన్
సత్యము కోసమై ప్రజల సాధుల జేయుచు ధర్మగాములై
నిత్యుని గొల్చువారలకు నిక్కము మోక్షపదంబులుండవే 44

ఆ॥ వె॥ తనువు నిలువ బోదు దాతకైనను గాని
మట్టియగుచునుండు మమత విడదు
ఇట్టి బ్రతుకుమాయ ఈశ్వరాజ్ఞయు లేక
ఎట్టి బ్రతుకువలన నేమి సుఖము 45

తే॥ గీ॥ శాశ్వతానంద సంధాయి స్వాగతంబు
స్వామి గాగను వావరు స్వామిగాగ
నిన్ను నిలుపుదు నెరిమేలి నిర్మలుడుగ
నాదు సేవలు జేసిన నమలచరిత 46

మ ॥ నిను పూజింపక నాదు కొండకెపుడున్ నిక్కంబుగా నెవ్వరున్
అనయంబున్ గనరారునేనటులనిన్ ఆనందసంధాయిగా
జను లందున్ వెలయింపజేసెదనునేజా జ్వల్యమానంబుగా
కనుమో మోక్షపదంబునిచ్చెదను నీ కాంక్షన్ తగన్ దీర్చెదన్ 47

వ ॥ అని స్వామియు వావరును గలసి కొంతకాంతా రమున్ క్రమియించి 48

ఉ ॥ వావరుస్వామిస్నేహితులు వాసిగతోడుగనుండు వారటుల్
ఆవనిలోన కృష్ణుడని ఆదటరాముడటంచు నామముల్
చేవలు గల్గువారి గని చేకొని వారల సేవకాళిగన్
ప్రోవగ సాధుసజ్జనులు పోయిరి ముందుకు స్వామితోడుతన్ 49

కం ॥ వారలిరుం జిప్పారై
సారెకు చేరంగ నంత సాధ్వసవృత్తిన్
మీరగ ముండడు ఉదయడ
పారభయం బుననువేగ పారిరిడాగన్ 50

కం ॥ 'చిన్నకడుత్తై' తోడను
పన్నుగవావరుడురాగ పల్మరుగనివా
రన్నన్నవచ్చిరదిగో
బన్నముమన కింకగలదు బ్రతికెదమె ధరన్ 51

మ ॥ అని పల్మారును వారుతామనములన్ అంతంతభాషింపుచుం
వనిలో నుండుచు దాగిరాలవెనుకన్ వైవంగబాణంబులన్
గనియా స్వామియు వారివైచెనట నాగంజాలకన్ బాణముల్
అనిలో వారలు డ్రెళ్ళి వేడిరటు నాహాకారతన్ బ్రోవగన్ 52

త్రయోదశ సోపానము సమాప్తము

## శ్రీ అయ్యప్ప మహాభాగవతము

# పంచమోల్లాసము - చతుర్దశ సోపానము

## సర్వదుఃఖవిమోచనము - దుర్వాసనారహితము

### ప్రకృతివర్ణణము

చం ॥ నభమున దీపమాలికలు నంచితరీతినివెల్గునట్లుగా !
నభమున తారకల్ వెలసె నందున చంద్రుడు నాయకుండుగా
సభయొనరించినట్లుగను స్వాంతమురంజిల తారకామణుల్
సుభటుల యట్లు మన్మథుని సోయగమట్టుల వెల్గెనత్తరిన్ 53

ఉ ॥ గోపికలందు కృష్ణుడటు గోమున మాయలు జేసివేడుకన్
ఏపున మన్మదార్తలను ఎమ్మిక లాడులబ్రోచినట్లుగా
నాపులినప్రదేశముల నంచిత రీతిని నాటపాటలన్
కాపులు జేసి కృష్ణునకు కామితవృత్తులు దీర్చుకైవడిన్ 54

ఆ॥ వె॥ పిండియారబోసి పేర్మిని నున్నట్లు
వెండి పూతబూసి వెలయునట్లు
కొండ దండలన్ని కోరివెల్గెను నేడు
వెండి కొండలగుచు వేడ్కదనర ! 55

ఉ ॥ కల్వలు నవ్వసాగినవి కాంచనదీప్తులతో జలంబులన్
కల్వల రాయవచ్చితివి కాంతులు నీకిట హారతుల్ యిడన్
పల్వములై చలించితిమి ప్రాపుగ నీకయిచూచినారమో
ఇల్వరుసందగా నిపుడుఇంతులు మేమిట కోరిచూడగన్ 56

ఉ ॥ కంతుడు బాధలన్ యిడెను కాంచన దీప్తులతోడ మమ్మికర్
మంతువటంచు బిల్చితిమి మాటికిమాదగుకూర్మిగొమ్మికన్
మంతన మాడ జూచితిమి మర్మములన్నియు వీడిమమ్మికన్
కాంతుడ కాంతిపుంజముల కౌగిళులందున దేర్చవేవెసన్ 57

పంచపాది ఉ ॥ కల్వలరాయ నీకొరకు కాంతులదేరగ జూచినారమో
వల్వదటంచు జెప్పకుము వారివిహారముమాకు చాలునా ?

కల్వలు మేము నీకిచట కాంచన దీప్తుల కౌగలింతలన్
గొల్వగ వేచియుంటిమిక గోలలటంచు దలంపబోకుమా !
చెల్వలమంచు ప్రేమగొని చేరిసుఖింపుము మోహనంబుగన్ 58

శా ॥ మారూపంబుల తోడ రోహిణియు నా మార్గంబుగా తారకల్
ఏరూపంబుల తోడ నుండిరటు నేయేరీతి నర్చించిరో !
నా రూపంబుల బ్రోచినావుగదవే నక్షాంత శ్రాంతంబుగన్ !
నారూపంబుల మమ్ము బ్రోవగదవే నాణ్యంబుగా నిత్తరిన్ 59

ఉ ॥ వెన్నెల వేడిమిన్ నలగి విశ్రుత లీలలలకోమలాంగులన్
అన్నెము పున్నెమున్ గనని ఆయువతుల్ తులలేని బాధలన్
ఎన్నగనేల చంద్రయిటు ఎమ్మికలాడులతోడనాడగా
బన్నము గాదెనీ కిపుడ భాగ్యులు గాకను వారిబ్రోవుమా ! 60

ఉ ॥ క్రొన్నెల నాటినుండి యిటు క్రొవ్విత పూర్ణిమ దాకనీవిటన్
మన్నన సేయ జాలదు మె మ్రగ్గముకృష్ణము గాగ పక్షమున్
క్రన్నన నీదుదీప్తులను కామినులంగలగింపబోకుమా !
బన్నము బాపి బ్రోవగను ప్రార్థనలన్ వేసజేతుమిత్తరిన్ 61

ఉ ॥ అన్నుల మిన్నలట్లు తగు నాయిదినీకని ఉల్లసోక్తులన్
బన్నము బాపవేడిరటు పల్మరుచంద్రుని దూరుచున్ వెసన్
క్రన్నన శంబునిందలచి కాంతులు నౌదలనుంటజాచి నీ
వన్నను కొంత గౌరవము వారజనేత్రలముంచి నామిటన్ 62

వ ॥ వావరు స్వామితో గలసి ఆవెన్నెలవెలుగులోనే గుడిదోపిడి దొంగలను జంపి కొంతసేదదీర్చుకొని వన్యఫలములను భుజించి నదినీరమును గ్రోలి ఒక గున్నమామిడి చెట్టునీడ విశ్రాంతి దీసుకొనుచుండగా వావరుస్వామి స్వామిపాదము లొత్తుచు కుతూహలియై స్వామి మీరు ధర్మశాస్త్రగా -అయ్యప్పగా అవతరించిన తీరును తమ పూర్వజన్మ క్రమమును వివరింపుమని ప్రార్థింప స్వామి ఇట్లు చెప్పందొడంగెను. 63

## ధర్మశాస్త్రా అవతరణ - వావరుస్వామికి స్వామివివరించుట

వ ॥ అలనాడు మహావిష్ణువు మోహిని దేవతల కమృతమును బంచివారినలరించి
అటనుండి అదృశ్యుడై వెళ్ళి తన మాయోపాయముతో భస్మాసురుని
భస్మముగావించి శంకరుని రక్షించెను. 64

ఉ ॥ రక్కసు భస్మమౌ నటుల రాయిడి గూల్చియు రామయంతటన్
నిక్కము నిల్వజూచియటు నీశ్వరుడంతట మోహవార్ధిలో
నక్కజమై దలిర్పగను నాననువీడటు కౌగలింపగా
చక్కగ ఈశ్వరాంచితము చాలదలిర్పగ నేను బుట్టితిన్ 65

ఆ॥ వె॥ ధర్మశాస్త్రగాను ధరపైపరాయగో
పుత్రుడనుచు ప్రజలు పుడమి బొగడ
పుట్టి తండ్రివెంట పోడిమివెళ్ళితి
వెండి కొండకపుడు వేడ్కదనర ! 66

ఆ॥ వె॥ జనకువెంటవెళ్ళి జాజ్వల్యమానాంగి
యైన జనని శక్తి యంతజేరి
దీవనంబులొంది ధీశక్తిబరగంగ
కార్తికేయుతోడ కలసియుంటి ! 67

ఆ॥ వె॥ విఘ్నరాజు బ్రోవ విమలమౌఫణితిని
విద్యలన్ని గరచి విమలుడైతి
భూతనాధుడైతి పూజ్యుండనైతిని
భూతగణములన్ని ముదముబొంద 68

మ ॥ వరకైలాస నివాససౌఖ్యములు నేవాంఛించి యట్లుండగా
పరమానందముతోడ నాజననియున్ పల్మారుదీవింపగా !
సురలోకేంద్రుని కైవడిన్ వెసన్ నేసూవాస్త్రుడైవెళ్లితిన్
సరసాలోకవిలోకనంబులధృతిన్ స్వారస్యమేపారగా 69

మత్తకోకిల॥వెండి కొండను జూచి చూచిన వేదవేద్యుడు శాస్త్రగా
దండిగాను మనన్ సుతున్ దరిదాను జేకొని బ్రోవగా
పండెజన్మమటంచు డెందము పావనంబు గనుండగన్
మండపాపచయంబులన్నియు మాధవాంఛితిసత్కృపన్ 70

మత్తకోకిల॥ ఈశ్వరుండటుగారవంబున ఇంపుగానను బెంచగా
ఈశ్వరాంచితమైన భక్తియు ఇమ్ములన్ హృదిగల్గగా !
ఈశ్వరా ! హరి ! మాధవా ! హర ఎంతో తల్లియుతండ్రిగా
శాశ్వతంబుగ నుండి రేయని చాలసంతసమందితిన్ 71

వ ॥ ఇట్లు కైలాస కానన మనోహర దృశ్య వీక్షణములతో కలకంఠ కంఠరవములతో
వనమయూరముల నాట్యముల వీక్షించుటతో కొంతకాలము గడిపితిని 72

సీ ॥ కమనీయ మైనట్టి కాసారములు కొన్ని
కన్నుల పండువై కానిపించ
వెండి కొండలవలె వెలసిన కైలాస
పర్వత భూములు పసదలిర్ప
కొండల కోనల కోమలాకృతితోడ
ప్రవహించు సెలయేళ్ళు ప్రతిభగాంచ !
నిఖిల భూరుహములు నిజవైభవముతోడ
ఫలభరంబులతోడి పసదలిర్ప !

తే ॥ శారికా కీరపంక్తులు చాలగల్గి
కీర్తనావళుల్ పఠియింప, కేకులంత
నర్తనంబులు సలుపనా పర్తనముల
ప్రకృతి సౌందర్యగరిమతో పరిఢవిల్లె ! 73

తే॥ గీ॥ తల్లి దండ్రుల తోడను యుల్లమలర
ఆ గణాధిపుతోడను అంచితముగ !
కార్తికేయుని తోడను కలసియుంటి
విద్దెలన్నియునేర్చితి విశదముగను ! 74

వ ॥ ఇట్లుండ 75

కం ॥ నేపాళ దేశమందున
ఏపార వళింజూడనుచు ఎమ్మిక తోడన్
భూపాలుడుండె నతనికి
తాపాపయి పుష్కలాఖ్య తనయయు గలిగెన్ ! 76

ఉ ॥ కాళికి కన్నెలన్ బలిగ కాతర నేత్రల నిచ్చుచుండెనా
కాళియు సంతసింపగను కాంచెవరంబులతండు కోరుచున్

మౌళిని పూలదండలిడి మౌనముతోడుత మ్రొక్కుచుండగా
కాళికి 'కన్నె' యన్ తరుణి కాతరనేత్రను చంపబూనినన్ 77

తే॥ గీ॥ శివుని గూరిచి భక్తితో చిత్తమలర
కన్నె ప్రార్థింప శివుడంత కాంచినన్ను
పొమ్ము కన్నెను కాపాడి రమ్మనంగ
వచ్చి కన్నెను కాపాడవలయునంచు 78

ఉ॥ రాజును నేజయించికడు రాజసమొప్పగ బ్రోవ కన్నియన్
రాజును లోబడెన్ వసుధరంజిల పుష్కలనామనిచ్చి వే
మోజుగ వైభవంబుగను మోహన రూపుడటంచు పెండ్లిదా
యోజన తోడ జేసెనటు యూర్ధ్వము నందలి వారుమెచ్చగన్ ! 79

వ॥ ఇట్లు తన కుమార్తె యగు పుష్కలనిచ్చి వివాహము జేసెను. అంతం గొన్ని
దినంబులకు. . . 80

తే॥ గీ॥ పింజ కుండను భూపుండు ప్రియముతోడ
దాకపాలిని సేవించి ధరను గనియె !
పూర్ణయంచను సుతవేడ్క పోడిగాను
వేటకొకనాడు నాతండు వేడుకలర ! 81

తే॥ గీ॥ బోవ బేతాళులతనిని బొడువ నంత
తాక పాలిని వేడంగ తాల్మితోడ
నాకపాలియువేడె నా నావిధముల
ధరణి శాస్తాను ఐనట్టి ధరణినన్ను ! 82

తే॥ గీ॥ అంత ద్రుంచితి భూతాల నదయ వృత్తి
అతడు నాకును నాతిధ్య మంత నిచ్చి
పూర్ణ నొసగెను భార్యగా పూజ్యుడతడు
పూర్ణపుష్కలలంగూడి పోదలంచ ! 83

వ॥ తన కుమార్తె పుష్కల కన్యాయము చేసి పూర్ణను వివాహమాడుటను సహించక
వళింజుడు కోపించి నన్ను భూలోకమున బ్రహ్మచారిగా పుట్టి ఒక రాజునకు
పండ్రెండు సంవత్సరముల సేవ చేయుదువుగాక యని శాపమిడెను. అందుకు
నేను నీవుమరు జన్మమున పందళరాజువై పుట్టుము నిన్ను నేను సేవింతునని
ప్రతిశాపమిచ్చితిని అని చెప్పి మరియు పూర్ణ పుష్కలాంబికల సమేతముగా

కైలాసమునకు వెళ్ళి భూతనాథుడనై శివపార్వతుల సంతోష పెట్టుచు గణనాథునితో సుబ్రహ్మణ్యదేవునితో గలసి యుంటిని.

నా తండ్రి ఒకనాడు నన్ను చేరబిలిచి నాయనా మహిషిని మర్థించుటకును పింజకుని శాపముననుసరించి నీవు భూలోకమున జనించి పండ్రెండేడులు రాజసేవచేయుటకును సమయమాసన్నమయినది. నీవు పసిబాలునిగా రూపొంది పంబనదీవమున నుండుము. రాజశేఖర రాజు నిన్ను పెంచుకొనునని చెప్పెను.

పరమేశ్వరి కరస్పర్శతో నేను బాలుడనుకాగా నన్ను పంబతీరమున ఒకచెట్టు నీడను పరుండబెట్టి, నాగరాజును కావలియుంచిరి ఇట్లు నేను అయ్యప్ప అవతారమును ధరించితిని. అని వావరునకు స్వామి చెప్పగా వావరు మహదాశ్చర్య భరితుడై స్వామికి పునః ప్రణామములు చేసెను. 84

చతుర్థశ సోపానము సమాప్తము

### శ్రీ అయ్యప్ప మహాభాగవతము

# పంచమోల్లాసము - పంచాదశ సోపానము

## సర్వమృత్యుప్రశమనము - జిహ్వానిగ్రహయుక్తము

### గుడిని పునరుద్ధరింపుమని తండ్రికి జెప్పుట

ఆ॥ వె॥ స్వామి స్వాంత మలర సాగి మిత్రుల తోడ !
రాజధానికపుడు రయముతోడ
దొంగలం జయించి దోర్బలః బునరాగ
హర్ష జలధి తేలె నంత తండ్రి ! 85

వ ॥ రాగల సంక్రాంతి నాటికి గుడిని పునరుద్ధరింపవలసినదిగా స్వామి రాజునకు జెప్పెను. రాజు గుడిని పునరుద్ధరింప శిల్పుల కాజ్ఞనిడెను స్వామి తండ్రికిని తక్కిన ప్రముఖులకు ఉపదేశములనిచ్చి అరణ్యములకు వెళ్ళి పంబ సమీపమున ధ్యాన నిమగ్నుడయ్యెను. 86

తే॥ గీ॥ సుబ్రమణ్యాఖ్యదేవుని సుబగుడగుచు
ధ్యానమొనరించె నంతట ధర్మ ఫణితి
అచట సాక్షాత్కరించెను ఆగు హుండు
దివ్యకాంతులు భువినిండ తేజమెసగ ! 87

ఉ ॥ తమ్ముని జూడవచ్చెనటు తాల్మి గుహుండు మయూరవాహనుం
డిమ్ముల సంతసాంబుధిని ఇంపెసలారగడెందమందునన్
క్రమ్మిన కూర్మితోడుతను కాంచెను నా మణి కంఠునిన్ వెసన్
సమ్మతి బ్రోవగా దలచి సారెకు డెందము కందళింపగన్ 88

ఉ ॥ ఏన్గు మొగంబు వాడగుచు నేర్పడ నీ దనుజుండువేగమే
కన్గొన వచ్చు నీతడిదెకాంచగనీకి టవాహనంబుగన్
వెన్గొన బోకు వీడసుర వేద్యుడు భస్మసురాఖ్య తమ్ముడౌ
ఏన్గను ఎక్కినీవెపుడు ఏర్పడభక్తుల బ్రోవుమంచనన్ 89

షట్పాదగీతి॥అనగ నారోహణము సేసె నపుడు స్వామి
నీదు బాణాగ్ని దగ్ధమై నీరజాక్షి
మహిషిలీలగబుట్టెను మంజులముగ !

మంచమాంబిక నామాన మగువ నిచట
నీదు ఆలయప్రాంగణ నిలయమందు
నిల్పెమాసాధ్వి నిప్పుడు నిర్మలుండ 90

చం ॥ మహిషిని బాణ ఘాతమున మంజులరీతి వధించుచోటికిన్
మహిత గుణాఢ్యమై బరగ మానుగ నీ యెరిమేలి మేలగున్
అహితము తోడ నేడ్వగను ఆమహిషాంగన కంటినీరమున్
సహితము ఆళుదానదిగ సారెకు బిల్వగజాతురందరున్ 91

ఆ॥ వె॥ ఆమె కంఠసీమ అధివసించుయు నీవు
ఎటుల నాట్యమాడి ఎట్టులుంటి
అట్టి తెరగునాడ ఆదట "పెట్టతుల్"
యనగ భక్తవరులు ఆడగలరు 92

ఆ॥ వె॥ నందివాహనుండు నటరాజు చూచెనో
అట్టిచోటు పేరు ననఘవినుము
"కాళెకట్టు", యనగ కడుముదంబొనరించు
భవుని పాదధూళి పడిన కథన 93

ఆ॥ వె॥ పెరుగ నీక మహిషి పేర్మితో రాళ్ళను
నామెపైన నిడితి నాడునీవు
అట్టిచోటునకును ఆఢ్యత కళ్ళిడం
కుంద్ర" మనెడి పేరు కూర్మిగలుగు ! 94

తే॥ గీ॥ శబరికిని మోక్షమిచ్చిన సదమలమగు
కొండశబరిమల యనంగ కూర్మినామ
మతిశయంబుగ గల్గును మధురఫణితి
శబరి నామంబు సార్థక్య సరణివెలుగ 95

వ ॥ అని స్వామిని ప్రబోధించి శ్రీసుబ్రహ్మణ్య దేవుండు అదృశ్యుండయ్యెను.
ఇంతలో సంక్రాంతి సమీపించినది. ధనుర్మాసము ప్రారంభమయ్యెను.
96

## ధనుర్మాస ప్రారంభము - సంక్రాంతి శోభలు

సీ ॥ పొగ మంచు వలిపంబు పొలతి సంక్రాంతికి
ధావళ్యరోచులు దారమొసగ
చేమంతి పూబంతి చెల్వసంక్రాంతికి
జాబిల్లి చెల్వంబు సంతరింప
కొండ కొమ్మల పైన కొల్చైన విరిలతల్
ఘనకుంభికుంభముల్ గణనదెల్ప
హరిత శోభితమైన ఆపంటపొలములు
సంక్రాంతి దాల్చిన శాల్వయనగ

తే ॥ పంట పొలముల యిల్లాండ్రు పరవసించి
పొలిపొలి యనుచు ధాన్యముల్ పోడిమీర
తూరుపొరలు బట్టిరి తోయజాక్షు
కాంతు లందున కాంతులు గలసియాడ ! 97

ఉ ॥ ప్రాంగణ సీమలన్ అలికి ప్రాపుగ ముగ్గులు బెట్టిచానలున్
పొంగులు వారబాలురును పోడిగ బాలికలంతనంతలన్
చెంగున గంతులన్ యిడుచు చేరిముదంబున నాడుచుండగా
నింగియు నేలయున్ బొదవి నిక్కము సంతసమెంతొ గల్గగన్ 98

ఉ ॥ కేకులు నాట్యమాడినవి కింతులు మోదముతోడజూడగన్
మాకులదైవతంబనుచు మాటికి చానలు దుర్గగొల్వగా !
వాకల నీరమున్ బరగ వాంఛిత మెల్లను దీర కర్షకుల్
పాకలలోననైననిక పండుగ వేడుక ఉల్లసిల్లగన్ 99

తే॥ గీ॥ ప్రకృతి దేవియు పులికించె ప్రభలు గుల్క
పుష్పలతికలు యెడనెడ పూచిమోసి
వాయువశమునదలలూచె వాయువంత
వీవ సుమనోజ్ఞవాసనల్ వెలసె భువిని 100

ఉ ॥ భృంగకుమారికల్ తమకు ప్రీతియతేనియలంచు వేడుకన్
చెంగున గంతులన్ యిడుచు చేరెను పువ్వులమాధురిన్ గొనన్
రంగుగ నూత్నదంపతుల రాగము పోలికరంజిలెన్ వెసన్
అంగన లంత హాసమున ఆదటనాదట యాడిపాడగన్ 101

తే॥ గీ॥ దక్షిణాయన పథమును దానువీడి
ఔత్తరాహుండు సూర్యుండు అగుచునుండె
తమము బీల్చెడి కిరణాల దనరియపుడె
తూర్పుకొండను వెలుగులు తోపజేసె ! 102

సీ ॥ కొక్కరో కోయంచు కొంగ్రొత్త ఎలుగెత్తి
తొలికోడి కూసెను తొలగనిరులు
చలివంటి స్వార్థంబు సమయింప చలిమంట
ధగధగల్ విలసిల్లె ధాత్రియందు
గొబ్బిళ్ళు పాడగా గొనబున జవరాండ్రు
ప్రాంగణ సీమలు ప్రభలుహెచ్చె !
"హరిలో రంగశ్రీ హరిరంగ" యనుచును
సాతాని జియ్యరు చయములెసగె !

తే ॥ ప్రాగ్దిశనుబాలభానుండు ప్రభలు గుల్కె
కేకి పించమ్ము విప్పటు కేరలియాడె
పిచ్చుకలు చూరులందున ప్రిదిలిపలికె
సంకురాత్రి నవోదయ సమయమందు 103

సీ ॥ చేమంతి పూవుల చెల్వమై దనరెడు
చెల్లెలినివ్వవే చెల్మిననుచు
తామర పువ్వును తగబోల్ప సరియైన
తమ్ముని నివ్వవే తాల్మిననుచు
కలువల బోలిన కమ్మని వదినెల
కలకంఠియివ్వవే కరుణననుచు !
మొగిలిపూవును బోలు మగనిని ఇడవమ్మ
మంజులవృత్తితో మాకటంచు !

మాదుబ్రతుకులవెన్నెలల్ మలయునట్లు
మధురములు నింపి మాలోని మమతలన్ని
సఫలమొనరించుమని గొబ్బి చాలనిడిరి
సంకురాతిరి వైభవాల్ సాగుచుండ ! 104

మ ॥ అదె సంక్రాంతి మనోహర ప్రభలు మా కానందమున్ గూర్చుచున్
గదియింపంజనుదెంచె నోహోయనగా గానామృతంబుల్ వడిన్
సుదతీ మన్మథుకృష్ణుదన్పగను నౌ చోద్యంబుతోభక్తులున్
సదనంబుల్ వెసజేరి పాడిరిదేయా సంక్రాంతి రోచిస్సులోన్ 105

ఉ ॥ తూరుపుకొండపై నినుడు తోపకమున్నె నెలంతలంతటన్
సారెకు మేలుకాంచి తమ సాధ్వసవృత్తులుమాని గుమ్మముల్
నేరుపు మీరగా నలికి నీటగు ముగ్గులు జేగురుల్ వెసన్
పారము మీరపెట్టుదురు పాపలు చిందులుద్రొక్కుచుండగన్! 106

మ ॥ కలకంఠంబులు విప్పి కన్నెలు సుఖై కాయత్త చిత్తంబులన్
కల కంఠంబుల కంటె మాధురిమ మా కంఠాలలో నుండనీ
కలమాధుర్యరవంబు గ్రోలుడని యా గానామృతంబుల్ వెసన్
ఇలలో జూపుచు గొబ్బులుంచిరిగ దా! నింపాదిగా నైపుణిన్ 107

ఉ ॥ పుష్పపు టంజలుల్ యిడగ పూనిక మొగ్గలు బోలుకాంతలున్
పుష్పవతుల్ తమంతటను పూనిక నౌదురటంచునంతలో
పుష్పిత కేతకీదళముబ్రోలిన భర్తలు రూపసంపదన్
పుష్పిత లైనయంతటనె పొందుడయంచనెగొబ్బిమాతయున్ 108

తే॥ గీ॥ కలరవంబులు అవ్యక్త కంఠములతొ
శారికా కీర పంక్తులు సలుపుచుండె!
"హరిలో రంగ శ్రీరంగ" హరి యటంచు
జియ్యరులు ప్రాంగణావళి చెలగిపాడ! 109

సీ ॥ అత్తవారిండ్లకు అరుగుచున్నారదే
అల్లుంద్రుసతులతో అదును లెరిగి
పండిన పంటల పలుమార్లు కళ్ళాల
నూడ్పులు గావించును విదలదొగొ!
పచ్చిక బీడుల ప్రాపుగానాలతో
లేబచ్చికలు మేయులేగలవిగొ!
అల్లదే రమ్యమై ఆనందమయమయి
కలకంఠరవములు గ్రాలుచుండె!

తే ॥ చరకు వింటను లంకృతుల్ సాగుచుండె
విశ్వమెల్లను ఆనంద విభవమెసగె !
ఎల్ల జనముల యుల్లముల్ పల్లవింప
నేడు సంక్రాంతి క్రాంతియౌ నిక్కముగను ! 110

తే॥ గీ॥ విచ్చె సంక్రాంతి సుధలును విరివిగాగ
విచ్చె కలువలు సంపంగి విరుల సరులు !
నళిన నేత్రల చిన్నారి నగవులకును
సాటి తామంచు సూనముల్ చాటిచెప్పె ! 111

## రాజు గుడిని పునరుద్ధరించుట

ఉ ॥ ఆలయ ప్రాంగణంబులను ఆలయమందలి అన్ని భాగముల్
చాలముదంబుతోడుతను స్వాంతమురంజిల రాజశేఖరుం
డాలలితంపు రీతులను అంచిత రీతిని పూర్వరూపమున్
పోలగ జేసె నంతటను పోజ్వలితంబుగ నాలయంబటన్ 112

సీ ॥ సాయుజ్య సామ్రాజ్య సంపద గడియింప
నిర్గుణోన్నతితోడ నెగడుచుండి !
శబరి తపంబును తరియింప జేసిన
యా కొండ శబరినా యపుడు బిల్వ !
తన దివ్యమంగళ తరమైన హస్తాన
తాకియామెను ముక్తిదరికి జేర్చి !
సంపూర్ణ సామ్రాజ్య సాయుజ్యమొదవించి
చాల సంతోషాన చానదన్ని -

తే ॥ పదియు నెనిమిది మారులు పడతి యపుడు
స్వామిని ప్రదిక్షణించి దా సాగి నటుల
పదియునెనిమిది పడికట్లు పరగగుడిని
కట్ట కట్టడి జేసెను ఘనుడు స్వామి ! 113

ఉ ॥ రాజగృహంబు నుండి వడి రమ్యత సేవక బృందముల్ వెసన్
రాజగు రాజశేఖరుని రంజిలగూడుచు బృందగానముల్
మోజున జేయుచున్ వసుధ మోహనమూర్తిని గొల్వకొండకున్
రాజిగ మేళతాళముల రంజిలవచ్చిరి స్వామికొండకున్ 114

వ ॥ ఇట్లు రాజును పరివారమును ప్రజలతో ఇరుమేలికి జేరుకొనిరి. వావరు జ్ఞాపకార్థముగ గట్టిన మసీదులాంటి గోడచెంత శూరటెంకాయలను గొట్టి "పేటతుళ్ళు" లాడుచురాగా ఆటవిక జాతివారు పూర్వము స్వామికి సాయపడిన సంతతివారు వచ్చి రంగులను వారిపై జల్లి ఆకులలుములును బెలునులును వారికి గట్టిరి. చిన్నపెద్ద అన్న భేదములేక అందరు మేళతాళములతో నృత్యములు చేసి ఆసమీపమునందలి కాలువలో స్నానమాడి వావరుసమాదిని దర్శించి అటనుండి వెళ్ళి ఆళుదానదిలో స్నానమాడి కళ్ళిడం కుండ్రములో రాళ్ళను ఉంచి కరిమల నీలిమల ద్వారా పయనించుచు ఇట్లు తలంచి 115

చం ॥ గుడులను చుట్టివచ్చితిమి కూర్మిని దక్షిణ దేశమందునన్
నుడువులు మీవిస్వామియని నూకొన బిల్చుచు వచ్చినారమో
పడతులు గాగమేమిపుడు కన్నెలమైతిమి యింతటన్ ప్రభూ
పడగను ధర్మమార్గమున పాలన సేయవె భర్తనీవెయై 116

ఉ ॥ కాంతుని జూడగోరి యటు కన్నికస్వాములు కన్నులంతటన్
కాంతిని కల్వలైబరగ కాంచగవత్తురు శక్తి సూనునిన్
వంతలు బాపవేడగను వంధ్యునినిన్ దలపోసి గుండెలన్
కాంతులు చింద జేయుమని కాంతుని జూడగ వచ్చిరందఱున్ 117

మ ॥ పదునార్వేలకు మించు గోపికలటన్ పల్మారు గోవిందునిన్
అరుదై కన్నికలైన దేవతలటన్ నానందసంధానులై
పదునై ముక్తి పథంబు గోరి యటులన్ ప్రార్థించుచున్ రాగవే
గదియన్ ద్వాపర మందునన్ జనరెనీ గమ్యబగమ్యంబుగన్ 118

ఆ॥ వె॥ శబరి కొండవాడ శరణాగతత్రాణ
సుబగు డైన స్వామి సుందరుండ
కొండదండ నుండి కొనియాడు చుంటిమి
కనులముందు కనగ కదలిరమ్మ 119

కం ॥ కోలాహలంబు గల్గెను
వాలాయము జనులు రాగ వారిజనేత్రున్
వేలాయుధు తమ్ముండని
చాలన్ మోదంబు హృదులచయ్యనగల్గన్ 120

ఉ ॥ కొందరు శంఖ నాదముల కొందరు ఘంటిక రావముల్ వెసన్
కొందరు కీర్తనావళుల కొందరు నృత్యము సేయుచున్ వడిన్
కొందరు ధ్యానసంపదల కొందరు కొండలు మారుమ్రోగగా !
నందము చింద స్వామియని నౌదల చేతులనుంచి మ్రొక్కుచున్ 121

చం ॥ అడుగులు బెట్టు నప్పుడును అంచిత రీతిని కొండనెక్కుచో
నడుచుచు నీదు నామములు నాధ్యత బల్కుచు మ్రొక్కుచున్ ధృతిన్
వడివడి వచ్చుచుండగను వారిత రీతిని గాన సంపదల్
నడవడి నమ్రమై చనగ నానన మందున సాగె భావముల్ 122

ఉ ॥ భావములన్ని నీపయిన భక్తియు శక్తికొలంది నీపయిన్
భావనజేసి జేసివడి భానుసమాన సుదీర్ఘకాంతులన్
ఓవన జాక్ష నీదయిన ఓ హరి పుత్రుడజ్యోతినిన్ గనన్
పావన నామవచ్చిరిదె ప్రార్థనలన్ వెసజేసి భక్తులున్ 123

తే॥ గీ॥ జనన మరణంబు లవిరెండె గనక భువిని
నిత్య నిర్మల జ్ఞానంబు నిమ్ము వేడ్క
ఆత్మ పరమాత్మలో గల్పి అతిరయమున
కావ వేముక్తి పథమును గాంచునట్లు 124

ఉ ॥ భండన భీముడౌదు గదె భాగ్యవిధాతవు నీవుగావొకో
చెండుము దానవాళినిట చెండుము దుష్టుల నెల్లవేళలన్ !
దండిగ భక్తులంగనుచు దానవ మర్దన బ్రోవుమోవెసన్
చెండి సుతుండు గావునను చెల్మిని కల్మిని మమ్ము బ్రోవవే ! 125

వ ॥ భక్తబృందములును రాజును పరివారమును "చంచత్ తుంగ భంగాంగ యౌ" పంపా నదిని సమీపించిరి. సప్తనదులతో సాటియైన ఆ పరమ పావనమైన పంబానదిని దర్శించిరి 126

## పంబ ప్రాచుర్యము

ఆ॥ వె॥ పంబ జూడగానె పరవసించెమనంబు
పంబ పాపపుంజ పటలిద్రుంచ
పంబ గంగ సమము పావనం బగుతీర్థ
మతుల మతుల పుణ్య మతిశయించు 127

ఉ ॥ ముక్తికి తావలంబగుచు ముందుగ దేవగణాళి స్వామితో
యుక్తిని స్నానమాడిరట ఊరట నందగ దేవతాతతుల్
రక్తిని మాధవాంశజుడు రాయిడిమాన్పెను రమ్యరీతితో
శక్తి సుతుండు గావునను స్వాంతమురంజిలభక్తకోటికిన్ 128

ఉ ॥ నీటితరంగమాఇకలు నింపుగ నేగుచునుండ దీపముల్
నీటను దొన్నెలన్ యిడగ నేర్పున బోయెడి చాలుజూడగన్
నీటను తారకావళులు నిక్కముబోవు తెరంగు దోచెడిన్
ఘాటపు భక్తి భావముల భక్తుల చీకటులంత బాయగన్ 129

చ ॥ రథముల యట్టి మాదిరులు రమ్యతరాకృతితోడదీపముల్
పథికులు ఉంచ పల్మరు సు పర్వులుజూడగ మింటనెంతయున్
కథలుగ భక్తసంతతులు కమ్మగ జెప్పుచు నుండ వైళమే
పథికులు దేవదేవునట ప్రాభవయుక్తిని జేయప్రార్థనల్ ! 130

మ ॥ తమముంజీల్చెడి సాధనంబులివి గో తారుణ్య సంభూతమై
విమలాంభః కణ వారిపూరములపై వేద్యంబులై వెల్గుచున్
కమలామోదములుల్లసిల్లగనువే కారుణ్యసందీప్తులన్
కమలాకామిని భర్తబోవగను సంక్రాంతంబుగా వెల్గెడిన్ 131

ఆ॥ వె॥ సప్త నదుల సాటి సరగున నవ్వారి
విమల ముక్తిపథము వేగజేర్చి
భక్త జనుల కెపుడు బడలిక దీరిచి
పంబ పరవసించి పారుచుండు ! 132

ఉ ॥ పావన నీరముల్ పరగు పాపచయంబులు ద్రుంగునచ్చటన్
పావన నాముడై బరగు పార్థివపుత్రుని స్వామి సన్నిధిన్
నేవరమైననున్ సరగ నీమముతోడుత భక్తిభావనన్
పారము ముట్టప్రార్థనలు ప్రాపుగ జేయగ నబ్బునచ్చటన్ 133

చం ॥ విమలపు వారిపూరముల విశ్రుత కీర్తిని నందిదేవతల్
విమలులు గాగనుండిరట వేద్యత మానవులంత నంతటన్
కమల దళాక్షుపుత్రునకు కామితవృత్తులు వీడి భక్తితో
విమలములైన పాదముల వేద్యత గొల్చిన ముక్తినీయడే 134

చం ॥ ఘనతర దీపమాలికలు కాంచగ పంబను గల్గు మోక్షముల్
వినుత యశంబు దెల్పెడిని వెల్గులు కల్గిన సంపదావళుల్
ఘనతర తోయమాలికల గాంచిన మోదము జెందుచిత్తముల్
వినుత యశంబు కీర్తియును విశ్రుత లీలను కల్గుకాంతులన్ 135

ఉ ॥ కాంతులు కాంతిపుంజములు క్రాంతినొసంగగ భక్తులందునన్
కాంతురు స్నానసంపదల కాలుని జేర్చుచు పాపపుంజముల్
కాంతురు మోదమెంతయును కాంచన ధీధితులుల్లసిల్లగా
కాంతురు స్వామి పాదములు కాంతులలోపల గల్గు సంపదల్ 136

వ ॥ ఇట్లు భక్తులు పంబ వారి పూరములతో దీపకాంతులను దిలకించుచు స్నాతులై
పర్వత పాదమున నున్న గణపతిని సేవించుటకు వెళ్ళుదురు. . . 137

తే॥ గీ॥ విఘ్నములు బాపి బ్రోవంగ విభవ మొసగి
ఆలయంబున నానంద మతిశయిల్ల
భక్త సందోహములుమ్రొక్కి భజన సేయ
ఆయుమా సుతుడిచ్చును అతులయశము . . . 138

తే॥ గీ॥ వేద వేదాంగములు తొల్త వేద్యుడగుచు
గంట ముంబాని వ్రాసిన గణన గాంచి
గణములకు నాధిపత్యంబు గల్గు సుతుడు
కల్గె నంచని శివుడంతగాంచముదము 139

ఉ ॥ భూమిని చుట్టివచ్చెనట భూజనులందరు మెచ్చునట్లుగా
ఏమిముదంబు కేకిపయి ఇంపుల సొంపుల సుబ్రమణ్యుడున్
ఏమి ఫలంబు అన్నయటు ఏర్పడతల్లిని తండ్రినిన్ వెసన్
కామిత వృత్తి చుట్టివడి క్రన్ననమ్రొక్కగ గల్గెసిద్ధియున్ 140

ఉ ॥ అన్నకు గల్గు లాభమున కంతట తమ్ముడు మోదమందుచున్
క్రన్నన జేరి మ్రొక్కగను కల్గెముదంబదితండ్రికిన్ వెసన్
క్రన్నన నాగణాధిపతి కాంతులుచిందగ మోదమందగన్
మిన్నక వైభవంబెసగ మేకొన జేకొనె నాధిపత్యమున్ ! 141

తే॥ గీ॥ కన్నెసాములు మ్రొక్కంగ గలదు సుఖము
కత్తి సాములుమ్రొక్కంగ కలదు ముదము
గంట సాములు మ్రొక్కంగ కలదు గుణము
త్రిగుణ ములుమీరి బ్రహ్మంబు తేజరిలగ . . . . 142

శా ॥ ఆటంకంబులులేక భక్తులకునై అంతంతబ్రోవన్ ధృతిన్
నీటందోగిటు వచ్చిభక్త తతులున్ నిక్కంబుగామ్రొక్కగన్
ఘాటం బందగ కూర్మిబ్రోచునట నీగంగా సుతుండంతటన్
చేటుం గీడును బొందకుండగను నా శ్రేష్ఠుండు బ్రోచున్ ధరన్ 143

ఆ॥ వె॥ ఆలయంబులందు అమరిన దేవుల
చూడబోవునపుడు చోద్యముగను
నీకుముందు మ్రొక్కి నిర్మలంబుగనున్న
ముక్తి పథము జేర్తు ముదమెలర్ప ! 144

తే॥ గీ॥ నీవు లేకున్న దైవంబు నెటుల జూడ
నీవు లేకున్న విద్దెలు నెగడవెందు !
నీకు మ్రొక్కక పనులవి నెగడవెందు
విఘ్నరాజ నమోస్తుతే ! విమలయశుడ ! 145

తే॥ గీ॥ అనుచు భక్తులు సాష్టాంగ మమరమ్రొక్కి
నెంచుకొందురు మదులలో నెంతొకూర్మి
గౌరిపట్టి వటంచును ఘనతతోడ !
శివుని తొలిపట్టి నీవయ్య చింతలుడుపు 146

వ ॥ శ్రీ గణనాథుని పూజించి కొబ్బరికాయలు గొట్టి కర్పూరహారతులిడి ధూపదీపములతోను పూలమాలికలతో నర్చించి కొండనెక్కుటకు భక్తులు ప్రయత్నింతురు 147

కం ॥ అప్పాచి మేడయనుచును
అప్పాకడుమిట్టనెక్క అంచితరీతిన్
గొప్పగద కొండనెక్కుట
ఎప్పాటం దప్పదదియు ఎక్కుట మిట్టై 148



చం ॥ బరువడి రాక్షసాంగనను భాసురవృత్తిని ద్రుంచి వేడుకన్
నిరుపమశౌర్య సంపదల నిర్మలతన్ ధృతితోడ పెంపునన్
కరిపయి నెక్కి నీవటుల కాంచనదీధితులన్ వెలుంగుచున్
సురపతి బ్రోచినావుగద సుందరరూపుడనంత సత్కృపన్ 149

కం ॥ హరిసుత జననుత మనువుము
బరువడి కరితేజిగాగ బరగెడు నీవున్
అరుదుగ పులిపైనుండియు
సరగున దిరిగెదవు నీవు సాక్షాత్కృతుడై 150

ఉ ॥ దోపిడులన్ వధించితివి దోర్బలవృత్తిని వారిదౌష్ట్యముల్
బాపితి దేవళంబునకు బాయక పూర్వపు రీతి ఏర్పడన్
నీవట జేయలేదపుడ నిక్కము, వావరుస్వామితోడుతన్
నావన మధ్యమందునను నాధుడవైజనులంతబ్రోవవే 151

వ ॥ అ॥ ప్రార్థించి . . . 152

మాలిని॥ మహిషి హరణ ధీరా ! మంజులాకార వీరా !
మహిత గుణసుసాంద్రా మాధవాకారరూపా !
అహిత ప్రళయరుద్రా ఆదిమధ్యాంత భద్రా
విహిత జనసమృద్ధీ వీర విఖ్యాత కీర్తీ ! 153

ఇది శ్రీ కామాక్షీ చలంభ్రమనామాఖ్యుల పౌత్రుండును చిన్నమ్మయన్వేరి నామాంతరముగల మునెమ్మ మునిరత్నమాఖ్యుల ఏకైక పుత్రుండును నన్ను పెంచి విద్యాబుద్ధులనునేర్పించిన శ్రీమంగతాయారమ్మ నారాయణాఖ్యుల దౌహిత్రుండును శకుంతలాసద్ధర్మ పత్నీ సమేత శ్రీతిరుత్తని పురసుబ్రహ్మణ్యేశ్వర వరప్రసాదలబ్ధ శివసుబ్రమణ్యానామాఖ్య సుపుత్ర సమేతుండును శ్రీహరిహరాత్మజస్వామి శ్రీ చరణరేణువును ఐన మధురాంతకం దొరస్వామినగు నాచే రచియింపబడిన శ్రీ అయ్యప్ప మహాభాగవతంబునందు పంచమోల్లాసము సంపూర్ణము 154

## శ్రీ అయ్యప్ప మహాభాగవతము

# షష్టమోల్లాసము - షష్టాదశ సోపానము

## సర్వవిఘ్న నివారణము - దుష్ట స్పర్శరహితము

కం ॥ ఆ శివునకు విఘ్ననకున్
శ్రీ శివలీలలను జూపి చింతలుదీర్చన్
కాశీ పురముగ శబరిని
ఆశివ రూపుడవు నీవు హరిహరపుత్రా ! 1

వ ॥ ఇట్లు సూతుండు శౌనకాది మహామునులకు శ్రీ అయ్యప్ప మహాద్భుత చరితంబు వినిపింపందొడంగె 2

కం ॥ మోకాళ్ళ మిట్ట యనగా
మోకాళ్ళం గట్టి పరచి మోపుచుపదముల్
ఏకంబుగ ప్రార్థనలను
సాకారత గొల్వదలచి సాగగ వలయున్ ! 3

సీ ॥ గెస పుట్టగా రాదు గేహంబు దేహంబు
పరమాత్మలోపల పదిలపరచి
స్వామి స్వామీ యంచు సాగగ వలెనెప్డు
అయ్యప్ప మాయప్ప అనుచుభక్తి
దిగివచ్చు స్వాములు దిక్కున కెక్కెడి
స్వాములు తెరవున చక్కగాను
కలసిన వేడ్కలు కలవెందుజూచిన
గణుతతో భజనలు గ్రాలుచుండ

గీ ॥ కొండ దండకు జేరుచు కువలయమున
నిండు మదులను నెక్కుచు నిర్మలముగ
చేదు కొనుమంచు అయ్యప్ప చేదుకొనగ
భగవద్రాజ్య మహిమంబు బరగుచుండు ! 4

మ ॥ మణి కంఠాయని మారమ్రోగగ గుహల్ మారెందు లేకుండగా
గుణియౌ స్వామిని గూర్చి పల్కు సుధలున్ గూర్చున్ జనామోదమున్

మణికంఠాయని మానసాంబుధులలో మాన్యుందలంచంవలెన్
గుణులై భక్తులు కొండనెక్కుదురటన్ గోవిందు పుత్రున్ గనన్ 5

తే॥ గీ॥ అప్ప మాయప్ప అయ్యప్ప అధిపబ్రోవు
తప్పులెంచకుమాస్వామి తరళనయన
గొప్పగా నీదు సేవలు గూర్తుమయ్య
అయ్యవున్ అప్పవున్ నీవే అధిపబ్రోవు 6

తే॥ గీ॥ కొండ నెక్కెడి వారలు కొదలు దీర్చి
బ్రోచు బంగరు నాస్వామి బ్రోతు వనుచు
నిండు గుండెల దండల నిక్కముంచి
చొక్కి చేరంగ నేతెంతు రక్కజముగ 7

తే॥ గీ॥ మిట్ట నెక్కుట శ్రమయంచు మిగులదలచ
బోక సర్వేశునామంబు పూర్ణముగను
ఆత్మలోపలిధ్యానంబు అపుడు జేసి
భక్తులేశ్రమలేకుండ ముక్తులగుచు 8

తే॥ గీ॥ కొండ నెక్కుచు మ్రొక్కుచు వేడ్కజూడ
వెండి కొండను పరమేశు వేడ్కజూడ
బోలు నాభక్తవరులను భువనమందు
దీవనంబులనింపుచు దీప్తులెసగ 9

తే॥ గీ॥ బ్రోతు వోస్వామి మాయప్ప బ్రోతు వనుచు !
జ్ఞాన సంపదలలరార గారవమున
ముక్తి అరచేతి దైయుండ ముదమెలర్ప
రక్తితో భక్తులన్ బ్రోతు రయముదేవ 10

తే॥ గీ॥ మత్తు వీడంగ మాయను మరల ద్రోచి
సత్తు నీవంచు జూపించి సదమలముగ
విశ్వమోహననీరూపు వెలయజేసి
భ్రాంతులంబాపి బ్రోతు సుశ్రాంతులు గను ! 11

తే॥ గీ॥ శక్తి సుతుడవు అయ్యప్ప శక్తులొసగి
భక్తి భావాంబరంబున బరగునట్లు
నిశ్చలానంద సామ్రాజ్య నియతిబూన్చి
అక్షయంబుగ భక్తుల ఆదరించు ! 12

తే॥ గీ॥ నేనె విశ్వంబు విశ్వంబు నేనెయంచు
అణువు నందఖిలంబును అమరినట్లు
మహిని మహిమాన్వితంబుగ మనగ ప్రజల
నిఖిల విజ్ఞాన పథముల నిలుపుదీవు 13

తే॥ గీ॥ హరిహరుల వేడ వేడంగ అతిశయమున
గల్గుఫల మెల్లనిన్ వేడ కలుగు నయ్య
హరి హరాత్మజుడగుటను అభయమొసగి
మాదుప్రార్థన లన్నియు మనగ జేయు 14

తే॥ గీ॥ నీవు నేనుగ నేనును నీవుగాగ
సర్వము న్నీదు పాదాల సంతరించి
ఆత్మజ్ఞానంబు ప్రాప్తమై అపుడెగల్గ
మోక్షపదమంద జేతువు మోహనాంగ ! 15

తే॥ గీ॥ మన్మథుని తమ్ముడైనట్టి మంజులాత్మ
మన్మథుని బారిజిక్కక మమ్ము బ్రోవు
మన్మథుని కంటె రూపాన మహిత యశుడ
వెల్గుచున్నావు కనులందు వేడ్కదనర 16

తే॥ గీ॥ మేడ దాటంగ చదునైన మేల్మియైన
బాటనడచుచు వచ్చితి బ్రమలు వాసి
చేరి నామయ్య శరణంబు చెలగ జేసి
శరణ గుత్తిని వేడ్కమై సరబసమున 17

ఉ॥ రాముడు కృష్ణుడున్ రయము రాయిడి మాన్పగ కొండ దొంగలన్
వేమరు గూల్చి బాణముల విశ్రుత లీలల దన్ని వారటన్
గోమున స్వామి గోరగను కొన్ని శరంబులు గుచ్చి రచ్చటన్
సామము తోడ యుద్ధమును చాలగ నిల్పిన యంతటన్ ధృతిన్ 18

తే॥ గీ॥ పూర్వ మందలి కథలకు పొందికగను
కొయ్య బాణాలు శరణంపు గుత్తిలోన
గ్రుచ్చుచుందురు నచ్చట గూర్మితోడ
కన్నె సాములు బహు వేడ్క గలుగుచుండ 19

వ ॥ శబరిమలకు దీక్ష గైకొనిన వారు మొదటి సంవత్సరము పోవుచు కొయ్య బాణములను ధరింతురు రెండవసంవత్సరము కత్తులను మూడవ సంవత్సరము గంటలను ధరింతురు. ఇట్లు 18మార్లు మాలధరించి శబరిమలకు వెళ్ళిన వారికి పునర్జన్మము ఉండదట ఆయుధములు ధరించి వెళ్ళుట ఇరుముడిని తలపై మోసికొని వెళ్ళుట భక్తులు స్వామిననుకరించు హేతువులగు చున్నవి. గంట స్వాములు. విజయ గంటలు ధరించినట్లు భావింతురు. ఇరుముడులలోని నారికేలములందలి నేతితో స్వామిని భక్తులు అభిషేకములు చేతురు.

నారి కేళములు తమ శరీరముగాను అందలి నీరు అహంకారముగాను నెయ్యి భక్తితోను, భక్తులు పోల్తురు. శరీరమను నారికేళము నుండి అహంకారమను నీటిని తీసివేసి భక్తి అను ఆజ్యమును నింపి లౌకిక విషయములందు మనస్సు పోనీక పరమాత్మపై నిలిపి ఇరుముడులు తలలపై దాల్చి భక్తులు వత్తురు. నేతిని పరమాత్మ నభిషేకించుట కిచ్చి చిప్పలను గుండములో వేతురు. సన్నిధిలో గుడికి ఉత్తరభాగమున మెట్లుదిగి పోవుదారిలో మాలికాపు రత్తమ్మ ఆదిశక్తి అంశమై వెలసినది. 20

## లీలావతీ దేవి ఆలయము

సీ ॥ లీలావతీదేవి లీలతోలయమయి
మహిషిగా బుట్టెను మగువనాడు
సుందరమహిషుడై సుదతిని దనియింప
స్వామియు అలనాడు సాగెకొంత
సుందర మహిషంబు సూటిగ కనరామి
మహిషి విజృంభించె మఘువుపైని
మణికంఠస్వామియై మగువను వధియించి
మాలికా పురమున మగువ నిలిపె

స్వామి సాన్నిధ్యమున నుండె సదమలముగ
కామి కానట్టి స్వామిని కడకు కోరి
తపము జేసెడి వైఖరిన్ దాల్చియామె
భక్తతతి పూజలందుచు ధరను నిలిచె ! 21

ఆ॥ వె॥ కన్నె సాములెపుడు కానరాకుందురో
అపుడు ధర్మపత్ని అగుదువనుచు
అధిపుడోదార్చె నాయమ్మ నతిశయముగ
ఆమె అక్కాలమునకు నై అట్టెయుండె ! 22

తే॥ గీ॥ కన్నె సాములు రానట్టి కాలమెద్ది ?
చూచి చూచియు కడగంట స్రుక్కెనామె !
శరణు గుత్తిని జూచుచు శరములందు
గ్రుచ్చి వెళ్ళిన స్వాముల గూర్చి తలచి 23

తే॥ గీ॥ కన్నె సాముల గోపింప గలదె సుఖము
వారి భక్తికి ప్రణతులు వాస్తవముగ
ననుచు దీక్షతో మాలిక నవయుచుండె
స్వామి కొరకెంతో వేచిటు స్వాంతమునను ! 24

తే॥ గీ॥ వత్సరంబున కొకమారు వాస్తవముగ
యుత్సవంబది జేతురు ఊరటగన
శరణగుత్తిని శరముల చాలజూచి
కోపమున మాలికా మాత కోర్కెగనక
మాలికా పురమందున మరలజేరు ! (పంచపాది) 25

ఉ ॥ మాతయు మాలికా పురము మాటికి జేకొని భక్తసంతతిన్
ఆతత వత్సలత్వమున అంచిరీతిని భక్తకోటినిన్
బ్రోతు నటంచు దీవెనల పూర్ణముగాగను నిచ్చిబ్రోచుతన్
కాతర నేత్ర యామెయటు కాంచన గర్భ సముండు జూడగన్ 26

సీ ॥ ఆదిపరాశక్తి ఆవిర్భవించిన
దేమియంచును రీతి తేజమెసగ
అమ్మపార్వతి తోడ ఆదిలక్ష్మియుగూడి
అవతరించె నొయన్న అతిశయంబు
సరసత విద్యల సాన్నిహిత్యము చేత
చారు సరస్వతీ చానబోలి
అపరకాళికయన అవనిలో ఆవిర్భ
వించి తానతివయై వెలసెనిలను

తే॥ బలు తెరంగుల స్తోత్రముల్ ప్రజలు సేయ
స్వామి గుడికిని వలపట చాలవెలసె
మాలికా పురమందున మగువ వేగ
భక్తులం బ్రోవ అంబిక బరగినట్లు 27

సీ॥ ప్రకృతి శక్తులు పరిపక్వ మందియపుడు
అమ్మగా బుట్టెను అతివమిన్న
కాత్యాయనీదేవి కలరూపు వహియించి
కారుణ్యమున ప్రజగాచుకొరకు
ఈవన సీమను ఇంపుగా నిచ్చట
శబరి పీఠంబున చానవెలసె

తే॥ గీ॥ స్వామి మున్ముందు యుగముల స్వాంతమలర
మంచ మాంబిక బ్రోచును మహిమ దనర
ఆమె కోరిక రిత్తగా అగునె చెపుమ
జన్మజన్మాంతరంబుల జననియగుట 28

వ ॥ అట్లు మాలికా పురమాత గత జన్మము నందలి ప్రేమ వీచికల దలపోయు చుండెను. 29

ఆ॥ వె॥ కలియుగంబు వోవ కలయుగంబులలోన
తల్లిదండ్రులనుచు దలచ బ్రజలు
మానధనులు వారు మహిమతో బ్రీతిని
దంపతులుగ వారు తగుదురపుడు ! 30

ఉ ॥ కొందరు పార్వతీ సతిగ కొందరు లక్ష్మిగ కూర్మితోడుతన్
కొందరు భారతీ సతిగ కొందరు కోరిభజించుచుండగా
కొందరు మంచమాంబికగ కొందరు తల్లిగ కొందరెంతయున్
కొందల మంద నేలయిటు కూర్మిని శక్తియటంచు కొల్వగన్ 31

తే॥ గీ॥ ధరను భక్తులబ్రోవంగ దాల్చె మూర్తి
మాలికా పురమందున మగువ యపుడు
శక్తిగా నుండి భక్తుల రక్తినేలు
భక్తియుం జూపి భక్తుల బడలు దీర్చు 32

## పందళ రాజవంశజులు సంక్రాంతికి స్వామికి ఆభరణములను అలంకరించుట

కం ॥ పట్టాభిషేకమునకై
పట్టుగ అలనాడు వేడ్క ఆ ప్రభుడంతం
దిట్ట తనము మీరంగను
గుట్టుగ తా జేసినట్టి కూరిమినగలన్ 33

కం ॥ సంక్రాంతి క్రాంతి కొరకై
సంక్రాంతి నలంకరింప స్వామిని వేడ్కన్
సంక్రాంతి రోజులందున
సంక్రాంతిని సంభ్రమమున సారెకు అపుడున్ 34

వ ॥ పందళ రాజభవనంపు కోటనుండి ఆనాడు పట్టాభిషేకమును చేయదలచి రాజశేఖరుడు చేయించిన నగలను ప్రతి సంక్రాంతి దినమున ఆనగలతో స్వామిని అలంకరింప భక్తులు తీసికొని అలంకరించుట ఆచారము పెట్టెను. కొని వచ్చునపుడు పెట్టెపై భాగమున ఆకసమున గరుడుడేతెంచి గుడిని ముమ్మారు ప్రదక్షిణించి యేగుచుండును ఇది స్వామి అనుగ్రహము. 35

తే॥ గీ॥ వైన తేయుని అంశంబు వాస్తవముగ
గరుడు డొక్కండు గగనాన గానిపించి
పెట్టెపై భాగమందున ప్రీతితోడ
వచ్చు చుండును ప్రతియేట వాస్తవముగ ! 36

తే॥ గీ॥ కాలినడకను భక్తులు క్రాంతితోడ
అనుగ మించంగ నటనట ఆదరమున
నిలచి విశ్రాంతులంగని నేర్పు మీర
వచ్చి గుడిజేర పెట్టెతో వైభవముగ 37

తే॥ గీ॥ ఉన్న నగలను వేడ్కను నున్నతముగ
స్వామి కంతట భక్తులు స్వాంతమలర
నిండు భక్తిని తామంత నేర్పుమీర
నగల గైసేయ స్వామికి నగును ముదము ! 38

చం ॥ అనుచు ముదంబుతోనపుడు అంచిత రీతిని భక్తబృందమున్
ఘనమున బ్రోవగా వడిని గాఢత చీకటులుండొలంగగా
ఇనుడగు భంగితేజరిలి నింపుల సొంపుల కాంతి పుంజముల్
ఘనమున జూచి బ్రోచునట కాంచన దీదితులుల్లసిల్లగా 39

చం ॥ ఘనమున బ్రోచుదేవుడని కంజదళాక్షుడు కాంతి రూపుడై
జనుల మనంబులందు నను చారుముదంబుగ భాగ్యరేఖలున్
అనువున నెల్లదేశముల ఆదయ గూరిమి యెంతదౌనొకో
వినుత యశస్కుడై బరగి వీరుడు గావున వెల్గునిత్తరిన్ 40

మ ॥ మణిదీపంబుల కాంతిపుంజములతో మా రెండు లేకుండగా
గుణ సంయుక్తులు భక్తసంతతులతో గూర్మింగుడింజేరగా
మణిదీపంబుల కాంతి జూచుచును తా మంతం సురల్ రాగస
ద్గుణులైవేగమే నాధ్వజంబువెలిగెన్ గూర్చంగ నామోదమున్ 41

తే॥ గీ॥ ఆధ్వజస్థంబ మమరెను అతిముదమున
పసిడి బూతల మెరుగుల పలు తెరగుల
జయము నయమును శాంతంబు చాలగల్గి
విజయ మంగళ ధ్వానంబు వెలసినట్లు 42

తే॥ గీ॥ మ్రోగె మింటను దుందుభుల్ ముదముగదుర
మ్రోగె గుడిలోన దుందుభుల్ మోహనముగ
మేళతాళాలు గొనబున మేకొనంగ
స్వామి సాన్నిధ్యమందున సదమలముగ 43

## స్వామిని భక్తులును రాజును దర్శించుట

చం ॥ గుడిని ప్రదక్షిణంబుగను గూడగ నాప్రజలెల్ల యుల్లముల్
అడుగులు భక్తితో నిడుచు ఆదట రాగను భక్తిభావముల్
మడుగులు నొత్తుచుండగను మాటికి అయ్యప్రబ్రోవు మంచొగిన్
వడివడి మ్రొక్కుచున్ వసుధ పల్మరు కొంచిరి యిష్టమూర్తికినిన్ 44

ఉ ॥ ఆశుభ గంపు నాదమును అంచితరీతిని పట్ట బంధమున్
ఈశుని పుత్రుడప్పుడును ఇంపుగ దాలిచి వేదవేద్యుడై
ఆశయ మెంతొ సంభ్రమత అంత సురూపముదాల్చిశోభిలెన్
గాసిని దీర్చి భక్తులకు జ్ఞానము గల్గిగజేయు నెంతయున్ 45

శా ॥ ఆ చిన్ముద్రను దాల్చి తానపుడు నానందాను సందాయియై
ఏ చిన్ముద్రను తాపసోత్తముడునై ఏర్పింప బ్రహ్మంబునై
నా చిన్ముద్రయె జూచు వారలకు నా నాసౌఖ్యసంజాతముల్
నోచంగల్గును గాదె భక్తతతికిన్ నోంకారతన్ ధుర్యతన్ 46

ఉ ॥ కన్నుల పండువై గనగ కాంచన రూపుడు దంచి తంబుగా
బన్నములన్నివాయగను బల్మరు నీదగుప్రార్థనంబులన్
సన్నుతి సేతురయ్యనిను సారెకు నీశ్వరపుత్రుడంచొగిన్
విన్నపజాలముల్ వినుచు విశ్రుత కీర్తిధరుండ బ్రోవవే 47

ఉ ॥ సారెకను గ్రహంబులను స్వాంతమురంజిలకుప్ప వోసివే
సారక భక్తసంతతికి సాధుజనాళికి నిచ్చుచుందువో
సారపు ధర్మమూర్తివిగ సాగితి భక్తుల గుండెలందువే
పారము ముట్ట ముక్తిగన పావనమూర్తివి బ్రోతువెల్లరన్ 48

ఉ ॥ పండెను మాదు భాగ్యమని ప్రార్థనలన్ నిను భక్తి భావనన్
గుండెల నిండ వేడగను గూర్తుముదంబతి వేలమై ధృతిన్
మండెను పాపపుంజములు మాటికి నేటికి సత్ప్రభూప్రభూ !
గుండెల నింపు భక్తులకు గూర్చి ముదంబున భక్తిభావముల్ 49

ఉ ॥ పూర్ణముగాగ నేలెదవు పూర్ణమ భర్తవు పుష్కలాంగనా
వర్ణిత భర్తవౌదువట వాసిగ పూర్వయుగంబు లందునన్
వర్ణన సేయమాతరమె వాసవు బ్రోచిన స్వామి బ్రోచునా
పర్ణకు గూర్చు పుత్రుడవ వారిత రీతిని బ్రోవుమందరన్ 50

తే॥ గీ॥ ఆదరింతువు నార్తుల ననవరతము
కూర్తుమోదాళి భక్తుల కోరిమ్రొక్క
శాత్రవులు లేక యుండంగ చాలదయను
అందరయ్యప్పలుగ జేసి ఆదరింతు ! 51

మ తమముం జీల్తువు కామక్రోధముల తాత్పర్యంబులన్ జెందకన్
సమముంజేసియు నెల్లప్రాణులధృతిన్ సాగించి సద్భావముల్
కమనీయంబుగ వారిడెందములలో కాత్యాయనీ నందనా
సమతన్ నీ గుణ పుంజముల్ నిలుపుచున్ స్వాంతంబులంబ్రోవవే ! 52

తే॥ గీ॥ హరిహరుల గొల్పుపుణ్యంబు అబ్బుగాదె !
హరిహరాత్మజు గొలువంగ నతిశయముగ
జ్ఞాన మోక్షంబులవి రెండు గలుగు నపుడె
ఒకట రెండు ఫలంబులు ఒనర గల్గు ! 53

వ ॥ స్వామి విగ్రహమునకట కుంభాభిషేకములు చేసి తాంత్రికాచార్యులు పూజించిరి. అపుడు 54

ఉ ॥ మ్రోగెను శంఖనాదములు మ్రోగెను దుందుభిధ్యానముల్ వెసన్
మ్రోగెను గానసంపదలు మోహన మూర్తిది విగ్రహంబొగిన్
వేగమె ఆలయంబునను విస్తృత కీర్తిని నిల్పనంతటన్
మ్రోగెను ఘంటికారవము మిక్కిలి మోహనమై చెలంగగన్ 55

తే॥ గీ॥ స్వామి నిలుచుండునచ్చోట స్వాంతమలర
కాంతి పుంజాలు జాల్వార కాంతి చయము
తళ్కుతళ్కంచు వెడలి తదాత్మవెడలి
విగ్రహంబున గలసెను వేడుకలర ! 56

## స్వామి మాయమై కాంతిమలకు వెళ్ళుట

తే॥ గీ॥ స్వామి గనిపించకుండంగ సాగెనెటకొ
కాంతి మలలోన కాంతియై క్రాలనోపు
వింత సంభ్రాంత చిత్తులై వివశులగుచు
భక్తి భజియింప భక్తులు పరమపురుషు 57

శా ॥ దేదీప్యంబగు కాంతిపుంజములతో తేజంబు నిండారగా
ఏడేవుండిట జ్యోతియై వెలిగెడిన్ ఏర్పింప నక్షత్రమై
ఆ దేవుండెగదా కృపార్థియగుచున్ అంతంత గన్పించెడిన్
మోదాశ్రుల్ వనులందు వెల్గ ప్రజకున్ మోదంబు దైవారగా 58

ఉ ॥ సత్యము జ్యోతియై వెలిగె స్వాంతములందున భక్తిభావముల్
నిత్యము భక్తులందురును నిర్మలతాగరిమంబు పెంపునన్
నిత్యము దాని గాంచగను నిర్మలచిత్తులహృత్పదంబులన్
సత్యము భక్తకోటికగు ప్రార్థనలన్ వెసజేసి చూడగన్ 59

తే॥ గీ॥ ఇది పరంజ్యోతి జ్యోతియై ఇపుడు వెల్గె
జ్యోతి లన్నియు నే జ్యోతి జ్యోతియగుచు
జేరు నాజ్యోతి ఇహపరం జ్యోతియగుచు
ఆధ్యతను బ్రోచు భక్తుల నహరహంబు ! 60

ఉ ॥ చీకటి బాపి వెన్నెలల జేరుచు మోదము గుల్కుచుండగన్
ప్రాకటమై త్రిభావముల ప్రాపుగ జేరుచు భక్తులన్ వెసన్
ఏకముగాగ దైవములు ఎంతొముదంబున నొక్కటైధరన్
వేకను గల్గజేయునట వేద్యత స్వాంతము భ్రాంతి వీడగన్ 61

ఉ ॥ చీకటులన్ దొలంగనిట చోద్యము వెల్గుల నింపి భావముల్
ప్రాకట భక్తితో వెలుగ ప్రాంజలులుంచుచు స్వాములందరున్
మీ కమనీయ కాంతులను కాంతివ హింతురు ఖ్యాతిగాంచుచున్
వేకను గల్గిమోక్షపద వేద్యులుగాగనునుందు రెంతయున్ ! 62

చం ॥ గరుడుని సాక్షిగాగనిట గాంచగజ్యోతిని అందరున్ వెసన్
నిరుపమ రూపసంపదల నిక్కమువెల్గెడి స్వామికొండపై
బరువడి గాతుసత్ప్రభువ భాసురవృత్తిని నిత్యమున్ వెసన్
మరిమరి ప్రార్థనల్ సలిపి మాటికి మ్రొక్కెదబ్రోవవే వెసన్ 63

ఆ॥ వె॥ నిదురవోవునపుడు నిక్కంబు నిన్ జూచి
నిదురలేక నిన్ను నేనుదలచి
నదరు బెదరు తోడ నాస్వామి దలచితి
కరుణ జూడవేల కలుషహరణ 64

తే॥ గీ॥ నీదు కావ్యంబు వ్రాయంగ నిర్మలాత్మ
నాదు డెందంబు యూరటల్ ననలుకొల్ప
మీదు పాదరజంబుగ మిగుల నుంటి
స్వామి కాపాడు కాపాడు సదయుడగుచు 65

ఉ ॥ మందులు మాకులున్ వలదు మాటికినిన్ దలపోసి నంతటన్
కందువ గాగ బ్రోచెదవు కారణ జన్మడ కొండవీటిలో
అందము చిందగా వలదె అంతటనిన్ దలపోయుచుండగా
ఎందున నీ వెయుంటివని ఏర్పడబల్కిరి భక్తులందరున్ ! 66

ఉ ॥ ఉంటివి రక్షసేసితివి ఊరట నందగ డెందమందునన్
మంటిని నీదు సత్కరుణ మిక్కిలి బ్రోవగ కావ్యసంపదన్
దంటగ వ్రాయుదున్ ప్రభువ తాలిమి తోడుత బ్రోవసత్కృపన్
అంటగ పుణ్యభావములు ఆదట బ్రోవుము ధర్మశాస్త్రవై ! 67

శా ॥ నైర్మల్యంబును నిచ్చిబ్రోవగదవే నిక్కంబు నీభక్తుడన్
మర్మంబుల్ వెసలేక నెల్లడలనన్ మాన్యంబుగా నేలవే
కర్మంబుల్ వెస ద్రుంచి బ్రోవగదవే కాంక్షించితిన్ పాదముల్
వర్మం బొందగ నాదు డెందముననే వాసిల్లగా బ్రోవవే ! 68

మ ॥ నయమున్ సత్యముధర్మమున్ వెలుగగా నాధిఖ్యతన్ బ్రోచికో
భయముల్ బాపుచు పుణ్యసంపదలతో పాపంబులన్ బాపుకో
నియమంబుల్ వెసజూపుచున్ నిరతితో నిక్కంబు మమ్మేలికో
నయముం జూపుచు స్వాములన్ నిరతమున్నాస్వామిరక్షించుకో 69

గేయము॥ నీ భవనం స్వర్ణం నయనం స్వర్ణం
వదనం స్వర్ణం హృదయం స్వర్ణం
హృదయాధిపతే సకలంస్వర్ణం
చరణాల్ స్వర్ణం కరములె స్వర్ణం
రూపం స్వర్ణం దయయేస్వర్ణం
హృదయాధిపతే సకలం స్వర్ణం
భావం స్వర్ణం భాగ్యం స్వర్ణం
భక్తియే స్వర్ణం ముక్తియే స్వర్ణం
జ్యోతియే స్వర్ణం పరం జ్యోతియెస్వర్ణం
హృదయాధిపతే సకలం స్వర్ణం ! 70

ఉ ॥ స్వర్ణమయంబె జీవితము సాగగ నావగ సత్పథంబులన్
వర్ణవివక్షతల్ విడిచి వర్థిలజీవిత సంద్రమందునన్
స్వర్ణమె సత్యసంపదల స్వాంతమురంజిల భక్తిమార్గమున్
స్వర్ణమయంబుగాదనిపి సాగగ భక్తుల బ్రోవవే వెసన్ ! 71

మ పరమాత్ముండవు నీవె పాహియనగా ప్రారబ్దముల్ బాపవే
కరినేలంగను విష్ణుడేయనుచునిన్ గాంచంగ కైవల్యమున్
బరమా నేలగమమ్ము వేగమున మా భాగ్యంబ గణ్యంబుగా
సరిగా డెందమునందు జూచివెసనీ సాన్నిధ్యముంజేర్చవే 72

తే॥ గీ॥ సూర్యకిరణాళి సోకిన సూటిగాగ
చీకటులు మాయ మౌనటుల్ సుందరాంగ
నీదు ప్రాపున పాపముల్ నిలువగలవె
నీదు కిరణాళి సోకిన నీఱుగావె ! 73

ఉ॥ సమ్మతి నమ్మి నారమిక సంస్తవనీయుత తోడ బ్రోవవే
కమ్మని గానసంపదల కల్మషమంతయు వీడిపోవగా
రమ్మని మమ్ముజేరమని రంజిలజేయుము మామనంబులన్
నిమ్మహి నీవెదైవమని నిక్కము నమ్మితిమీశ్వరా వెసన్ ! 74

శా॥ నీవే దైవమటంచు నమ్మితినినే నిక్కంబుగా నా మదిన్
రావే రాజకుమార బ్రోవగదవే రంజిల్లగానామదిన్
రావా నావెదదీర్చి బ్రోవగదవే రమ్యంబుగా నీకృపన్
కావా మా మదిలోనిదైవమయి నీ కాంతుల్ విజృంభింపగన్ 75

మ॥ త్రిగుణాతీతులుగాగ నుండవలయున్ తీవ్రంబుగా భక్తులున్
త్రిగుణం బందుల సత్యమే సదయతన్ ధీరుల్ గనన్ వేగమే
ద్విగుణంబుల్ వెసరాగ ద్వేషములతో తీవ్రంబుగా నుండెడిన్
త్రిగుణాతీతమనస్కులౌటకు వెసన్ తేజంబు భక్తాళికౌ 76

తే॥ గీ॥ జ్ఞానమున కంటె ధ్యానంబు గాంచుమేలు
కర్మఫలత్యాగమధికంబు గాంచుదాన
త్యాగమున శాంతి లభియించు తత్త్వవిధులు
త్యాగ భాగ్యంబుగాంతురు త్యాగధనులు 77

తే॥ గీ॥ దేహి దేహంబు వాసిన తేజమలర
ఆత్మ రూపాన తానుండు నతిశయముగ
సర్వప్రాణుల డెందాల సాగునాత్మ
తానె పరమాత్మలో నుండు తలపజనులు 78

తే॥ గీ॥ పరమ గతిగాగ దేవునిన్ సరగ దలచు
నాతడే జ్ఞాని-జ్ఞానియౌ ననవరతము
మూడు కాలములందున ముదమెలర్ప
జరుగు సంగతులన్నియు స్వామియెరుగు 79

తే॥ గీ॥ ఇతర విషయాలపై మది ఇంచుకేని
లేక యోగంబు గాంచుచు నేకముగను
మదిని నిల్పిన మహనీయ మగుచు ప్రజలు
స్వామి పాదాలలో నుండ సాగుచంద్రు 80

ఉ ॥ శ్రద్ధయు యింద్రియంబులును సర్వము నిగ్రహమొందజేయుచున్
నిద్దర బ్రహ్మజ్ఞానియగు నీరజనాభుని సత్కృపాంబుధిన్
బుద్ధిగ నాచరించవలె పూనిక కామములేని కర్మలన్
అద్దిర బ్రహ్మజ్ఞాని యగు అంచిత రీతిని నుండునట్లుగన్ 81

మ ॥ మనసే బంధువు శత్రుడున్ మనగసే మంబుందగం జూడగా
మనసే సత్యగుణాంచితంబుగను నేమాన్యుండు పాటించునో
ఘనమౌ శాంతియు సౌఖ్యసంపదలతో గాంచున్ జనామోదమున్
వినుమోజీవుడ విశ్వమందునను నీ విఖ్యాతియౌ సత్యమున్ 82

శా ॥ శీతోష్ణంబును ఖేదమోదములిటన్ శీలింపగా రాదు
చేతోమోదము సర్వజీవుల యెడన్ శాంతంబుతో నుండగా
ఏ తత్వంబులనున్న శత్రువులతో ఏర్పించగారాదు నీ
శాంతాకారము తోడ జూడవలెతా శ్లాఘింపసత్కోవిదుల్ 83

ఉ ॥ సత్యము సర్వసంపదల సాగును జ్ఞానపు దీప్తులన్ గనన్
నిత్యము దాని గాంచవలె నిర్మలతాగుణశీల సంపదన్
అత్యతిగాగ రంజిలగ ఆదట రాజసమున్ తమంబునున్
పత్యము తా మసంబుగన పాటులు చేటులువచ్చుగాదొకో 84

తే॥ గీ॥ మూడు గుణములు దేనికి ముఖ్యముగను
ద్వేషముంబూన డెంతయు తేజమెసగ
అవియు లేకున్న కాంక్షింపడతడు సువ్వె
ఇంచుకేని చలింపక నుంచు మదిని ! 85

తే॥ గీ॥ సుఖము దుఃఖంబు. రాయియు సూటిగాగ
మట్టిపెళ్ళయు బంగార మనిన వాని
ఒక్కటిగ జూచు భేదంబు నిక్కముగను
చూప బోవక యుండును సుముఖడౌచు ! 86

తే॥ గీ॥ ఇంద్రియంబులు గుఱ్ఱముల్ ఇంపుగుల్క
మనసు సారధియగుచుండు మాటికెపుడు
రథికుడే బుద్ధిజూడంగ రాజసమున
ఆత్మరాజగు ఆదేశ మపుడు బంప 87

తే॥ గీ॥ భయము అభయంబు బంధంబు బాగదెలిపి
మోక్షమార్గంబు నెరుగుట మోదమగును
చేయవలసిన పనులేవి చేయదగని
పనుల దెలియుట సాత్విక పద్ధతియగు 88

తే॥ గీ॥ ఏమి యంటిని నాస్వామి ఏమియంటి ?
అంటి మీ పాదపద్మాలు అనవరతము
నాదు హృత్పీఠమందున నధివసింప !
నుండ నీయవే నీయవే నిఖిల శుభము ! 89

తే॥ గీ॥ నిందకున్ ప్రతినిందను నెపుడు జేయ
కునికి ఓరిమి భూదేవి కుండు నంత
కలిగి మెలగంగ వలయును కరుణ నొసగు
కోప భావంబు హృదయాన గుబులు కొనక 90

తే॥ గీ॥ శాంతి సౌభాగ్య గరిమంబు చాలగల్గి
మెలగ వలయును అయ్యప్ప మిగుల బ్రోవ
పొగడి నంతట పొంగక పోడిమిగన
క్షమము ఓరిమి సతతంబు సాగవలయు 91

వ ॥ మరియు అయ్యప్ప భక్తులకు ఎన్నియో నియమముల నేర్పరించెను అందు 92

తే॥ గీ॥ నిన్ను నిందింప నీకది నిక్కముగను
తక్కువేమియు కాబోదు తాల్మితోడ
మౌనముంబూనినన్ నీకు మంచిదగును
ఇత్తడ నినను కనకంబు ఇత్తడగునె 93

తే॥ గీ॥ మౌనమే శక్తి ఓరిమి మహిత గతిని
శక్తియగు గాన శక్తులు చాలగలుగ
శక్తి సుతుడిట్టి నియమముల్ సలుపు మనియె
ప్రార్థనలతోడ నెప్పుడు పరవసించి 94

ఆ॥ వె॥ స్త్రీలు కంట బడిన చిద్విలాసముతోడ
అమ్మవారలనుచు ఆత్మలందు
జూచువారలెందు చోద్యంబుగాదంచు
ఆదిశక్తులనుచు అపుడెదలచి 95

ఉ ॥ నీమములన్నియున్ మొదట నిక్కము చక్కగ జెప్పెనప్పుడే
కోమల మానసాబ్జముల కొల్వగస్వామిని భక్తులందరున్
స్వాముల డెందముల్ మిగుల శాంతియుదాంతియుకల్గునట్లుగా
నీమములందలంచుకొని నీతిమెయిన్ ధరనుండగా వలెన్ 96

తే॥ గీ॥ ఐదు కొండల వాడవు ఆశ్రితులకు
కొంగు బంగార మగుచును కూర్మితోడ
సర్వసౌభాగ్య గరిమంబు చాలనిచ్చి
ముక్తికాంతావిలాసంబు ముదము నిత్తు 97

శా ॥ శ్రీశైలంబిది చిద్విలాసమిది యే శ్రీకాళహస్తీశుడున్
నీశైలంబున నిన్ను జూచుటకునై నిక్కంబుగా వత్తురే
నీ శైలాకృతితోడనుండు శబరిన్ నిక్కంబుగా నుండుచున్
ఈ శైలాగ్రమే కాశిగాగ నెపుడున్ ఈ భక్తులన్ బ్రోతువే 98

మ ॥ ననునీ వానిగ జేర్చుకో సుమతిగా నాపాపముల్ద్రోచుకో
మనగా మంజులరీతితో నెపుడు నీమంబుల్ తగన్ దిద్దికో
ఘనపాఠంబులు నేర్పి నీసుమతిగా గానంబులం నింపుకో
అనయంబున్ భజియింపగా వసుధలో ఆనందముంజూపుకో 99

మ ॥ ఘనతన్ ప్రాపుగనేలికో గతివిగా జ్ఞానంబులన్ నింపుకో
వినయాధిఖ్యాత తోడనుం మనగ నీ విశ్వాసముంజూపుకో
ఘనమౌస్వామివి విద్దెలందనుపుకో గాంచంగ గన్పించుకో
మనసా ప్రార్థనలందుకో వెసను నీ మహాత్యముంజూపుకో 100

మ ॥ భువనంబందున నీశ్వరుందలచగా బుద్ధిన్ మదిన్ నింపుకో
సవనంబట్టుల సాగగామదిని నీ సాంగత్యమున్ జేర్చుకో
భవపాపంబులద్రుంచి నీవుకరుణన్ భాగ్యంబులన్ నేలికో
భువనాధీశుడశంభుపుత్రుడవు నీ పూర్ణాకృతింజూపుకో ! 101

మ ॥ హరికిన్ శూలికి నందనుండవగుచున్ ఆనందమున్ జూపుకో
సిరికిన్ శక్తికి నీవు పట్టివగుచున్ చింతల్ దీర్చి రక్షించుకో
వరముల్ గుప్పుచువాసిగాంచప్రజలన్ వర్ధిల్లగా బ్రోచుకో
పరమార్థంబుల నింపి మమ్ముృవడిమా ప్రారబ్దముల్ బాపుకో 102

తే॥ గీ॥ ఖండ ఖండాంతర వ్యాప్తి కలుగుచుండె
నీదు చిన్ముద్రతోడిది నిక్కముగను
వరలు చున్నదినీమూర్తి వాస్తవముగ
శ్రీరమాపార్వతీ పతుల్ చేరినట్లు ! 103

తే॥ గీ॥ గుడికి ఎడమ బ్రతిష్టించి కుదురుకొనిన
కనుల పండువ గణపతిన్ కాంచగలము
అన్నసామికి మ్రొక్కుచు నాదరమున
బన్నములు బాపవేడంగ బడయుముక్తి 104

తే॥ గీ॥ పదునెనిమిదవ మెట్టుకు పడమటిదెస
గుడిని వావరుస్వామికి కోరికట్టి
రపుడు హిందూముసల్మాను లలరుచుందు
రఖిల క్షేమాలకయ్యది రక్షయగుచు ! 105

తే॥ గీ॥ నిఖిల జనులంత మోదాన నిర్మలముగ
వావరాఖ్యుని వంశంబు వాసిగాంచ
వారివలన విభూదిని వరుసదాల్తు
రైక మత్యంబు వర్ధిల్లి అలరుచుండ 106

తే॥ గీ॥ భక్తులంతట కలకండ పచ్చిమిరియ
ములను ఆరాధనంబున ముదముతోడ
నప్పనముసేసి బూదిని నపుడు దాల్తు
రెంత పుణ్యంపు మతులొకో యేర్పంప ! 107

ఆ॥ వె॥ ఉత్తరంపు మెట్లు ఓరిమితోదిగి
మాళిగ పురమునకుమరలవెళ్ళు
దారిలోన దోచు ధార్మిక తతితోడ
నాగరాజు యక్షి నయము గదుర 108

ఆ॥ వె॥ నాగరాజు జాడు నాగయక్షిణిజాడు
దారిలోన నీవు దప్పకుండ
వారిదాటిచనిన వాస్తవమ్ముగ నుండు
మాలికాపురత్తు మాన్యచరిత ! 109

కం ॥ ముక్కంటి పండులన్నియు
చక్కగ దొర్లించు కొనుచు సాగుచు చుట్టున్
మ్రొక్కుచు తిరుగుచు వలయుము
నిక్కము నైవేద్యమిడుట నియమంబిచటన్ ! 110

కం ॥ నీరాజనంబు లిడుచును
సారంబగును తులతోడ సారెకు మ్రొక్కన్
కోరిన వరముల నిచ్చును
సంతానము సౌఖ్యమగుచు చాలగ గలుగున్ 111

ఆ॥ వె॥ పసుపు పొడిని గొంచు పావనమారీతి
మంగళాంగులంత మహిమదాల్చి
నంత శోభనములు హాయిగ గల్గును
అమ్మవారిదయ ననంతముగను 112

తే॥ గీ॥ నారికేళాలు తనువులు నందునున్న
నీరమేయహంకారమై నెగడుచుండు
నీరముందీసి భక్తియున్ నేతినుంచి
ఇరుముడుల గూర్చి తెత్తురు ఇలను ప్రజలు 113

తే॥ గీ॥ నారికేళాలలో నున్న నంచితంపు
నేతులందీసి అభిషేక నియమమొప్ప
ఆలయంబున స్వామికి అతిముదమున
అంతనభిషేక మొనరించి అలరుచుంద్రు 114

ఆ॥ వె॥ నేయి ఆత్మగాను నిజముగా స్వామికి
ఆత్మనప్పణంబు అపుడు జేసి
దేహమైన టెంక దేదీప్యముగ వెల్గు
గుండమందు వైవ గూర్చుముదము 115

ఆ॥ వె॥ స్వామితనువు సోక స్వాంతంబు రంజిల్లు
నేతినపుడు ప్రజలు నేర్పుమీర
బూసికొన్న యెడల పూర్వంపునొప్పులు
పోవుతనువునందు పోడిమిగన 116

ఆ॥ వె॥ ఔషధంబు పోల్కి ఆదటనేతిని
నిల్వజేసికొనుచు నేర్పుమీర
భక్తతతులు వేగ భక్తితో జనుచుంద్రు
స్వామి పాదములను సాగిమ్రొక్కి 117

షష్టాదశ సోపానము సమాప్తము

## శ్రీ అయ్యప్ప మహాభాగవతము

# షష్టమోల్లాసము - సప్తదశ సోపానము

## సర్వాంగ సుందరము - విద్యారహితము (త్రిగుణరహితము)

### భక్తుల ప్రార్థనలు

సీ ॥ పడికట్టు పడికట్టు పరవసింపగనెక్కి !
శరణంబు శరణంబు స్వామి యనుచు
ఔదల ఇరుముడి ఆనందమునబట్టి
రెండు చేతులతోడ నిండుమనసు
తోనుండ అయ్యప్ప తోయజనయనుండు
డెందంబులందున నిండియుండ
ధ్యానించి భక్తితో ధర్మంబు సత్యంబు
జూపగా ప్రార్థించి చోద్యమంద !
గుడిని చుట్టివచ్చి గురుతుగా గమనించి
స్వామిపాదయుగళిస్వాంతమలర
మ్రొక్కి సన్నిధానమోదంబునుంగాంచి
రక్షసేయవేడి రపుడు ప్రజలు 118

ఉ ॥ ఓపరమేశనందనుడ ఓకరుణాకర ఓ మనోహరా !
ఓపిక తోడ మమ్ముగని ఓవనజాక్షుడ మమ్ముబ్రోవవే !
ఓపరమాత్మనీవె గతి ఓజగదీశ్వర మమ్ముబ్రోవవే !
మీపదపల్లవంబులను మిక్కిలి గొల్తుము శాస్త్రబ్రోవవే 119

సీ ॥ మాంరక్ష మాంరక్ష మాంరక్ష యంటిమి
మహిషిమర్థనస్వామిమమ్ముబ్రోవు
శరణఃబు శరణంబు శరణంబు అంటిమి
శరణాగతుల మమ్ము సరగబ్రోవు
శరణు జొచ్చిన వారి శరణాలు గైకొని
చరణముల్ జూపించి సరగబ్రోవు
వరములంగుప్పించి వారిజనయనుడై
వాసిగాంచినస్వామి వరద ఏలు

వచ్చినారము మాస్వామి వనరుహాక్ష !
దివ్యదేదీప్యమగురూపు భవ్యముగను
గానిపించెను రాదొర కరుణనేలు
కార్తికేయుని తమ్ముడా కలుషహరణ 120

వ ॥ అని ప్రార్థించి తర్వాత ఇరుముడులను ఆరుబయట గురుస్వామిద్వారా విప్పి అందలి నేతిని నింపిన కొబ్బరికాయలలో నేతులను ఒక పాత్రలో సేకరించి పునర్దర్శనమునకు వెళ్ళి నేయ్యభిషేకమును తిలకించితిమి. 121

సీ ॥ నేయ్యాభిషేకంబు నేర్పున జేయంగ
వెయ్యారు విధముల వెలయుచుండ
పూలాభిషేకంబు పుణ్యంబుతోజేయ
పూనిక డెందాన మురియు చుండ
గంధాభిషేకంబు ఘనముగా జేయంగ
కైలాస మట్టుల గాంచుచుండ
భస్మాభిషేకంబు బరువడి జేయంగ
బంగరుస్వామిని ప్రజలు చూడ

తే॥ గీ॥ ఫలములంతట నైవేద్య ఫణితి నిడగ
కప్పురపు వాసనావళుల్ గడలు కొనగ
నిజముకైలాసమట్టుల నీరజాక్షు
ప్రజలు దలపోయ రాజును పరవసించె 122

మ ॥ ఇదిగో ఘోషలు ఘోషలై బరగగా ఇంపారసద్ఘోషలన్
ఇదిగో నీచరణంబులాన నిపుడే ఇంపార మోదంబునన్
మదిలో బాహ్యము నందునన్ గదురగా మాస్వామి స్వామీయనన్
గదియింపంబడె శబ్దముల్ శరణముల్ గానంబులన్ గూడుచున్ 123

శా ॥ మీపాదంబుల భక్తిగా వలయునే మీపాదముల్ జూపవే
మీపాదంబున రేణువౌచు నిలుతున్ మీపాదమందంతటన్
మీపాదంబులనిల్పి కొల్వగ వెసన్ మీపైన కూర్మిన్ గనన్
మీ పాదంబులె సాక్షిగా మనియెదన్ మీజ్ఞానపుంజమ్ములన్ 124

ఉ ॥ సత్యము ధర్మమున్ వలయు సాగవలెన్ ధరియిత్రిలోపలన్
నిత్యము ధాత్రిపై వెలయ నీరజ నేత్రుడరక్షసేయవే
ముత్యపుచిప్పవోలెయిటు ముందుగ నీకయి వేచియుంటినే
అత్యతివేలమై ప్రభువ అంచిత రీతిని రక్షసేయవే 125

శా ॥ విశ్వాసంబున నిన్నుగొల్వగను నీ విశ్వాకృతిన్ జూపవే
విశ్వాసంబె నిజంబుగా నిడినచో విఖ్యాతితో స్వామియున్
వశ్యంబౌగద భక్తసంతతులకున్ వాస్తవ్యమేపారగా
సుశ్యామాంగుడు విష్ణుసూనుడగుటన్ చోద్యంబెనిన్ జూచుటల్ 126

శా ॥ మీ పాదంబుల భక్తియే యొసగినన్ మీదాసునిన్గావవే
మీపాదంబులె జీవితంబనగ వే మీధ్యానముల్ గల్గగన్
మీ పాదాంబుజవాసనల్ వసుధలో మీనుండి వాసింపగా
మీ పాదంబున రేణువౌచు నిలుతున్ మీపాదముల్ జూపవే 127

శా ॥ నీ తేజంబది నిత్యసత్యమగుచున్ నీమంబుతో వెల్గెడిన్
మీ తేజంబున మాదు పాపచయముల్ మేల్గాగ్రదుంగుంగదే
మీతేజానలమందు గ్రమగ్గుగదవే మేకొన్న పాపంబులున్
మీ తేజంబులె వెన్నెలౌచు హృదులన్ మేల్గల్గు భక్తాళికిన్ 128

తే॥ గీ॥ పంచ భూతాలలో నీవు పరవసింప
నాదు డెందాన నీవుండి నన్నుబ్రోవ
సర్వజీవుల డెందాల సాగుస్వామి
ఆత్మవీవిట జీవాత్మ లపుడెగలుపు 130

తే॥ గీ॥ జ్ఞాన ముద్రాంచి తంబైన జ్ఞానమిదియె
జీవబ్రహ్మంబు బ్రహ్మంబు జేర్చినీవు
చూపుచున్నావు దారిని చోద్యముగను
శబరిమలపైన గూర్చున్న స్వామిబ్రోవు 131

ఉ ॥ స్వర్ణమయంబె సర్వమును సొగెడి భక్తులకెల్లవేళలన్
స్వర్ణమెనీదు నామమును స్వర్ణమెమీదగు గద్దెయున్ ధృతిన్
స్వర్ణమె మీదు భక్తియును సాధుజనావళి బ్రోవనెప్పుడున్
స్వర్ణమెకాదెనాబ్రతుకు సర్వము స్వర్ణమె నిన్నుగొల్వగన్ 132

ఉ ॥ భౌతికమైన స్వర్ణమిది భాగ్యమెయైనను నీదు స్వర్ణమే
జ్ఞాతము జ్ఞేయమైదనరు గావున సత్యముధర్మము సొగస్వర్ణమై
మాతరమౌనెనిన్ గొలువ మాన్యుడబ్రోవుము మూర్తులందునన్
నేతవు బ్రహ్మవిష్ణులుగ నేర్పున నాశివరూపుడౌటచే 133

ఉ ॥ మోసమె సంపదల్ గలుగ మోసమె జీవులకెందుజూచినన్
మోసముగాక కొంతవడి మూర్ఖులు మాకిక యివ్వవేడెదన్
మోసములేక జ్ఞానధన మోశివసూనుడ భక్తిసేయగన్
మోసము లేక కొంతధన మోపగ ఇమ్మదిసర్వసౌఖ్యమౌ 134

ఉ రక్తియె చాలునంచనుచు రాయిడి చెందెడి మానవాధముల్
శక్తిసుతుండవైననిను సారెకు కొల్వగ భక్తిభావనన్
ముక్తికి తావలంబగును మూర్ఖుల మమ్మికబ్రోవవే వెసన్
రక్తిని మానసంబులను రాణదలిర్పగ నివ్వవే వెసన్ ! 135

శా ॥ రోజా పుష్పమునీదు పాదయుగళిన్ రూపొందియుండన్ ధృతిన్
రోజాపుష్పము పైకిలేచినదినా రోమాంచితంబైన శ్రీ
సంజాతంబుగ నాదుశీర్షము పయిన్ సంతోషిత స్వాంతతన్
రోజాపుష్పము బద్ధరీతిగనుచున్ రూఢిన్ మతిన్ జ్ఞానినై 136

చం అనిశమునన్నివేళలను అంచితరీతినినిన్ దలంచుచున్
వినయము తోడ నుండవలె విస్తృత కీర్తికి తావలంబుగా
ఘనమగు మానసాంబుధిని జ్ఞానముతోడుతసత్పథంబునన్
జననుత వైభవాస్పదము జానుగ నొగదనెంచి చూచినన్ 137

శా ॥ విశ్వశ్రేయమె కావ్యమౌనటులమున్ విఖ్యాతులౌ యాకవుల్
విశ్వస్తుత్యుని నిన్నుగూరిచి వెసన్ వేవేలచందంబులన్
విశ్వాసంబున పోతానార్యుడునినున్ విఖ్యాతమౌరీతులన్
ఆశ్వాసించుచు వ్రాయుడే పటుగతిన్ ఆరాధ్యదైవంబుగా 138

చం ॥ కవులు కలంబులన్ గొనుచు కావ్యములన్ వెసవ్రాయువారొకో
నివహములుల్లసిల్లగను నిక్కముచక్కగనేర్పుతోడుతన్
కవనముకావ్యసంపదగ కావ్యమునన్ రసవత్తరంబుగా
భువనము నందు వ్రాతురది భూరియశంబుగ కల్పనాకృతిన్ 139

ఆ॥ వె॥ కల్పవనంబు లేదు కవనమందున నాదు
కావ్యమందు చరిత కలదు మరియు
పూర్వ భవములందు పుణ్యులకథలుండె
నిత్య సత్యమగుచు నెగడినవియె 140

ఆ॥ వె॥ కల్పనంబు కొంత కల్గినమాత్రాన
కావ్యమందునుండు కాంతిచయము
డిందువడదు నెగడు ఇందుమౌళి
నున్న చంద్రకళలు నున్న భంగి 141

శా ॥ నీనామంబు జపింపగా వలెనులో నిక్కంబుగా నెప్పుడున్
నీనామంబు హృదంతరాళమున నేర్పంగ నన్నుండనీ
నీనామంబును జిహ్వపై బలుకుచున్ నిక్కంబుగానుండనీ
నీనా భేదములెల్ల లేక జనులన్ నీరక్షలో నుండనీ ! 142

ఆ॥ వె॥ రక్షకుండనీవె రక్షించిబ్రోవవే
అక్షయంబుగాగ అంజలింతు
రోగబాధలన్ని రోయముపోవంగ
హాయి గాగబ్రతుకు ఆదరించు 143

మ ॥ కలముంబూనిన యంతలో పలనెనేకాలుష్యమున్ లేకనే
నిలలో సత్కృపతోడకావ్యమునునే నిక్కంబుగావ్రాయుగా !
పలుకైనం పలుమారు పల్కువది నాపాపంబుసైరింపుమా !
నిలలో పల్కుము నీరజాక్షకృపతో నిక్కంబునన్ బ్రోవగన్ 144

తే॥ గీ॥ కనులు మూసిన తెరచిన కలలనైన
కానిపింతువు నాదొరా కలుషముడిపి
స్వాంతమందుననీవుండి సగయవృత్తి
కావ్యమున్ వ్రాయ జేయుమా కలుషహరణ ! 145

ఆ॥ వె॥ కుండివాడుగూడ గోమున నడచెను
తొంటికాలమందు తోయజాక్ష
గ్రుడ్డివాడు గూడ కోర్కెమైజూచెను
నీదు కరుణవలన నీరజాక్ష 146

ఆ॥ వె॥ నీదు పాదరజము నిక్కంబునేనంటి
నీట కడుగబోక నిర్మలముగ
అమృత బిందువునను అతికించు కొనుస్వామి
పాదరేణువగుదు పరమపురుష 147

వ ॥ ఇట్లు ప్రార్థించి అటనుండి 148

సీ ॥ మాళిగ పురమాత మహిమలు గనిపింప
మాటికి వందనాల్మహిని జేసి
నాగమాతకు మ్రొక్కి నర్మిలితోడుత
యక్షికి సాగిల అపుడు మ్రొక్కి
కొందరు స్వాములు కొలువంగ ధరణిపై
సాగిల్లబడి దొర్లి సాగుచుండ
భక్తబృందములంత భజనలు సలుపంగ
పరమపావనమూర్తి పరవసించి

తే॥ గీ॥ కళలు దేరంగ గనిపించె కాంక్షహెచ్చె
డెందమందుల నీరూపు బొందముదము
నందభక్తులు నీరూపు నపుడు గాంచి
రక్ష మాం రక్షరక్షని రయమువేడ ! 149

ఉ ॥ షణ్ముఖుడైన దైవమయి సారెకు బ్రోచితవప్పుడెంతయున్
షణ్ముఖ షణ్ముఖాయనుచు సారెకు నేదలపంగ సత్కృపన్
కణ్మణివౌచు బ్రోచితివి కాని కొరంతయు దీర్పవైతివే
షణ్ముఖ సోదరుండవయి సారెకు అన్నకుజెప్పిబ్రోవవే ! 150

ఉ ॥ వంశమునిల్పి బ్రోవగదె వాసిగ గాసిని మాన్పిబ్రోవవే !
వంశములుద్ధరించెదవు వారిజనేత్రుడమమ్ముబ్రోవవే
అంశము దైవమైబరగ అంచిత రూపులబుట్ట జేయవే
రంశము లేక భక్తిమెయి రంజిల జేయవెవంశముల్ధృతిన్ 151

ఉ ॥ భక్తిని నిన్నుజూచుటకు భాగ్యముగావలె దేనికైననున్
ముక్తికి తావలంబముగ మోహనమూర్తివి కావవే వెసన్
రక్తికి భాగ్యమున్నిడకు రాజిలభక్తికి నైన నీయవే
శక్తిసుతుండగానయిటు సాగగకోరికలంత బ్రోవవే ! 152

ఉ ॥ పెన్నిధినీవుయుండగను పేర్మినికూర్మిని కోర్కెలందవే
సన్నిధిచూడగా వలయు సంస్తవనీయము గాగనోప్రభూ
అన్నవు కన్నతండ్రివియు ఆర్మగస్వామియు నీవెయంచునే
మున్నెయెరింగి నేగొలుతు మూర్ఖుడ సద్గుణజాలమివ్వవే 153

తే॥ గీ॥ పంచభూతాలలో నీవె పరవసించి
యుండవెదుకంగ నేటికి దండుగరయ
మందబుద్ధిని మన్నించి మరలమరల
ఏలు ఎల్లలోకంబుల ఏలు ప్రభువ 154

ఉ ॥ లోపములన్నియుందలప లోలతలోపములెన్నియో యగున్
కోపము చెందబోవకను కూరిమితోడ గణింపబోవకే
పాపములన్నిమాన్పవలె ప్రార్థనలన్ వెసజేసినాడనీ
ప్రాపుగ నేను నుండగను పాహియటంటిని స్వామిబ్రోవుమా 155

శా ॥ కల్లోలంబగు మానసాంబుధియిటన్ కాత్యాయనీ నందనా
ముల్లోకంబుల నేలు సత్ప్రభువ నా మోహంబు పోద్రోలినీ
సల్లాపంబుల తోడనే బ్రతుకగన్ సాధ్యంబుగా చేయుమా ?
ఉల్లాసంబున బ్రోవవే వసుధలో ఉల్లాసముల్ పండగన్ 156

శా ॥ అల్లాయన్నను నీవుగావలయు నాయల్లాయెదైవంబుగా
"ఇల్లిల్లా"యని మోదమున్ బొరయగా ఇట్లంటి నేవేడుకన్
అల్లాకాదని క్రీస్తుదేవుడనుచున్ ఆహ్లాదముంజెందగా
ముల్లోకంబుల వేడుకై జనగ నీ మోదంబు జూపింపవే 157

ఉ ఒక్కడే దేవుడంచు మది ఓరిమతోడుత కొల్వగా ప్రభున్
నిక్కము బ్రోతు వెందునను నీనిజరూపము జూపుచుం ధృతిన్
చక్కగ ఎట్టిరూపమున సంస్థవనీయముగాగ మ్రొక్కినన్
నిక్కము బ్రోతువెల్లరను నీరజనాభుని పట్టివేడుకన్ 158

ఉ ॥ అందరు మానవుల్ ఒకటి అందురు జీవులు ఎంచ ఒక్కటే
పందళరాజపుత్రుడవు ప్రాపుగ జెప్పినరీతిజూడగా
కొందరు కానలేరు గద కోమలతన్ తగురీతితోడుతన్
మందసమీరణంబుగతి మానవులందరుఒక్కటే తగన్ 159

తే॥ గీ॥ ధర్మమిదియంచుదెలియక ధరణిపైన
కార్యమిదియ కార్యంబుని గదసి చేయ
తెలిసికోలేని యా బుద్ధి తెలిసికొనగ
రాజసంబగు రంజిల్లు రాగమెసగు 160

శా ॥ అజ్ఞానంబును అంధకారమయమౌ ఆచీకటిన్ వెల్గుగా
విజ్ఞానంబొకయింత లేకునికితన్ విజ్ఞల్ తగన్ మెచ్చకన్
సుజ్ఞానంబును జూపకన్ దనుజులై చోద్యంబునడ్డంబుగా
సుజ్ఞానంబెయటంచు జేయునధముల్ చోద్యంబుగన్ తామసుల్ 161

వ ॥ మరియు స్వామి ఇట్లనుచున్నారు 162

శా ॥ నాపై కూరిమి నింపగా వలెనిటన్ నాపట్ల సద్భక్తితో
ఏపై పూజలు చేయగావలెనికన్ ఇంపారగా మ్రొక్కుచున్
కాపైయుండ ప్రతిజ్ఞజేసెదనునేకారుణ్యముంజూపుచున్
నాపై ధ్యానముతోడనుండగనునిన్ నావానిగా బ్రోచెదన్ 163

శా ॥ ఐశ్వర్యంబును శోభనాయుతమునౌ అత్యంత ఉత్సాహమున్
వశ్యంబౌచును నుండు నెద్దియును నావశ్యంపు అంశంబెయౌ
విశ్వంబందున నుండు శక్తులవియున్ విశ్వాత్ముడౌనాయెదన్
వశ్యంబైనివసించునన్నియును నావాసించు అంశాంశమై 164

శా ॥ నిష్టల్ నింపుము నాదు స్వాంతమున నీభక్తిదైవారగా
క్లిష్టం బెద్దియు లేక యుండగ వడిన్ ఖేదంబులుంబాపగా
నిష్టల్ నాకిడినాదు డెందముననే నిక్కంబు నీవుండగా
శిష్టాత్ముండవు రక్షసేయగదవే శీలంబునన్ బ్రోచుచున్ 165

ఉ ॥ విష్ణుడ వీవెయంచనుచు వేద్యుడు నాశివుడీవెయంచొగిన్
కృష్ణుడు రాముడున్ వసుధ క్రూరుల జంపగబుట్టలేదెనా
కృష్ణమయంపుజీవులను క్రూరత నిర్దయ జంపలేదెనా
విష్ణుమయంబె మాయయగు వేగమె మాయలు ద్రుంచి బ్రోవవే ! 166

ఉ ॥ దేహము గేహమున్ సతము తేజరిలంగను శుభ్రతన్ గనన్
దేహము ఆత్మయున్ పలుకు తేజము రీతిని ఒక్కటై ధృతిన్
మోహము లేక యుండవలె మోహనరూపునిగొల్చుచున్ వడిన్
దేహము గేహమున్ వెతలదేలవుహాయిని గూర్చునెప్పుడున్ 167

తే॥ గీ॥ ఉబ్బులేకుండ తబ్బిబ్బు ఉండకుండ
గబ్బులేకుండ గళమున గానమెసగ
నిబ్బరంబిమ్ము అప్పరో నిర్మలముగ
జబ్బు లేమియు లేకుండ నిబ్బరమున ! 168

శా ॥ నీపద్యంబుల వ్రాయునట్లు నిన్నాడువాక్యంబులన్
నీపై భక్తియు నీదు పాదములపై నీరేజ పత్రేక్షణా
ఏ పై యుండెద పాదరేణువగుచున్ ఇట్లేలమన్నింపవే
కాపై యుండుము స్వామి డెందమునవే కాత్యాయనీనందనా ! 169

మ ॥ ప్రభువా బ్రోవుము బ్రోవుమంచెదను నేప్రార్థింపగానెప్పుడున్
విభవం బిమ్మని నేనువేడనుగదే వేద్యాంశముల్ జూచుచున్
అభయం బిమ్మని వేడినాడనిడవే ఆనందమున్ జూపుచున్
సుభగుండై ధృతితోడ బ్రోవగదవే చోద్యం బెనన్ బ్రోవగా 170

ఉ ॥ చూపులు నీదురూపమును చూడగ వీనులు నీదు గానమున్
ఏపున స్పర్శనీదయిన ఏపగుపాదములందు బ్రోవగా
కాపుగ వాసనల్ గలుగ గాంచగ నీపదపుష్పముల్ వెసన్
నాపయి కూర్మినుంచగదె కాంచన దీధితులుల్లసిల్లగన్ 171

శా ॥ నీవున్నావని నమ్మికొంటినెదలో నీదేవతామూర్తిపై
నీవేరక్షకుడంచు నేదలచెదన్ నీవేననున్బ్రోవుమా
రావేమోదముగుల్క నామదినినో రాకేందుబింబాననా !
దేవానీవిక నాదు దేహమునకున్ తేజంబునున్ గూర్పవే ! 172

ఉ ॥ ఏమని నిన్ను నేదలతు ఏమిటప్రార్థనలందజేతునే
కామవిలాస సంపదల కల్గనీయక భక్తిభావముల్
వేమరుయిచ్చిబ్రోవగదె వేద్యత నీపదపల్లవంబులన్
స్వామి వటంచుమ్రొక్కెదను సంస్కృతి జూపుము సారెకున్ ధృతిన్ 173

ఆ॥ వె॥ నాదుడెందమందు నాస్వామియుండగ
దిక్కు లేనియట్లు దీనరక్ష
వనటగుందు చుంటి వాస్తవంబుగ బ్రోవు
వనట బాపి వంద్య వసుధ బ్రోవు 174

## జ్యోతిద్దర్శనము

వ ॥ శబరి గుడికి తూర్పు కాంతిమలపై ఋషులును భక్తబృందములును
దీపారాధన గావింతురు 175

తే॥ గీ॥ దివ్యకాంతులు చిందంగ దీపమంత
వెలుగు చుండుట చూడంగ వేద్యముగను
భక్తులందరి హృదయాలు పరవసించు
కాంతులన్నియు హృదయాల కల్గినట్లు 176

తే॥ గీ॥ గిరికి ఉత్తరభాగాన మరియు కొంత
తూర్పు కలిసిన భాగాన తోరముగను
కాంతినక్షత్రరూపమై కలగిమెలగి
క్రమముగా పెద్దదగుచును క్రాలుచుండి 177

తే॥ గీ॥ మెర్క్యూరీలయిటంతగా మెలిగి వెలిగి
క్రమక్రమంబున చిన్నది క్రమత యగుచు
తుదకదృశ్యంబుగా గను తొలగిపోవు
వెదుక సత్యంబు జ్యోతియై వెలుగుచుండు 178

ఉ ॥ ఆమకరంపుజ్యోతిగన అందరు ఊరటలందుచుండగా
ఆమహిమాభిరామమగు అందలిజ్యోతిని జూచుభాగ్యమున్
వేమహిమాభిరాములగు వేద్యులుమాత్రమెజూతురందరున్
ఆమహిమంపుజ్యోతిగన అందరునోచరు పుణ్యహీనతన్ 179

శా ॥ ఆ సంక్రాంతిని దివ్యజ్యోతిగనగా ఆనందమేపారగా !
గాసింబొందక వేల్పుజ్యోతిగనుచున్ గానంపు జ్ఞానంబులన్
వాసిం గాంతురుదీక్షగైకొనినన వ్వారందరున్ గణ్యతన్
మోసంబింతయులేక భక్తితతులన్ మోదించివారందరున్ 180

శా ॥ దీపారాదన జూచికొందరచటన్ దీపంబెనా జ్యోతిగా
దీపారాధనయంచు తామెరుగకన్ తేజంబు నాజ్యోతిగా
నేపారంగదలంతు రంతటను నీ నీమంపు దీపంబుగా
నాపాపంబులద్రుంచుతేజమనుచున్ అత్యంతమోదంబునన్ 181

సీ ॥ పొన్నంబలంబున పోడిమి తోగూడ
స్వర్ణమందిరమున స్వామిగలడు
బంగరు గద్దెపై భాసిల్లగూర్చుండి
బ్రహ్మాండమునునేలుప్రభుడతండు
ఇంద్రాది దేవతల్ ఇంపుగదిక్పతుల్
కొలువంగ నుండెడి కోమలుండు !
పంద్రెండవత్సరాల్ బడసిన బాలుండు
గద్దెను నెక్కంగ గలడెయంచు

పరగ పడికట్లు కాగను పడయగోరి
దేవతలు కొందరప్పుడు తేజమెసగ
పడిరి పడికట్లు కాగను పసిడిగద్దె
నెక్కనాతండు వారిపై నెక్కెగద్దె ! 182

తే॥ గీ॥ కోటి చంద్ర ప్రభాభాస కోమలాంగు
డతుల సౌందర్యమోహన యుతుడతండు
మన్మథుని తమ్ముగుట్టయై మహిదనర్చి
భక్తిసామ్రాజ్యవిభవంబు బడయునతడు ! 183

ఉ ॥ వాసము సర్ణమందిరము వాసిగగద్దియ స్వర్ణమేయగున్
భాసిలకాంతిపుంజములు కాంతులు స్వర్ణమయంబెజూడగన్
వాసిగ రూపముల్ గనిన వాస్తవమేయది స్వర్ణమేయగున్
భాసిల స్వాములందరికి ప్రాప్తులు స్వర్ణమయంబె జూడగన్ 184

తే॥ గీ॥ స్వర్ణమందిరవాసివైయె సదమలముగ
బంగరుంగద్దె పైనున్న పరమపురుష
మమ్ము నేలంగ శబరిపై మహిమనుంటి
పూర్ణ పుష్కలమైనట్టి పుణ్యమెసగ 185

ఉ॥ రాసులు రాసులై దనర రాశిగ పూర్ణముగాగవేగమే
వాసిగ పుష్కలంబుగను వర్ధిలరాసులు ముందునుండగా
వాసిగ నిత్తువీవునట వారిజనేత్రుడనుగ్రహంబులన్
భాసిలు కుప్పలందునను భాగ్యముగాగను భక్తకోటికిన్ 186

ఉ॥ పూర్ణము పుష్కలంబయిన పుణ్యపురాసులే భార్యలౌనటుల్
పూర్ణము గానునమ్మియటు పూర్ణము పుష్కళలీవునంతటన్
పూర్ణపు యోగసాధనగ పొందితిముందట మూర్తి వైఖరుల్
పూర్ణముగాగ భక్తులకు పుణ్యము పొందగ నిత్తువెప్పుడున్ 187

ఆ॥ వె॥ రాసిలో రవంత రంజిల్ల నిచ్చినన్
వాసిగాంచువాడ వరములొసగి
వసుధ సుధలు గురియు వర్థిల్లబ్రోవుమా
వసుధ భర్మ్యహర్మ్య వరద నీవు ! 188

ఉ॥ నీ మహిమార్ణవంబుగన నేపును జాపుననన్నివేళలం
నీమహిమార్ణవంబుమము నిర్మలతాగరిమంబు తోడతన్
నీమహిమంబు జన్మముల నిక్కముచక్కగ వెల్గజేసెడిన్
నీమహిమంపుజ్యోతిగన నిక్కము సర్వముగల్గెడిన్ధృతిన్ 189

తే॥ గీ॥ స్వర్ణమందిర మందున స్వర్ణమంట
పమున బంగరుగద్దెపై పసదలిర్ప
కూరుచుంటివి దిక్పాలకు లుకొలువగ
సామగానంబు దేవతల్ సరగజేయ ! 190

తే॥ గీ॥ వైభవోపేత సంరంభ వాసిదనర
నిండు కొలువుండు నాస్వామి నిర్మలాత్మ
రావె మముబ్రోవ రయమున రాజపుత్ర
పందళంబున వెలసిన పరమపురుష 191

తే॥ గీ॥ శైవవైష్ణవ శాక్తేయ సదమలంపు
సర్వమాద్యంత తుల్యంబు సారయుతము
బూది-గంధంబు-కుంకుమ పూనవలయు
నొసట భక్తులు భక్తిని నోర్మితోడ 192

కం ॥ పంద్రెండేడుల బాలుడ
వేంద్రంబగు కొండ నెక్కు వేగమెయనుచున్
తంద్రీ మాపై అడుగిడి
వేంద్రంబది లేక నెక్క వేయని చెప్పన్ ! 193

వ ॥ ఇట్లు దేవతలు సోపానములైరని శబరిగిరిలో గూడా సోపానములుగా దేవతలు పరుండిరి. అవియే అష్టాదశ సోపానములని మనవారినమ్మిక ! పాదములంటి వేడగా పాదము పైనున్న పుష్పము పైకి లేచి భక్తుని శిరముపై బడినదట !
194

ఉ ॥ ఔదల పుష్పమున్ బడిన అంచితజ్ఞానముసత్ప్రభుండిడన్
పాదమునందు రేణువయిపాహియటంచును వేడనాకిటన్
మోదము గొల్పపుష్పమును మూర్ఖుడునైననునాదుశీర్షమున్
వేదన లెల్లబాపగను విశ్రుత కీర్తిని వైచితే యిటన్ 195

ఉ ॥ వేదన లెల్లబాపగను వేద్యత నామది భక్తిభావముల్
నీదరి జేర్చుకొంటకును నిక్కము నాశిరమందునన్ ధృతిన్
ఆదరణంబుతో యిడితి “ఆండవనే అఖిలాండ పావనే”,
నీదగు పాదపద్మముల నిక్కముజేర్చుము నాదు డెందమున్ 196

ఉ ॥ నీమముతోడగొల్చునటు నీతిని న్యాయము సత్పథంబులన్
నామది నిల్చునట్టులుగ నాహృదయంబున మీదు పాదముల్
వేమరునిల్పగా వలయు వేద్యత తోడుత నెల్లకాలముల్
సామము తోడ కార్యములు సాగగజేయుము అంజలించెదన్ 197

కం ॥ రుద్రుండ వీవు సద్గుణ
భద్రుండవుగాన నిన్ను సుభగుడనగుచున్
భద్రుంగొలిచెద సుమధుర
భద్రా సర్వేశసుతుడ భద్రత కొరకున్ 198

తే॥ గీ॥ విద్యలెరుగను చక్కని విధులతోడ
పద్యమాలిక లల్లను పలుతెరగుల
బాధ్యతాయుతయుతడనై బడలుమాని
విద్యలెల్లను గూర్చుమ విద్యబాపి 199

ఆ॥ వె॥ పండితుడనుగాను ప్రారబ్దమునుదాట
పద్మములనుబోలు పాదములను
దండి గొల్చువాడ దయతోడ బ్రోవుము
భండనంపు భీమ బడలుమాన్పి ! 200

ఉ ॥ మీపద భక్తిమార్గమిట మిక్కిలిచక్కగ వ్రాయజేయగా
మీపయిధ్యానముంచగను మిక్కిలి సద్గుణముల్లసిల్లగా
మీపయి భక్తి భావమును మేలుగ నాహృదినుండ జేయుమా
మాపయి కూర్మిడెందమున మాటికి నిల్పుము నీరజాక్షుడా ! 201

తే॥ గీ॥ వాస్తవంబును వ్రాయంగ వరమొసంగు
గాసిజెందక మీపాద కమలములను
ఎల్లవేళల నర్చించు యుల్లమొసగు
ధర్మశాస్తవు బ్రోవుము దయదలిర్ప ! 202

ఉ ॥ కొండలు కోనలన్నియును కోమలతన్ తగనీదు పాదముల్
మెండుగసోకనెట్టులను మోదముజెందగ మెట్టి నాడవో
దండిగ వ్యాఘ్రవాహనము తాలిమి నెక్కిటుసంచరించితో
భండన భీమ ఏన్గుపయి భాసిలకొండలు చుట్టితో వెసన్ 203

ఉ ॥ కామముక్రోధమున్ వదల కాయముడెందము మోదమందగా
మీమహిమాభిరామముగ నిక్కము చక్కగ నన్ను బ్రోవుమా
కామిని కాంచనంబులకు కాయముకుందగ నీక బ్రోవుమా
నీమములన్నియున్ గలిగి నీతి పథంబున నన్ను బ్రోవుమా 204

తే॥ గీ॥ నాదు గుండియ కైలాస నగముజేయు
శివుడు మాతలతో గూడ చింతలుడుప
నుండు నట్లుగ దీవించు నున్నతముగ
నీవు అగ్రజులంగూడి కావుమచటె 205

శా ॥ అద్వైతంబది గాదె జూడగనునే హర్షంబునున్ బొందగా
సద్వైతంబది లేదు చూడగను నే సాయుద్యముంజెందగా
మద్వైతంబుగ లేని బుద్ధినిడుమా మాధుర్యమేపారగా
అద్వైతామృతమంత జూరగొనగా ఆనంద చిత్తుండనై 206

ఉ ॥ పావన నామనీ గుణము పామరుడన్ గనలేని వాడనున్
కావుము దేహగేహముల కావుము మానసవీఢిసత్కృపన్
కావుము జీవుడన్ గలయ కావుము నాత్మకు జేర్చివైళమే
కావుము జ్ఞానముద్రనిడి కాంచనగేహములోని దైవమా ! 207

ఉ ॥ కోవిదుడంచునన్ దలచ కోవిదుడన్ దగకానుచూచినన్
నావిధి వ్రాతయున్ మరియు నానవహింపగ సిగ్గులయ్యెడిన్
నావిధి వ్రాతనున్ దుడిచి నానయొకింతయునుండు నట్లుగా
కావుము శక్తినందనుడ కావుమొకింతయునుండునట్లుగా 208

ఉ ॥ నాదురితంబు లెన్నకుము నాదగు పుణ్యములుల్లసిల్లగా
నాదురితంబు బాపుమయ నామన సాంబుధినీవెనిండియున్
నాదుమనంబునన్ వెలుగు నాధవుడై విలసిల్లి బ్రోవుమా
పాదుగ నాహృదంతరము ప్రాపుగ భక్తిని నింపవేధృతిన్ 209

ఉ ॥ స్వామివి నీవు నేనగుదు స్వామివి ఎల్లరు స్వాములేగదా !
స్వాముల డెందమందులను సాగెడిదైవమునీవె కావొకో
స్వామివిస్వామివీవనుచు సాగిలిమ్రొక్కితి నెల్లవేళలన్
స్వామి వటంచు నామదిని చల్లగనే దలతున్ ధృడంబుగా ! 210

ఉ ॥ జ్యోతివి నాదుడెందమున జ్యోతివి ఏడు స్థలంబులందునన్
జ్యోతివి చక్రముల్ వెలుగ జ్యోతివిశీర్షమునందు సైతమున్
జ్యోతిని గాంచినాడనిట జ్యోతులునాదగు దేహమందునన్
జ్యోతివి సర్వలోకముల జ్యోతివి వెల్గితి వేవెలుంగులన్ 211

ఉ ॥ నాతర మౌనెనిన్ గొలువ నాతరమా భవసాగరంబు నన్
సేతువు నీవుగావలెను నిక్కము నిర్మలమానసాంబుధిన్
నీతిని ధర్మమున్ వెలయ నిక్కము శాంతముసర్వసౌఖ్యముల్
నీతరి నాదు డెందమున నిల్పుము బల్పువెలుంగురీతిగా ! 212

ఉ ॥ ఏది చరిత్ర మౌనొయిట ఎయ్యది చూడ పురాణమౌనొకో
ఏది నిజంబు నెయ్యదియొ ఏదరిజూచిన కానిదేదొకో
ఏదరి జూడనిన్ దలచి ఇందులనీపిటనుంట జేసినే
పాదుగ వ్రాసినాడనిది పావనమూర్తివిస్వీకరింపుమా ! 213

మ ॥ ఇతిహాసంబది యున్నదయ్య కరుణన్ ఇంపారగాబ్రోవవే
మతినీపైవెస భక్తిగా వలయునే మాంద్యంబులేకెప్పుడున్
నుతియౌమెత్తననాదుడెందమయి దాసోహంబెదాసోహమై
నుతియింతున్ ధరబ్రోవరావెవెసతో నూర్ధ్వంబుగా నున్నతిన్ 214

ఉ ॥ భేదము వాదమేలనిట భండన భీముడ నీవుయుండగా
భేదము వాదముల్ దలప భేదమే గావున వాదముల్ వెసన్
బాధలు గానమానియవి భాసిలుస్వామిని నిన్నుగొల్వగా
బోధలు నీవిసల్పవలె భూరియశంబును గూర్చుగావునన్ 215

ఉ ॥ పందళరాజులుండుటయు ప్రాభవయుక్తిని భూషణంబులన్
వందనమాచరించుచును వారివానిని గొంచుపోవగా
మందసమీరణంబుగతి మానుగ నాగరుడుండు వచ్చుటల్
సుందర మూర్తకిన్ ధృతిని సూటిగ బూన్పరెసంకురాత్రినిన్ 216

ఉ ॥ నేటికిగానవౌనుగద నిక్కము జ్యోతిని జూడనందరున్
మాటలె స్వర్ణమందిరపు మాధవపుత్రుడ నిన్నిటుల్ వెసన్
మేటివెలుంగుగా గనగ మేకొని చీకటులన్నిబాపగా
పాటిగ కర్మబంధములు పాయగ భక్తులబ్రోచుస్వామియున్ 217

ఉ ॥ సాక్షివి అన్నికాలముల స్వామివి భక్తులపాలిదైవమై
పాక్షిక మేమిలేకవడి ప్రార్థనలన్ వినిభక్తజాలమున్
కక్షలు యేమిలేక వడి కార్యము కాదగురీతిజేయగా
అక్షయమైన సంపదల ఆదట గూర్తువు భక్తులందునన్ 218

ఉ ॥ ఎందును నీవె యందువని ఎందున నీదగు చూపుప్రాపునై
సుందర మూర్తికానబడి సూటిగబ్రోతువు ఆత్మలోపలన్
కందువ తోడకానబడి కాంచగనుందువు కాంచువారికిన్
మందులు మాకులున్ వలదు మాటికి నీదయసోక వెజ్జుడై ! 219

ఆ॥ వె॥ రాజశేఖరాఖ్య రాజును ప్రజలును
కొండదండజేర కోర్కెలెసగ
వచ్చుచుండిరపుడు వాస్తవంబుగ స్వామి
సేవలపుడు జేయ శ్రీఘ్రగతిని ! 220

ఉ॥ స్వామిని గాంచగాదలచి స్వాంతములందున సంతసంబులన్
గోమున వచ్చిరందరును ఘోషలు జేయుచుస్వామిసన్నిధిన్
వేమరుప్రార్థనల్ సలుప విశ్రుత లీలలగానమాధురుల్
స్వామిని గూర్చిపాడుచును సాగిరిసన్నిధిజేరవైళమే 221

ఆ॥ వె॥ ఇరుముడులతోడ తనువులు ఇంపుగుల్క
పదియునెనిమిది పడికట్లు పరగునెక్కి
స్వామిదర్శనభాగ్యంబు సరగగల్గ
మ్రొక్కిరందరు శరణంచు మోదమలర 222

తే॥ గీ॥ స్వాంతములలోని భ్రాంతుల సరగదునిమ
కాంతులందున మోదంబు గలుగుచుండ
చేసి రభిషేకములు తాము సేవలలర
స్వామిమాస్వామి మాస్వామి స్వామియనుచు ! 223

ఉ॥ నిశ్చయమా యిదంచుకృప నిర్మలతన్ నినువేడినంతలో
నిశ్చయమే యిదంచుధృతినేర్పునజాడగ నాత్మలోపలన్
నిశ్చయమైన జ్యోతిగని నిర్మలతాగుణసంభృతంబుగన్
నిశ్చయమానసాంబుధిని నిల్పిన నీదయకల్గకుండునే 224

ఉ॥ వీక్షణమాత్రమే తనువు విస్తృత రీతినిపుల్కరింపగా
అక్షయజ్ఞానసంపదల ఆదట నిత్తువు ధర్మశాస్తవై
దీక్షను నిన్నుజూచినను ధీజనులెల్లరు ఉల్లసిల్లగా
ఏక్షణమైననిన్ దలప ఏర్పడభ్రోతువు నందరిన్ వెసన్ 225

వ॥ ఇట్లు ప్రార్థించి మరియు .... 226

ఉ॥ లక్షలు లక్షలై జనులు లాలసవృత్తిని భక్తిగీతముల్
అక్షయపుణ్యముల్ గలుగ అంచితరీతిని పాడుచుండగా
రక్షణ సేయువాడవని రాగసుధామయ కీర్తనంబులన్
మోక్షము గోరివచ్చిరిదె మోదము జెందగ స్వామినీదెసన్ 227

ఉ ॥ స్వాములటన్న సంభ్రమత సాగగసాగగపుణ్యమార్గముల్
స్వాములు స్వాములైవరల సాగిలిమ్రొక్కుచు వచ్చినారహో
కామము వీడికాంచనము కావలెనంచునుకోరకుండనీ
సామములైన దీక్షలతో స్వాంతములంగని బ్రోవవే వెసన్ 228

తే॥ గీ॥ స్వామి శరణము అయ్యప్ప స్వామిబ్రోవు
స్వామి స్వామియటంచును స్వాంతమలర
స్వామి మీపాదపద్మాల శరణుబొంద
వచ్చినారము చూడుము వరదుడగుచు 229

శా ॥ మోమాచూడగాచంద్రబింబ మదిగో మోహంపునాకారమున్
వేమారుంగనుపట్టబంధమును నీవేజూపుచిన్ముద్రయున్
వేమారుంగనిపించు చుండగను నీవేపాదపద్మంబులన్
నీమోపాయములుల్లసిల్లగవడిన్ నిక్కంబుగా జూపవే 230

చం ॥ పదముల బడ్డవారలను ప్రార్థనలన్ వెసజేయువారికిన్
పదిలముగాగ బ్రోతువట ప్రాపుగ జేయగ ఘోషలన్ వెసన్
వదలక రక్షసేయుమని వర్థిలబల్కుచు వచ్చువారికిన్
ముదమున నీవె రక్షయిడి మోహము వాపిటు రక్ష సేయవే 231

చం ॥ మనమున దుష్టచింతలవి మానవుమాటికి నేటికిన్ ధృతిన్
మనమున దుష్టభావములు మాన్యత జేయనుగాన మోక్షమున్
ఘనయశమందికొండపయికానగ వచ్చిన స్వామి యాత్మలో
ఉనికి వహించి బ్రోవగదె ఊరటలందగ జేయవే వెసన్ 232

ఉ ॥ ఒక్కమతంబువర్థిలగ ఓహరిపుత్రుడ కాంచలోకముల్
చక్కగ భావనల్ సలిపి సారెకు ఐక్యత వారిలోపలన్
దక్కును శాంతిలోకముల తాలిమితోడుత గూడనెందునన్
మక్కువ గాగ నీవిషయ మంతట నీజనులున్ దలంచగా ! 233

శా ॥ విశ్వవ్యాప్తము నీవసుంధరతగన్ వీర్యంబవార్యంబుగన్
వశ్యుండైన పరాత్పరుండు ఒకడే వారాసిపోలెన్ ధృతిన్
విశ్వంబున్ వసుధైక సూత్రముననే విఖ్యాతితో నుండినన్
విశ్వాసంబున మానవావళులటన్ వేద్యంబుగానమ్మినన్ 234

శా ॥ కామక్రోధములోభమోహములతో కాయంబు ధ్యేయంబుగా
వేమారుందలపోయువారువసుధన్ వేజాడగా రక్కసుల్
నీమంబుల్ దగజూచువారలచటన్ నిక్కంబుగా దేవతల్
కామాంధత్వము మానిమానవులిటన్ కాంతుర్ జనామోదమున్ 235

తే॥ గీ॥ ఐకమత్యంబెయవనిలో నమరవలయు
ఐకమత్యంబె మంత్రమై అవనిబరగ
కలుగవలె భక్తిశ్రద్ధలు కలుషముడుప
ప్రభుడు కలడెందు జూచిన ప్రభలుడగుచు ! 236

ఉ ॥ దొంగతనంబు దోపిడులు తోరముగాగధరిత్రి లోపలన్
చెంగున సాగనేమిటికి చేకొనిమమ్మిక బ్రోవగా వెసన్
ముంగిటదైవమై బరగ ముఖ్యత మాహృదయంబులందునన్
వెంగలులై చరింపకను వేగమె బ్రోవుము శాస్త్రవై ధృతిన్ !

సప్తదశ సోపానము సమాప్తము



## శ్రీ అయ్యప్ప మహాభాగవతము

# షష్ఠమోల్లాసము - అష్టాదశ సోపానము

## సర్వసౌభాగ్యయుతము - అవిద్యా (మయా) రహితము

### జ్యోతిర్దర్శనము దాని మహిమ

ఉ ॥ జీవనజ్యోతులంతటను జేరగ నాదిపరంపు జ్యోతిలో
జీవనభావమంతటను జేరగ జ్యోతిని దివ్యభావమై
జీవన మందుగల్గుపెను చీకటులన్ దొలగించి బ్రోవగా
జీవనమెంతొ గొప్పగను జ్యోతిపరంబగు జ్యోతిబ్రోచుతన్ 238

సీ ॥ ఈపరంజ్యోతియే ఇరులను దొలగించి
దివ్యదీప్తులు నింపు దివ్యజ్యోతి
ఈ పరం జ్యోతియే ఎల్లలోకమ్ముల
చిమ్మచీకటులను చిమ్మివైచు
ఈపరంజ్యోతియే ఇమ్ముగ పాపమ్ము
లన్నిటిదునియించి అధివసించు
ఈపరంజ్యోతియే ఈశ్వరు కరుణార్థ
చిత్తంపు వెల్గయి చెలగు చుండు

తే॥ గీ॥ జ్యోతులన్నింట వెలిగెడి జ్యోతియిదియె
క్రాంతినొదవించి సంక్రాంతి కాంతినొసగి
దివ్యజాజ్వల్యమాన సందీప్తమైన
మకర సంక్రాంతి జ్యోతిగా మహిమదనరె ! 239

సీ ॥ ఈమకర జ్యోతి యింపుగా భక్తుల
పాప పుంజమ్ముల పటలి మాన్పు
ఈమకరజ్యోతి ఇంతుల పతులను
నీతి పథమ్మున నిల్పుచుండు
ఈ మకరజ్యోతి ఈశ్వరాంచితముగ
భక్తులదనియించి ముక్తినొసగు
ఈ మకరజ్యోతి ఈశ్వరపుత్రుండు
హరిహరాత్మజునిదై అలరచుండు

తే॥ గీ॥ చీకటుల మాన్పి పాపాల చీకటులను
పారద్రోలుచు భక్తుల గారవమున
జీవనంబుల వెలుగుల జేర్చిబ్రోచు
అయ్యలమ్మల బ్రోచునయ్యప్ప జ్యోతి 240

మ ॥ చిరుచీకట్లను చిమ్మివైచుటకు సుశ్రీకారమున్ జూపుచున్
అరుదై కాంతులు ఉజ్వలంబగుటతోనా స్వామిడెందంబునన్
బరమాభక్తులబ్రోతునంచనడె ఏ ప్రారబ్ధముల్ ద్రోచుచున్
సరిగా నీధరలోన నుండు జనతన్ శాంతింపగా జేయడే ! 241

## సంక్రాంతిని జ్యోతిర్దర్శనము

మ ॥ అదె సంక్రాంతిని కాంతి పుంజములతో అత్యంతకాంతిన్ ధృతిన్
ముదమందంగను తూర్పుకొండపయిదా ముఖ్యంబుగా స్వామియున్
సదనంబుల్ వెలిగించు దీపమయి సంసారంబులే సారమై
గదియింపంగను వెల్గుచుక్కయయియా గమ్యంబగణ్యంబుగన్ 242

సీ ॥ ఇదె క్రాంతి పుంజాలు ఇరులను తొలగించు
భక్తుల చీకట్లు బడలుపరచు
ఇదె క్రాంతి పుంజాల ఇమ్ముగ భక్తుల
కష్టాల వార్థులు కలచి దాటు
ఇదె మకర జ్యోతి ఇంపుగ గనిపించి
భక్తుల డెందముల్ పవరసించు
ఇదె మహోజ్జ్వల దీప్తి ఇంపుగ గనిపించి
స్వాంతముల్ రంజిల్ల సాగివెలుగు

తే॥ గీ॥ కాంతులందున నీ జ్యోతి కనులకెప్డు
దివ్య దీపాంకురంబుల తేజమెసగు
లోక మందున తేజంబ లోలవృత్తి
నవ్య సంక్రాంతి క్రాంతిని భవ్యముగను 243

సీ ॥ ఈ తేజమేగదా ఇమ్ముల నరికట్టి
దాసాను దాసులన్ ధరను బ్రోచు
ఈ తేజమేగదా ఇనుని తేజము మీర
ఇంపుగ భక్తుల ఇలను బ్రోచు
ఈ తేజమే గదా ఇంద్రాది దేవత
లందరి బ్రోచిన సుందరంబు
ఈ తేజమేగదా ఇమ్ముల శబరికి
మోక్షమబ్బగ జేసి ముదిత జేసె

తే॥ గీ॥ స్వామి జ్యోతి స్వరూపుడై సాగుచుండె
స్వామి భక్తులపాపాలు సరగద్రుంచి
నిండు గుండెల వెల్గుల నింపి బ్రోచు
రండు చూతము జ్యోతిని రమ్యగతిని 244

చం ॥ వెలుగులు గ్రమ్ముదేరవడి వెల్గుల వెల్గయి చంద్రభాస్కరుల్
వెలుగుల గప్పి పుచ్చివడి వెల్గుచుతారలకుం గ్రమంబునన్
వెలుగయి ధ్వాంతతన్ వదలి వెల్గులలోకములన్ని దన్పుచున్
వెలుగుచు బ్రహ్మమైదనరి విశ్రుతకీర్తుల నింపెనీధృతిన్ 245

ఉ ॥ ధర్మపథంబు జేర్చునట ధన్యత జీవితమందు జేయగా
మర్మము లేక బ్రోచునట మంజుల భావము లుల్లసిల్లగా
కర్మములన్ని గాల్చునట కామితముల్ వెసబ్రోచునంట మీ
రర్మిలి భక్తి సల్పగను రాయిడులన్ వెసమాన్పి బ్రోవడే 246

ఉ ॥ బిడ్డలు పాపలున్ వెలసి భ్రీతియశంబును భక్తిభావముల్
జడ్డున జేరుభక్తులకు జాలములేదట జూడుడీ వెసన్
గడ్డు సమస్య లైనవడి గాంచగనిల్వవు గ్రద్దనన్ ధృతిన్
బిడ్డడు గాదె నాహరికి భీమునకుంతగురీతి స్వామియున్ 247

సీ ॥ అయ్యప్ప వెల్గది అన్యంబు గాదిది
మీగుండెలందున మిగులవెల్గు
నెయ్యప్ప వెల్గది నెక్కొను రోగాల
మటుమాయ మొనరించుమహిమగలది
కయ్యాల లేకుండ కలజనంబులలోన
నైర్మల్యమొనరించిన తడుబ్రోచు
వేయ్యారు కోర్కెలన్ వెలయింపగానేల
మోక్షపథంబును ముఖ్యమిచ్చు

తే॥ గీ॥ అయ్య నీపేరు విన్నను నెయ్యమలర
దివ్య కాంతులు కనులందు తేజరిల్లు
మాదు గుండెలు పులకలు మలయునట్లు
అయ్య మాయయ్య అయ్యప్ప అధిపబ్రోవు 248

చం ॥ వెలుగది బ్రహ్మాదీప్తిగద వేదమయుండగు స్వామిరూపమే
వెలుగయి లోకముల్ దనుప వెల్గెను వెల్గది విశ్రుతంబుగా
వెలుగన వెల్గుగాదదియు వెల్గులకేయది వెల్గువెల్గుగా
విలువలు సంతరించుకొని వేగన నంతపువెల్గువెల్గెడిన్ 249

వ ॥ కాంతి మలలో తూరుపువైపు భూమిపై నుండి కాంతి వంతమైన నక్షత్రమై
కొండపైకిప్రాకి 9 గంటల ప్రొద్దువలె ప్రకాశించును 250

ఉ ॥ ధన్యమటంచు జన్మములు దారత భక్తుల డెందమందునన్
అన్యమెరుంగ కుండగను అంచితరీతిని స్వామికొల్వగన్
ధన్యత జెందజేయునది తారుధనంబులు దివ్యభోగముల్
అన్యయరూపతం దనిపి ఆదట మోక్షపథంబు జేర్చడే ! 251

ఉ ॥ పాపపు చీకటుల్ దునుమ పర్వము నేడని భక్తులందరున్
నేపున డెందమందులను నేరుపు తోడుతస్వామి గొల్వగా
పాపములన్ని బాపివడి ప్రార్థనలన్ విని బ్రోవసన్నిధిన్
నాపరమాత్మ బ్రోచునట అంచిత రీతిని భక్తబృందమున్ 252

తే॥ గీ॥ అన్ని ధర్మాలు వదలుచు అంచితముగ
స్వామి గొల్వగ పాపాలు సడలిపోవు
సిద్ధమై యుండు నిక్కంబు సిరులుదనరి
స్వామి పాదాంబుజంబుల సాక్షిగాగ 253

తే॥ గీ॥ ధర్మమే జ్యోతి జ్యోతియే ధర్మమగును
ధర్మమయ్యేది సత్యాన దనరుచుండు
శాంతిదాంతిన హింసయు చాలగలుగ
ధర్మపథమున నడపు నీ ధర్మజ్యోతి 254

తే॥ గీ॥ మీదు గుండెల లోపల మిగుల వెలుగు
సత్యమై నిత్యమై వేగ సదమలముగ
వెల్గు హృదయాల లోపల వెల్గుచుండు
వేద వేద్యుని వెలుగది విస్మయముగ ! 255

## మా శబరిమలయాత్ర

ఉ ॥ వ్రాయుదునీదు కావ్యమును వర్ధిలభక్తులు మీదుసత్కృపన్
వ్రాయుదు నాదు జన్మమిక వారిజలోచన ధన్యమౌనటుల్
వ్రాయుదు మోక్షగామినయి వర్ధిలనీదగుచూపుపెంపునన్
వ్రాయుదనంత రూపుడగు వారిజనేత్రుడనీవటంచొగిన్ 256

చం ॥ మనసున కంటి వెల్గినది మానసమయ్యది పాలసంద్రమై
ఘనముగ దోచెనప్పుడును కాంతుని కాంతులు కౌముదీరుచుల్
గనగను వెల్గె నిచ్చటను కాంచగ వన్నెలరేనిపోలికన్
గనగను మోదమయ్యె హృది గాంచగనామణికంఠురూపమున్ 257

ఉ ॥ వాంఛితుడైతి స్వామిగన వారిజనేత్రునిరూపసంపదన్
వాంఛితుడైతి పాదముల వారిగ గొల్వగ నెల్లవేళలన్ !
వాంఛితుడైతి మోదమున వాసిగ కావ్యమువ్రాయబూనుచున్
వాంఛలుదీరబ్రోవగదె వాసవుబ్రోచిన ధర్మశాస్తవై 258

ఉ ॥ వాక్కును దేహమున్ వసుధ వాస్తవమాత్మయుస్వామికిన్ ధృతిన్
నిక్కము నేసమర్పణము నేటికి జేసితి పాలదేల్తువో
ఎక్కసమందనీటనిడి ఏవిధిలీలలు సల్పుచుందువో
చక్కగ పాలదేల్చుమని స్వామివి పాదములంటివేడితిన్ 259

వ ॥ ఇట్లు స్వామిపాదరేణువైన నేనునుమరి కొందరు స్వాములును మాస్వగ్రామమగు పదిపుట్లబయలు ఆలయమునందు గురుస్వాముల నర్థించి వారి వలన ఇరుముడులను తలలపై దాల్చి శబరిమలకు ప్రయాణోన్ముఖులమై స్వామినిట్లు ప్రార్థించితిమి 260

ఉ ॥ ఏశనియంటకుండగను ఎమ్మిక తోడుత నల్లబట్టలన్
గాశియటంచునే మరక కాంతులుచిందగ దాల్చివేగమే
ఆశలు వీడి నాలయము అంతట జేరియు దీపమాలికల్
నాశత దీప్తులన్ వెలుగ అంచితరీతిని(మ్రొక్కి స్వామికిన్ 261

తే॥ గీ॥ శరణు శరణంచు శరణంచు చాలమ్రొక్కి
శరణఘోషల తోడను స్వామిదలచి
ఉభయ సంధ్యలయందును ఉన్నతగతి
మరియు మధ్యాహ్నసమయాన మంజులముగ 262

తే॥ గీ॥ స్వామిదలచుచు వ్రతమును సలుప వలయు
మండలాంతంబు నందున మహితగతిని !
ఇరుముడుల దాల్చి శబరికి అరుగవలయు
సదమలంబైన భక్తితో స్వామికడకు ! 263

ఉ ॥ వ్యాఘ్రము వాహనంబుగను వర్థిలుచుంటివి స్వామియెయ్యడన్
శీఘ్రమిభంబు వాహనము సుందరమూర్తికి నీకు చొప్పడెన్
వ్యాఘ్రము జూచి పారుదుర వారణవృత్తిని భక్తసంతతుల్
శీఘ్రమిభంబు వాహనము చెల్వున గాగను రమ్మునీవిటన్ 264

ఆ॥ వె॥ నీదు పాదధూళి నిక్కంబు సోకిన
అమృత ఝురులు కురియు నద్భుతముగ
నీదు నామమెంచ నిక్కంబు భక్తుల
అఘములన్నిద్రుంగు అహరహంబు 265

తే॥ గీ॥ రావె కరుణింపవే మమ్ము రాజపుత్ర !
రావె మాదగు కర్మముల్ రయము ద్రుంచి
దీవనంబుల నింపుమో దీనరక్ష
పాహిమాం పాహిమం పాహి పాహియంటి 266

ఉ ॥ మాదగు కర్మబంధముల మాటికి దీరిచి కూర్మితోడుతన్
నీదయ జూపవా ప్రభువ నిక్కముమీపదపద్మముల్ వేసన్
ముదమున సోకమ్రొక్కెదము మూర్ఖులమమ్మికజ్ఞానపుంజముల్
కుదురుకొనంగ జేయవ యకూర్మిని డెందము కందళింపగన్ 267

తే॥ గీ॥ నీవే తల్లివి తండ్రివి నీరజాక్ష
నీవే మాయిలవేల్పువు నిక్కముగను
నీవే హరిహరసుతుడవు నిర్మలాత్మ
నీవె మా అంతరాత్మవు నిజము తండ్రి 268

ఆ॥ వె॥ కంఠ నీమనున్న కమనీయ రుద్రాక్ష
మాలయందుమణియు మహితవృత్తి
తళ్కు తళ్కుమంచు తరళంబు గనువెల్గె
వెల్గులన్నిగలసి వెలయునట్లు 269

ఉ ॥ దీప్తములయ్యె కాంతులవి దివ్యముతేజము దీప్తిచందమున్
దీప్తమనంత దీప్తముగ దివ్యునినామమురూపమున్ తగన్
దీప్తములయ్యె తేజము యుధీరత శోభితమయ్యెనెల్లడడన్
దీప్తపుకాంతులన్నియిటు ధీజనులందరుమెచ్చునట్లుగన్ ! 270

ఉ ॥ మోహనరూపుడైవెలసె మోదమునన్ హృదిగల్గుమూర్తియై !
మోహనరూపమున్ గనిన మూర్ఛత బాయును నాడుడెందమున్
మోహితుజేసినాడిపుడు ముఖ్యుడు దేవతలందుజూడగన్
నాహితుదేవదేవునకు నంజలిచేసెదరక్షసేయగన్ ! 271

చం ॥ మదనుని తమ్ముగుట్టయట మాధవుపుత్రుడటంచు వేడెదన్ !
కుదురుకొనంగమంజులత కూర్మినిడెందమునందు పండగా
నిదురయెలేని మేల్కొలుపునిక్కము కల్గగ స్వాంతమందునన్
కుదురుకొనంగ భక్తులవి కూర్మిని బ్రోతువటంచునెంచెదన్ 272

తే॥ గీ॥ చీకటుల బాపి వెల్గుల చెంతజేర్చి !
జ్యోతి జూపించి దీప్తుల చెలగ జేసి
మాధవుని పుత్రుడిచ్చును మహితగతులు !
పాపములు బాపి పుణ్యంబు పరగగూర్చి 273

చం ॥ పడిశము దగ్గురాదెపుడు పల్మరు నీటనుమున్గినన్ వెసన్
వడివడి శీతలంబులగు వర్షపునీటను దోగినన్ వెసన్
మెడనటుమాలవైచికొన మిక్కిలిచోద్యము స్నానసంపదల్
సుడివడ దెన్నడేనియును సూటిగ సుందరమూర్తిగొల్వగన్ ! 274

తే॥ గీ॥ త్రిషవణస్నాన మహిమంపు తీరువేరు
మాలగైకొని నంతట మహిమదనరు
గంధమునుకుంకమంబును కాంక్షదాల్చ
గలుగు శోభలు దైవారు కలుగు దీప్తి 275

చం ॥ శబరిగిరీశ|మొక్కెదము శాంతముసౌఖ్యము నిచ్చిబ్రోవవే
శబరికి రామదర్శనము స్వాంతమురంజిల కల్గునట్లుగా
శబరికి నీవు మోక్షమును చయ్యన నిచ్చినయట్లు నాకికన్
సుబగముగాగనిమ్మునిక సుందరరూపుడ స్వామిచయ్యనన్ 276

చం ॥ వరదుడ వారిజాక్షుడవు వర్థిలభక్తుల[బ్రోతువెన్నడున్
వరములు ఎన్ని కావలయు వాస్తవమెంచగ మోక్షమొక్కటే
పరమదయాబ్ధివైయిడుము పాదములంటెద స్వామిభక్తితో
సురపతి బ్రోచినట్టి దొర సుందర రూపుడ[బ్రోవుమిత్తరిన్ 277

ఉ ॥ జ్ఞానము నిమ్మువేడెదను జ్ఞానముతోడుతమోక్షమార్గమున్
గానగనియ్యవేయనుచు కాంక్షనువేడితి వేదవేద్యుడీ
జ్ఞానము గానముంగలుగ గానిక భక్తియుజాలువారగన్
మేనులు హర్షసంభరిత మేళనమొందగ వ్రాయనిమ్మికన్ 278

చం ॥ శివుడట జ్ఞానరూపుడట చిన్మయరూపుడు మాధవుండికన్
అవనిని భక్తకోటులకు అంచిత రీతిని మోక్షమిచ్చుతన్
భువనములందు జ్ఞానమును పూర్ణముగాగను మోక్షమార్గమున్
నివహములందు నందరికి నీవికగల్గగ జేతువీశ్వరా ! 279

తే॥ గీ॥ హరిహరాత్మజుడౌటను అంచితముగ
మురియుచున్నారు భక్తులు మోదమలర
కురియ జేయుము సుధలను మోదమలర
జీవనాధారములు గల్గి చెలగుచుండ ! 280

తే ॥ నీదు నామంబు నాల్కపై నిక్కముగను
వరలు చున్నది దైవంబు వాస్తవముగ
నీవెయన్నది నిక్కంబు నీశ్వరేశ
హరిహరుల పుత్రమము బ్రోవు ఆదరమున 281

తే॥ గీ॥ ఏమి యంచును నుతియింతు నేమి ప్రభువ
ఏమి నీక్రాంతినీదాంతి ఏమి చెలువు
విశ్వమోహన నీరూపు విమల ఫణితి
వెలయుచున్నది కనులందు వేదవేద్య 282

వ ॥ ఇట్లు స్వామిని ప్రార్థించుచు గురుస్వాములకు మ్రొక్కి పదిపుట్ల బయలునుండి
ఇరుముడులను తలదాల్చి బస్సున బయనించి కాణిపాకుజేరితిమి 283

చం ॥ ఇరుముడులంగ్రహించుకొని నింపుగ నొదలదాల్చివానినిన్
పరముడుబ్రోచునంచువడి ప్రార్థనలన్ వెసజేసి వెంబడిన్
మురెపముతోడ స్వామిగన ముచ్చట స్వాములతోడ గూడుచున్
సరియగురీతితోడుతను సాగవలెన్ పటురీతి కొండకున్ 284

ఉ ॥ బస్సున లేక రైలునను భాసురవృత్తిని నేగు నంతనా
శీస్సులు గల్గు భక్తులకు శీలము వంశము విస్తరిల్లగా
బస్సున మార్గమధ్యమున ప్రాపుగ నుండెడి దేవతాళియా
శీస్సులు గూడ బొందనగు శ్రీపతిపుత్రుని చూడనేగునో ! 285

ఉ ॥ శ్రీగణనాధుజూచితిమి చిన్మయ రూపుని కాణిపాకునన్
బాగుగ మా ప్రయాణములు భాసిలు రీతిని చేయునట్లుగన్
వేగమె స్వామి పాదముల విశ్రుత లీలలమ్రొక్కగా వడిన్
సాగగ యాత్రలం గరిమ స్వాంతమురంజిల మేముమ్రొక్కుచున్ 286

తే॥ గీ॥ మొగిలి జేరితిమింతలో ముఖ్యముగను
మొగిలి సర్వేశు బూజించి మోదమలర
నేగితిమి బెంగుళూరుకు వేగిరముగ
చూడ వైమానికాశ్రయ సుద్దులచట ! 287

సీ ॥ విభవ వైమానిక విశ్రుతరీతుల వెలసె
విమానాలు విభమలర
మద్రాసు బొంబాయి మార్గాల గమియించు
వైమానికావళుల్ వరుసజనియె
అప్పురుపైనుండి అతిముదంబున జూడ
ఏరొడ్రోమెంతయు ఇంపుదనరె !
ప్రాంగణారంభాన పరవసింపగ జేయు
పార్కట విలసిల్లె ప్రాభవమున !

తే॥ గీ॥ ఒకటి దిగినది రెండట ఒనరనుండె
మరియు నొక్కటి ఆకసమంట నేగె
ఆవిమానల లీలల త్యద్భుతములు
యుల్లవలరించె నద్భుత ముల్లసిల్ల 288

వ॥ అటనుండి పయనించి శ్రీరంగనాథాలయమును సమీపించి అరుణోదయకాంతులు వ్యాపించుచుండ గుణభద్రయైన కావేరి దేవేరి ఒడిలో సుస్నాతులమై, తీరప్రాంతమందలి గణనాథుని సేవించి శ్రీరంగనాథాలయమును బ్రవేశించితిమి. శ్రీరంగనాథస్వామి శయనించిన తీరు కనులపండువుగ నున్నది. అచట శిల్పకళా సంపదను కనులార దర్శించి తదుపరి టిప్పుసుల్తాను సమాధులను మ్యూజియమును దర్శించి, అలనాటి చరిత్ర కాంశముల నవగతముచేసికొని అటనుండి మైసూరునకేగితిమి.

చాముండేశ్వరికొండకు బన్సున బయనించితిమి. ఉవ్వెత్తుగా ఆలయగోపురమొక వింత చెలువము ఘటించుచుండెను. తెల్లగా మల్లెపూవులవలె ఆలయము ఆలయప్రాంగణపు గోడలు ప్రకాశించుచుండెను. లోన మాత మహిషాసురమర్దిని ! 289

శా ॥ చంచత్ కాంచన కాంతి పుంజములతో సాలంకృతంబైననా
కించత్ క్రోధము నేత్రయుగ్మములపై కెంపుల్ గనన్ చండియై
చంచత్ దానవ నాశియై పరగెడిన్ సంహారియై హారియై
చంచత్ కాంతులు శోభిలంగనచటన్ స్వాధిష్ఠియై శోభిలెన్ 290

తే॥ గీ॥ జగములకు గన్నతల్లిగా జనులజోత
లందుకొనెడి మాదు జనని నంచితముగ
కన్నతల్లి కాత్యాయని గాగజూచి
మ్రొక్కులిడితిమి మేమంత మోదమలర ! 292

కం ॥ చాముండేశ్వరి పదముల
నీమంబున గొలిచి మేము నియతాత్ములమై
సోముండు వెల్గ తలపై
కాముంబరి మార్చు ప్రభువు కంటిమి హృదులన్ ! 293

వ ॥ అటనుండి మైసూరుమహారాజుల మందిరములజాడ నేగితిమి 294

సీ ॥ మైసూరు రాజుల మహితంపు భవనాలు
అలనాటి చెలువంబు ఆవహించె
సైనికావళి వస్త్రసౌభాగ్య గరిమంబు
ఆయుధంబుల తీరు అతిముదంబు
వాలుగత్తుల తీరు వరుసగ తలగుడ్డ
లాదిగ గౌనులు అపుడు గాంచి

తే॥ గీ॥ పూర్వవిన్యాస పణతుల పూర్వమంద
సంభ్రముల హొయలు గనగ సంబరమున
కప్పుక్రిందను సొరులు కాంచతరమె
కనుల కానంద విభవంబు కలిగె నచట ! 295

తే॥ గీ॥ శ్రావణ బెళగొళ యనంగ సొగెడిపురి
గోమతేశ్వరడుండెను గోముమీర
అరువదడుగులపొడవున నతిశయించి
శిల్పమయ్యది కన్నుల గాంచినాము 296

ఆ॥ వె॥ కొండపైన నుండు గోమతేశుని జూడ
వెళ్ళవలయుమెట్ల వెంటపైకి
కాళ్ళునొప్పులనక కదలి పోవంగను
దర్శనంబు గల్గు తప్పకచట 297

తే॥ గీ॥ బౌద్ధమోలేక జైనమో బరగునాటి
కాలమందలి శిల్పంబు కలదు అచట
సంస్కృతికి మార్గదర్శకమై సాగునట్టి
వేడ్కదానిని గంటిమి విశదముగను 298

ఉ ॥ నల్లని రాలచిత్రములు నాణ్యత తోడుత దీప్తులందగన్
యుల్లముపల్లవింపగను యూహలు కల్గగ చిద్విలాసమై
అల్లన గాంచ చిత్రములు ఆదట మల్లెలు మాధవీలతల్
పల్లవితంబులై బరగె ప్రాపుగ నాహలి బేడు నందునన్ 299

తే॥ గీ॥ అచటి నుండియు బేలూరి కపుడు వెళ్ళి
కాంచి నారము కనులార క్రాంతిసుధల
చెన్నకేశ్వరు నాలయ సదమలంపు
చిత్రశోభిత చెలువంపు చిత్రములను 300

శా ॥ ఆ బేలూరున చెన్నకేశ్వరునిదౌ ఆదేవళంబందునన్
ఆ బాబెవ్వడు చెక్కెబొమ్మలను నింపారంగ చోద్యంబుగన్
ఏ బాముల్ కలుగంగ నేరకనుతా ఎప్పేట జెక్కన్ ధృతిన్
ఆ బాబేగద జక్కనార్యుడనగన్ ఆంధ్రావనిన్ వెల్గడే 301

తే॥ గీ॥ భారతీయమహోత్కృష్ట భావలతల
కాలవాలంబు బేలూరు కలదు శిల్ప
దీప్తపుంజంబుల కొటారు తేజమెసగ
శిల్పసంపద చెలువొందు శిలలపైన 302

ఆ॥ వె॥ చిత్ర లేఖనములు చెప్ప చిత్రంబులౌ
ద్వార బంధములను దర్శితముగ
కప్పుక్రిందనుండుకల భాగములయందు
కలదు చిత్రగరిమ కాంతులెసగ 303

తే॥ గీ॥ ధర్మస్థలంబు జూడగ ధర్మమచట
నాల్గుపాదాలవర్ధిల్లు ననవరతము
మంజునాథమహాదేవు మహితుగాంచి
కేరళంపుటడవులకు చేరినంత 304

ఆ॥ వె॥ మోద మయ్యెనాడు మోహనంబుగనంత
ప్రకృతి కాంతచెంత పరవశించు
భాగ్యమబ్బునంచు భావించి చేరంగ
తెల్లవారెనంత తేజమెసగ 305

మ ॥ ఇరుపార్శ్వంబుల కొండలున్ వెలయగన్ ఇంపారు రోడ్లంచులన్
సరిగాకాటెజులందునందునను పార్శ్వంబుల్ కనన్ రమ్యమై
మురిపెంబుంగను వృక్షవాటికలతో మోదంబుదైవారగా
కరులున్ వచ్చునొ వ్యాఘ్రముల్ వరుసగా గాంచంభయంబబ్బునో 306

మ ॥ అనుచున్ డెందము కందళింపగ వడిన్ ఆ స్వామిస్వాంతంబునన్
గనుచున్ మోదముతోడ స్వామి బిలువంగాంక్షించగా నంతలో
గనుపించంగను బోయె నామృగములున్ కంజాక్షు సంప్రార్థనన్
అనయంబట్టులె స్వామిబిల్చుచువడిన్ ఆనందమేపారగన్ 307

ఆ॥ వె॥ జనులు జనుచునుండ జాజ్వల్యమానమౌ
కొలను దీర్ఘికగను గానిపించె
బస్సునాపిస్నాన పానంబులవి జేయ
నున్నయంత నచట నున్నవారు 308

తే॥ గీ॥ కాలకృత్యములకు నీరు కలుషితంబు
చేయగా రాదటంచని చెప్పిరంత
రోడ్డువెంబడి వెళ్ళంగ రోయకపుడు
కానిపించెన రేబియా కనులకపుడు ! 309

తే॥ గీ॥ కాలకృత్యంబులందీర్చి కాంచను దధి
రమ్యమానసశుద్ధాంత రాజసమున
నిశ్చలానంద మందంగ నెగడుచుండె
భయద బంగాళఖాతంబు పగిదిగాక ! 310

ఆ॥ వె॥ ఇదియె పాలకడలి ఇట్టిది యౌనొకొ !
దేవదానవాళి తేజమెసగ
చిలక బోలుదీన చిద్విలాసముగాగ
అమృతమిందు బడయ అతిముదమున 311

వ ॥ అని తలంచుచు గురు వాయూరును జేరితిమి

మ ॥ గురువాయూరున కృష్ణదేవుకృపతో కూర్చన్ జనామోదమున్
నరుడైకన్నులకెంతొ సొంపుగలుగన్ నాశ్చర్యమౌనాగుడిన్
అరుదై యుండెడిదాని జూచితిమటన్ అత్యంత మోదంబునన్
పరుడై యీశ్వరుడైన సత్ప్రభుని నేపల్మారు వీక్షించుచున్ 312

ఆ॥ వె॥ వెన్నదొంగయిటకు వేంచేసినావెట్లు
కుబ్జలేదు యిచట కులుకులాడ
ఉన్నవారమంత కన్నకుచేలురే
కన్నతండ్రిబ్రోవు కాంక్షలొసగి ! 313

ఆ॥ వె॥ కొడుకు బ్రహ్మయగును కోడలు వాగ్దేవి
కాంతలక్ష్మియగును కనికరింపు
విద్దెలొసగి ధనము విస్తృతంబుగనిచ్చి
ఆయువొసగి బ్రోవుమయ్య తండ్రి 314

ఉ ॥ పంబనుజేరి స్నాతులయి ప్రార్థనలన్ గణనాథు గూర్చిపా
పంబులు వాయప్రార్థనలు పల్మరుజేయుచు కొండనెక్కుచున్
అంబుజ నేత్రుబాడుచును అంచిత రీతిని నుండునంతలో
సంబరమెంతొగా గదిసి సాగుచు వచ్చిరి భక్తబృందముల్ 315

చం ॥ గంటిమి భక్తకోటులను గంటిమి స్వాములు సాగివచ్చుటన్
గంటిమి మంటి మయ్యెడల కంజదాళాక్షుని భక్తులంతటన్
గంటిమి శూలిపట్టి నిజ జ్ఞాన సుధాంబుధి నిర్మలాత్మునిన్
గంటిమనేకరీతులను కాయము డెందము కూర్మిపండగన్ 316

చం ॥ ఎదురుగ వచ్చువారలటు ఎంతయుకూర్మినియుల్ల మందునన్
గదురగ వందనంబులటు గల్లగజేయుచు పాదమంటుచున్
మదిని శివుండెనేననుచు మార్గములందున మ్రొక్కుచుండగా
అదియు శివంబెనేననుచు ఆదటవారల పాదమంటితిన్ 317

తే॥ గీ॥ స్వామియన నెల్లహృదయాల సాగుచుండు
స్వామిసర్వేశ్వరుండయి సరగబ్రోచు
స్వామి హరిహరాత్మజుడయి సాగుచుండు
స్వామియన భక్తులందరు స్వాములగుదు 318

తే॥ గీ॥ రదియొనద్వైత మూర్తిగా నలరుచుండు
నద్వయంబైన పరమాత్మ నమలగతిని
కొండదండను భక్తుల దండనుండు
ఎల్లెడల తానెయైసాగు యుల్లములను 319

తే॥ గీ॥ చరమున చరంబు నమభేద సరణిలేక
నద్వయంబైన ప్రకృతియే యచట సాగు
చెట్లులతలును గిరులును చెలగుచుండు
స్వామి నామంబు పఠియించి సరగనుండు 320

తే॥ గీ॥ పరమశాంత స్వరూపంబు పడయగోరి
నట్టి భక్తులు యేతెంచునట్టి గిరియె
శబరగిరియంచు శబరిని చాలదలచి
రామనామంబు సామ్యంబు రయముగాగ 321

తే॥ గీ॥ స్వామిపాదారవిందముల్ చాలదలచి
ఎక్కుచుందురు కొండను ఎంతొభక్తి
స్వామి స్వామి యటంచును చాలదలచి
గిరులు గుహలును మార్మ్రోగి గీలుకొల్ప ! 322

వ ॥ ఇట్లు కొండనెక్కి శరణగుత్తిని జేరి శరములనట జెక్కిక్యూలో ప్రవేశింప బోవ రక్షక భటులు దయదలచి వృద్ధుడనగుట నేరుగా నన్ను నాతోటి గురుస్వామిని మిత్రులను నాకు తోడుగా వదలిరి. 323

తే॥ గీ॥ డెందమందుల స్వామికి వందనములు
చేయుచును వెళ్ళి పడికట్ల చెంత జేరి
ప్రీతికొబ్బరికాయల పేర్మిగొట్టి
పదియు నెనిమిది పడికట్లుపరగనెక్కి 324

తే॥ గీ॥ ఇరుముడులతోడ స్వామిని ఇంపుతోడ
గాంచినారము కన్నులు కరువుదీర
స్వర్ణకాంతులతో స్వామి స్వాంతమలర
నుండు చిన్ముద్రధారిని నిండుమదుల 325

తే॥ గీ॥ గొల్చి అభిషేకములు జేసి నిల్చిచూచి
రెప్పలార్పక మదిలోన గొప్పగాగ
శాంతిసౌఖ్యంబు ధర్మంబు చాలగల్గ
పండె జన్మలు మాకని పరవసించి 326

తే॥ గీ॥ కూరుచుంటిమి ఒక్కెడ గోముతోడ
తోడి వారలు వచ్చిరి తోరముగను
స్వామివారిని సేవించి స్వాంతములను
వచ్చి మా పొంతకూర్చుండి వరలిరంత 327

వ ॥ వారు అన్నారు పంబలోమేము బయలుదేరుటకు ముందు మీరు వృద్ధులు మాతో రాలేరు అని కొందరు మాస్వాములు నిరుత్సాహపరిచారు వారు ప్రభాతమున స్వామిని దర్శించి మా చెంతకు వచ్చిరి. మాగురుస్వామి గారును నాతోటి ఐదారుగురుస్వాములము రాత్రి పదిగంటలకే స్వామిని దర్శించుకొనగలిగితిమి. అది అంతా స్వామిదయ.

నామదిలో స్వామి చేదు కొనుము అని ప్రార్థించి కన్నులు మూసి ధ్యానించితిని అంతట స్వామి చేయి యిచ్చి చేదుకొన్నట్లు అనుభూతి కలిగినది. స్వామి అనుగ్రహమున స్వామిని ముందుగా దర్శించగలిగితిమి.

గుడికి ఉత్తరపు పడికట్లు దిగి నాగమాతను నాగయక్షిణి. అమ్మవారగు లీలావతీ మాతను దర్శించి కొండదిగుచుంటిమి. 328

ఉ ॥ స్వర్ణమయంపు కాంతులను సంపదగా గ్రహియించి యాత్మలో
కర్ణములందు గానములు సాగుచునుండగ కొండక్రిందికిన్
ఆర్ణవ మట్లువచ్చు ప్రజకంజలులుంచుచుకొండడిగ్గగన్
పూర్ణుడుగాచు మమ్మనుచు పూవుల తావి పోలికన్ ! 329

ఉ ॥ స్వామిని గొల్చివచ్చితిమి సారెకు డెందములందు నిండగా
మామదిలోని భావములు మాటికి స్వామి మనంబులందునన్
వేమరుగల్గ సంతసము వేగముగల్లగ మాటిమాటికిన్
గోమున పంబజేరితిమి కూర్మిని స్వామిదలంచుచున్ వడిన్ 330

## తిరుగుప్రయాణము

వ ॥ తిరుగు ప్రయాణమున ఎరిమేలి జేరి అటనుండి రాత్రియంతయు ప్రయాణించి ప్రభాతమున కన్యాకుమారి జేరితిమి. 331

తే॥ గీ॥ మూడు సంద్రాలు మోదాన ముచ్చటగుచు
కన్యకా పరమేశ్వరి కాళ్ళముందు
ప్రణతులిడుచుండు నెప్పుడు ప్రాభవమున
నట్టి కన్యాకుమారియౌ నతివగొలిచి 332

ఉ॥ మోదముతోడ మ్రొక్కులిడి ముందట సంద్రములోన బండపై
పాదములుంచి ధ్యానమును ప్రాపుగ జేసెడి యానరేంద్రునిన్
వాదములేక వేదముల వారిగ నేర్చువివేకశీలునిన్
సోదర మానవాళికిని చొక్కపు నీతులు నేర్పునాతనిన్ 333

వ॥ వివేకానంద స్వామిని చూచుటకు సంద్రమందున్నే స్నాతులమయి లాంచీపై నేగి ఆస్వామిని జూచితిమి. తదుపరి తీరమును జేరి అప్పుడే ఉదయించుచున్న సూర్యభగవానుని రాగరంజితమైన కిరణములు సముద్రముపై బ్రసరించుటెంతయు ఆనందదాయకముగ రాగరంజితముగ నున్నది. సూర్యభగవానుడు పైకిఎక్కుకొలది సంద్రమందలిఇ అలలువెండి రేకులు పరచినట్లు తళతళలాడినవి. గాంధీనేస్క్వేర్ నుండి చూడగా సువిశాల సాగరము వివేకానంద శిల, ప్రకృతి, పరమానందమును గల్గించెను. అటనుండి రామేశ్వరమున కేగితిమి. 334

కం॥ రామేశ్వరంబు నందున
రామేశ్వరు జూచినాము రమణీయముగా
రామేశ్వరు లిద్దరునట
వేమారున్ భక్తతతుల వేగమె బ్రోవన్ 335

తే॥ గీ॥ మధుర మీనాక్షి ఆలయ మంతజూచి
అంబనంతట హృత్పీఠి అపుడు నిల్పి
జగములకు తల్లిమము బ్రోవు జననియనుచు
మ్రొక్కమము బ్రోచెనాతల్లి ముదితులుగను ! 336

ఆ॥ వె॥ పళని కొండపైన ప్రాభవ యుక్తితో
సుబ్రమణ్యుడుండె చోద్యముగను
భక్తులచట మ్రొక్క భవబంధములు బాపి
చిద్విలాసుడతడు చింతదీర్చె 337

వ ॥ అటనుండి మార్గమధ్యమున మీరా సాహెబ్ దర్గాను దర్శించి అతని మహిమలను గొనియాడి తరుపరి చిదంబరేశ్వరుని పూజించి మ్రొక్కులిడి శ్రీఅరుణాచలమునకేతెంచితిమి 338

తే॥ గీ॥ దేవతా చక్రవర్తిని దేవదేవు
కంటి మరుణా చలేశ్వరు కాంతులెసగ
లింగ మూర్తిని నిటలాక్షులీశ్వరేశు
తనువు లంతటపులకలు దాల్చుచుండ ! 339

తే॥ గీ॥ చిత్ర శోభితమైయుండి చెలగుహాలు
నంత దిలకించి పులకించినాము మేము
స్వామి అయ్యప్ప గణనాథు సరసనుండు
సర్వదేవతామూర్తుల సరగ జూచి 340

వ ॥ నవగ్రహములను ప్రదక్షిణించి దీపారాధనలు జేసి చిత్తూరును జేరి కొంటిమి. 341

ఉ ॥ చిత్తురసీమ జేరితిమి శ్రీశుని డెందము లందలంచుచున్
మత్పుర మండలాంచితము మానసమందున కందళింపగా
తత్పురసీమ గల్గెడి నుదంచితవస్తుచయంబు జూచుచున్
మత్పుర మేగ జూచితిమి మార్గమునందున కాణిపాకునన్ 342

శా ॥ శ్రీ విఘ్నేశ్వరపాదపద్మయుగళీ సేవార్థ చింతారతిన్
ఆ విఘ్నేశ్వరుజూచి మ్రొక్కులిడగా నా గౌరిపుత్రున్ వెసన్
ఆ విఖ్యాత మహత్యమున్ గల సుతున్ ఆనందమేపారగా
నే విశ్రాంతత లేక జూచితిమి మా నేత్రంబుల్ నిల్పుచున్ 343

మ ॥ గురుస్వాముల్ తగురీతిమాలలను తాగూర్మిన్ సవిశ్రాంతతం
సరిగా మాలలు దీసి భక్తతికిన్ స్వాంతంబు రంజిల్లగా
కరుణార్ద్రుండగు విష్ణురాజునచటన్ కాంక్షించి మ్రొక్కంగతా
మరతంపంబుగ వేడగాధవుడు తామంతం బ్రసాదింపగన్ 344

కం ॥ పది పుట్ల బయలు కంతట
పదిలంబుగ జేరినాము ప్రాభవయుక్తిన్
సమదలగతి సర్వేశ్వరు
పదములు దెందముల నిలిపి ప్రార్థించితగన్ । 345

తే॥గీ॥ మంగళంబగు మణికంఠ మహితునకును
మంగళంబగు స్వామికి మంజులముగ
హరి హరాత్మజు డానంద మంది బ్రోవ !
మంగళంబులు భక్తాళికగును గాత ! 345

గద్యము ! ఇది శ్రీ కామాక్షీ చలం బ్రమ నామాఖ్యుల పౌత్రుండును చిన్నమ్మయన్పేరి నామాంతరము గల శ్రీ మునెమ్మ ముని రత్నమాఖ్యుల ఏకైక పుత్రుండును నన్ను పెంచి విద్యా బుద్ధులను నేర్పించిన శ్రీ మంగతాయారమ్మ నారాయణాఖ్యుల దౌహిత్రుండును శకుంతలా సద్ధర్మ పత్నీ సమేతుండును శ్రీతిరుత్తణి శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర వరప్రసాద లబ్ద శివసుబ్రమణ్య ప్రసాద సుపుత్ర సమేతుండును శ్రీహరి హరాత్మజస్వామి చరణ రేణువైన మధురాంతకం దొరస్వామియను నాచే రచియింపం బడిన శ్రీ మణికంఠేశ్వర చరిత్రంబను నామాంతరముగల శ్రీ అయ్యప్పమహాభాగవతము సర్వము సంపూర్ణము 347

## ఫలశ్రుతి

చం॥ నలువది యొక్క రోజులును నాధ్యత దీక్షవహించివేడగా
నిలువున శత్రులార్వురనునిక్కముగాగను గెల్చియంతటన్
బలువుగ స్వామి నామమును బల్కుచుడెందము కందళింపగా
నిలను భజింప పాపములు నీల్గవె పుణ్యములంతజేరగా! 348

తే॥గీ॥ కోర్కెలన్నియు దీర్చెడి కోమలాంగు
డన వరత ఈశ్వర ధ్యాన అతుల యశుడు
కొంగుబంగారమై తాను కొదువ లేక
ఇచ్చుగాపుతజ్ఞానంబు ఈశు పట్టి - 349

సీ॥ ముక్తి గోరెడి వారి ముక్తికి జేర్చును
జ్ఞానంబు గోరిన జ్ఞాన మిచ్చు
భాగ్యంబు గోరిన భాగ్యముల్ సమకూర్చు
సంతాన సౌఖ్యముల్ సరగనిచ్చు
సౌధంబులను గోర సరగున సమకూర్చు
బాంధవ్యముల యందు పసలు దేల్చు
విద్దెల గోరిన విశ్రుతంబుగ నిచ్చు
సౌఖ్యంబు గోరిన సౌఖ్యమిచ్చు

తే॥గీ విష్ణు లోకంబు గోరిన వేగ జేర్చు
కడకు కైలాసమడిగిన కడకు జేర్చు
బ్రహ్మమును గోర బ్రహ్మంబు పరగజేర్చు
అయ్య బంగార తండ్రి అయ్యప్ప స్వామి ! 350

## హృదయ పద్మము

తే॥ గీ॥ మనసెకాసారమయ్యెను మహితవృత్తి
కలదు నిర్మల జలముల గణ్యముగను
అడుగునందున పంకంబు అమరియుండు
పాపపుంజీకటులపోల్కి పరిఢవిల్లి 351

శా ॥ పంకంబందున నుండి పుట్టెనచటన్ ప్రారబ్ధముల్ బాపగా
శంకంబొందక పద్మమంతటను ధీశాంతంబుంజూపగా
పంకం బందున జన్మమెత్తితినినే పాపుండపాపుండనన్
శంకం బేటికి గొల్తుమప్రభునినే స్వాంతంబురంజిల్లగా 352

మ ॥ అనుచున్ పద్మమపునాళమెంతయును తానాశ్చర్య సంధాయియై
కనుచున్ నీరముపైకి లేచినది నాకంజాక్షు నింజాడగా !
కనులన్ గాంచుచు పైకిలేచినది నాకాశంబునుంజూచుచున్
మనియెన్ నీరము పైకినెంతయును తామాధుర్యమింపారగా ! 353

మ ॥ కనియెన్ తానట తోటిపద్మములనా కారంపు తోరంబులన్
మనగా మంజులరీతినీటిపయి నేమంబుల్ వెసన్ జూపుచున్
కనగా దూరమునందునాకసమునన్ గాంచంగ నాసూర్యుడున్
మనసా తాకిరణాళితో దనుపగా మాధుర్యతన్ ధీరతన్ 354

ఉ ॥ మొగ్గలు నిగ్గుదేరుచును మోహన వృత్తిని సూర్యదేవునిన్
నిగ్గులు వారప్రేమమున నీరములందులనుండి చూడగా !
మొగ్గలు చెంగలించుచును మోదముజెందుచు పంకజాలుగా
సిగ్గు దొలంగ జేసెనటు చింతలు దీరిచి దీప్తులందగన్ 355

తే॥ గీ॥ సూర్యదేవుని కిరణాలు సూటిగాను
చెంగలించుచు గిలిగింత చెలగుచుండ
పంకజమ్ముల పైబడి పరవసించి
ముద్దుగుల్కుచు మోములు మురియు చుండు ! 356

చం ॥ విరిసిన పద్మముల్ వెలసి వేగమెసోయగ మింపులారగన్
మురియుచు నాదిలక్ష్మియును మూరతిశక్తియువాణియున్ వెసన్
సరియగు గద్దెలంచుధృతి సాగిరి పద్మపు గద్దెలందునన్
వరుసగ గూరుచుండిరటు వాసిగ శ్రీయుతశోభనాకృతిన్ ! 357

ఉ ॥ అమ్మలుజేరనంతటను అయ్యలు జేరిరి వారి పజ్జలన్
కమ్మని వాసనల్ గలుగ కాంచిరిపద్మదళాక్షులంతటన్
ఝుమ్మని మ్రోగుతుమ్మెదల చోద్యపుగానములుల్లసిల్లగా
అమ్మలు అయ్యలున్గలయ ఆలయమయ్యెను హృత్యథంబిలన్ ! 358

తే॥ గీ॥ మనుప బెనుపను ద్రుంచను మంజులముగ
ముగురు మూర్తులు ఒకటిగా ముదముగుల్క
హృదయ సరసిని దర్శించి మదినిమెచ్చ
జూచి నాడను బ్రహ్మంబు చోద్యమంద 359

ఉ ॥ పంకములోన బుట్టినది ప్రాకిటు నీరముపైకి వచ్చుచున్
శంకయెలేకమిత్రునికి సారెకు నాకిరణాళివెల్గులన్
మంకువమూర్తులందనువు మంజులపుష్పములుల్లసిల్లగా
సంకటమెల్ల బాసినది సారెకు మాధవుసత్కృపాంబుధిన్ 360

ఉ ॥ అంబుధి లోనబుట్టినది అంచిత రీతిని అమృతంబొగిన్
అంబలు స్వాంతమందిడగ అంచితరీతిని బ్రోవనిత్తరిన్
కంబములోన బుట్టు హరి కాంచనగర్భునితండ్రిబ్రోవడే
పంకజమయ్యె నాయెడద పల్మరు ముగ్గురుమూర్తులుండుటన్ 361

తే॥ గీ॥ ముగ్గురమ్మల సూనుండు ముదితుడగుచు
మణినికంఠాన వెలసిన మాన్యచరితు
డతుల శుభముల నిచ్చును అనవరతము
హృదయ పద్మాననుంటచే మృదులముగను 362

## మానసపూజ

పాదరేణువు స్వామిదై పరవసించి
కవితయను కల్పవృక్షాన గానమెసగ
కోకిలాంగనయగుచును కూయుచుంటి
స్వామి అయ్యప్పమాస్వామిస్వామియంచు 363

భక్తియే గానమగుచును పరమపురుషు
రక్తిగానానరంజిల్ల రాగమెసగ !
ముక్తిగోరుచు వేడితి ముదమెలర్ప
శక్తి సుతుడవు బ్రోవుమాసక్తితోడ ! 364

## పాటలు

స్వామిచరణం స్వామిచరణం
అయ్యప స్వామిచరణం మాకు శరణం
మాకు చాలు మహేంద్రమస్తక భూషణం శ్రీ స్వామి చరణం
శత్రులార్వ్వర వలన చెడినపు
డాదుకొను మాస్వామిచరణం
మాయనిండిన కలియుగంలో
సత్యమను జ్యోతి నిల్పగ
బ్రతుకునకు బంగారు బాటగ
తావినొసగును స్వామిచరణం
కలుగషములు బోకార్చిబ్రోవగ
భవసముద్రము దాటనావగ
ముక్తికాంతకు చేరువగుటకు
మాకు చాలును స్వామిచరణం
పాపపుంజముల్నిడులిచి
పావనత పండింపజేయగ
మాకు చాలును స్వామిచరణం ॥ స్వామి ॥ 365

## పాట - 2

శరణం శరణం అయ్యప్పా స్వామీ శరణం అయ్యప్పా !
హరి హరపుత్రా - అయ్యప్పా ఆపరంజ్యోతివి అయ్యప్పా !
స్వాంతము రంజిల అయ్యప్పా స్వామీ శరణం అయ్యప్పా
ఇరుమేలి వాసుడ అయ్యప్పా ఇరుల తొలగింపుము అయ్యప్పా !
శబరిగిరివాసాఅయ్యప్పా స్వామీ శరణం అయ్యప్పా
స్వర్ణాలయవాసా అయ్యప్పా స్వామీ శరణం అయ్యప్పా
పావన చరితుడవయ్యప్పా పతిత పావనాఅయ్యప్పా
సుందరేశుడవు అయ్యప్పా సూటిగ బ్రోవుము అయ్యప్పా

శబరగిరిలో వెలసిన అయ్యప్పా షణ్ముఖ సోదరఅయ్యప్పా
కాంచనరూపుడ అయ్యప్పా కరుణతోబ్రోవుము అయ్యప్పా
శరణం శరణం అయ్యప్పా స్వామీ శరణం అయ్యప్పా !

## పాట-3

స్వామి స్వామి స్వామి అనరాదా !
స్వామి నామము నాల్కకు రాదా ?
స్వామి పాదము మీద నీస్వాంతమునిలుపగరాదా
మాయజగతిలో మనుట యెమార్మిక వేదనగాదా !
కరుణామయుడతడేగాదా ! పాదధూళిపడరాదా !
స్వామి అయ్యప్పస్వామి అంటే మనజన్మ సార్థకత కాదా ?
ఆటవికుడు వావరుదొర అంజలించిరేగాదా
మహిషిని మర్ధనజేసి మహేంద్రునిబ్రోవగలేదా
హరిహరాత్మజుని మీద మీ అంతరాత్మపడరాదా !
మనసారా మన ప్రభువును కనలేరా !

## పాట - 4

ఎంత దూరము స్వామి శబరిమలమాస్వామి
హృదయాన కొంతదూరమె స్వామి ॥ ఎంత ॥
నీవే పరమాత్మ వగుచు సక్కముగా జగతినిండ
ఎంతదూరము స్వామి శబరిమలమాస్వామి
స్వాంతముననీవుండ సంతసము ఎదనిండ
దూరమేలేదయ్య హృదయక్షేత్రాలలో
నిలచిన నాస్వామి ఎంతదూరముస్వామి
శబరిమల మాస్వామి ॥ హృద ॥ 367

## పాట - 5

రండీ రారండీ శబరిమలకు పోదాము ఓభక్తులార ॥ రండీ ॥
రారండీ నీలాంబరులై నియమాన్వితులై

శరణఘోషలను ఇడుచును
చెలగి ముందునకు సాగగ ॥ రండీ ॥
అహంకారములు దిగవిడిచి అతిక్రోపం మతిపాపం అంతావదలి
జగమంతా మానవతా మాధుర్యం మహినిండగ
కులంలేదు మతంలేదు గూడుపుటాణీ లేదు
కేలూపుచుక్రొత్త జగం సృష్టింపగ ఆత్మబలంవర్ధిల్లగ అందరమొకటేనని
శరణు శరణు శరణు స్వామీ
శరణని శరణ ఘోషలను ఇడుచును
రండీ రారండీ శబరిమలకు పోదాము 368

## పాట - 6

పందళరాజసుతాజగ ధీశా శంకర సూనుడబ్రోవుమధీశా
స్వామియొనీవని వేడితిదేవా శ్రీమణికంఠుడ చిన్మయరూపా !
మోహిని సూనుడ సుందరరూపా ! వావరుస్వామిని బ్రోచిన దేవా !
పంగుని నడువగ జేసిన దేవా అంధునిచూడగజేసిన దేవా
బధిరుని వినగను జేసినదేవా గురుసుతుననయముబ్రోచిన ధీరా
మహిషిని మర్ధనజేసినదేవా మముగాపాడుము మంజులరూపా 36

## పాట - 7

నీతేజ మజేయమయ్యె నిక్కంబుగ నాస్వామి
దుర్నిరీక్ష్యమది చూడగ జాలను చర్మచక్షువుల
దివ్యచక్షువుల బ్రసాదింపుము దీన బాంధవాఅరసి రక్షింపుము
దేహిదేహి దేహిని ప్రభూ పాహిపాహి పాహియంటిని
పరమాత్మా నన్నేలుము మీ పాదములచెంత నేనుంటినో ప్రభూ
నాపాపపుంజముల హరియింపుమోప్రభూ 370

**రచన : - మధురాంతకం దొరస్వామి విద్వాన్.**

# విరాళదాతలు

| | రూ |
|---|---|
| **తిరుమల తిరుపతి దేవస్థానములు** | 20000 |
| శ్రీ నాగరాజుగారు, విద్యావిహార్ H.M. చిత్తూరు | 2116 |
| జెడ్.పి.హెచ్.స్కూల్, దామల్ చెరువు H.M.&Staff & Students | 2166 |
| జెడ్.పి.హెచ్.స్కూల్, కల్లూరు H.M. Staff and Students | 2166 |
| శ్రీ కె.చంగల్ రాయులుగారు - రిటైర్డు హెడ్మాస్టరు | 1116 |
| శ్రీ డి. రామమూర్తిగారు, పేరసానిపల్లె | 1116 |
| శ్రీ కె.జయరామ శెట్టిగారు - గుండ్లగుట్టపల్లె | 516 |
| శ్రీ పాతూరు సుబ్రమణ్యం - గుండ్లగుట్లపల్లె | 310 |
| శ్రీ మునస్వామిరెడ్డి & సుందరరాజ - గుండ్లగుట్టపల్లె | 216 |
| శ్రీ కె.ఎన్. కందస్వామిగారు, యల్లంపల్లె | 216 |
| శ్రీ టి. వెంకటమునస్వామి, H.M. మంగళంపేట | 216 |
| శ్రీ సుబ్రమణ్యం, ఈశ్వర్ - గుండ్లగుట్టపల్లె | 216 |
| శ్రీ టి.ఎన్.ఆర్. చుక్కావారి పల్లె | 216 |
| శ్రీ ఆరుముగం పిళ్ళైగారు, మంగళంపేట | 201 |
| శ్రీ గులాబ్జాన్‌గారు, దామల్‌చెరువు | 200 |
| శ్రీ జవహర్, దామల్ చెరువు | 202 |
| శ్రీ శ్రీరాములు శెట్టి - గుండ్లగుట్లపల్లె | 116 |
| శ్రీ వి. ఉమాపతి, కల్లూరు | 116 |
| శ్రీ శ్రీరాములు శెట్టి - గుండ్లగుట్టపల్లె | 116 |
| శ్రీ మల్లికార్జున - గుండ్లగుట్టపల్లె | 116 |





# పరిచయం

జననం : 15-8-1928 చిత్తూరుజిల్లా పాకాల మండలం పదిపుట్ల బయలు గ్రామంలో మాతామహుల యింటిలో

తల్లి : చిన్నమ్మ అను నామాంతరముగల మునెమ్మ

తండ్రి : యం. మునిరత్నం పిళ్లై

విద్యాభ్యాసం: మునిసిపల్ సెంట్రల్ స్కూల్ చిన్నంగడి వీధి తిరుపతిలో 1943లో VIII Standard పబ్లిక్ పరీక్షలో ఉత్తీర్ణుడు కావడం. (ఇప్పుడాపాఠశాల గర్ల్సు హైస్కూలుగా మారింది) చిత్తూరులో గవర్నమెంటు టీచర్సు ట్రయినింగ్ స్కూల్లో 1945-46, 1946-1947 రెండు సంవత్సరాలు హైయర్ గ్రేడు ట్రయినింగ్ ప్రయివేటుగా S.S.L.C. మరియు T.S.L.C. సెకండరీగ్రేడు మదరాసు యూనివర్సిటీ విద్వాన్ పట్టభద్రత

రచనలు : ఆంధ్రప్రభ- ఆంధ్రపత్రిక ఆంధ్రప్రదేశ్ పత్రిక సైనికసమాచార్ మాత ప్రజామత మున్నగు పత్రికలలో పద్యాలు - గేయాలు - కథలు - వ్యాసాలు ప్రచురింపబడినవి. హరివిల్లు - ఈ రేడు లోకాలు అన్నకథా సంకలనాలలో గూడా నా కథలు ప్రచురితమైనాయి.

వృత్తి : జిల్లాలో అనేక ప్రాథమిక పాఠశాలలో ఉపాధ్యాయ ప్రధానోపాధ్యాయ వృత్తులు - పిదప జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో జూనియర్ మరియు సీనియర్ తెలుగు పండితులుగా పనిచేసి ఆగష్టు 1986లో చిత్తూరు జిల్లా బి.కొత్తకోటలో సీనియర్ తెలుగు పండితులుగా రిటైర్కాబడినాను.

ప్రస్తుతనివాసం : పదిపుట్లబయలు - పాకాలమండలం
G.G.Palle (B.O) దామల్ చెరువు (So)
చిత్తూరు జిల్లా A.P

వ్యాసంగం : రచనలు చేయడం గ్రంథాలు వ్రాయడం

కుటుంబం : భార్య యం. శకుంతలమ్మ
కుమారుడు యం. శివసుబ్రమణ్యాం ప్రసాద్
కుమార్తెలు 1. యం. అమరావతి
2. శ్రీవళ్ళీ ప్రసన్నాంబిక